# సాధనచతుష్టయ ప్రకరణము

(ఆల్కియోన్ వ్రాసిన "పరమగురుచరణసన్నిధి" కి
వ్యాఖ్యానము)

ఇది

గుంటూరు వెంకటసుబ్బారావుచే

యోగి లెడ్బీటరుగారు, డా॥ బెసెంటుగారు, డా॥ అరండేలుగారు
వ్రాసిన వ్యాఖ్యానముల ననుసరించి వ్రాయబడినది



"వసంతా ఇన్స్టిట్యూట్"
థియాసాఫికల్ సొసైటి
అడయారు, మద్రాసు
1938

# సాధనచతుష్టయప్రకరణము

(ఆల్కియోన్ వ్రాసిన "పరమగురుచరణసన్నిధి"కి
వ్యాఖ్యానము)

ఇది

గుంటూరు వెంకటసుబ్బారావుచే

యోగి లెడ్బీటరుగారు, డా॥ బెసెంటుగారు, డా॥ అరండేలుగారు
వ్రాసిన వ్యాఖ్యానముల ననుసరించి వ్రాయబడినది.

"వసంతా ఇన్స్టిట్యూట్"
థియసాఫికల్ సొసైటి
అడయారు, మద్రాసు
1938

# విషయసూచిక

## మొదటి భాగము

### పరిచయము



## రెండవ భాగము

### వివేకము

## మూడవ భాగము

## నిష్కామత్వము

## మొదటి అధ్యాయము

### యోగమార్గము—లోకహితము

మోక్షమార్గమున ప్రవేశింపగోరువారు తత్సాధనములను తెలిసికొనినంతమాత్రమున ప్రయోజనము లేదు. అవి తెలిసికొనుట కష్టముకాదు. కాని వానిననుష్ఠించుటయే కష్టము. వానిని మననిత్యప్రవర్తనములో ననుష్ఠించనియెడల ప్రయోజనములేదు. ఇందుకుగల యాటంకములన్నియు మనము స్వయముగ గల్పించుకొన్నవేగాని తదితరములు గావు. శరీరవ్యాయామమెవరికివారు స్వయముగాచేయవలసినదేగాని, యొకనికొరకింకొకడు చేయవలసినదికాదు. అట్లే మోక్షమార్గసాధనములనుగూడ గురువు మనకనేకవిధముల బోధించిచెప్పునుగాని, వానినభ్యాసముచేయుట మనపని. ఇది తెలిసి, తమ దేహాత్మ[1]లవల్లగలుగు నాటంకములను

[1] స్థూలదేహము, ఇంద్రియములు, మనస్సు, వీనిలో వ్యవహరించుచు తిరిగి తిరిగి మాతృగర్భమున బుట్టుచు, చచ్చుచునుండు జీవాత్మయొక్క కళ దేహాత్మయనబడును.

తొలిగించుకొనుటకు ప్రయత్నించరుగనుకనే, జనులలో నింతతక్కువమందిమాత్ర మీ సాధనముల నభ్యసింప బూనుచున్నారు. శ్లో॥ "మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతత సిద్ధయే..." (శ్రీమద్భగవద్గీతా 7-3).

ఈ లోకములో సత్ప్రవర్తకులును, పుణ్యశీలురును, అయినవారుకూడ నెందరో తామనుష్ఠించవలసిన తమ మతధర్మములనన్నింటిని యథావిధిగ ననుష్ఠించుటలేదు. బాహ్యమతధర్మములలో కొన్ని నిరర్థకములును, కొన్ని యనుచితములునై యుండును. అట్టి ధర్మముల నుల్లంఘించినను ప్రమాదములేదు. కాని, యోగమార్గమునందలి నియమములలో నుల్లంఘించదగినవేమియు నుండవు. ప్రతినియమము అనుల్లంఘనీయమును, యథావిధిగ ననుష్ఠించవలసినదియునై యుండును. రసాయనశాస్త్రములో కొన్నిపదార్థములను నియమితభాగములుగా గలిపినచో కొన్ని ఫలితములుకలుగునని విధింపబడును. మన మాపదార్థములను ఆ యాభాగములుగా కలిపినప్పుడే ఆఫలితములుకలు గును, లేనియెడల, ఆఫలితము కలుగకపోవుటయేగాక, విపరీతఫలితములు గలుగును. యోగాభ్యాసమునగూడ, నదేవిధముగ, నియమము నుల్లంఘించినయెడల, విపరీత ఫలితములు గలుగును. కనుక, సాధారణ మత ధర్మానుష్ఠానములోవలె యోగా

భ్యాసములో ప్రాలుమాలిక పనికిరాదు ; చెప్పిన విషయ
మును చక్కగా బోధపరచుకొని, యథావిధిగ నడుచు
కొనవలెను. అయితే, గురుకటాక్షముగలుగుట కీ సాధ
నము లన్నిటిని పూర్తిగా సాధించనక్కరలేదు. కాని,
ప్రతిసాధనమును కొంతవరకైననభ్యసించి, అభ్యసించి
నంతమట్టుకు జీవితములో నైక్యము జేసికొనవలెను.

ఆధ్యాత్మిక విషయములు మనకు దూరములును,
అనిశ్చితములును గావు. అవి సాధించుట కాటంకములు
మనలోనేయుండునుగాని బైటనుండవు. ఆ యాటంకము
లనేక విధములు. ఒకనియందున్నది యింకొకనియం
దుండదు. ఇట్లేదో యొకలోపము మనయందరియొద్దను
లేకున్న, మనమందరము నిదివరకే ముక్తులమైయుందు
ము. పరమగురువునందెన్నడును లోపముండదు. శిష్యుడు
సిద్ధముగా నున్న యెడల గురువు సాక్షాత్కరించును.

మన మీలౌకికవ్యాపారములలోబడి, యెంతోపని
గలిగి తీరికలేకయున్నామని, యెంతో ప్రయోజకులమని
సంతసించుచున్నాము. కాని మనమెల్లకాలమును, అసత్య
ము అనిత్యమునగు నీ స్థూలలోకముననే వ్యవహరించు
చున్నాము. ఇంతకంటె నెక్కువ సత్యము, ఎక్కువ
శాశ్వతము, ఎక్కువ ప్రయోజనకరమునగు సూక్ష్మ
లోకమున్నదని తెలిసినవారు బహు అరుదుగ నున్నారు.

కాని, మోక్షమార్గమున బ్రవేశించినవా రీలోకమున తమకర్తవ్య వ్యాపారములను విడువనక్కర లేదు. వార ప్పుడీ లౌకికవ్యాపారములను పరలోకజీవితార్థము చేయ వలెను. ఒకవ్యక్తి తన కళాభిజ్ఞత వృద్ధిపరచు కొను టకుగాని, మరియొక ప్రయోజనముకొరకుగాని యొ క్కొక్క నాటకములో నొక్కొక్క పాత్రము నభి నయించుటలో తన యావచ్ఛక్తిని వినియోగించి ఆ యా పాత్రపోషణమును చక్కగా నెరవేర్చును. ఆప్రకారము నెరవేర్చుట ఆవ్యక్తిప్రయోజనముకొరకు. అట్లే జీవు డును తన పరలోకజీవిత ప్రయోజనార్థమై, యీలోక రంగమునం దొక్కొక్కజన్మ భూమికలో తాను నెర వేర్చవలసిన ధర్మములను చక్కగా నిపుణతతో నెరవేర్చ వలయును. ఈ జన్మములో మనముచేయవలసిన పనులు ఎటువంటివైనను, మనకు కష్టసుఖము లేవిసంభవించి నను, అవి ముఖ్యముకాదు. మనకర్తవ్యమును చక్కగా నెరవేర్చుటయే ముఖ్యము. నటుడు రంగస్థలమున నటిం చునప్పుడనుభవించు దుఃఖములు, కష్టములు వానిని బాధించవు ; నటుడు రంగస్థలములో యుద్ధముచేసినట్లు, చనిపోయినట్లు నటించును, కాని, ఆయుద్ధమువల్ల, చని పోవుటవల్ల వానికేమినష్టము ? వానికి కావలసినది ఆ నటన చక్కగా జేయుటయే.

ఇది తెలిసికొన్నవారి కీజీవితము దుర్భరముగాదు. మనకీజన్మమున సంభవించు సుఖదుఃఖములు, ఎన్ని జన్మములక్రిందటనో, ఎప్పుడో చేసిన కర్మఫలితములు, ఆకర్మము నిప్పుడు మార్చజాలము, కనుక, మనకా కర్మఫలముగ నిప్పుడుకలుగు సుఖదుఃఖములను తత్త్వ దృష్టితో భరించవలెను. కష్టములుసంభవించినప్పుడు, వానినే చింతించుచు, విశేషదుఃఖమును పొంది బాధ పడక, వానివలన మనమునేర్చికొనవలసిన గుణపాఠ ములనునేర్చికొని, తరువాత, సాధ్యమైనంతవరకు, ఆ కష్టములను మరచిపోవలెను. తేనెటీగ పూవునంటకుండ దానిలోని తేనె నారగించును. అట్లే మన మీయనుభవ ములనంటకుండ వానివల్ల దెలిసికొనవలసిన పాఠములను గ్రహించవలెను. వానివల్ల మనము ధైర్యము, సహనము మొదలగు సద్గుణములనభివృద్ధిచేసికొనుటకే వాని నుప యోగించుకొని, తరువాత వానిని మరచిపోవలయును.

అయితే, అట్టి తత్త్వదృష్టికలుగుట సులభముకాదు. ఏలయన, ఈ లౌకికజీవితమే యదార్థమని నమ్మి, ఇం దలిసటనలే సత్యములని యెంచువారు వేనవేలు మన చుట్టునున్నారు. వారు మనలనుగురించి యేమన్నను, ఏమిచేసినను, అది మనకాటంకమగును. ఇంతకంటెను గొప్ప ఆటంకము లోకాభిప్రాయము. ఇది యనవరతము

మన కొత్తిడి గలిగించుచుండును. ఎట్లనగా, సత్యమెఱిం గినయొక్కొక్కనికి సత్యమెఱుంగని వారనేకవేలచొప్పున యున్నారు. వారందరు తమ మేలుకు, తమగొప్పకు, తమపేరుప్రఖ్యాతులకు పాటుబడుచుందురు. మరి విష యములలోను, సాంఘిక విషయములలోనుగూడ వారు సంకుచితబుద్ధి గలిగియుందురు. ఇట్టి యసమానపరిస్థితు లలో వస్తుతత్త్వమెఱింగిన కొద్దిమంది, బాహ్యజీవిత మసత్యమని, అంతరంగజీవితము సత్యమని తెలిసి, తదను సారముగనెల్లప్పుడును ధైర్యముతో ప్రవర్తించుట సుల భముకాదు. కాని, యీకాలమున ముముక్షువు చేయ వలసినపనియదియే. పరమగురువులలోనొకరు " మమ్మ నుసరింపగోరువారు మీలోకమును విడిచి మాలోకము నకు రావలయు " నని సెలవిచ్చియున్నారు. ఆ వాక్య మునకు లౌకికవ్యాపారములను విడిచిపెట్టి యడవులకు బోయి యుండవలెనని యర్థముకాదు ; వింతయైన యీ జీవితరంగమున మనకు విధింపబడినధర్మములను నెర వేర్చకవదిలివేయుటకుబదులు, వానిని మునుపటికంటె నెక్కువ శ్రద్ధతో నెరవేర్చవలయునని, అనగా, మన కర్తవ్యములవిషయమై మనకభ్యాసమైయున్న చిత్త వృత్తిని విడిచిపెట్టి, పరమగురువుల చిత్తవృత్తి నవలం బించ వలెనని యర్థము. లౌకికకార్యములను కేవలము

ఐహిక ప్రయోజనములకొఱకు చేయబూనక, ఆధ్యాత్మిక ప్రయోజనములకొఱకు చేయవలయును.

ఈ ప్రయత్నములనుజేసి, కృతార్థుడైనవాడు పరమ గురువులలోనొకరిచే శిష్యునిగ స్వీకరింపబడును. గురు శిష్యులమనుస్సులేకమైపోవుటచేత, శిష్యుడేవిషయమును గురించియైనను గురుదేవుని యభిప్రాయమెట్లుండునో సులభముగ దెలిసికొని యాప్రకారము ప్రవర్తించగలడు. పూర్వము తనకుగొప్పవిగ దోచిన విషయము లిప్పుడు ఎందుకును పనికిరానివిగను, పూర్వము తన కల్పవిషయ ములుగ దోచిన విప్పుడు మహద్విషయములుగను దోచుటచే, శిష్యునకు మొదట కొంత చిక్కుగానున్నను క్రమముగా పరమగురువుయొక్క యభిప్రాయముల తత్త్వము నెఱింగి ఆయన చిత్తవృత్తి నవలంబించగలడు.

కామ, మానసిక లోకముల (భువర్లోక, సువర్లోక ముల) నుండి మన మనస్సులకు యొత్తిడి దగులుచుం డును. అది యంతరాత్మనుండి వచ్చినదనుకొందురు. ఆ లోకములనుండి వచ్చుప్రోత్సాహములకు చెవియొగ్గక యంతరాత్మనుండివచ్చు వాక్కునకును, పరమగురువు నుండి వచ్చుతలంపులకును వాక్కులకును మాత్రము చెవియొగ్గవలెను. పూర్వము పరమార్థనిష్టుడై వైహిక జీవితమును విడిచి, యేగుహాలోనో, యేయడవిలోనో

యొంటరిగ జీవింపబోవుచుండిరి. ఇందులో ఆశ్చర్యము లేదు. వారీ యజ్ఞానజనితమగు లోకాభిప్రాయము యొక్క యొత్తిడినుండి తప్పించుకొని, తమమార్గమును తామనుసరించుటకు స్వతంత్రులగుట కట్లుపోవుచుండిరి. అట్టి యేకాంతవాసము పరమగురువుయొక్క తేజస్సులో జేరియుండువారికిని, యోగమార్గమున నెక్కువ యభివృద్ధినొందినవారికిని మిక్కిలి ప్రయోజనకరము. ఆ తేజస్సులోని చలనములు నిరంతరము శిష్యుని శరీరములపై బ్రసరించి, ఆ శరీరములను సంస్కరించి, గిలకరించి, వానిలోనున్న యననుగుణ్యములగు నణువుల నావలకుద్రోసివైచి, యుచితములగు నణువులతో నా శరీరములను నింపును. శిష్యుడు ప్రేమమొదలగు సద్గుణముల నభివృద్ధిచేసికొనుట కెల్లప్పుడును ప్రయత్నించుచుండవలెను. అట్టి నిరంతరప్రయత్నమునకీ తేజస్సు మిక్కిలి సహాయకారి. ఆ తేజస్సులోనున్నంతకాలము శిష్యునకింకొక తలంపు పుట్టదు.

కాని, యిక్కాలమున ముముక్షువు లీ లౌకికవ్యాపారములలోనుండియే, యేకాంతమునందును, పరమగురుసన్నిధిని, యుండుటవలన గలుగు ప్రయోజనముల బొందవలసియున్నది. ఏలయన, నిప్పటి ముముక్షువులు కేవలము ధ్యానమువల్లను తపస్సువల్లనేగాక లోకసేవ

వల్ల తరించవలసియున్నది. అది కష్టసాధ్యమైనను, గొప్ప యవకాశము, గొప్పభాగ్యమునై యున్నది.

యోగసాధనము చేయువాడు కృత్రిమముగ బ్రవర్తింపరాదు. అతని ప్రవర్తనమున విరుద్ధములుండ రాదు. అతను తెలిసికొనిన విషయముల ననుసరించి వ్యవహారోచితముగ బ్రవర్తించవలెను. ఆధ్యాత్మిక విషయముల సాధించుటకై గొప్ప ప్రయత్నముల జేయువారున్నారు. ఒక పరమగురువునకు తోడ్పడవలసినను, వారికొరకు లోకకార్యము నెరవేర్చవలసినను ప్రాణములనైన సమర్పించి యాపనిని చేయువారున్నారు. "క్రైస్తు కొరకు చచ్చువారనేకులున్నారు, గాని ఆయనకై జీవించువారరుదు". తాత్కాలికావేశముచే శౌర్యము గలిగి యేపనినైన జేయవచ్చును, గాని, యాశౌర్యము నెల్లప్పుడు, నంతతీవ్రముగ, మన కనుక్షణమును సంభవించు స్వల్పఛిద్రముల మధ్య, నిలువబెట్టుకొని, వానిని జయించుట కష్టము. మన చుట్టునున్నవారి ప్రవర్తనము మన కనుకూలముగనుండదు, గనుక, మనము వారితో నెల్లప్పుడును వ్యవహరించుచున్నప్పుడు మన మనస్సాక్షి తీరున నుంచుకొనుట బహుకష్టము. అందుచేతనే, స్వల్ప విషయములలోగూడ "క్రైస్తుకొరకు జీవించుట" అంతకష్టము.

మనస్వభావమును లోబఱ్చుకొని, మనయందున్న మంచిచెడ్డలను నిష్పక్షపాతముగ దెలిసికొని, దోషములున్నవొప్పుకొని, వానిని తొలిగించుకొనుట ఆత్మనిగ్రహము. ఆదోషములు లోతుగా వ్రేళ్లుబారినప్పుడు వానిని తీసివేయుటలో బాధగలిగినను సహించి, వానిని తీసివేయవలెను. ఇదివరకది సాధించి కృతార్థులైనవారున్నారు. మనముకూడ నెందుకు ప్రయత్నించి కృతార్థులము కాగూడదు? ఆప్రయత్నము కొద్దిగాగాని గొప్పగాగాని, ఒక్కసారిగాని యనేకసార్లుగాని, చేయుట ప్రయోజనకరమని అనుభవజ్ఞులు చెప్పెదరు. ఆ సాధనమునకు సాధనచతుష్టయమని పేరు.

బ్రహ్మజిజ్ఞాస సాధనచతుష్టయసిద్ధ్యనంతరముగాని చేయుట కర్హతలేదని చెప్పబడియున్నది. అట్టి సాధనచతుష్టయము నీకాలమున కనుగుణ్యముగను, ముముక్షువుల కందఱకును తెలియునట్లును, వివరించుటకు ఈ గ్రంథము వ్రాయబడినది.

మనుష్యులు మోక్షమార్గమున బ్రవేశించుటకును, అనుగమించుటకును, తరించుటకును అర్హులుగ జేయనుద్దేశించిన అభినవగ్రంథములు మూడున్నవి. అందులో "పరమగురుచరణసన్నిధి" (At the Feet of the Master) యొకటి. దానిలో 1909 లో జిడ్డు కృష్ణమూర్తి

గారికి[1] ఆయన పరమగురువు[2] సాధనచతుష్టయమును గుఱించి చేసిన యుపదేశములు వ్రాయబడినవి. అప్పటికి ఆశిష్యుని వయస్సు 13 సంవత్సరములు, ఉపదేశికుడు పరమపురుషుడు అగుటను ఆ యుపదేశములు బహుసులభశైలిలో, చక్కగా బోధపడునట్లు చేయబడెను. అందుచేత ఆ గ్రంథమునందలి యుపదేశములను మూలముగాగైకొని, వానికి వ్యాఖ్యానపూర్వకముగ నీ గ్రంథమును వ్రాయడమైనది.

"అంతరంగప్రబోధము" (The Voice of the Silence), "మోక్షమార్గప్రదీపిక" (The Light on the Path) అనునవి తక్కిన రెండు గ్రంథములు. ఈ మూడు గ్రంథములను అభినవప్రస్థానత్రయమని చెప్పవచ్చును. "మోక్షమార్గ ప్రదీపిక" మేబెల్ కాలిన్సు గారికి వారి పరమగురువుచేసిన యుపదేశవాక్యములు. ఇది 1885 సం॥ లో ప్రచురించబడినది. దీని కొకదాని వెనుక నొకటిగ అనేకగూఢార్థములున్నవనియును, వానిలో గూఢతమమైనది 'మహాచోహాన్' దీక్ష[3]తో

[1] ఈయనయొక్క వెనుకటిజన్మముల చరిత్రము యోగదృష్టితో జూచి వ్రాయుటలో నీయనకు 'ఆల్కియోని' అన్నసంజ్ఞానామమీయబడినది.

[2] కూట్ హూమీ మహర్షి.

[3] ఒకటవ యనుబంధము చూ॥

సంబంధించినదనియును, స్వామి తల్లాప్రగడ సుబ్బారావు గారు చెప్పిరి. "అంతరంగప్రబోధము" బ్లవాట్స్కీ-అమ్మ గారు వ్రాసినది. 1889 సంవత్సరములో ప్రచురింపబడి నది. ఆమె హిమాలయాశ్రమములలో నున్నప్పుడచట చదివి కంఠస్థముచేసికొన్న యొక యోగగ్రంథమునుండి తీసి వ్రాయబడిన దీగ్రంథము. ఇది "అర్హాత్" దీక్ష వరకు నుపయోగించును. "పరమగురు చరణసన్నిధి" ప్రథమ దీక్షవరకు నుపయోగించును.

---

రెండవ అధ్యాయము

## జ్ఞానదీక్ష—దానికిమార్గము

శ్రీ కృష్ణమూర్తిగారు వ్రాసిన గ్రంథమునకు సూచింపబడిన ముప్పది నలువది పేర్లలో నీ "పరమగురు చరణసన్నిధి" (At the Feet of the Master) యన్న పేరు డా॥ బెసెంటమ్మగారిచే నెంచబడెను. ఆమె యాలోచనపైనే కృతిసమర్పణము "మోక్షద్వారమును తట్టువారలకు" చేయబడెను. ఈ కృతిసమర్పణము "(తలుపు) తట్టువారలకు తెరవబడును.[1] (సత్యము) వెతుకువారలకు లభించును" అన్నసూక్తియందలి యర్థమును సూచించుచున్నది.

[1] భూతకోటియెడల ప్రేమయు, తన సర్వశక్తులను లోకహితార్థముపయోగించవలయునను నాసక్తియు నెవరికి గలుగునో, అట్టి ప్రేమయు లోకోపకారబుద్ధియు వికసింపజేసికొనుటకు కరుణతో మనకు తోడ్పడు పరమపురుషులయెడల నెవరు కృతజ్ఞులైయుందురో, వారా మహాపీఠమువారి నిలయద్వారమును తట్టువారు, వారికి జ్ఞానోదయమగును, గనుక, వారికి ద్వారము తెరువబడునని యభిప్రాయము.—డా॥ అరండేలు.

డా॥ బెసెంటమ్మగారు ఈ At the Feet of the Master అను గ్రంథమునకు వ్రాసినపీఠిక[1]లో "పెద్ద నైయుండుటంబట్టి యీ చిన్న గ్రంథమునకు పీఠిక వ్రాయు భాగ్యము నాకు గలిగెను. ఇది శరీరమున బాలుడై యుండియు, పరిపక్వమైన జీవుడగు నొకపిన్న సోదరుడు రచించిన ప్రథమగ్రంథము" అని వ్రాసిరి. సాధారణ ముగ పిన్న పెద్ద తారతమ్య మెంచునపు డీజన్మములో నీ పార్థివశరీరము యొక్క వయస్సునే గణింతుము. కాని, తత్త్వజ్ఞానాభివృద్ధి నిర్ణయించుటలో జీవాత్మయొక్క వయస్సేగాని యీ పార్థివశరీరముయొక్క వయస్సును గణించ రాదు. స్థూలశరీరము పిన్నవయస్సులోనున్నను, జీవు డభివృద్ధినొందియున్న యెడల, హృదయము మన స్సు పరిపక్వమైయుండి, యోగశక్తులు వికసించినగుర్తులు కనిపించును. ఆల్కియోని గతజన్మములలో పరిపక్వ మునొందిన జీవుడగుటచే, నీ జన్మములో నంత పిన్న వయస్సులో, నంతత్వరితముగ పరమగురుకటాక్షమును బడసి, వారుచేసిన యీ యుపదేశముల నవలీలగ బోధ పరచుకొని, యనుసరించి, సాధింపగలిగెను.

తరువాత, పీఠికలో డా॥ బెసెంటుగారు "వారిని జ్ఞానదీక్షవహింప నర్హునిగఁజేయుటకు నిందలి విషయ

[1] ఈ పీఠిక 1910 సం॥ రం॥ డిసెంబరులో వ్రాయబడినది.

ములు పరమగురువులు వారి కుపదేశించినవి" అని వ్రాసిరి.

దీక్ష యనుమాట మోక్షమార్గమునందలి మైదు మెట్లు అనదగిన మైదు జ్ఞానోపదేశములకు[1] వర్తించును. మోక్షమార్గమున మూడంతరువులు చెప్పబడినవి. 1. పరీక్ష్యమాణావస్థ (The Probationary Period) 2. నిజమార్గము (The Path Proper) 3. ఆధికారికావస్థ (The Official Period). జ్ఞానదీక్షనొందుటకు పూర్వము ముముక్షువుయొక్క యర్హతను పరీక్షించు కాలము పరీక్ష్యమాణావస్థ. ప్రథమోపదేశముతో నారంభమై సిద్ధిబొందు (జీవన్ముక్తదశ) వరకు నిజమార్గము. తరువాతది ఆధికారికావస్థ.

పరీక్ష్యమాణావస్థను బ్రవేశించుటకు ముఖ్యమయిన సాధనములు నాలుగున్నవి. మొదటిది సత్సాంగత్యము, అనగా, మోక్షమార్గమందున్న మహనీయుల సాంగత్యము. దానివల్ల నా మార్గముయొక్క మహిమయును, శోభయును, దాని ననుగమించవలసిన యావశ్యకతయును దెలియును. మరియును, అట్టి మహనీయుడు చెప్పుసంగతులవల్లను, అంతకంటె నెక్కువగ, వారి

[1] వీనిని తారకోపదేశములనియు నందురు. ఒకటవ యనుబంధము చూ ||

2 

తేజస్సునుండి ప్రసరించు ప్రాణశక్తిస్పందములవల్లను, మిక్కిలి మేలుగలుగును. ఈదేశములో జ్ఞానాభివృద్ధియం దనేక యంతరువులలోనున్నవారు, శక్తిపరిణామమున వివిధ దశలలోనున్నవారు, పలురకములవారు, నగు దేశికు లనేకులున్నారు. వారిలో ప్రతివానికిని శిష్య బృందముండును. ప్రతిదేశికుడును తన శిష్యులకు తత్త్వ విషయములను తన యభిప్రాయానుసారముగ బోధిం చును, పునశ్చరణార్థ మొకమంత్రము నుపదేశిం చును, లేదా, ధ్యానవిధానములనుగాని, యోగాభ్యాస సాధనములనుగాని బోధించును. కాని వీని యన్నిటి కంటెను ఎక్కువ మేలుచేయునది వారి సాంగత్యము. గురు వెక్కడకుబోయిన శిష్యు లక్కడకు వారివెంటనే పోయెదరు. వారెచ్చటనున్న శిష్యులచ్చటనేయుండి, వారిసేవజేయుచు, వారియుపదేశములను వినుచు, వారి తేజఃప్రభావమున పరిశుద్ధులగుచునుందురు.

రెండు గడియారములను దగ్గిరగా జేర్చియుంచిన యెడల, వానిలో బలమైనగడియారము క్రమముగా రెం డవదాని నడకను తన నడకతో సమానగముగనుండు నట్లుచేయును, లేదా, దానినడకను నిలిపివేయును. ఇది భౌతికశాస్త్రజ్ఞు లంగీకరించినవిషయము. ఆవిధముగనే యైహికజీవితమువల్ల మోటుస్పందములుగల శిష్యుని

సూక్ష్మశరీరములను, తీవ్రస్పందములుగల గురువుయొక్క సూక్ష్మశరీరముల నంటియుండునట్లు నిరంతరము సమీపమున నుంచినయెడల, క్రమముగ, శిష్యుని సూక్ష్మశరీర స్పందములుగూడ గురువుయొక్క శరీరస్పందములవంటి స్పందములు గలవియగును.

శ్రవణము రెండవసాధనము—అనగా, ఒక విషయముగురించి మరియొకరు చెప్పినదానిని వినుట, లేక, చదువుట, ఒక విషయమునుగురించి తెలిసికొనవలెనని శ్రద్ధగలవా డందునుగురించిగల యుత్తమబోధనలను సంపాదించి, యవి తన యంతరాత్మకు నచ్చుటచేత, వెంటనే వానినిగురించి యింకను తెలిసికొనవలెనని ప్రయత్నించును. అట్టి గొప్పబోధనలను వినియును; లేక, చదివియునుగూడ, వానియెడల నించుకంతయు శ్రద్ధగలుగని వారనేకులున్నారు. అది వారివారి పూర్వజన్మానుభవమునుబట్టి యుండును. పూర్వజన్మములలో నొక విషయమై దెలిసికొనుటకు కృషిచేసియున్న యెడల నీ జన్మములో నా విషయమునుగురించి వేగముగ శ్రద్ధబుట్టి, దానిని త్వరలో బోధపరచుకొనుశక్తి యుండును. ఇరువదిసంవత్సరములక్రిందట చదివినపుస్తకమును తిరిగి యిప్పుడు చదివినయెడల, అప్పటికంటె నిప్పుడెన్నియో క్రొత్తసంగతులు దానిలో గోచరించును.

ధ్యానము మరియొక సాధనము. గాఢముగ నాలో చించినంతమాత్రమున నీ సృష్టిపరిణామ మొకయేర్పాటుననుసరించి నడుచుచున్నదనియును, అట్టి యేర్పాటునుగురించి పూర్తిగదెలిసిన సిద్ధపురుషులు కొందరున్నారనియును, వారినిజేరుట కొకమార్గము దొరుకుననియును మనకు తెలియును. అట్లు గాఢాలోచనముచేసి యీ సంగతిని తెలిసికొన్నవా డామార్గమును కనుగొనుటకై ప్రయత్నించును.

సద్గుణాభ్యాస మింకొకసాధనము. ఇది కొన్ని విధముల నుత్తమసాధన మనవచ్చును. దీనిని క్రైస్తవులు శుద్ధి (purification), లేక, పవిత్రత (saintship) అందురు. ఇది సాధకుని మోక్షమార్గమున జేర్చువారి సన్నిధినిజేరి జ్ఞానవికాసమునొందుట కర్హునిగజేయును, గాని, కేవల మోక్ష సాధనముగాదు. కేవలము సద్గుణముల నలవరచుకొనియు మనోవికాసముకొరకు ప్రయత్నించనివానికి జ్ఞానప్రాప్తి యాలస్యమగును.

ఈ గ్రంథములోజెప్పబడిన నాలుగు సాధనములును పరీక్ష్యమాణావస్థలో నభ్యసింపవలసినవి. వాని నిందు చెప్పిన వరుసనే యభ్యసించనక్కరలేదు. అన్నిటిని ఒక్కసారి యభ్యసింపవచ్చును. కొందరి కొకటి సులభముగనుండును, మరికొందరి కింకొకటి సులభముగ

నుండును. మన కెంతవరకు సాధ్యమో అంతవర కన్నిటిని సాధించవలెను.

పురుషుడు మోక్షమార్గమున ప్రవేశింపవలెనని నిశ్చయించుకొనుటకు వివేకమావశ్యకము గనుక అది మొదటి సాధనముగ జెప్పబడినది. దీనిని బౌద్ధులు 'మనోద్వారవజ్జన' మందురు. అనగా, మనస్సుయొక్క ద్వారమును తెరచుట యని యర్థము. సామాన్యలౌకిక జీవితము నిరర్థకమనియును పరమార్థజీవితము సత్యమనియును తెలిసికొనుటకు పురుషుని మనస్సు అప్పుడే తెరువబడినదని భావము. దీనినే క్రైస్తవులు "కన్వర్షన్" (Conversion) [1] అందురు. మొదట నీశ్వరేచ్ఛ నెఱుంగక, తనదారిని తానుబోయి, కొట్టుకొనుచున్న పురుషుడు తుదకు, ఆ యీశ్వరేచ్ఛానుసారముగ నీ లోకపరిణామమెట్లు నడువవలసియున్నదియు తెలిసికొని, తన మార్గమునుండి మరలి, యీశ్వరేచ్ఛకనుకూలముగ బ్రవర్తించుట కారంభించుట యని దీని భావము. "మీ రీయైహికవిషయములయందను రాగముంచక, యూర్ధ్వలోకవిషయములయం దనురక్తులై యుండు" డన్నయపోస్తలుని వాక్యమున కర్థమిదియే.

[1] ఈ మాటకు 'కలిసి కూడావచ్చుట' యని వ్యుత్పత్త్యర్థము.

జ్ఞానదీక్షలు మహీపీఠనాయకుడగు 'నేకోపదేష్ట'[1] పేరున, ఆయన యాజ్ఞననుసరించి, యామహీపీఠము[2] వారిచే నొసగబడును. అంతకు పూర్వము ముముక్షువునకును అతని పరమగురువునకు గల సంబంధముతో మహీపీఠమునకు పనిలేదు. అది గురుశిష్యులమధ్య స్వాంతవ్యవహారము. ముముక్షువు మొదట నంతేవాసియై, తరువాత స్వీకృత శిష్యుడై, పిదప గురుపుత్రుడై, యనంతరము జ్ఞానదీక్ష కర్హుడగును.

మొదటి జ్ఞానదీక్షనొందిన పురుషుడు మహీపీఠములో జేరును. అంతవరకు నతడు మోక్షమార్గమున ప్రవేశించలేదు. ఆ దీక్షని ర్హేతుకముగ లభించదు. ఈ గ్రంథములో జెప్పిన నాలుగు సాధనములను సాధించి, తన కామములతో ముందుకు చొరుచుకునివచ్చి జీవాత్మాభి

[1] ఈయనరే యీ భూమండలమునందు జరుగు పరిణామమునంతను పరిపాలించు ప్రభువు. శ్రీసనత్కుమారులవారు.

[2] ఈ భూమండలమును పరిపాలించుచు అందలి సమస్తభూతపరిణామమును నడుపుచున్న ఆధ్యాత్మికాధికారికవర్గమునకు మహీపీఠమని పేరు. వీరే లోకపాలురు. వీరీశ్వరసంకల్పము నెరవేర్చు పరమపురుషులు. ఈ మహీపీఠనాయకుడు శ్రీసనత్కుమారులు. మనువులు, జగద్గురువులు, మహర్షులు, బ్రహ్మర్షులు, దేవర్షులు, మొదలగు సిద్ధపురుషులును, జ్ఞానదీక్షితులై మోక్షమార్గమునను గమించుచున్న శిష్యకోటియు నందఱు నా మహీపీఠమున జేరినవారు.

వృద్ధి కాటంకము గలిగించు నీచప్రకృతిసంబంధమగు దేహాత్మను జయించి, దేహాత్మ జీవాత్మయొక్క లక్షణ ములను వ్యక్తపరచునదిగ జేసికొన్నవాని కాదీక్ష యొసంగబడును.

దేహాత్మ జీవాత్మయను రెండు భిన్నసత్త్వములు లేవు. జీవాత్మ బహుస్వల్పమగు తనయంశ నొకదానిని స్థూలలోకముల(భూర్భువస్సువర్లోకముల)లోనికి, అచ్చటిస్పందముల ననుభవించుటకై, బంపును. అదియే దేహాత్మ. దేహాత్మ తన కనుకూలస్పందములు గల ప్రకృతిలోనుండుటచేత, నచ్చట నది జీవాత్మకంటె నెక్కువ స్ఫుటమగుచైతన్యము గలిగియుండి, తాను జీవాత్మ యొక్క యంశయనుమాట మరచిపోయి, స్వతంత్రముగ వ్యవహరించుట కారంభించి, తన యిష్టమువచ్చినట్లు పోవును. కాని, బహుజన్మముల యనుభవముచే జీవాత్మ బలపడి, దేహాత్మ తన్నతిక్రమించి తప్పుమార్గములలో బడిపోవుచున్నదని తెలిసికొని, దానిని నియమించుట కారంభించును. దేహాత్మ జీవాత్మయొక్క లక్షణములను వ్యక్తపరచుటయేగాని మరియేమియు జేయకుండునట్లు నియమించుట మనవిధి. దీనినే సిన్నెటుగారు 'జీవాత్మకు భక్తి జేయుట' (Giving allegiance to the Higher Self) యనిరి. 'అంతరంగప్రబోధము' (The

Voice of the Silence) లో "కామశరీరము[1]ను జంపవలె" నని యున్నది. అనగా, కామశరీరము తన స్వంతకామములు రాగములు గలిగియుండక, జీవాత్మ యెంచుకొన్నవానినే వ్యక్తపరచునట్లుచేయుట యని భావము.

పురుషుడు ప్రథమజ్ఞానదీక్షకు సిద్ధమగునప్పటికి కామశరీరమును, మానసికశరీరమును స్థూలదేహమును స్వాధీనముచేసికొనియుండవలెను. అది యనేక సంవత్సరములు ధ్యానమననములు చేసినవారికి సులభము గాని సామాన్యులకు కష్టసాధ్యము. కనుక, వారి కా సంగతి చెప్పినంతనే మాకక్కర లేదందురు. అది యెంత కష్టమైనను చేయదగినది. జ్ఞానదీక్షల నెవ్వరును స్వలాభమునకై, యనగా, తామీసంసారదుఃఖములనుండి తప్పించుకొనుటకై, పొందరు; ఈశ్వరసంకల్పమున తోడ్పడుటకు పొందుదురు. అందుకర్హులమగుదుమను ధైర్యము మన కీ శ్రమనంతను భరించుటకుదగిన ప్రోత్సాహమిచ్చును.

మానవుని పరిణామములో ముఖ్యమైన మార్పులు మూడున్నవి. వానిలో మొదటిది జంతువర్గులో సమూహాత్మలో జేరియుండిన జీవుడు వ్యక్తిత్వమునొంది

[1] Lunar Form=సోమోరాజా.

మానవవర్గులో జేరినప్పుడు కలిగినది. రెండవది ప్రథమ జ్ఞానదీక్షను బడసినపుడు కలుగును. ఈ దీక్షనిచ్చు నపుడు "ఇక నీ వెప్పుడును సురక్షితుడవై యుందువు; నీవు ప్రవాహమున ప్రవేశించినావు; ఇక నీ వావలి గట్టును త్వరలో జేరుదువుగాక!" అని యందురు. క్రైస్తువులు ప్రథమదీక్షబొందిన వారిని 'రక్షితులు' 'ఆపన్ముక్తులు' అనియందురు. అనగా వారీ మహా మన్వంతరాంతమునకు మానవకోటికై యేర్పడిన గమ్య స్థానమును జేరుట నిశ్చయమని భావము. మూడవ మార్పు పురుషుడై దవజ్ఞానదీక్ష బొంది, జీవన్ముక్తుడై, మానవవర్గును విడిచి పరమపురుషుడైనప్పుడు గలుగునది. ఇదియే మనకీమహామన్వంతరాంతరమున కేర్పడిన గమ్య స్థానము. కాని మనమంతవరకు నిరీక్షించ నక్కరలేదు; ఈలోపునే సాధనముచేసిన, నా పదవిని బొందవచ్చును.

ప్రథమ దీక్షకాలమున దేహాత్మజీవాత్మలు తాదా త్మ్యమునొందినట్లే, రెండవ దీక్షకాలమునకు జీవాత్మ పరమాత్మలు తాదాత్మ్యము నొందును. అటుపైని జీ వాత్మ పరమాత్మయొక్క లక్షణములను వ్యక్తముచేయు చుండును. జీవన్ముక్తులయెదుట నొక మహామహిమా న్వితమగు మార్గము వారనుగమించవలసినది యున్నదని మాత్ర మిప్పుడు మనము తెలిసికొనినచాలును.

ఈ పరిణామమున కంతమేమియని యడుగవచ్చును. మన తెలివి మిక్కిలి సంకుచితమును, మితమునైనది. జ్ఞానోదయమైనంతవరకును మన తెలివి సంకుచితమనియు నిస్సారమనియు తెలియదు. ఇట్టి తెలివితో మనము సంసారాంతము నూహించజాలము. ఈ సంసారమును సంకల్పించి నడిపించుచున్న పరాత్పరుడున్నాడని మాత్రము చెప్పగలము గాని అంతకంటె నెక్కువ చెప్పజాలము. ఈ విషయమున వేదాంతులును మీమాంసకులును అనేకవిధములుగ జెప్పియున్నారు. కాని య వన్నియు మన మిప్పుడే అంగీకరించనక్కరలేదు. "భగవంతుడు తనను ప్రేమించువారికొరకై సృష్టించిన వస్తువులను యథాతథముగ కన్ను చూడజాలదు, చెవి వినజాలదు, మనుష్యుని హృదయమున నవి ప్రవేశించవు". ఇప్పటి మనధర్మమును మనము యథోక్తముగ నెరవేర్చుచు బోయినచో ముందుగతి యెప్పటికప్పుడు మన యెదుట గనబడుచుండును.

---

## మూడవ అధ్యాయము

## ఆ గ్రంథ మెట్లు రచియింపబడినది

డా॥ బెసెంటుగారు పీఠికలో తరువాత ఇట్లు వ్రాసిరి:

"ఆ విషయములను వారు కష్టబడి మెల్లమెల్లగ జ్ఞప్తికిఁదెచ్చుకొని యింగ్లీషుభాషలో వ్రాసిరి. ఏల యన, గడచిన సంవత్సరమున (1909) వారికాంగ్లేయ భాషాధోరణి యిప్పటికంటె మిగుల నల్పముగ నుం డెను. చాలమట్టుకు పరమగురువులమాటలే యిందు వ్రాయఁబడియున్నవి. అచ్చటచ్చట వారి సొంతమా టలుకానిచో వారి యభిప్రాయము శిష్యుని మాటలతో వ్రాయఁబడినది. వారి వాక్యములలో రెండుమాత్రము విడిచిపోయియుండ వానిని బరమగురువులు పూర్తిచేసిరి. మఱిరెండు స్థలములలో నొక్కొక్కమాట విడిచియుండ నది పూర్తిచేయఁబడినది. ఇవివినా, మిగిలినదంతయు ఆల్కియోని సొంతముగ వ్రాసి లోకమునకు వారొసంగిన ప్రథమగ్రంథము."

పరమగురువులు : వారికటాక్షమును బొందుమార్గము (The Masters and the Path) అను గ్రంథమున నీ గ్రంథరచననుగురించి యిట్లు వ్రాయబడెను. " ప్రతిరాత్రియును నేనీ[1] బాలుని కామ (స్వప్న) శరీరములో పరమగురువు[2] సన్నిధికి, యుపదేశార్థము గొనిపోవుచుంటిని. ప్రతిరాత్రియు పరమగురు వాబాలునితో పదునైదునిముషములు ముచ్చటించి, తుదను తానా రాత్రిచెప్పిన విషయమంతయు నొకటి రెండు వాక్యములలో సంగ్రహముగ జెప్పుచుండెను. ఆ వాక్యముల నా బాలుడు తిరిగి చెప్పుచుండెను. అట్లవి వానికి హృద్గతములై, యాతడు మరుచటియుదయముననే వానిని జ్ఞప్తికి దెచ్చుకొని వ్రాయుచుండెను. ఈ గ్రంథ మట్టి సంగ్రహవాక్యములతో గూడి, పరమగురువుచేసిన యుపదేశమున కాయన సొంతమాటలతో జెప్పిన సారాంశమైయున్నది. . . . మరికొంతకాలమున కా బాలుడు మన యధ్యక్షురాలి[3]తో వారణాసి కేగి, యచ్చటనుంచి తాను వ్రాసినకాగితములను బంపుమని యడయారులో

[1] ఈ గ్రంథమునకు వ్యాఖ్యానమును చెప్పిన యోగి లెడ్బీటరుగారే "పరమగురువులు : వారికటాక్షమును బొందుమార్గము" అను గ్రంథమును వ్రాసిరి. ఆల్కియోనిగారికి వారొక దేశికుడుగనుండెను.

[2] కూట్ హూమిమహర్షి.

[3] డా॥ బెసెంటుగారు.

నున్న నాకు జాబువ్రాసెను. నే నాకాగితములను వెతకి వరుసగజేర్చి, 'టైపు' చేసి, అవి పరమగురువు వాక్య ములగుటచేత, వ్రాయుటలో దప్పులు లేవని నిశ్చయము చేసికొనుట మంచిదనితోచి, ఆ 'టైపు' ప్రతిని కూర్ హూమీమహర్షి వారిసన్నిధికి గొనిపోయి చూపితిని. ఆయన దానిని చదివి, యక్కడక్కడ నొకటిరెండు మాటలుసవరించి, కొన్నిచోట్ల అన్వయపూర్తికొర కును, అర్థము స్పష్టమగుటకును కొన్నిమాటలుచేర్చి, ఆయనచెప్పిన వ్యాక్యములలో వ్రాయమరచినవి చేర్చిరి. ఆయన యట్లుసవరణజేసి 'బాగు, ఇది నిర్దుష్టముగ గనబడుచున్నది. ఇది చాలు' నని సెలవిచ్చిరి. కాని, వెంటనే 'దీనిని మైత్రేయులవారికి[1] కనపర్చెదము ర' మ్మని యాపత్రముల జేతగొని బైలుదేరిరి. మేమిరువుర ము శ్రీమైత్రేయులవారిసన్నిధి కేగితిమి. వారాపత్ర ముల జదివి యామోదించి 'ఆల్క్యెయొనిని లోకమునకు పరిచయముచేయుటకు దీని నొక చక్కని చిన్నగ్రంథ ముగ బ్రచురింపు' డని యానతిచ్చెను. అప్పటికా బాలుని లోకమున కెరుకపరచునుద్దేశము మాకులేదు.

[1] శ్రీ మైత్రేయులవారు ప్రస్తుతము జగద్గురువులు, లేక, వ్యా సులు. శ్రీ కృష్ణద్వైపాయను లాపదవిని విడిచినపిదప వారాపదవి నలంకరించియున్నారు.

. . . కాని, యోగమార్గమున నాజ్ఞమేరకు నడువవలయును గనుక, ఈ చిన్న పుస్తకమును వెంటనే యచ్చు వేయుట కిచ్చితిమి ".

ఆ గ్రంథము ప్రచురించుటవల్ల గలుగుననుకొన్న యిక్కట్లన్నియు గలిగినవి. కాని శ్రీమైత్రేయులవారి యాజ్ఞ ననుసరించుటయే యుక్తమైనది. ఏలయన, నీ గ్రంథమువలన లోకమున గలిగిన మేలు ఆ యిక్కట్లనన్నిటిని మించిపోయినది. వేలకొలదిజనులా గ్రంథమును చదివి తమ జీవితములను పూర్తిగ మార్చుకొనిరి. ఆ గ్రంథ మిరువదియేడు భాషలలోనికి భాషాంతరీకరణము చేయబడినది. అన్నిటికంటెను విశేష మా గ్రంథము ఇప్పుడు వ్యాసపీఠ మలంకరించి జగద్గురుపదవియందున్న శ్రీమైత్రేయులవారి యాశీర్వచనమును బడసినది.

డా॥ బెసెంటుగారు మనలనందర నీక్రింది విధముగ నాశీర్వదించుచు ఆపీఠిక నిట్లు ముగించుచున్నారు :

" పరమగురువుల వాక్కునుండి వెలువడిన వాక్యములు శిష్యుఁడగు గ్రంథకర్త కెట్లు ఉపకారములయ్యెనో అట్లే యీ గ్రంథ మితరులకు నుపకారమగుఁగాక ! అట్టి మనోభీష్టముతో నిది యియ్యఁబడుచున్నది. అయిన నీ యుపదేశము పరమగురువులు వచించినది మొదలు గ్రంథకర్త యనుష్ఠించినరీతి నొక్కొక్కరు ననుష్ఠించి

సంగాని సఫలముగానేరదు. వారు చెప్పినట్లు చేసినచో గ్రంథకర్తకు మోక్షమార్గద్వారము దెలుపఁబడినట్లే చదువరులకు సయితము ఆద్వారము తెలుపఁబడి వారా మోక్షమార్గమున నడువఁగలరు".

ఆ గ్రంథమును విమర్శించుచు డా॥ బెసెంటుగారొక చో "ఇట్టియుపదేశములు—ఇంత నిదానముగను, ఇంత తత్త్వబోధకముగను, ఇంత సొగసుగను చేయబడిన యుపదేశములు—లోకమున బహుఅరుదుగ జేయబడు" నని వ్రాసిరి. కనుక, మన మిందలి ప్రతిమాటను మిక్కిలి జాగ్రత్తగ విచారించదగియున్నది.

---

నాలుగవ అధ్యాయము

## పూర్వశాంతిమంత్రము

ఆ గ్రంథప్రారంభమున "అసతో మా సద్గమయ। తమసో మా జ్యోతిర్గమయ। మృత్యోర్మాఽమృతం గమయ।" అన్న బృహదారణ్యకోపనిషద్వాక్యములు ప్రార్థనపూర్వకముగ నింగ్లీషున భాషాంతరీకృతమై వ్రాయబడినది. "అసత్తునుండి నన్ను సత్తునకుఁ జేర్పుఁడు। చీఁకటినుండి నన్ను వెలుఁగునకుఁ జేర్పుఁడు। మృత్యువునుండి నన్నమృతత్వమునకు నడుపుఁడు" అని దీని యర్థము.

సత్తు అనగా శాశ్వతమైనది, అసత్తు అనగా అశాశ్వతమైనది యని యర్థముచేసికొనదగును. మన మీ సంసారములో వ్యవహరించు బూర్భువస్సువర్లోకములు అసత్యములనుట కొంత దురభిప్రాయమునకు కారణమగును. ఆలోకములు లయముగాకుండ నున్నంతవరకవి యసత్యములుకావు. మనము జాగ్రదవస్థలో భూలోకమున ప్రజ్ఞకలిగియున్నప్పుడు తక్కిన లోకముల

యందలి వస్తువులు మనకు కనిపించవు. అందుచేత, అప్పుడు, మనకు భూలోకము సత్యముగను, తక్కిన వసత్యముగను, దోచును. అట్లే నిద్రావస్థలో మనము భువర్లోకమున ప్రజ్ఞగలిగి, యందలివస్తువులను చూడ గలము, గాని, భూలోకమునందలి వస్తువులను చూడ జాలము, గనుక అప్పుడు భువర్లోకము సత్యముగను, భూలోక మసత్యముగను దోచును. ఏ లోకములోని వస్తువు లక్కడ నెప్పుడు నుండును, కాని, తాత్కాలిక ముగ మనప్రజ్ఞ యేలోకములో వ్యవహరించునో అం దలి వస్తువులే మనకు గోచరమగును గనుక ఆ లోకమే సత్యమనితోచును.

మనకు తెలిసినంతవరకు వ్యక్తప్రపంచమంతయు నశాశ్వతమైనదే. అవ్యక్త మొక్కటియే శాశ్వతమైనది. వ్యక్తమైనదంతయు నెప్పుడో యొకప్పుడు లయమయి యానిర్వికారవస్తువులో లీనమగును. లోకములన్నియు స్థూలసూక్ష్మభేదమును బట్టి ముందు వెనుక లయముకా వలసినవే. సత్యలోక మెంత సత్యమైనదో భూలోకము అంత సత్యమైనదే. అదియెట్లు భగవంతుని వ్యక్తస్వ రూపమో యిదియు నట్లే భగవంతుని వ్యక్తస్వరూప ము. కనుక, నొకటి సత్యమని, ఒకటి యసత్యము, కేవలముస్వప్నము, ఇంద్రజాలము, అని యనరాదు.

ప్రకృతి చెడ్డదికాదు. ఆత్మ భగవత్స్వరూపమైనట్లే ప్రకృతియు భగవత్స్వరూపమే. భగవంతునిలో నవి రెండును రెండుప్రక్క లనవచ్చును. ప్రకృతి తరుచుగ ఆత్మాభివృద్ధి కాటంకమగుచుండును. అందుచేత, అది చెడ్డదియందురు. కాని, దానిని మన మార్గమున కడ్డు పడున ట్లుపయోగించుకొనుటచే నట్లగుచున్నది, గాని, యుక్తముగ నుపయోగించుకున్నయెడల మన కది తోడ్ప డును. కనుక, మన మీ వాక్యమున 'మమ్ములను మాయ యెక్కువగనున్న యీ బాహ్యలోకమునుంచి శుద్ధసత్యమునకు సమీపముననున్న సూక్ష్మలోకమునకు జేర్పు'డని కోరుచున్నాము.

రెండవ వాక్యములోని చీకటియనగా నజ్ఞానము, వెలుగనగా జ్ఞానము అని యర్థము. మాకు జ్ఞానము నొసంగుడని పరమగురువును ప్రార్థించుచున్నాము. మరి యును, స్థూలలోకమునందలి వెలుగు అంతకంటె సూక్ష్మ మైన లోకములో చీకటియగును. భూలోకమందలి వెలుగు భువర్లోకపు వెలుగుముందు మబ్బుగను మసక గను కనబడును. పైలోకములకుబోయిన కొలదియు నట్లేయుండును. మనప్రజ్ఞ యొకలోకమునుండి పైలోక మునకు బోయినపుడచట మనజ్ఞానము, శక్తి, తేజస్సు అదివర కెరుగని వర్ణనాతీతమగు నౌన్నత్యమును బొంది

నట్లు కనిపించును. అందుచేత ఈ వాక్యములో నూర్ధ్వ లోకసంబంధమగు జ్ఞానమును గోరుచున్నామనునర్థము గూడ నున్నది.

మూడవ వాక్యమునకు ఈ జననమరణరూపమగు సంసారచక్రమునుండి మమ్మమృతత్వమునకు జేర్పుడని యర్థము. జననమరణము లొకరినొకరు ఎన్నడునెడ బాయని సహవాసులు. మృత్యువునుండి తప్పించుకొన గోరినపుడు జననముగూడలేకుండ జేసికొనగోరవలెను. అమృతత్వమనగా, జననమరణముల కతీతమైనదియును, పురుషు డీ ప్రపంచమునం దనుభవించవలసిన యనుభవముల నన్నిటిని పూర్తిగా ననుభవించి తన పరిణామము పూర్తిచేసికొని, యిక నీలోకత్రయమున (భూర్భువస్సువర్లోకములు) కు దిగ నగత్యములేనిదియు, నగునవస్థ.

ముండకోపనిషత్తు (౧ ముం. ౨ ఖం. ౫ మొ॥ మం.) లో అగ్నిహోత్రాది కర్మలను చేయుటవలన కలుగు ఫలములను చెప్పుచు, (౭ మం.) ఈశ్రౌతస్మార్త కర్మయే శ్రేయస్సు (మోక్షదాయకము) అని సంతసించు మూఢులు జరామరణములను తిరిగి పొందుచున్నారు, అని చెప్పి, (౧౧ మం॥ లో) శమించిన యింద్రియోద్వేగముగల యేజ్ఞాను లరణ్యమున తపస్సు (తన విధ్యుక్త ధర్మాచరణము)నను శ్రద్ధయందును ఉపవసించుచున్నా

రో, వారు (విరజాః) నశించిన వాసనలు గలవారై, అమృతః అవ్యయాత్మా, అగు హిరణ్యాగర్భుడుండు (సత్య) లోకమును సూర్యద్వారమార్గమున పొందు చున్నారు, అని చెప్పబడియున్నది. ఈ సూర్యద్వారమే శుక్లపక్షమని, ఉత్తరాయణమని శ్రీమద్భగవద్గీత (౮ అ-౨౪, ౨౫) లోను ప్రశ్నోపనిషత్తులోను చెప్ప బడినది. దీనివల్ల అమృతత్వమును బొందనిచ్ఛగలవా రైహికఫలములనిచ్చు కర్మల జేయరాదు, అట్టి కర్మల వల్ల స్వర్గాది యుత్తమలోకప్రాప్తి కలిగినను 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి' యనిన ట్లాలోకముల యందనుభవించదగిన విశ్రాంతి యనుభవము కాగానే, తిరిగి, జననము కలుగకతప్పదు, అని తెలియుచున్నది.

ఈలోకమునగలుగు ననుభవమంతయు నింద్రియ గోచరమైనది. ఇంద్రియములకు అంతర్దృష్టి లేదు. అమృ తత్వము నభిలషించువారు ధీరులై, యీ యనిత్యము లైన యైహికభోగములవల్ల తమకు నిత్యమగు ఫలము లభించదని, వానిని కోరనివారై, అంతర్ముఖులు కావల యును. (కఠోపనిషత్తు, ౪—౧, ౨). కనుక, సామాన్య జీవితమున కిది భిన్నమైనమార్గము. అందుచేతనే, యిది 'క్షురధార' వంటిదనియు, దుర్గమమైయునదనియు కఠోపనిషత్తు (3-౧౪)లో చెప్పినారు. క్రైస్తు "మృ

త్యుమార్గము విశాలమైనది. దాని ననుసరించువా రనేకులు", "ద్వారము తిన్ననైనది, జీవితమార్గమిరుకైనది, దానిని తెలిసికొనగలవారు బహుకొద్దిమంది" అని చెప్పిన దీ మార్గములనుగుఱించియే. ఈ వాక్యమున సాధకుడు తన నీయమృతత్వమునకు జేర్పుమని కోరుట వల్ల, వానికి తత్సాధనము చేయుటయందు పూర్తియైన శ్రద్ధ, ఇచ్ఛ కలిగినవని యర్థము.

---

అయిదవ అధ్యాయము

## తన గ్రంథమున కాల్కియాని వ్రాసిన యుపోద్ఘాతము

మూలము :—" ఇందు వ్రాయఁబడునవి నా మాటలు గావు. నాకుపదేశించిన పరమగురువుమాటలు. వారు లేనియెడల నేనేమియు చేసియుండఁజాలను, గాని వారి సహాయముచే నేను మోక్షమార్గమును బ్రవేశించితిని."

ఆల్కియోని తన యభివృద్ధికి తన పరమగురుని ప్రభావమును, సహాయమును, కారణములని యిచట స్పష్టముగ జెప్పుచున్నారు. వారివలె పరమగురుని సహాయముబడయ సంసిద్ధులైనవారందరకు నది లభించును.

మూలము :—" నీవును అదేమార్గము ప్రవేశింప నిచ్ఛగలవాఁడవు. కావున వారు నాకుపదేశించినవాక్కులు నీకును సహాయములుగనుండును. ఆ మాటలను అనుష్ఠించవలెను సుమా! ఆ మాటలు సత్యములనియును, రమణీయములనియును చెప్పుట చాలదు.

చెప్పినప్రకారము జవదాఁటక యనుష్ఠించినఁగాని నీవు కడతేరఁజాలవు. ఆహారమును జూచి యది బాగుగనున్నదనుటచే నాఁకొనియున్నవాని యాఁకలితీరదు. చేయిచాఁచి యా యన్నముఁ దినవలయునుగదా! అట్లే పరమగురువులవాక్కుల వినుట చాలదు. వారుచెప్పు నొక్కొక్కమాటయు గమనించి వారు సూచించు నొక్కొక్కయంశమును గ్రహించి వారు చెప్పునటుల నడుచుకొనవలయును."

ఏయుపదేశములైనను, అనుష్ఠించెదనని చెప్పినంత మాత్రమునచాలదు. ప్రతివాక్యమును మన జీవితములో జేరిపోవలెను. మన మనుక్షణమును ఆ యుపదేశముల ననుష్ఠించుట కవకాశములకొరకెదురుచూచుచుండవలెను. ఆ గ్రంథాంతమున నీ విషయమును చక్కఁగ బోధించు నొకగీతమున్నది. అది:

"గీ॥ వేచియుందు సద్గురువాక్కు వినెడువేడ్క[1] ।
చూచుచుందును గుప్తమాజ్యోతికొరకు ॥
యుద్ధరంగము మధ్యను ఓర్పుతోడ ।
గురువునాజ్ఞను వినుటకై కోరుచుందు ॥

[1] పరమగురుచరణ సన్నిధిలో "వేచియుందును సద్గురువచనమునకు" అని యున్నది. యతిభంగమగుటచే సవరించడమైనది. (గుం. వెం. సు.)

జనసమూహామునందైన కనగనేర్తు ।
వారి యతిసూక్ష్మసంజ్ఞను వైశముగను ॥
జనులు మహితోరు వాద్యముల్సలుపుచుండ ।
పరమగురువులగుహ్యాహూ పలుకు విందు ॥ ”

జీవితరణరంగమున విశేషముగనున్న కోలాహలము, తొట్రుపాటు, ఉద్రేకము మధ్య నుండియు పరమగురు వ్వాక్యమును వినుటకు శ్రద్ధతో వేచియుండవలెను. ఆ వాక్యముల ననుష్ఠించుటకుతగిన యవకాశములకొరకాతురతతో చూచుచుండవలెను. మొదటియడుగు వేయుటయే కష్టముగాని, తరువాత అభ్యాసమువల్ల నిది సులభసాధ్యమగును. ఒక వ్యాపారి తన వ్యాపారములో లాభమెట్లుకలుగునో శ్రద్ధతో కనిపెట్టి చూచుచుండును. వాడభ్యాసముచే తగిన యవకాశములను గని పెట్టును. అట్లు వాడు శ్రద్ధవహించుట యుక్తమే. ఐహిక విషయములలో నవకాశములకొరకు వ్యాపారి యంత శ్రద్ధవహించినపుడు పరమార్థవిషయమున ముముక్షు వంత శ్రద్ధవహించనక్కరలేదా ?[1]

[1] సామాన్యముగ నెవరైన మనకు మంచిగుణములున్నవని చెప్పి నపుడు మనము నిజముగ మనకాగుణములున్నవనుకొని పొంగిపోవుట యును; సాధారణదుర్గుణములను గురించియు వానిని పోగొట్టుకొనుట గురించియు, నెవరైన మాట్లాడినపు డాగుణములు ‘ మాయందు లేవు,

... పరమగురుచరణసన్నిధిని చేరగోరువా రాయనచిత్త వృత్తిని తెలిసికొనియుండు టత్యావశ్యకము. కాని, ఆ యన యభిప్రాయమిదియని తెల్లిసినతరువాత ఆయన కట్టి యభిప్రాయమెందుకు కలిగినదని విమర్శించి తెలిసి కొనకుండ, గ్రుడ్డిగా, దానినవలంబించుట యుక్తము కాదు. వారు మనకంటె బహుయెక్కువ జ్ఞానవంతు లగుటచేత వారియభిప్రాయములు మన యభిప్రాయ ములకంటె నెక్కువ యనుసరణీయములై యుండును. కనుక, వానిని మనము గ్రుడ్డిగా ననుసరించినను మనకు మేలే. కాని, యది వారి కిష్టము లేదు. మన తెలివి నుప యోగించి ప్రతియుపదేశమును పరిశోధించి, దాని మంచి చెడ్డల నాలోచించి, మనకది యుక్తమనితోచినప్పుడే దాని ననుష్ఠించవలెను, గాని, అనాలోచితముగ ననుష్ఠించరాదు, అని వారియాదేశము.

ఐహికార్థములకంటె ఆముష్మికార్థము లెక్కువ సత్య ములు, ఎక్కువ శాశ్వతములు, ఎక్కువ యావశ్యక

మా ప్రక్కనున్నవారికొరకీమాటలు చెప్పినారుగాని మాకొరకు కాదని యనుకొనుటయును సహజము. ఇట్టి మహోపదేశములు లభించినప్పుడు, అవి మనకు వర్తించవనుకొనక, అవి మనకు వర్తించునో లేదో ముందు పరిశీలించి చూచుకొనవలెను. లేనియెడల గొప్ప యవ కాశమును బోగొట్టుకొందుము. ఆ యవకాశము పోయినయెడల మరల నీ జన్మమున దొరకకపోవచ్చును.

ములు అని మనస్సునందుంచుకొనుట బహుముఖ్యము. లౌకికవ్యాపారములోనున్నవాని కాముష్మికము ముఖ్యమని తోచదు. సిన్నెటుగారు "మీకు చేరింగుక్రాసు (లండనునగరమునందలి యొకచతుష్పథము) యెంత సత్యమో పరమార్థవిషయములుగూడ అంతసత్యములై యుండవలె" నని వ్రాసిరి. మన కవి ప్రతిదినము చూచు వస్తువులవలె పరిచయమై యుండవలెను. ఎల్లప్పుడు బ్రహ్మజ్ఞానమునుగురించియే చింతించుచు, తదనుసారముగ బ్రవర్తించుచు నుండువారి కాముష్మికవిషయములు యదార్థములని యనుభవమువల్ల నిశ్చయభావము గలుగును. లేదా, యొక విషయమునుగురించి విన్నప్పుడు దానిని హేతుపూర్వకముగ విమర్శించుటవల్లగాని, యంతర్వాణి ప్రబోధముచేగాని, యా విషయము సత్యమని తెలిసికొనవచ్చును. అట్లు తెలిసికొన్నప్పుడావిషయము మనకు సత్యమై, యాచరణీయమగును. ఆధ్యాత్మికవిషయములలో గొన్ని మొదట తెలిసికొనుటకు కష్టముగను గూఢముగను నుండును, గాని, క్రమక్రమముగ నవి సులభములును, సుబోధకములునై, మనకు స్వాభావికములగును. వానిని బోధపరచుకొనుటకు ప్రయత్నించుచున్నకాలములో వాని విలువ నెరుంగజాలము, గాని బోధపడినతరువాత నవి మన జీవితము

లో నొక గొప్పశక్తిగ బనిజేయును. స్వానుభవమువల్ల నీ మార్గము సులభమును, శీఘ్రముగ తరింపగలదియు నగును. ఒక్కవిషయమును స్వానుభవమువల్ల తెలిసి కొన్నయెడల, తక్కిన విషయములయందు నమ్మకము గలిగి యవి బోధపడుట సులభమగును.

మూలము :—" వారి సూచనలలో నొక్కటి గ్రహించకపోయినను, వారి మాటలలో నొక్కటి విడిచినను, అది యెప్పటికినిపోయినదే. వారు చెప్పినది మరల చెప్పరుసుమా ! "

పరమగురువుల యుపదేశములు పునః పునః వినుచున్నను, వాని ననుష్ఠించుటకు ప్రయత్నించనియెడల, ఆ సందేశములను విననిలౌకికులకంటె తక్కువవారమగుదుముగాని యెక్కువ వారముకాము. అనుష్ఠించుటకు ప్రయత్నముకావలసినది.

పరమగురువులు చెప్పినదానిని మరలచెప్పరు. వారొకసూచనను చేసి మనము దానిని ఉపయోగించుకొననియెడల తిరిగి యాసూచనను చేయరు. వారు శిష్యుడు చేయజాలని కార్యమును సూచించరు. కాని, యతడు దాని నశ్రద్ధజేసినయెడల వారూరకుందురు. ఇందుకు కారణము వారికి శిష్యునిపై దయలేకపోవుటగాదు,

యత డాసూచనను గ్రహించుటకు సంసిద్ధుడుకాలేదు, మరియును, వారి కొక్కనికొరకు కాలము వ్యర్థముచేయుటకు తీరికయుండదు. కాని, వారిశిష్యులు వారియుపదేశములను మనకు బోధించునపుడు చెప్పినదానినే తిరిగి తిరిగి చెప్పెదరు.

పరమగురువులు తమ శిష్యుల కిది యిట్లు చేయుడని స్పష్టముగ జెప్పుటయరుదు. శిష్యుడేమిచేయగలడో తనంతట తాను తెలిసికొనవలెనని వారియుద్దేశము. వారిది యిట్లుచేయుమన్నయెడల శిష్యుడు తప్పక అట్లు చేయును, కాని ఆ కర్మఫలము గురువుకే లభించును; శిష్యునకు భక్తి, విధేయతలవల్లగలుగు ఫలముమాత్రమే మిగులును. ఆ కర్మఫలముగూడ శిష్యుడు పొందవలెననిన, నతనుచేయవలసిన సత్కార్యముల నతనే యాలోచించి నిర్ణయించుకొనవలెను.

పరమగురువు చేసినయొక సూచనను శిష్యుడు గ్రహించనియెడల, తిరిగి వానికాసూచన దొరకదు, కనుక బహుఅప్రమత్తతతో నుండవలెను.

ఒక్కొక్క పరమగురువు తన శిష్యులకొక్కొక్క విధముగ శిక్షణము నొసంగుదురు. ఆ శిష్యులేగోత్రము[1]

[1] సృష్టిప్రారంభమున ఆ యాప్రకృతిగుణములయొక్కయు పురుషలక్షణములయొక్కయు ప్రాధాన్యతనుబట్టి యేడువిధములగు ప్రాణు

నకు జెందినవారో, వారేమార్గమున లోకసేవజేయ నియమింపబడియున్నదో, దానినిబట్టి యాశిక్షావిధాన ముండును. మనువు, మోర్యమహర్షి, వీరిమార్గమునకు జెందినవారు క్షత్రియస్వభావముగల పరిపాలకులు, న్యాయాధిపతులు, న్యాయవాదులు, రాజకీయవేత్తలు మొదలగు వారు; వీరిని రాజర్షులందురు. భోధిసత్త్వుడు, కూటహూమీమహర్షి, వీరి మార్గమునకు జెందినవారు ఉపాధ్యాయులు, మతోపదేశకులు, సంస్కారులు మొదలగు బ్రాహ్మణస్వభావముగల వారు; వీరిని బ్రహ్మర్షులందురు. ఇవిగాక యింకను వేరువేరు లక్షణముల తో నైదుగోత్రము లున్నవి. ఒక్కొక్క గోత్రమున కొక్కొక్క మహర్షి నాయకుడుగనుండును. అట్టి గోత్ర నాయకుడధమ మారవజ్ఞానదీక్షనైనను పొందియుండ వలెను. వారికి చోహాణ్ (=ప్రభువు) అని సంజ్ఞ. ఒక్కొక్క గోత్రనాయకుని చేతిక్రింద ననేక ఋషు లా

లుద్భవించెను. ఒక్కొక్కవిధమగు లక్షణము ప్రాధాన్యముగ గల ప్రాణశాఖ కొక్కొక్క మహర్షి యధికారియైయుండును. జీవ పరిణామమంతయు నా యేడుశాఖలుగ జరుగుచున్నది. ఆ శాఖలకే గోత్రములనియు, రేఖ (Ray) లనియు పేర్లు. సత్త్వగుణప్రధాన మగు నొక గోత్రమున పరిణామమున బ్రవేశించిన ప్రాణి, క్రమముగ సకలైహికవర్గుల ననుగమించి, పరమపురుషవర్గులో జేరువరకును ఆ గోత్రములోనే పరిణామమునొందును. ఈ గోత్రభేదములు అన్నివర్గు లలో నున్నవి.

గోత్రమునకుజెందినవారుందురు. ఒక గోత్రమునకు జెందిన శిష్యుడాగోత్రనాయకుని యొద్దనే శిష్యుడుగ నుండ నక్కఱలేదు. ఆ గోత్రమునకుజెంది శిష్యులను స్వీకరించుట కధికారముగల మరియొక మహర్షియొద్ద శిష్యుడుగనుండవచ్చును.

---

## ఆరవ అధ్యాయము

## సాధన చతుష్టయము

మూలము :—"ఈ మార్గమున నాలుగు సాధనము లున్నయవి.

1. వివేకము.
2. నిష్కామత్వము. (విరాగము).
3. సదాచారము.
4. ప్రేమ."

ఇవి యన్నిమతములలోను చెప్పబడియున్నవి. కాని వానిలోకొన్నిటి కీగ్రంథములో క్రొత్తపేర్లు పెట్టబడినవి.

వివేకము—ఇది క్రొత్తపేరుగాదు. దీనిని వేదాంతులు నిత్యానిత్యవస్తువివేక మందురు. దీనినిగురించి కొంతవరకు పైరెండవయధ్యాయములో వ్రాయబడియున్నది[1]. రెండవ యధ్యాయములో చెప్పిన సాధనములలో నొకదానివలన వివేకము—అనుసరించదగిన

[1] ౨౧ వ పుట చూ॥

దేదో, తగనిదేదో విచక్షణచేయగలుగుట—గలుగును. అప్పుడు ఈ గ్రంథములో నిష్కామత్వమని పేర్కొనబడిన రెండవసాధన మావశ్యకమని కనిపించును. దానిని హిందువులు వైరాగ్యమందురు. వైరాగ్యమనగా కర్మఫలములయం దుదాసీనతగలిగియుండుట. దీనికి శ్రీబుద్ధులవారు 'పరికమ్మ' యని పేరుబెట్టిరి. 'కమ్మ', లేక, 'కర్మ' యనగా పనిచేయుట యని యర్థము. 'పరికమ్మ' యనగా పనిచేయుటకు సిద్ధమగుట యని యర్థము. సంస్కృత గ్రంథములలో 'వైరాగ్యము' నకు చేయబడిన నిర్వచనమునకును శ్రీబుద్ధులవారు 'పరికమ్మ' యని చెప్పుటచే కలిగెడిభావమునకును భేదమున్నట్లు పైకి కనిపించును. కాని, పనిచేయుట యనగా స్వప్రయోజనమున పేక్షింపక, సత్కర్మ జేయుట తన ధర్మమనియెఱిగి, యాకర్మ జేయుటయని యర్థముచేసికొన్న యెడల నారెండు పదములకును భేదముండదు. కర్మఫలమునం దుదాసీనుడై కర్మ జేయుట యనగా, తానుచేయుపనులవల్ల నితరుల కెట్టి మేలుకీళ్లు గలుగునో యోచించనక్కర లేకుండ పని జేయుట యని కొందరు చెప్పెదరు. అది సరికాదు. ఫలితమేమైనను, "సరియైనదానినే చేయవలయును, సరికానిదానిని చేయరాదు" అని యీగ్రంథములో వేరొకచోట వ్రా

యబడియున్నది. నిజముగ జూచినచో, మనముచేయు పనివల్ల నితరులకుగలుగు మేలుకీళ్లనుబట్టియే యది సరియైనదో కాదో నిర్ణయింపబడును. పరమగురువునకు శిష్యుడైనవాడు తానుచేయుపనులవల్ల నితరులకుగలుగు ప్రయోజనములనే యోచించునుగాని తనకుగలుగు ప్రయోజనములనుగురించి యోచించనే యోచింపడు.

సదాచారమను సాధనము సంస్కృతగ్రంథములలో షట్సంపత్తి యనబడును. దీనిని శ్రీబుద్ధులవారు 'ఉపచారో' యనిరి. ఇందలి యారుసంపత్తులను వారు మణిషట్కమనిరి. వీనిపేర్లలో కొన్ని భేదములున్నను అవి తెలియజేయు తత్త్వమొకటే. ఈ విషయమై కృష్ణమూర్తిగారు తమగ్రంథములో నిట్లు వ్రాసియున్నారు. "సాధన చతుష్టయమువలెనే వీనిలోకొన్ని తఱచుగ వేరుపేళ్లతో పేర్కొనబడుట నేనెఱుగుదును. అయినను, నాకుపదేశించినపుడు పరమగురువు స్వాంతముగం జెప్పినపేర్లనే, అంతటను నే నుపయోగించుచున్నాను". అని.

పరమగురువగు కూట్ హూమీమహర్షి యీ యుపదేశముచేసినపుడు ప్రాచీనపదములకు సరియైన నాంగ్లేయపదములనుమాత్ర ముపయోగించక, వాని నభ్య

సించుటకు తగినట్లు భావమును వెల్లడిచేయుపదముల నుపయోగించిరి[1].

కడపటి సాధనము ప్రేమ. దీనిని సంస్కృతగ్రంథములలో ముముక్షుత్వ మందురు. ముముక్షుత్వమనగా జననమరణరూపకమగు నీసంసారమునుండి విముక్తిజెంది పరమేశ్వరునితో నైక్యమునొందవలయునను తీవ్రమైన యిచ్ఛ (మోక్షేచ్ఛ) గలిగియుండుట. శ్రీబుద్ధులవారు దీనిని 'అనులోమ' మనిచెప్పిరి. అనులోమమనగా సవ్యమైన యేర్పాటు అని యర్థము. పురుషుడు తక్కిన సాధనములను సాధించినయెడల పరోపకారార్థ మైహిక బంధములనుండి తప్పించుకొని, పరమేశ్వరునితో నేకీభావమునొందవలయునను నిచ్ఛగలుగుట తప్పదని దీని భావము.

మూలము :—"వీనిలో నొక్కొక్కదానిని గుఱించి నాకు పరమగురువేమి యుపదేశించెనో దానిని నీకుం జెప్పఁబూనెద."

ఇటుపై నీనాలుగు సాధనములనుగుఱించి పరమగురువు చేసిన యుపదేశముల ననుసరించి వివరింపబడును.

---

[1] ఈపదభేదములును భావములును 2 వ అనుబంధములో చూపబడినవి.

మొదటి అధ్యాయము

## లక్ష్యము—సత్తు, అసత్తు

మూలము :—"ఇందు మొదటిసాధనము వివేకము. ఇది మోక్షమార్గమునఁజేర్చు సదసద్వివేకమని వాడుటకలదు. ఇది సరియే, ఐనను దీనియందు మఱికొంత గొప్పవిశేష మున్నయది. అది మార్గారంభమున నేగాదు, అడుగడుగునను ప్రతిదినమునను తుదివరకును అభ్యసింపఁదగినది."

ఈ సాధనమును వేదాంతులు నిత్యానిత్యవస్తువివేకమని యందురు; బౌద్ధులు మనోద్వారవజ్జన మందురు, అనగా, మనస్సుయొక్క ద్వారములు తెరువబడుట యని యర్థము; నిత్యమేదో, అనిత్యమేదో తెలిసికొనదగినట్లు మనస్సు వికసించినదనిభావము. మోక్షమార్గమున ప్రవేశింపగోరువారికి సంభవించు కష్టము లీతుది వాక్యమున సూచింపబడినవి. ఎంత మంచివానికైనను, ఎంత శ్రద్ధాళువునకైనను, ఎంత కష్టపడి పనిచేయువానికైనను, వానిదేహాత్మ సులభముగ స్వాధీనముకాదు.

లోకాభిప్రాయమొకటి నిరంతరము నొత్తిడి కలిగించు చుండును. ఇది గొప్పయాటంకము. ఇంతకంటె గొప్ప కష్టమింకొకటి యున్నది. ఏడవ మహామన్వంతరాంత మునాటికి మనుష్యుని శరీరములలోని యణువు లిప్పటి కంటె నెక్కువ వికాసమునొంది, యెక్కువ సౌష్టవముగ నుండును. మరియు నప్పుడు ప్రకృతిశక్తులుకూడ నిప్పటి కంటె ననుకూలముగనుండును[1]. అప్పటికి జనసామాన్య మందరునుండుస్థితికి ఇప్పుడు ఈ సాధనముల ద్వారా చేర వలయునని ప్రయత్నించుచున్నాము. అనగా, మన శరీరములలోని యణువులు సహజముగ నిక రెండున్నర మహామన్వంతరముల[2]లో పొందదగిన వికాసమును ఇప్పుడే, ఒకటి రెండు జన్మములలో, నిప్పటిమానసిక వాతావరణములో, పొందునట్లుచేయుటకు ప్రయత్నించు చున్నాము. అది కష్టమైనపనియే, కాని సుఖముగా నేడవ మహామన్వంతరాంతమువరకును వేచియుండిన

[1] ఏడవ మహామన్వంతరాంతమునకు మనుష్యులు చేరవలసిన గమ్య స్థానము చేరజాలనివారందరును అయిదవ మహామన్వంతర మధ్య మున నీ పరిణామప్రవాహమునుండి పైకితొలిగించబడుదురు. కనుక అప్పుడు మనకిప్పుడాటంకములగుచున్న మానసికశక్తు లుండవు. ఇప్పుడు మునులయాశ్రమములలోనుండు పరిస్థితు లప్పుడంతటను ఉండును.

[2] ఈ ప్రపంచకాలమిప్పుడు నాల్గవమహామన్వంతరమున మధ్య కాలమును కొంచెము అతిక్రమించియున్నది.

నప్పుడు సహజముగ లభించుస్థితి కొరకిప్పుడింత కష్టపడ నేలయని యడుగవచ్చును. ఇప్పుడింత కష్టపడి త్వరలో తరించినవారు లోకాభ్యుదయమున దోడ్పడు మహా భాగ్యమును బడసి, లోకసేవకులుధరించు కిరీటమును ధరింతురు. ఒక ప్రాచీన క్రైస్తవకీర్తనలో నొకగాథ యున్నది. ఒకడు స్వర్గమునకుబోయి, నలుదెసలజూచి, యచటనున్న యితరులకును తనకును ఏదోభేదమున్నట్లు కనిపెట్టి, దానికి కారణము దెలియజాలక, తుదకు క్రైస్తుప్రభునిజూచి, ఆయన నాభేదమున కేమికారణ మని యడిగెను. అందులకాయన యిట్లనిరి :

గీ॥ నమ్మితివి భక్తిమీఱంగ నన్నటంచు ।
నేనెఱుంగుదు, నావల్ల నీవు జ్ఞాన ।
వంతుఁడవుకమ్మ, కాని నీ ఫాలసీమఁ ।
దమ్ముఁడా ! మెఱయవలసిన తారలేవి ? ।
అదిగో ! చూచితె ? సంతోషహృదయులైన ।
జనులఁదారకాలంకృతులను ; మదీయ ।
సన్నిధికి వారలెందఱొ జనులఁజేర్చి ।
నారొ యన్నన్ని తారలు వారిఫాల ।
సీమలమెఱయు నిప్పుడు చిహ్నలుగను ॥

“జ్ఞానులైనవారు నిర్మలాకాశమువలె ప్రకాశింతురు ; కాని, అనేకులను సన్మార్గమునకు ద్రిప్పినవారు శాశ్వత

ముగ నక్షత్రములవలె—వేనవేలు ఇతర జీవులకు వెలుగును, వేడిని, బలమును ఇచ్చు సూర్యమండలముల వలె—ప్రకాశింతురు” అని బైబిలులో చెప్పబడి యున్నది. ఎట్టి కష్టములనైనను పడి యిట్టి మహాభాగ్యమున కర్హులము కాతగినదేగదా!

**మూలము:**—“పొందఁదగిన వస్తువులన్నియు నా మార్గముననే లభించునని నేర్చితివిగావున నీ వీమార్గమునఁ బ్రవేశించితివి. తెలియనివారు ధనమును గూర్చియు అధికారముకొఱకును పాటుపడుదురు గాని అవియెంతకాలముండిన నొక్కజన్మముతో విడిచిపోవును. కాఁబట్టి యవి అసత్తులు. సత్తులును నిత్యములునై వీనికంటె నధికమైన వస్తువులు గలవు. వీని నొకతూరి చూచినచో నీ వితరవస్తువుల మరల కోరవు.”

ఈ సదసద్వస్తువిచారము బహుగూఢమైన తత్త్వవిషయము. అయితే, మనకిచ్చట యాగూఢతత్త్వవిచారమక్కఱలేదు. ఐహికవిషయములును, ఒకానొక ప్రాకృత ప్రయోజనముకొఱకు మన మర్థించు నాముష్మిక విషయములును కూడ అసత్తులని యిచట నిరూపించబడినది. అనగా, కేవల మీశ్వరునియిచ్ఛలో

నొక యంశగానిదేదియైనను అసత్తే యనవచ్చును. సద సద్వస్తువిచక్షణజేయగలవారు ఈశ్వరుని యిచ్ఛతో నైక్యమునొంది, ఆ యిచ్ఛానుసారము పనిచేయుదురు. కాని, పనిచేయుటమానరు. వారీశ్వరేచ్ఛననుసరించి, ఈశ్వరుని ప్రతినిధులుగ నిచట పనిచేయుదురు గనుక వారు చేయుపని యితరులుచేయుపనికంటె నెక్కువ బాగుగనుండును. 'యోగః కర్మసు కౌశలమ్' (కర్మములుచేయుటయందు నేర్పు యోగము) అని గీతలలో చెప్పబడినది. యోగమనగా భగవంతునితో నైక్య భావమునొందుట. అట్లైక్యభావమునొందిన పురుషుడు పనిచేయడు, వానియందున్న భగవంతుడు పనిచేయును. కనుక ఆపనియందు కుశలత యుండకతప్పదు. శ్రీ కృష్ణుడు తానదివరకే శత్రువులను చంపితినని యర్జునునకుచెప్పి "కనుక, అర్జునా యుద్ధము చేయు" మనెను. అనగా, పైకియుద్ధముచేసి శత్రువధజేసినది యర్జునుడైనను నిజముగ శ్రీకృష్ణుడే (భగవంతుడే) శత్రువధ జేసెను.

శ్లో॥ విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః । రస వర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే[1] ॥ అని శ్రీ

[1] ఇంద్రియములను విషయములయందు ప్రవర్తింపజేయని జీవాత్మకు రాగముతప్ప తక్కిన విషయానుభవములన్నియు నివర్తించుచున్నవి.

మద్భగవద్గీతలలో జెప్పిన యర్థమునే యిచట ' సత్యము లగు వస్తువులను జూచినతరువాత నితరవస్తువులయం దభిలాషయుండ'దని చెప్పిరి. పరవస్తువు నొక్కసారి చూచినవాని కైహికవిషయములయం దభిరుచి యుం డదు, నిశ్చయమే, కాని, యట్లు పరవస్తువును చూచుట వల్ల వానియందభిరుచిలేనందుననే యైహికవిషయము లను విడువవలయునుగాని, కార్యకారణవిచక్షణము లేక, ముందైహికమును వదులుకొనినవానికి పరవస్తు ప్రాప్తి కలుగదు. అట్టివాడు ఇంద్రియములను నియమించు కొన్నను ఇంద్రియార్థములను మనస్సున స్మరించుచుం డును గనుక మిథ్యాచారియనబడును (గీతా ॥ ౩-౬). విషయధ్యానముచే సంగము, సంగముచే కామము, కామముచే క్రోధము, క్రోధముచే సమ్మోహము, దాని చే బుద్ధినాశనముగలిగి, పురుషుడునశించును. (గీతా ॥ ౨—౬౨, ౬౩.) సామాన్యజీవిత సౌఖ్యములను వదులు కొని, కష్టపడుట పుణ్యమనుకొనుట అజ్ఞానము.

పసిబాలుడుగ నున్నప్పు డొకనికి మిక్కిలి ప్రియము లుగనుండిన యాటవస్తువులు వాడు పెద్దవాడైనప్పుడు ప్రియముగ నుండవు. పెద్దవయస్సున తనకు ప్రియము

పరబ్రహ్మస్వరూపమును తెలుసుకొన్నతరువాత ఈస్థితప్రజ్ఞునికి రాగముగూడ నివర్తించుచున్నది. గీతా ॥ ౨—౫౯.

లగు వస్తువులు తనకు లభించునుగనుక వానిని గ్రహించి బాల్యమున తానుపయోగించిన వస్తువులను విడిచిపెట్టును. తనకు పూర్వము సంతసముగూర్చిన యాటవస్తువు లిప్పుడు సంతసముగూర్పవు. అనగా అభిరుచులు మారినవి. అట్లే పరవస్తుప్రాప్తివల్ల అభిరుచి మారి, యైహికవిషయములు ప్రియముగనుండవు. కాని, మూడు సంవత్సరములబిడ్డ తన వయస్సుకు తగిన యాటవస్తువులను విడిచి, ‘క్రికెట్టు’, లేక ‘ఫుట్ బాల్’ ఆడగోరినంతమాత్రమున నెట్లు పెద్దవాడై పోడో, అట్లు ఆముష్మికమునం దభిరుచిలేనివాడై ఐహికవిషయములను వదలిపెట్టినంతమాత్రమున పరమార్థసిద్ధి కలుగఁబోదు.

బ్రహ్మజిజ్ఞాసువులు ఈ ప్రపంచమునకు పనికిరారని లౌకికులుచెప్పుట కిదియే కారణము. కాని బ్రహ్మజిజ్ఞాసువులకు లౌకికవిషయములనుగుఱించి లౌకికులకంటె నెక్కువ బాగుగదెలియును.

మూలము :—“ప్రపంచమునందలి మనుజులందరు రెండే రెండు తెఱఁగులవారు—తెలిసినవారు, తెలియని వారు. ఈ తెలివియొక్కటియే ముఖ్యమైనది. ఏ మతము నవలంబించువాఁడైనదియు నేజాతివాఁడైనదియు ముఖ్యముగాదు.”

పరమగురువు మనుజులను తెలిసినవారు, తెలియని వారు, అని రెండుతరగతులుగ విభజించినారు. ఇది బహుజ్ఞానదాయకమైన విభజనము. యోగమార్గమున నీ విభజనమే ముఖ్యముగాని రూపభేదములు అభిప్రాయభేదములు ముఖ్యములుకావు. తెలియనివారొక్క జన్మముననుండు వస్తువులకొరకే పనిచేయుదురు. తెలిసినవారు, అనగా సద్వస్తువు నొక్కసారి చూచినవారు, భగవత్కైంకర్యముకొరకు, ఈశ్వర సంకల్పముతో నేకీభవించి దానిని నెరవేర్చుటకొరకు, పనిచేయుదురు. నేర్పుతోమాట్లాడుటకును, ఇతరులకు బోధించుటకును మాత్రము పనికివచ్చు మేధాశక్తియసత్తు; మన జీవితములో ప్రతిష్ఠించుకొని, నిత్యానుష్ఠానమున కుపయోగించు జ్ఞానము సత్తు.

**మూలము** :—"నిజముగ ముఖ్యమైనది యీజ్ఞానమే. మానవులను గుఱించి యీశ్వరుఁడు చేసినకట్టుబాటిట్టిదని తెలిసికొనుటయే జ్ఞానము. భగవంతుఁడట్టికట్టుబాటుచేసియున్నాఁడు. అదియే ప్రపంచము పుణోవృద్ధికివచ్చుమార్గము. ఎవఁడుగాని యామార్గమిట్టిదనిచూచి వాస్తవముగఁదెలిసికొనినచో, నతి తేజోవంతమును, అతి రమణీయమును నగు నా

మార్గమున పాటుపడి యామార్గముతో నేకీభవింపక యుండనోపడు."

మనుష్యులను తెలిసినవారు తెలియనివారు అని రెండు తరగతులుగా విభజించినప్పుడు తెలిసినవారనగా నెవరు అను ప్రశ్నవచ్చును. జ్ఞానముగలవారు తెలిసినవారు, అనగా ఈశ్వరు డీమానవపరిణామమునుగుఱించి చేసిన యేర్పాటు నెఱింగినవారు అని చెప్పినారు. మానవపరిణామ మొక యేర్పాటు (Plan) ననుసరించి నడుచుచున్నదన్న సంగతి దెలిసినవారే బహు అరుదు. ఈ ప్రపంచములోనున్న యీ దుఃఖములు, కష్టములు, అల్లరులు, వైషమ్యములు, అన్యాయములు చూచినవారట్టి యేర్పాటున్నదనిన నమ్మజాలరు. కాని, అట్టి యేర్పాటే లేనియెడల, నీప్రపంచమింతవరకు నిలిచియే యుండదు. ప్రపంచ చరిత్రమును పరిశోధకదృష్టితో, జాగ్రత్తగ, జదివిచూచినయెడల, బాహ్యదృష్టికి గోచరించు అల్లకల్లోలమంతటివెనుక నొక నియమిత పరిణామమార్గమున్నదని కనిపించును.

భగవంతు డీప్రపంచమును సృష్టించినపుడు దాని విధానముగుఱించి, అందలి జీవు లేవిధముగ నెంతవరకు పురోవృద్ధినొందవలయునో, వివరముగా నొక సంకల్పముచేసి ఆ సంకల్పముననుసరించి సృష్టిజేసి, తన సం

కల్పమునెఱింగిన పరమపురుషుల కాపరిణామపరిపాల నాధికార మొప్పగించెను. ఆ సంకల్పము నతిక్రమించ కుండ జీవుడు, స్వతంత్రుడై, పురోవృద్ధినొందుచున్నాడు. ఎప్పుడు జీవుడు—ఒక వ్యక్తిగాని, యొక సంఘము గాని—తన స్వతంత్రప్రవర్తనమున నీశ్వరసంకల్పము నతిక్రమించనున్నాడో అప్పుడు ఆ ప్రవర్తనమువల్ల ప్రపంచమునకు కీడుగలుగకుండ ఆ పరమపురుషులు, ధర్మప్రతిష్ఠచేసి, కాపాడుదురు.

ఇది సర్వసామాన్యముగ జరుగుచున్న సంగతి. ఈశ్వర సంకల్పమునకు భిన్నముగా ప్రవర్తించువా రజ్ఞానులు. వారెంత చదువుకున్నవారైనను, ఎంత పండితులైనను, అజ్ఞానులే, యెందుచేతననగా, వారికా యీశ్వరసం కల్పమునుగుఱించి తెలియనందున.

"యజ్ఞాత్వా నేహ భూయోఽన్యత్ జ్ఞాతవ్యమవ శిష్యతే" (గీతా ॥ ౭—౨) అనగా, దేనిని తెలిసికొన్న వాని కిక తిరిగి తెలియవలసినది మిగులదో, "యజ్ఞా త్వా న పునర్మోహ మేవం యాస్యసి" (గీతా ॥ ౪— ౩౫) అనగా, దేనిని తెలిసికొని తిరిగి యిట్లజ్ఞానమును పొందవో, అది జ్ఞానము. జ్ఞానము పరా, అపరా, యని రెండువిధములు. శ్లో ॥ భూమిరాపోఽనలో వాయుః ఖం మనోబుద్ధిరేవచ। అహంకార ఇతీయంమే భిన్నా ప్ర

కృతిరష్టధా ॥ అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్। జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥ (గీతా ॥ ౭—౪,౫). భూమిమొదలు అహంకారమువరకు గల యెనిమిది విధముల ప్రకృతితో సంబంధించినది అపరాజ్ఞానము, దేనిచేత ఈ జగత్తు ధరింపబడుచున్నదో, అట్టి జీవస్వరూపమైన ఈశ్వరుని యొక్క ప్రకృతినిగుఱించినది పరాజ్ఞానము, అని చెప్ప బడినది. మఱియును, శ్రు ॥ తత్రాపరా, ఋగ్వేదో, యజుర్వేదః, సామవేదోఽథర్వవేదః, శిక్షా, కల్పో, వ్యాకరణం, నిరుక్తం, ఛన్దో, జ్యోతిషమితి,। అథ పరా, యయా తదక్షరమధిగమ్యతే ॥ (ముండకోప నిషత్తు ౧—౧—౫) ఋగ్వేదాదులన్నియు అపరా జ్ఞానమనియును, దేనివల్ల అక్షరము తెలియబడుచున్న దో అది పరాజ్ఞానమనియును చెప్పబడినది. అపరా జ్ఞానమెంతయున్నను, పరాజ్ఞానములేనివాడు జ్ఞాని యనుట కర్హుడుకాడు.

జిజ్ఞాసువులలో చాలమంది యీప్రపంచము పురో వృద్ధికివచ్చుట కీశ్వరుడు సంకల్పించిన మార్గమును గుఱించి కొంతవరకు ఎఱుగుదురు. వారందరు నా సం కల్పమేమో ప్రత్యక్షముగ జూచియుండరు, కాని, దానిని ప్రత్యక్షముగజూచి, దాని కనుగుణ్యముగ నడుచుట

నెఱింగినవారి సాంగత్యమును గలిగియున్నారు. ఆ సంకల్పము నందరును చూచియున్నయెడల ప్రపంచము నందిప్పుడింత దుర్మార్గము దుఃఖము మిగిలియుండుట సంభవించదు. లోకమున నెందరో జనోపయోగకరములగు సత్కార్యములను, సంస్కరణములను బూనుకొందురు. ఆ యుద్యమము లెప్పుడో ఫలించునని, ఎందరు అభిమానించుకొని తోడ్పడిన నంతత్వరలో ఫలించునని, నమ్మి మిక్కిలి యుత్సాహముతో వానిని నడిపింతురు. కాని వారు లోకపురోవృద్ధికై యీశ్వరుడు నియమించిన మార్గమును తెలిసికొని దానికి వారు పూనిన కార్యమెట్లనుకూలించునో కనిపెట్టజాలనియెడల పొరపాట్లుజరుగును. వారాయుద్యమముల నెంతస్వార్థత్యాగముతో నిర్వహించినను వివేకములేనియెడల, అనగా, నీశ్వరసంకల్పమునుగురించి తెలియనియెడల, వారి ప్రయత్నములు కొనసాగవు. అవివేకము లేకుండుట చేత వారు లోకమునందున్న కష్టముల నొక్కపక్షము గానేచూచి, దానికి ప్రతిక్రియ జేయబూనెదరు, కనుక, నాప్రతిక్రియ లోపములుగలదియై, యనుకొన్న ఫలితముల నీయకపోవుటయేగాక, క్రొత్తకష్టముల దెచ్చిపెట్టవచ్చును. అట్టి దుఃఖములకు ఈశ్వరసంకల్పము నెఱింగిన జ్ఞానులుచేయు ప్రతిక్రియలు మనకాశ్చర్యము

గలిగించును. ఒకప్పుడు మన యెదుట కనిపించు దుఃఖమునకును వారుచేయు ప్రతిక్రియకును సంబంధము మనకు కనిపించదు, గనుక, వారిచర్య మనకు విపరీతముగదోఁచి, వారికి సహాయము జేయుటకుగూడ అంగీకరించము. కాని, కొంతకాలమునకు వారి వివేకము మనకు బోధపడును.

యోగాభ్యాసిచేయవలసిన లోకసేవ జ్ఞానముతోఁ గూడుకున్నదియై యుండవలెను, గనుక, ముందుగా వాఁడీశ్వరసంకల్పమును తెలిసికొనవలెను అని వివేకములో మొదటిమెట్టుగా చెప్పబడినది. దాని నెఱుఁగుట వల్ల నింకను సాధకున కెట్లుపయోగమగునో చెప్పుచున్నారు.

మూలము :—"ఇట్లెఱుఁగుటవలన వాఁడు భగవంతుని పక్షముచేరును. ధర్మము నవలంబించి యధర్మము నెదిరించును. లోకముయొక్క శ్రేయస్సుకొఱకు పాటుపడును. స్వప్రయోజనము నపేక్షింపఁడు."

తెలిసినవారెవరో గుర్తించుటకిది యొక వన్నెరాయి వంటిది. ఒకని మతముగాని, జాతిగాని, వాడు తెలిసిన వాడని చెప్పుటకు తగిన గుర్తుగాదు. ఎక్కడనైన నొక్కఁడు తన కధర్మమని తోఁచినదాని నెదిరించుచు,

తనకు ధర్మమని తోచినదానిని భక్తితో నవలంబించి పనిచేయుచున్న యెడల, నతడు చేయుపనియంతయు మన కంగీకారముగాకున్నను, అతడు చేయుపనిని ఈశ్వరుడు మెచ్చుకొనడని మనమనుకొన్నను, అతడు భగవంతునిపక్షమవలంబించి పనిచేయుచున్న సోదరుడని మన మెఱుఁగవలెను. తమ యభిప్రాయముల ననుసరించి బహుయోగ్యులై ప్రవర్తించువా రనేకులున్నారు. వారిలో, చాలమంది తమననణగద్రొక్కుచున్న పెక్కుబంధములకు లోనైయున్నారు. వారు శ్రద్ధతోను భక్తితోను పరోపకారమునకై తమ శక్తిసామర్థ్యములను, కాలమును, తమ సర్వమును, ధారపోయుదురు. కాని, వారి యభిప్రాయములు మిక్కిలి సంకుచితములును, మూఢములునై, తమ యభిప్రాయములతో నించుకంతయైన భేదము గనపరచినవారి యెడల తీవ్రమైన విరోధభావము నవలంబించెదరు. కాని, మహీపీఠము వా రట్టివారి యందలి లోపముల నెంతమాత్రమును సరుకుచేయక, వారిసుగుణములనే గ్రహించి, వారి భక్తి శ్రద్ధలవల్ల జనించు శక్తులను గైకొని, వానిని పూర్తిగవినియోగింతురు. ఏ లోకములోనైనను చెడుగు మంచిని తలయెత్తకుండ నణగద్రొక్కివేయును. కాని, మహీపీఠస్థులా చెడుగును గమనించరు. మనకంటె వారే ఆ చెడుగు

నెక్కువబాగుగ జూడగలరు, కాని, దానినుండి భక్తి, శ్రద్ధ మొదలగు సద్గుణముల నేర్చి వేరుచేయుదురు. కనుక, మనముగూడ సత్కార్యములను ధర్మచింతతో జేయువారియందు దురభిమానము మొదలగునవి కనిపించినయెడల సహనముగలిగి వారి యోగ్యతలయందే దృష్టినుంచి, ఆ యోగ్యతలను వృద్ధిజేయుటకు తోడ్పడవలెను. లోకములో నితరులయందున్న నెఱసులకై వెదకుట యభ్యాసమైపోయినది. అది మిక్కిలి హానికరము. పరమగురువు చెప్పినట్లు ముత్యముల (ఒప్పుల) పైకుఱుకుచుండవలెను గాని గులకరాళ్ల (తప్పుల)పై కుఱుకరాదు. ఇతరుల లోపములకొఱకు వెదుకక, యెవరిలోపములను వారు గుర్తించ గలిగినయెడల నెక్కువ ప్రయోజనకరముగనుండును.

మూలము :—" ఇట్లు భగవంతుని పక్షముండినచో నాతఁడు మాలో నొక్కఁడగును. హిందువనిగాని, బౌద్ధుఁడనిగాని, క్రైస్తవుఁడనిగాని, మహమ్మదీయుఁడనిగాని, పేరుపెట్టుకొన్నను హిందూదేశవాసియైనను, ఆంగ్లేయదేశవాసియైనను, చీనాదేశస్థుఁడైనను, రష్యాదేశపువాఁడైనను భేదమించుకయైనను లేదు."

ఇది బహుముఖ్యమైన తత్త్వము. దీని ననుసరించని వాడు మోక్షమార్గద్వారమును సమీపించజాలడు. ఆ ద్వారముచెంత మిమ్మెవ్వరును మీ జాతిమతములను గురించియడుగరు; మీస్వభావములు చక్కబడుటకు మీ రేయే సద్గుణముల నలవరచుకొన్నారని యడుగుదురు. ఒక్కొక్క మనుష్యుడు ఒక్కొక్కమూలజాతిలో జేరిన యొక్కొక్కయుపజాతిలో బుట్టి, ఆ యుపజాతియొక్క ప్రత్యేకలక్షణములను తనయందు వికసింపజేసికొనును. ఎవడైన నొక యుపజాతిలో బుట్టుట కాతనియం దాయుపజాతి లక్షణము వికసించవలసియుండుటయే కారణము. ఆర్యజాతిలో హిందువులు మొదటి యుపజాతికి చెందినవారు. పారమార్థికజీవనము, అహింస, సహనము, నిష్కామకర్మ, ఇవి యాయుపజాతి లక్షణములు. ఆంగ్లేయులు ఆర్యజాతిలో నైదవ యుపజాతికి చెందినవారు. మానసికాభివృద్ధి, వ్యక్తిస్వాతంత్ర్యము, వ్యక్తిబలము, మొదలైన వాయుపజాతి లక్షణములు. ఇట్లే తక్కినయుపజాతులకు ప్రత్యేకలక్షణములున్నవి. ఆ యుపజాతులన్నియు మొత్తమున లోక సమరసత సమకూర్చుట కగత్యముగనుండవలసినదే. ప్రతిజాతియు సమష్టిప్రయోజనమున కొసంగవలసిన దేదోయొక లక్షణము గలిగియుండును. ఆ జాతిలక్షణము

తాత్కాలికముగ నందుబుట్టిన మనుష్యులకు స్వాభావికలక్షణమై, వారి పురోవృద్ధికి సహాయకారిగ నుండును. అంతమాత్రముచేత వారు తమ కితరజాతులలక్షణములతో పనిలేదనిగాని, తమజాతిలక్షణము లుత్తమములనిగాని, వానినే యితరజాతులవా రవలంబించవలెననిగాని, యనుకొనుటతప్పు. ఏజాతిలో నేయుపజాతిలో బుట్టినవారైనను, తమరందులో నలవరచుకొనవలసిన యుత్తమలక్షణముల నలవరచుకొని, వానిని లోకసామరస్యమును చేకూర్చుటకై వినియోగించవలెను. అందుకొఱ కితరజాత్యుపజాతుల లక్షణముల యావశ్యకతను దెలిసికొని వానియందు గౌరవము సహాకారబుద్ధి గలిగియుండవలెను.

మరియును, ప్రతియుపజాతియందును కొన్ని దుర్గుణములుకూడ నున్నవి. అవి దుర్గుణములని గ్రహించి విడిచిపెట్టక, అవియు తమజాతి స్వభావములోజేరిన యావశ్యక లక్షణములుగనెంచి వానిని బలపరుచుకొనుచున్నారు. అది స్వజాతిగర్వమువల్ల కలిగినదోషము. ప్రతివాడును తనయుపజాతి యుత్తమలక్షణముల నలవరచుకొనుచు, అందలిలోపములను గుర్తించి, వానిని సవరించుకొనుటకై, అవసరమైనయెడల, నితరయుపజాతిలక్షణములనుగూడ నలవరచు కొనవలయును.

ఉదాహరణమునకు : హిందువులలో కొందరు ఫలాపేక్ష లేక పనిచేయవలయును, గనుక, నేపనినెట్లుచేసినను బాధలేదనుకొని, పూనిన కార్యము నజాగ్రత్తగను, అసంపూర్తిగను చేయుదురు. ఆంగ్లేయులు పూనినకార్యమును పూర్తి జేయుటయందును, చేసినదానిని నేర్పుతో సాధ్యమైనంత చక్కగా జేయుటయందును శ్రద్ధవహింతురు, కాని ఆపని సఫలముకానియెడల సంక్షోభము జెందెదరు. హిందువులు కార్యనిర్వహణసామర్థ్యమును నేర్చుకొనవలెను. ఆంగ్లేయులు అసక్తత నేర్చుకొనవలెను. ఇట్లందరుచేసినయెడల లోకకల్యాణము సమకూరును.

స్వజాతియందభిమానముగలిగియుండుట, స్వజాత్యభివృద్ధికై నీవు తోడ్పడవలసియున్నదనుకొనుట, స్వజాతిని సేవించుట, ప్రశంసించుట, మంచిదికాదనరాదు. కాని, యా జాత్యభిమానము పరజాతిదూషణముగా పరిణమించరాదు. ఎవని కుటుంబమును వాడు పోషించుకొనవలసినదేగాని, బందిపోటుచేసి, దారులుగొట్టి, హత్యలుచేసి కుటుంబము పోషించుట దుర్మార్గమనబడును. అట్లే దేశాభిమానము, జాత్యభిమానము, మంచిదేగాని, యితరజాతులను హింసించి నాజాతిని సంరక్షించుకొనెదనను తలంపు దుర్మార్గమనబడును. పరజాతులను హింసించకుండ నీ జాతికి మేలొనర్పగలి

గినయెడల నీ వాజాతిలోఁబుట్టినందుకు సంతుష్టిపడుటకది తగిన కారణము.

మతముల విషయమునగూడ నిదేతీరు. ఒక్కొక్క మతమునం దొక్కొక్క తత్త్వము ముఖ్యముగ జెప్ప బడును. కాని వివిధజాతులవలెనే వివిధమతములును మానవాభ్యుదయమున కగత్యమైయున్నవి.

మూలము :—“ భగవంతుని పక్షమున నుండువారలు తా మేకారణమున ఈ లోకమునకువచ్చిరో, తా మేమిచేయవలయునో, దానినెఱింగి దానిం జేయఁ బూనుదురు. తక్కినవారలందఱు దామేమి చేయ వలయునో దాని నింకను నెఱుంగకపోవుటంజేసి తఱ చుగ నవివేకముగ నటింతురు.”

అజ్ఞానమే యనర్థముల కన్నిటికిని మూలమని శ్రీ గౌతమబుద్ధులవారు చెప్పిరి. తెలియనివాడు తఱచుగ నవివేకముగ బ్రవర్తించును. కనుక, దుర్మార్గుడు కనికర మునకు పాత్రుడుగాని, యసహ్యమునకును, ద్వేష మునకును పాత్రుడుకాడు. ఒక యుదాహరణము దీసి కొందము. దుర్బలులనేకుల నుద్యోగభ్రష్టుల నొనర్చి, బిచ్చగాండ్రనుచేసి, యశాశ్వతమగు నైశ్వర్యమును సంపాదించి, కోటీశ్వరులైనవారు కొందరున్నారు. లోకు

లందరు వారిని స్వార్థపరులని క్రూరులని నిందింతురు. నిజమే, కాని, వారట్లు స్వార్థపరులగుటకు క్రూరుల గుటకు కారణము అజ్ఞానము. బలువుడొకడు ఆదుర్బ లులు చేయుచుండిన వ్యాపారమును వారికంటె తాను బాగుగజేయుదుననుకొని, దానిని పూనుకొని, దాని నెట్లయిన నెరవేర్చుటకు సర్వవిధముల ప్రయత్నించును, తుదకు నిగ్రహించును. బహుశః వాడు ఆవ్యాపారమును వారికంటె బాగుగజేయును, ఆచేయుటలో విశేష ధనము సంపాదించును, కాని, తన ప్రయత్నమువల్ల తానదివరకావ్యాపారము చేయుచుండిన వారినందర నణ గద్రొక్కివేయుచుంటినని తలచనైన తలచడు, వారికి తాను చేసినహానికంటె తనకు తాను చేసికొన్నహాని యెక్కువైనదనియును, వారతనిని నిందించుటవల్ల చేసి కొనుచున్న కర్మముకంటె తాను ఎక్కువ నికృష్టమైన కర్మమును ప్రోగుచేసికొనుచుంటిననియును, ఇంచుకంత యు నెఱుగడు; ఎఱిగినయెడల నతడట్లు ప్రవర్తించి యుండడు. అజ్ఞానజనితమగు వాని స్వార్థపరాయణ తకు వానిని నిందించుటకంటె, వాని అజ్ఞానమునకు వానిని కనికరింపవలెను.

మూలము :—" (అవివేకముగ నటించుచు,) నందఱు
నొక్కటియనియును, ఒక్కఁడేయగు భగవంతు

నిచ్ఛయే యెపుడుగాని యందఱకును యదార్థముగ ప్రియముగ నుండనోపుననియు నెఱుగక, తమకు మాత్రము ప్రియమనితోఁచుమార్గముల కల్పింపఁ బూనుదురు."

సంఘములో కొద్దిమంది మేలుకొఱకు నెక్కువమందిని ఉపేక్షించుటగాని ఎక్కువమందికి మేలుకలుగునని కొద్ది మందిని యుపేక్షించుటగాని యుక్తముకాదు. సంఘములో నందరు నొక్కటియే, గనుక, అందరిమేలునుకూడ లెక్కజేయవలెను. అందరు నొక్కటియన్న సత్యమం దరకును తెలియదు. మనమందరము నొక్క పరమపిత బిడ్డలమగుటచేత సోదరులము, అందరము నొకటి యని యనుకొందుము, కాని, యా యేకత్వముయొక్క యా దార్థ్యము, గాంభీర్యము ప్రత్యక్షముగ నిప్పుడు తెలిసి కొనజాలము. మనప్రజ్ఞ జనలోకమున, ఆనందమయ కోశమున వికసించినపు డది తెలిసికొనగలము.

భిన్నచైతన్యస్వరూపములన్నియు నొకటి, ప్రపంచ మంతయు నొకటి, ప్రపంచమునందున్న ప్రేమ, సౌం దర్యము, పవిత్రత భగవంతుని దివ్యలక్షణములు. ప్రతి మనుష్యునియందున్న మంచితనమును భగవంతుని మం చితనము. భగవంతుని దివ్యలక్షణము లొక్కటొక్కటి యు నానారూపములుగ నీప్రపంచములో వ్యక్తమగు

చున్నవి. మనప్రజ్ఞ సూక్ష్మలోకములలో వికసించిన కొలదియు భగవంతునిశోభ కొంచెముకొంచెము మనకు గోచరమగుచువచ్చి తుదకు అందమగు ప్రతివస్తువు నందును ఆశోభనంతను చూడగలము ; ప్రతివస్తువులో, ప్రతివస్తువుద్వారా, భగవంతుని మహిమను తెలియగలము ; ఆవస్తువు, నామహిమలతో, నితర వస్తువులలో ప్రతిదానియందును చూడగలము ; ఒక రమ్యమైన స్థలదృశ్యమును చూచినపుడు విశ్వశోభయంతయు దానిలో గనబడును. అప్పుడు మనకు జీవితమద్భుతమగు సుఖమునిచ్చును, జీవితము ప్రేమపూరితమై యుండును. ఆ సుఖముద్వారా అనంతమగు నానందమనుభవింతుము, ఆప్రేమద్వారా అనంతమగు ప్రేమతో నిండిపోవుదుము. అట్లు మన మీపూర్ణమునందణుమాత్రులమని తెలిసికొనుటయే యదార్థమగు ప్రజ్ఞావికాసము ; అప్పుడు మనప్రజ్ఞ భగవంతునిప్రజ్ఞయందు లీనమై, ఆయన మనద్వారా యీ శోభనంతను చూచును, మన మీప్రపంచశోభయం దాయనను చూడగలము [1].

మూలము :—“ అట్టి వారందఱు అసత్తును అనుసరించువారలుగాని సత్తుననుసరించుట లేదు. ఈరెంటికిం

[1] గీతా ॥ 6—29, మొ ॥ 32 వరకు శ్లోకముల జూడుడు.

గల తారతమ్యము నెఱుంగునంతదనుక వారు భగవంతుని పక్షమున చేరినవారుకారు. కావున నీ వివేకము మొదటి మెట్టు.

ఇట్లు నిశ్చయించిన వెనుకను, సదసత్తులలో ననేక భేదములున్నవని మఱువకుము. సరి యిది యనియు తప్పు ఇదియనియును, ముఖ్యమిదియనియు అముఖ్యమిదియనియును, ఉపయోగకరమిదియని యు వ్యర్థమిదియనియును, సత్యమిదియనియు అనృత మిదియనియును, స్వప్రయోజనమిదియనియు పరో పకారమిదియనియును వివేకముతోఁ దెలిసికొనుట యింకను మిగిలియేయుండును."

సత్తునకు అసత్తునకు గల భేదములలో నివి యన్ని యు భాగములు. ఈ భేదభాగములనన్నిటి నిచ్చట వివరించుటవల్ల, మనము నిజముగా మోక్షమార్గమున నడువదలచినయెడల, మన జీవితమునందలి బహు స్వల్ప విషయములలోఁగూడ వివేకము నుపయోగించుట మిక్కిలి యావశ్యకమని తెలియుచున్నది. మనకర్తవ్య మిదియా యదియా యని తీర్మానించవలసిన సందర్భ ములు మిక్కిలి స్వల్పవిషయములలోఁగూడ తటస్థిం చును. మన మెల్లప్పుడు వివేకము నుపయోగించవలయు నన్న సంగతి మనస్సునందుంచుకొని, జాగ్రత్తతో

మెలగవలయును. అట్లు నిరంతరము జాగ్రతగలిగి మెల గుట యెంత సత్పురుషునకైనను ప్రయాసకరము, విసుగుబుట్టించును, ఆ ప్రయాసము భరించుటకష్టము. కాని ఆకష్టము భరించజాలనివారు జయము గాంచరు.

మూలము :—"తప్పును విడిచి సరియైనదాని నవలం
బించుట కష్టముగఁ దోఁచరాదు. ఏలయనఁగా పరమగురువు ననుసరించఁగోరువా రెన్నికష్టము లైననుపడి సరియైనదానినే యవలంబించవలయునని ముందే నిశ్చయముచేసికొనియుందురు."

పరమగురువు ననుసరించుటకు నిశ్చయించుకొనుట యే సరియైన నిశ్చయము. ఆనిశ్చయము నెప్పుడు చేసి కొన్నావో అప్పుడందుతో సంబంధించిన కష్టముల నన్నిటిని భరించుటకుకూడ నిశ్చయించుకొనియుండ వలెను, లేనియెడల నీ నిశ్చయము నిజమైనదికాదు. పతంజలి యోగసూత్రములలో యోగమార్గమును బొం దుటకు ప్రథమసాధనములుగ విధించబడిన (అహింసా సత్యాఽస్తేయ బ్రహ్మచర్యాఽపరిగ్రహాః) అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము అనునవి 'యమము' న నైదు అంగములని చెప్పి, అవి సర్వావస్థలయందు ననుష్ఠించదగినవగుట, నవి

'మహావ్రతము'లని చెప్పెను. అనగా, తనకుగాని యిత రులకుగాని యెంతప్రయోజనము గలుగనైయున్నను, దానికొఱకు, ఆవిధుల నుల్లంఘించరాదు. మరియు నా విధులను స్వప్రయోజనము నుద్దేశించి యనుసరించ రాదు. అహింస, సత్యము మొదలగునవి మన స్వా భావికచర్యలుగ నుండవలెను.

యోగశక్తులగోరువారు ముందుగ తమ యుపాధు లను శుద్ధిజేసికొనవలయును. ఈ శరీరమున కత్యావశ్యక మైన యాహారమునుదక్క తదితరమును దేనిని పుచ్చు కొనకుండుట శరీరశుద్ధి కొకమార్గము. కాని, కొందరు యోగదృష్టికావలెనని కోరుదురుగాని సమయమువచ్చి నప్పుడు వారిదృష్టి మృష్టాన్నము వైపునకు బోవును; అదివరకు శరీరమునకు మృష్టాన్నమభ్యాసమగుటచేత, సమయమునకు యోగదృష్టిమాట మరచిపోవుదురు. అది వారి యభ్యాసమువల్లనే యల్లగును, కాని, వారా యభ్యాసమునకుబదులు మంచియభ్యాసమును కలిగిం చుట సాధ్యము అన్న సంగతిని తెలిసి దానికై ప్రయత్నిం పరు. ఒక్కసారి కష్టపడి శరీరమున కొక మంచి యభ్యా సమును స్థిరపరచినయెడల, తరువాత నది తనంతటతానే పనిచేయుచుపోవును, మనకు మరియొక దురభ్యాసమును పోగొట్టుటకు ప్రయత్నించుట కవకాశము కలుగును.

ఎవరైనను సరియైనదిదియని యొకసారి చూచిన యెడల, నికదాని నవలంబించుటకు సందేహించరు. తమ జీవనార్థము ఇతర జీవులను హింసించువారును, తమ దుస్తులకొరకు, అలంకారములకొరకు జంతువులను పిట్టలను చంపువారును, ఆచారముననుసరించి యట్టి పనులజేయుచున్నారుగాని, వారుచేయునది క్రూరకృత్యమనియు, అది తమ జీవితమున కగత్యముకాదనియు తెలిసినయెడల చేయరు.

---

రెండవ అధ్యాయము

## శరీరములయొక్క జీవము

మూలము :—" అయినను నీ శరీరములు వేఱు నీవు వేఱు. నీ యిచ్ఛ యెల్లప్పుడును నీ శరీరముకోరు దాని ననుసరించియుండదు. నీ శరీరమెద్దియైన కోరిన చో నది యదార్థముగ నీవు కోరునది యగునా యని నిలిచి యోచింపుము."

సాధకుడు సరియైనపనినే చేయవలయునని నిశ్చ యించుకొన్నను, వాని శరీరములు వాని కడ్డువచ్చును. దానినిగుఱించి యిచట చెప్పబడుచున్నది. ఈ సాధనము బహుకష్టమైనది ; విసుగు, అలసట పుట్టించునది. కాని, యలసట జెందువాడు యోగమార్గమున సిద్ధి బొందజాలడు. దీనికి గొప్పప్రయత్నము దీర్ఘకాలము చేయవలయును. యోగాభ్యాసి తన జీవితమును యథా విధిగ నియమించుకొని, తొందరతో నేకార్యము జేయ కుండ, తొందరతో నొకమాటనైన నాడకుండ, తొం దరతో నొకతలంపైన తలచకుండ, మనోవాక్కాయ ములు తన స్వాధీనము చేసికొనియుండవలెను.

అందుకు అతడు తన యుపాధులనుగుఱించి సంగతులనన్నిటిని పూర్తిగా తెలిసికొని, వానితత్త్వమును బాగుగా నెఱిగియుండవలెను. మొదట తెలియవలసినది, నీవు వేఱు నీశరీరములు వేఱు అని. నీవు ఆత్మవు, నీశరీరములు నీకు ఉపాధులు, ఉపకరణములు. నీవు తెలియవలసిన రెండవసంగతి నీకక్కరలేనివానిని నీశరీరము కోరునని. స్థూలశరీరమేగాక, కామ, మానసిక శరీరములుగూడ నట్టికోరికల గోరును అని యీగ్రంథములోనే వ్రాయబడియున్నది. ఈశరీరములతత్త్వము నెఱిగినవారి కవికోరుకోరికలు తమకు శ్రేయస్కరము కావని బోధపడును. ఒకవిధముగజూచిన నా శరీరములలో నొక్కొక్కదానికి ప్రత్యేకవ్యక్తిత్వ మున్నదని చెప్పవచ్చును. ఒక్కొక్క శరీరము ఒక్కొక్కరకమైన యణువులచే నిర్మించబడియుండును. ఆ యణువులు ప్రాణము గలవి. ఒక్కశరీరమునందలి యణువుల ప్రాణమంతయు జేరి యొక ప్రత్యేకసమష్టిప్రజ్ఞ (చైతన్యము)ను సంపాదించును.

కామశరీరములోచేరిన భువర్లోకఅణువుల సమష్టి చైతన్యము కామచైతన్యమని, ఇంద్రియాత్మయని చెప్పబడును. ఈ యణువులు స్థూలలోకమునకు దిగి లోహవర్గులోజేరుట వానియొక్క పురోవృద్ధి, అనగా అవి

యింకను (Involution) ప్రవృత్తిదశలో నున్నవి. ఈ యణువులకుగల ప్రజ్ఞ యసంపూర్ణము. అట్టి యణువులు చేరి యొక కామశరీరమైనంతనే, వాని చైతన్యమంతయు నేకీభవించి, యొకవ్యక్తివలె ప్రవర్తించును. అవన్నియు చేరినతరువాత కామశరీరమునకు స్వతంత్రేచ్ఛ యున్నదేమో యని యనిపించదగినంత బలమైన స్వాభావికజ్ఞానము (instinct) కలుగును. ఈ శరీరచైతన్యము అసూయ, మాత్సర్యము, స్వార్థపరాయణత మొదలగు మనకక్కరలేని గుణములయొక్క మోటు చలనములను వృద్ధిచేసికొని, తద్విధముగ తన బలమును పెంపుచేసికొనును. అది దానిధర్మము. అందుచేత మనకు కావలసినవి దానికక్కరలేదు. ప్రేమ, కరుణ, భక్తి మొదలైనవి మనకు కావలసినవి. ఆ లక్షణములకు సంబంధించిన చలనములు మిక్కిలి సూక్ష్మములును, శీఘ్రములును, శక్తిమంతములునై యుండును. ఆ చలనములు కామశరీరమున సూక్ష్మతరభాగమునకు చెందిన యణువులకుండును, గాని సాధారణముగ కామశరీరమున కవి యక్కరలేదు.

తమ జీవితమును చక్కబరచుకొనజాలనివారు నిజముగ కామశరీరమునకు దాసులై యుందురు. ఈ విషయమున మనము ఆశరీరమును నిందించరాదు. క్రైస్తవులు

దీనిని దుర్బుద్ధులు పుట్టించు పిశాచమందురు కాని యది తప్పు. మనసునుగురించిగాని మన యునికినిగురించిగాని దానికి తెలియనే తెలియదు. అది మన కెట్టి దుర్బుద్ధులను కావలెనని పుట్టించదు. తక్కిన భూతములవలెనే తనస్రోవ నదియు నభివ్యక్తమై, యభివృద్ధినొందుటకు ప్రయత్నించుచున్నది.

పోనిమ్మా కామచైతన్య మట్లభివృద్ధినొందుట కవకాశము నెందుకీయగూడదు? మన మెందుకడ్డుపడవలెను? అని యడుగవచ్చును. అది సరియైన పరోపకార చింతకాదు. అట్టి మోటుస్పందములకు పూర్తిగా తావిచ్చుట మనకు సాధ్యముకాదు. ఏపూర్వజన్మములోనో మోటుభావముల కెడమిచ్చుటచేత యీ జన్మములో నట్టి మోటుస్పందములుగల యణువులు మన కామశరీరములో జేరినవి. వానికి మన శరీరములలో తావొసంగక, పైకిత్రోసివైచి, యే యనాగరికుని శరీరములోనో, యేకుక్క శరీరములోనో, యేపశువు శరీరములోనో ప్రవేశించి, యచ్చట నెవ్వరికిని హానిలేకుండ నభివృద్ధిజెందుట కవకాశమిచ్చుటయే వానికి మనము చేయగల మహోపకారము.

ఈ కామచైతన్యము సహజముగ బహుచమత్కారి. అది తనుకోరినదానినే నీవుకోరినట్లు తోపజేసిన

యెడల, తనకు కావలసినస్పందములు లభించునని కని పెట్టును. తనచుట్టునున్న మానసిక ప్రకృతియందు తన స్పందములవంటి స్పందములను కలిగించును. ఆ విధముగ నాస్పందములతో సంబంధించినతలంపు నీకు కలుగును. ఒక చెడుతలంపు నీకు కలుగగానే, చెడు భావముకలుగును. అదియే ఆచైతన్యమునకు కావలసినది. ఒకసారి కలిగినస్పందములను వెంటనే యణచి వేయని యెడల, అవి తిరిగితిరిగి కలిగి బలపడును. అయితే, అట్టి భావములు చెడ్డవని తెలిసి యాచైతన్య మట్లు చేయదు. దాని కాభావవికారములవల్ల సంతోషము కలుగజేయు మోటుస్పందములు కలుగుటయొక్కటియే తెలియును.

పరిణామమున నింకను లోహవర్గులోనైనను జేర నంత హీనస్థితిలోనున్న యొక చైతన్యమునకు లొంగి పోయి దానిచేతిలో కీలుబొమ్మలవలె నాడుచున్నామనిన మనకది యవమానకరముగాదా? అట్టి యవమాన మునుండి తప్పించుకొనుటకు పూర్వజన్మవాసనలుగ వచ్చిన దురభ్యాసములను విడిచి వానికిబదులు సద్గుణ ముల నలవరచుకొని, ఆ విధముగ కామశరీరమును, దానికిష్టములేకున్నను, శుద్ధిచేసికొనవలెను.

కామచైతన్యమున్నట్లే మానసిక చైతన్యము, స్థూల శరీరచైతన్యముకూడ నున్నవి. స్థూలశరీర చైతన్యమును

భూతాత్మయందురు, ఇది శరీరములోని మాంసపుకండ లను నిర్మించును, మొత్తముపైని శరీరమునంతను కాపాడుచుండును. శరీరమున గాయముపడినప్పు డచ్చట క్రొత్తతెల్లకణము (White Corpuscles) లను చేర్చి, గాయమునుపూడ్చి మాన్పున దీచైతన్యమే. ఇది శరీరములో చేయుపనులు విచిత్రములుగనుండును. ఇట్టి పనులు మనకుపయోగకరములుగ నుండును, గాని, మనకు నిరుపయోగములైన మోటుస్పందములుకూడ ఆ చైతన్యమునకు గలుగుచుండును.

మూలము :—"నీ వీశ్వరుఁడవే. ఈశ్వరుఁడిచ్ఛయించునదియే నీవును నిచ్ఛయింతువు, గాని నీవు నీయంతరంగమును లోఁతునదిగి శోధించి నీలోనుండు నీశ్వరునింగనుగొని [1] వాని మాటను దెలిసికొనవలయును సుమా ! అదియ నీమాట."

నీవును పరమాత్మయు నొక్కటియని ప్రత్యక్షానుభవమువల్ల దెలియుట బహుకష్టము. నీప్రజ్ఞను క్రమముగ సూక్ష్మలోకములలో నొకదానినుండి యొకదాని

"[1] కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్ ఆవృత్తచక్షురమృతత్వమిచ్ఛన్—ఒకానొక ధీరుడు అమృతత్వమును గోరినవాఁడై దృష్టిని లోపలికిఁద్రిప్పి ప్రత్యగాత్మను (లోపలనుండు ఆత్మను) చూచును—కఠోపనిషత్తు ౪—౧."

లోనికి గొనిపోయి తుదకు జనలోకమున నిలిపియుంచిన యెడల ఆ యేకత్వము ప్రత్యక్షముగ దెలియును. అందుకు యోగమార్గమున గొన్ని సాధనములు చెప్పబడినవి. ఆవివరములతో నిక్కడ బనిలేదు.

అంతవరకు ప్రతివాడును 'ఈశరీరములు నేనుకాను, ఈశరీరములకు నేనతీతుడను, ఇవి నాయుపాధులు, నాపనిముట్లు, వీనికి కావలసినవన్నియు నాకుపయోగకరములుకావు, నేనీశ్వరుడను,' అని తెలిసికొని, తనకు గలుగు ప్రతికోరికయు తనకు కావలసినదా, శరీరములకు కావలసినదా, యని యోచించి, నిర్ణయించుకొనవలయును. అందుకు అంతరంగమున పరిశీలన జేయవలయునుగాని బాహ్యపరిశీలన పనికిరాదు. బాహ్యేంద్రియములను నిశ్చలముచేసికొని, శాంతముగ నంతరంగమున దృష్టిని నిలిపి యోచించవలెను. ఏది శరీరములు కోరునది ఏది నీవుకోరునది యని విచక్షణచేయుటకు కొన్నియుపాయము లీదిగువ వ్రాయబడియున్నవి.

మూలము :—"నీశరీరములు నీవనుపొరపాటు పడకుము. స్థూలశరీరము నీవుకావు. కామమయశరీరము నీవుకావు. మనోమయశరీరము నీవుకావు.[1] ఇవి

"1 ఈ కామమయ మనోమయ శరీరములు రెండును జేరి మనోమయకోశమని వేదాంతులు చెప్పుదురు."

యొకొ్కక్కటియుఁ దనకుఁ గావలయువానినిఁ బొందుటకుఁ దానే యాత్మయని నటించును. అయినను వానినన్నిటిని దెలిసికొని వానికన్నింటికిని స్వామివి నీవని[1] యెఱుంగుము."

ఇచ్చట పరమగురువు శరీరములనుగుఱించి చెప్పుటలోనవి ప్రత్యేకవ్యక్తులైనట్లు చెప్పినారు. వారు చెప్పినది ఆ యాశరీరచైతన్యములను గుఱించియే. చాలమంది యట్టి చైతన్యములున్నవని యెఱుగనే యెఱుగరు; ఇక వాని యధికారమునుండి తప్పించుకొనుటకు ప్రయత్నమెట్లు చేతురు?

సాధారణముగ మనుష్యుడు తనకొక యాత్మయున్నదని నమ్మినంతవరకు తాను వేరు తన శరీరములు వేరు యనుభావము కలుగదు. మనుష్యుడే యాత్మయనియును ఆ యాత్మకు శరీరములున్నవనియును నెఱింగిన వెంటనే తాను వేరు శరీరములు వేరు అను భావము గలుగును.

మూలము :—"చేయవలసిన పనియుండగా శరీరము శ్రమతీర్చుకొనవలెననిగాని, తిరుగఁబోవలెననిగాని,

"[1] ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే । ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥—ఈ శరీరమునకు క్షేత్రమని పేరు. దీనిని దెలిసికొనువాఁడు క్షేత్రజ్ఞుడు (జీవుఁడు) అని తెలిసిన వారు చెప్పుదురు.—గీత, ౧౩—౧."

భోజనపానములు చేయవలెననిగాని కోరును. తెలియనివాఁడు 'ఇవియన్నియు నేనుగోరెదను, నేను వీనిం జేయవలెను' అనుకొనును. తెలిసినవాఁడు 'వీనింగోరునది నేనుగాదు, ఇది కొంతకాలమట్లుండనిమ్ము' అనును."

పసిబిడ్డలశరీరములిట్లు స్వతంత్రించుట తరుచుగ కనబడును. బిడ్డ కొక పనిచేయవలెనని బుద్ధిపుట్టిన యెడల, తత్క్షణము, ఉన్నవాడున్నట్లుగ లేచి, యాపనిని వాఁడు చేయును. లేనియెడల వానికి బ్రహ్మాండమంతయు మునిగిపోవునని తోఁచును. అనాగరికుఁడుకూడ నట్టి యుద్రేకములకు వశుడై యుండును. వాఁడాయుద్రేకతీవ్రత చేత నొకప్పు డొక స్వల్పప్రయోజనముకొఱ కొక మనిషిని చంపివేయును. బిడ్డ యేదోయొక పనిచేయుచు నొక్కుమ్మడిని లేచి గంతులిడుచుపోయి యాటలాడును. బాల్యచాపల్యమును మనము మరిచిపోయినందున వానిని కోపించి చివాట్లుపెట్టుదుము. మన మనుభవమువల్ల నట్లు తొందరపడక, చేయవలసినపనికొఱకు ఆటపాటలను వెనుకకు బెట్టెదము. కాని బిడ్డకట్లుచేయవలెనని తెలియక శరీరముకోరినంతనే యాటకుబోవును. అప్పుడు మనము వానిని చివాట్లుపెట్టక శాంతముగా వాడప్పు డాపనిని చేయకపోవుటవల్ల నేమినష్టముకలుగునో

బోధించవలెను. ఆవిధముగ వానికి జ్ఞానవికాసము కావలెను. అనాగరికుడుగూడ కాలక్రమమున అనుభవములవల్లనే కొన్నివిధముల యుద్రేకముల నణచుకొనవలయునని తెలిసికొనుచు, కొన్నిజన్మములైనతరువాత నాగరికుడగును.

నాగరికులమనుకొనువారిలోగూడ నింకను చాలమంది తమ శరీరములుకోరునవి తాము కోరునవియే యని తలచి, ఆ కోర్కెలను తీర్చుటకు ఎంతమాత్రమును సందేహించరు. ఆవిషయమున వారింకను అజ్ఞానదశలోనున్నారు. ఆ యజ్ఞానము బాపుకొనంతవరకు వారి శక్తియంతయు శరీరవాంఛలను సమకూర్చుటకై వినియోగమై, తమ పురోవృద్ధిమార్గమునుగురించి తలచుటకైనను వారికి తీరికగాని యోపికగాని యుండదు.

మూలము :—"ఎవరికైన సహాయముచేయుట కవకాశముగలిగినపుడు శరీరము 'అది నాకెంతో శ్రమ, మరి యెవరైనచేయుదురుగాక' యని పలుమరు దలంచినను, 'మంచిపనిచేయుటకు నీవడ్డము రాకుము' అని వాఁడుశరీరమునకుఁ బ్రత్యుత్తర మిచ్చును."

ఏదైననొక సత్కార్యము చేయవలసియున్నప్పుడు "ఇది చేయదగినపనియే, ఎప్పుడో యొకప్పు డెవరో

యొకరు చేసెదరు. ఇప్పుడు మనమెందుకు దీనికై శ్రమ పడవలెను" అని చాలమంది యనుకొందురు. మంచి పని, పరోపకారము, చేయుటతటస్థించుట గొప్ప అవకాశము. నిజముగ బనిచేయదలచినవా డట్టి యవకాశమును బోగొట్టుకొనక 'ఇదిగో! చేయవలసినపని లభించినది. దీనిని ఎంతశ్రమమైనను పడి నేనే యేల చేయరాదు' అని వెంటనే పూనుకొనును.

మూలము :—"దేహము నీకు వాహనము, నీ వెక్క గుఱ్ఱము. కావున దాని నాదరించి చక్కగఁ గాపాడ వలయును. దానికి శక్తికిమించినపని యియ్యరాదు. దానిని పరిశుద్ధములగు నన్నపానములనే యిచ్చి మేపవలయును. లేశమాత్రమైన మైలలేకయుండు నట్లతి పరిశుద్ధముగ నెల్లప్పుడు నుంచవలెను."

నీకును నీ శరీరములకును గల సంబంధమును, నీ శరీరములయెడల నీకుగల బాధ్యతయును, ఇచ్చట మిక్కిలి చక్కగా చెప్పబడినది. నీ శరీరమొకవిధమగు వ్యక్తిత్వముగలిగిన చైతన్యము. అది ప్రేమకు, ద్వేషమునకు ప్రతిస్పందించును. కనుక, దానియెడల నేర్పుతో సంచరించవలెను. నేర్పరియైన రౌతు తనగుఱ్ఱమును మిక్కిలి ప్రేమతో నాదరించి, దాని స్వభావమునంతను

జాగ్రత్తగ కనిపెట్టి తెలిసికొనును, దానితో చెలిమిచేసి తనయందు దానికి నమ్మకము గలిగించును, తన మనస్సులో నేమియున్నదో గ్రహించి దానిని చేయుటకు వెనుదీయనంత విశ్వాసము దానికి గలిగించును. ఎంత భయంకరమైన యవస్థయందైనను వానియందు నమ్మకముంచి వానియాజ్ఞను పాలించుటకు అది జంకదు. వాడు దానిని సాధ్యమైనంతవరకు సుఖముగను, సంతోషముగను, ఆరోగ్యముగను, ఉండునట్లు సదా కనిపెట్టిచూచును. నీవు నీగుఱ్ఱము నెంత ప్రేమించినను, అది పని చేయుట కేర్పడినది గనుక దానిచేత కావలసిన పని చేయింతువు, కాని అది చేయజాలనిపనిని చేయించవు. మరియు దానినెప్పుడును నీపనినిచేయుటకు సిద్ధముగను, ఎప్పుడుకావలసిన నప్పుడు పనిచేయదగిన స్థితిలోను, ఉండునట్లుంచెదవు.

అట్లే శరీరమునుకూడ మిక్కిలి నేర్పుతో తరిబీతు చేయవలెను. కఠినములగుహఠయోగాది అభ్యాసములు చేయుట తప్పు. కఠినవ్రతములుచేసి శరీరమును హింసింపరాదు. దానియెడల నీవు దయగలిగి, దాని సుఖము చెడకుండ నీకు కావలసినపని చేయించుకోవలెను. నీ శరీర మొక్కగంటకాలములో తనశక్తికి మీరినపనిచేయుటవల్ల దానికికలిగిన చెడుపు అనేక సం

వత్సరములలోగాని కూడిరాదు. కనుక శరీరమును శ్రమపెట్టి పనిచేయించరాదు. శరీరము ప్రాణముగల యంత్రము. యంత్రమునకు మితిమీరినపనిచే చెడువు గలిగినయెడల నది తిరిగి యథాస్థితికిరాదు. శరీరమునకు నష్టశక్తిని కూడదీసికొను నద్భుతశక్తి యున్నది. ఆ శక్తి చేత సాధారణముగ ఆరోగ్యముగనున్న శరీరము కొంత వరకు కష్టమును భరించును, గాని ఆ కష్టమువలన దానికి హానికలుగ లేదనుకొనరాదు. ఆహాని మొదట కనిపిం చదు, గాని అది క్రమముగ శరీరమును క్రుంగదీసి తుదకు నాశనముచేయును. కనుక యోగమార్గమున నభివృద్ధిగాంచగోరువా రీ సంగతిని లక్ష్యముననుంచు కొని బహుజాగ్రత్తగ నుండవలెను. నీవు చేయజాలనిపని నీదికాదని విడువవలెను.

భోజనము విషయమైకొంచెము యోచింతము. ఏది తినియైనను బ్రతుకవచ్చునందురు. కాని యీమాట యనుభవవిరుద్ధము. మనుష్యులు స్వభావములోను, సామర్థ్యములోను విశేషముగ భేదించియుందురు. ఒక్కొక్కడును తనతన ప్రకృతినిబట్టి, వ్యాపకమును బట్టి, యాహారము నేర్పర్చుకొనవలసియుండును. అం దుకే ‘ ఒకనికి విందు మరియొకనికి మందు ’ అన్న సామెత పుట్టినది. ఒకవంక ఆహారమునుగురించి యక్కరకు

మాలిన గడబిడచేయువారున్నారు. మరియొకవంక యే యాహారమైన నేమనువారున్నారు. ఈ రెండు తత్త్వములునుకూడ క్షేమకరములుకావు. మధ్యమార్గమవలంబించి, ప్రతివాడును తన శరీరమున కెట్టియాహార మనుకూలించునో, ఎంతపదార్థము తిన్నయెడల శరీరము భరించగలదో, శరీరమున కేది యనుకూలమో, ఏది హానికరమో, నిర్ణయించుకొని, ఆ ప్రకారము భోజన నియముచేసికొనవలెను. శరీర మాహారమునకుగూడ నలవాటుపడును, గనుక, మాంసము, మత్తువస్తువులు, మొదలగు రాజసతామస ఆహారముల కలవాటుచేయక సాత్వికాహారముల కలవాటుచేయవలెను.[1]

శరీరము పరిశుభ్రముగ నుంచుకొనుటకు గూడ మిక్కిలి జాగ్రతదీసికొనవలెను. ఇందు కారోగ్య మొక

[1] ఆయుస్సును, సత్త్వమును, బలమును, ఆరోగ్యమును, సుఖమును, ప్రీతినివృద్ధిచేయునవి, రసముగలవియు, స్థిరములయినవి, చమురుగలవి, మనోహరములైనవి, ఈ ఆహారములు సాత్త్వికాహారములు. కారముగాను, పుల్లగాను, ఉప్పుగాను ఉండునవి, మిక్కిలి వేడియైనవి, తీక్ష్ణము (కారము)లైనవి, రూక్ష (చమురులేనివి) ములైనవి, దాహముగలిగించునవి, దుఃఖము శోకము రోగముగలిగించునవి రాజసున కిష్టమైనఆహారములు. జాముదాటినదియు, రసము పోయినదియు, దుర్గంధముగలదియు, పాచినదియు, ఎంగిలిదియు, అపరిశుద్ధము (భగవంతునికి నైవేద్యమునకు తగనిది)ను అగు ఆహారము తామసులకు ఇష్టమైనది. గీతా. ౧౭—౮, ౯, ౧౦.

కారణము. పరిశుభ్రత యోగ్యతకు నాగరికతకు లక్షణము. మఱియును పరమపురుషులు తమశక్తుల నీ లోకములో ప్రసరించుటకు తమతో సన్నిహిత సంబంధము గలవారిని వెల్లువలుగా నుపయోగించెదరు. తరుచుగ, తమ యంతరంగశిష్యుల నుపయోగించెదరు. కాని, మెచ్చటనైన శాస్త్రోక్తములగు ధర్మములననుసరించి జీవించువారున్న యెడల, వారు పరమగురువుల నెఱుగకపోయినను, వారి దృష్టిలోనుందురు, గనుక, నొకప్పుడట్టివారినికూడ నుపయోగించవలసివచ్చును. ఆశక్తి సాధకుని శరీరములో బ్రవేశించినపుడు దాని నదిభరించ గలిగియుండవలెను. అందుకు పరిశుభ్రత యావశ్యకము. ఆశక్తిప్రసార మొక్క భూలోకముననేగాక భువస్స్వర్లోకములలోగూడ గలుగుచుండును. భూలోకమున బ్రసరించుశక్తి సాధకుని హస్తాగ్రములద్వారాను, పాదాగ్రములద్వారాను పైకి బ్రసరించును. పరమపురుషునకవసరమైన సమయమునకు వారుపయోగించదలచిన శరీరము శుభ్రముగనుండనియెడల, వారు దాని నుపయోగించరు. మురికిగొట్టములో బ్రవహించు నీరు మురికితో కలుషితమైనట్లే, అపరిశుభ్రశరీరములో బ్రవేశించినశక్తి కలుషమగును. మఱియును, అట్టి శుభ్రశక్తులను అపరిశుభ్రశరీరములో భరించుట శరీరమునకు

ప్రమాదకరము. పరమగురువునకు తమ జీవితములను సమర్పించి యోగమార్గానువర్తులు గాగోరువారు, తమ శరీరముల నెవ్వడును పరిశుభ్రముగ నుంచుకొని, వారి శక్తుల ప్రసారమునకు తగినట్లు ఎప్పటికప్పుడు సిద్ధముగ నుంచవలెను. మరియును, మన శరీరావయవములు, ముఖ్యముగ చేతులు పాదములు వంకరలై, వికారము నొందకుండ జాగ్రత్తగ జూచికొనవలెను. ఇరుకు చెప్పుల నుపయోగించుటవల్ల పాదములు వంకరలగుట తరుచుగ గనబడును. పరమపురుషునిశక్తి సాధకుని శరీరములో బ్రవేశించి చేతులకొనలనుండియు పాదములకొనల నుండియు ప్రసరించును గనుక ఆకొనలు రూపవికారము నొందినయెడల వానిద్వారా ఆశక్తి ప్రసరించదు.[1]

[1] ఈ సందర్భములో నీక్రింది గీతావాక్యములు జ్ఞాపకముంచుకొన దగినవి. శ్లో॥ నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాన్తమనశ్నతః। న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవచార్జున॥ మిక్కిలి తినువానికి యోగములేదు. బొత్తిగా తిననివానికిని లేదు. మిక్కిలి నిద్రించుస్వభావముగలవానికిని లేదు. ఓ యర్జునా! బొత్తిగామేలుకొనువానికిని లేదు. 6—16.

శ్లో॥ యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు। యుక్త స్వాప్నావభోదస్య యోగో భవతి దుఃఖహా॥ తగిన ఆహారవిహారములు కలవాడును, కర్మములయందు తగిన వ్యాపారముకలవాడును, తగిన నిద్ర మెలకువకలవాడును అగువానికి యోగము దుఃఖముల నన్నిటిని పోగొట్టును (సాంసారిక దుఃఖములనుపోగొట్టెడి యోగము కలుగు చున్నదియని యొకయర్థము: దుఃఖహా యోగః భవతి. అని) గీతా.

మూలము :—" పరిశుద్ధియు ఆరోగ్యమును పూర్ణముగ నుండు శరీరములేనిచో, నీవు ఎడతెగని శ్రమను నోర్చి యీ కఠినమగు సాధనము చేయఁజాలవు. ఎట్లయినను, నీశరీరము నీకు నెల్లపుడును లోఁబడి యుండవలెనుగాని నీవు నీ శరీరమునకు లోఁబడి యుండరాదు."

ప్రస్తుత పరిస్థితులలో మోక్షమార్గసాధన మతి కఠినమైనదని యిదివరకు చూపియున్నాము. ఆ సాధనమును త్వరగ జేసినయెడల నది యెడతెగని శ్రమయే యగును. మన శరీరముల నన్నిటినిగూడ మంచిస్థితి లోనుంచుకొననియెడల మన మాశ్రమ భరింపజాలము. కనుగ, శీఘ్రముగ నభివృద్ధినొందుట కారోగ్యమత్యావశ్యకము. ఆరోగ్య మేమాత్రము చెడినను అభివృద్ధి కాటంకమగును. పరమగురువులు తమ శిష్యుని యోగాభివృద్ధిని కనిపెట్టుచుందురు, శిష్యుడు తన శక్తికిమించిన పనినిచేయకుండ మిక్కిలి జాగ్రత్తగజూచెదరు.

మొత్తముపైని శరీరము నీకు లోబడియుండునట్లు చూచుకొనవలెనని చెప్పబడినది. అయితే, దానిని

6—17. ఇక్కడ యుక్తఅనుమాటకు 'ఉపాయముతోగూడిన', అనగా ఏశరీరమున కేయాహారముతగునో తెలుసుకొని దానిని ఉపయోగించుటయని మధ్వభాష్యములో అర్థము చెప్పబడినది.

మంచి శిక్షణములోనుంచి యుక్తాహారవిహారాదులచే పోషించి, ప్రేమతో లోబర్చుకొని నీవు చేయుమన్నపని చేయుట కది సంతోషముతో సిద్ధపడునట్లు చేయవలెను గాని కష్టపెట్టి పనిచేయించరాదు.

మూలము :—" కామమయశరీరమునకు దానికోరిక లుండును. అవి పెక్కులు. నిన్ను కోపించుకొనుమనును, పరుషవాక్కులాడుమనును, అసూయపడుమనును, ధనమునకై పేరాసపడుమనును, ఇతరులకుండునది చూచి యోర్వకుండుమనును, ఖిన్నుఁడవై పరవశతనొందుమనును, వీనినిగాక మరిపెక్కుకోరికలు కోరును. ఇట్లుకోరుట నీకుఁ గీడుచేయఁదలచికాదు. ఇట్టి బలమగుతాఁకులు[1] తాఁకుటయు సారిసారికీ తాఁకులు మాఱుచుండుటయు, దాని కిష్టము. ఇవి యొక్కటియు నీకేమో యక్కరలేదు. కావున నీ కోరికలలో నీవియెవ్వి నీశరీరముకోరిక లెవ్వి యని వివేచనముచేయవలెను."

"[1] తాఁకులు—కామక్రోధాది మనోవికారములు గలుగునపుడెల్ల నీకామమయశరీరములో నొక కంపనము (అదురుపాటు) ఉత్పత్తి యగును. అట్టి కంప మాశరీరమునకు ప్రియము. మనస్సున వృత్తులు మాఱునట్లెల్ల కంపముయొక్క స్వభావము సహితము మాఱుచుండును. ఈ కంపము యోగదృష్టికిఁగానవచ్చు. దీనివలనఁగలుగువర్ణములను బట్టియే, యోగులగువా రితరులమనోభావముల నెఱుంగుదురు."

ఎంత తెలివైనవారైనను కామశరీరముతో నెంత యెక్కువగ తాదాత్మ్యభావము నొందియుందురో, కామశరీరమున కెంత లోబడియుందురో యీ వాక్యము వల్ల దెలియుచున్నది. తరుచుగా 'నాకు కోపమువచ్చినది. నాకుచికాకుగానున్నది,' అని యందురు. కాని నిజముగా కోపము చికాకు వచ్చినది నీకుగాదు. నీ కామ శరీరమునకు. కొంద రిట్టిక్షుద్ర రాగములతో తాదాత్మ్య మొందుట కిష్టపడరుగాని, యాక్షుద్ర రాగము లుత్తమరాగములని భ్రమ జెందుదురు. ఒక డొక మిత్రుని ప్రేమించి, యామిత్రు డింకొకనిని ప్రేమించినయెడల నసూయపడి, యది యసూయ యని యొప్పుకొనక, ప్రేమయనుకొనును. ప్రేమయను దానిలో నెన్నిటినైనను చేర్చవచ్చును. దానితో సంబంధములేని రాగముల నన్నిటికిని దానిపేరుబెట్టి సంతసింతురు. నిజమైనప్రేమ యున్నవాని కసూయ పుట్టనేపుట్టదు. ఏలయన పరిశుద్ధ ప్రేమ ప్రతిఫలము కోరదు.

కనుక, మనరాగములను నిష్పక్షపాతముగ విమర్శించుకొనుట మేలు. క్షుద్రరాగములు నీవికావు. నీవు కోపించజాలవు, అసూయపడజాలవు. అవి కామశరీరము యొక్కవృత్తులు.

 

ధనాశ, ఓర్వలేమి, ఖిన్నత యనునవికూడ కామమయశరీరముయొక్క కోరికలుగ జెప్పబడినవి. వానిలో ఖిన్నత మిక్కిలి తరుచుగా గానబడునది. కాని, దీనిని గురించి తీసికొనవలసినంత జాగ్రత దీసికొనరు. "నేను ఖిన్నుడనైనను సంతోషరహితుడనైనను, అది నాపని గాని, ఇతరులకు దానితో పనిలేదు" అని యనుకొందురు. అది నిజముగాదు. ఖిన్నత యితరులకుగూడ హాని కలుగజేయును. ఒకడు ఖిన్నుడైయున్న యెడల, వాని కామశరీరములోగలుగు చలనములు భువర్లోక ప్రకృతిలో చలనములను గలిగించును. ఆచలనములు వానిచుట్టును వ్యాపించి, చెంతనున్నవారి కామ, మానసికశరీరములలోగూడ నవ్విధమగు చలనములను కలిగించును. ఆ సమయమున నాచెంతనున్నవారి మనస్థితి యనుకూలముగనున్న యెడల నీచలనములు వారియందు గూడ ఖిన్నత గలిగించును. ఈ ఖిన్నతవల్ల గొప్ప ప్రమాదములు జరుగును. నరహత్యలు, ఆత్మహత్యలు, గాఢమైన ఖిన్నతగలిగినతరువాత జేయబడిన ట్లనేక నిదర్శనములున్నవి. నిజముగ నట్టి పరిస్థితులలో నట్టి ఘోరకృత్యములు చేసినవారు అందు కెంతమాత్రమును బాధ్యులుకారు. కాని, వారికి నేటిన్యాయస్థానములలో శిక్షతప్పదు.

కొందరు ఖిన్నతయును సంతోషమును పైనుండి కలుగునందురు. పైనిజెప్పిన సందర్భములోతప్ప అవి యట్లు కలుగవు. ఒకనాడు ఎండ బాగుగ గాయుచుండును. అది యొకనికి కడుసొంపుగను, సంతోషకరముగను నుండును, మరియొకనికి అది యెంతమాత్రమును సంతోషము కలిగించదు. ఒకనాడు ఒకనికి శోభాయమానముగా గనిపించిన ప్రకృతియే మరియొకనాడు అంధకారమయముగ గనిపించును. దీనిని బట్టిచూడ ఖిన్నతయును సంతోషమును నీలోనే సంభవించునని స్పష్టమగుచున్నది. ప్రకృతిశోభవల్ల బొత్తిగా ప్రయోజనములేకపోదు, కాని యదియే యందుకుకారణము కాదు. ఎవ్వరును తనయందేవిధముగగూడ ఖిన్నత ప్రవేశింపకుండ జాగ్రత్తగనుండవలెను. ఖిన్నతగలిగినప్పుడు, ధైర్యముగురించి, సంతోషముగురించి బలమైన సంకల్పముచేయవలెను. ఇతర సమయములయందెల్లప్పుడును ఖిన్నతనుగురించి తలంచక సంతోషముగనుండుటకు ప్రయత్నించుచు నుండవలెను. సంతోషమువల్ల నీసూక్ష్మప్రకృతిలోగలుగు చలనములును, సంతోషమునుగురించిన నీ మనస్సంకల్పమును బైటనుంచివచ్చు ఖిన్నతతో సంబంధించిన చలనములను నీ శరీరములలోనికి చొరనీయవు, నీ కామశరీరములో ఖిన్నతను బుట్టనీయవు.

కామశరీరము మనకు హానిచేయవలెనని కోరదని యిచట పరమగురువు చెప్పుచున్నారు. దీనినిగురించి యీ యధ్యాయారంభమున వివరించడమైనది. ఒక కోరిక నీ కామశరీరముదని నీవు నిశ్చయించుకొన్న తరువాత నీవు దానివిషయమై యెంతమాత్రమును తల పోయవద్దు. దానినిగురించియే తలపోయుటవల్ల నది బలపడునుగాని తగ్గదు. దానికి వ్యతిరేకమగు భావము నెంచుకొని, ఆ భావమునే దినమంతయు నభ్యసించుము. నీకామశరీర మాతురతగ నుండగోరునేని, నీవు నీ మనస్సును తాలిమియందు నిలువబెట్టుము. ప్రాతఃకాల మున ధ్యానముచేయునపుడు తాలిమినిగురించి ధ్యాన ముచేసి, ఆదినమంతయు నీ ప్రవర్తనమున తాలిమి నభ్యసింపుము. అట్లు అభ్యసించుచురాగా, కొన్ని దిన ములకు నీ ప్రకృతిలో నాతురతకు సంబంధించిన చలన ములు గలుగుట కవకాశము పోయి, తాలిమి నీస్వ భావమైపోవును.

మొదట నీ యభ్యాసము కొంతకష్టముగ నుండును. మొదట నీకు కోపము వచ్చినప్పు డాయుదయమున చేసికొన్న సంకల్పము జ్ఞప్తికిరాక కోపమును ప్రకటిం తువు. వెంటనే నీ సంకల్పముజ్ఞప్తికివచ్చును. తిరిగి రెండవసారి కోపమువచ్చినప్పుడు, కోపము చేయు

చున్నప్పుడే నీ సంకల్పము జ్ఞాపకమువచ్చి వెంటనే కోపమును నిలిపివేయుదువు. మూడవసారి కోపము బైట కురాకముందే జ్ఞాపకమునకువచ్చును. ఇట్లు పట్టుదలతో సాధనము చేయవలెను. కొందరీసాధనమును కొంత వరకుచేసి, విసుగుజెంది విడిచిపెట్టెదరు. అది తెలివి తక్కువ. ఒక యూరునకు బోవలెనని ప్రయాణమై నడచి సగముదూరమునకేగి, యచట నింకను నీవేగ వలసినయూరు రాలేదని మరలిపోవుట యెంత తెలివి తక్కువపనియో యిదియు నంత తెలివితక్కువపని. నీవు నడచినకొలదియు నీవా యూరుసమీపించు చున్నావుగాదా! అట్లే నీవు అభ్యాసముచేసినకొల దియు ఫలితము, నీకు కనిపించకున్నను, సమీపించు చున్నది.

వెనుకటి జన్మములలోని కర్మవాసనాబలముచే నీ జన్మములో నీ స్వభావమేర్పడును, కనుక, నీకు కోపము మొదలైన గుణములు చాలకాలమునుండి బలపడియున్న విగా యుండును. వాని నొక్కసారి త్రుంచివేయుట సాధ్యముకాదు; ఒక్కసారి త్రుంచివేయుటకు ప్రయ త్నించినయెడల, కామచైతన్యము, బెదిరినగుఱ్ఱమువలె, చెలరేగి నీపై తిరుగబడును. అందుచేత, నేర్పుతో, నెమ్మ దిగ, ఆ చైతన్యమును లోబరుచుకోవలెను.

నీ మంచితలంపులవల్ల నితరుల స్వభావమును చక్క-పరచవచ్చును. నీస్నేహితుడొకడు ముక్కోపి యనుకొనుము. వానియందాగుణము పోగొట్టవలెనని నీవు పూనుకొన్నయెడల 'అయ్యో! పాపము! వాడు ముక్కోపియే, వానికాగుణముపోయిన బాగుండును' అని పలుమారాముక్కోపమునుగురించియే నీవు తలపోసినయెడల, దానిని వృద్ధిచేసినవాడవగుదువు. అట్లుగాక 'వాడు శాంతము, తాలిమి గలిగియుండుగాక' యని పలుమారు గాఢముగ దలచుచుండవలెను. అప్పుడు నీ సంకల్పబలమువల్ల వాడు శాంతుడును, తాలిమి గలవాడును అగును.

ఈ సాధనమున నీకు గలుగు కష్టములన్నియు నీకర్మరాహిత్యమున కవకాశములని నమ్ముము. నీ చుట్టునున్నవారందరు నిన్ను ప్రేమించువారైనప్పుడు నీవు ప్రేమగలిగియుండుట కష్టముకాదు. అందరు మర్యాదస్థులైనప్పుడు మర్యాదస్తుడుగనుండుట విశేషముగాదు. ముఖ్యముగ నది యోగాభ్యాసియందొక మెచ్చదగిన లక్షణముకాదు. సామాన్యుడెవడైన నట్లుండగలడు. యోగాభ్యాసి తనను ప్రేమించనివారిని ప్రేమించవలెను, తనకు కీడుచేయువారికి మేలుచేయవలెను, తన కమంగళముగోరువారికి మంగళముగోరవలెను. ఇతరులు నీకు

కష్టముకలిగించినపుడు, లేక, నీకు కోపముమొదలైన వికారములు కలిగించదగిన పనిచేసినపుడు, అది నీ ఋణ విముక్తికొరకు సంభవించినదని యూహించి, దానిని సంతోషముతో గైకొని, తిరిగి వారికి నీ ప్రేమపూరితములగు తలంపులను బంపుము.

నిన్నెవ్వరేమియన్నను, ఏమిచేసినను, నీ మనస్సు నొవ్వగూడదు. ఒకరు నిన్ను నిందించినపుడుగాని, నీ యందొక దుర్గుణమారోపించినపుడుగాని నీ మనస్సు నొచ్చినయెడల నీవింకను అహంభావపూరితుడవై యున్నావు, అనగా, నిన్నుగురించియే నీవు తలచుచుందువు, అని నిశ్చయించుకొనుము ; అట్టి యహంభావము సాధకునకు పనికిరాదు. ఇతరులు తమ్మవమానించుచున్నారని తెలిసికొనజాలని మొద్దుతలకాయలు కొందరున్నారు. అదియు వాంఛనీయముకాదు. నీకు అవమానము జరిగినదని తెలిసియు, నీవు దానిని సరుకుగొనక యుండుట మంచిది. నిన్నుగురించి లోకులసహ్యాకరములైన మాటలుచెప్పుకొందురు. అట్టి మాటలను లక్ష్యముచేయవద్దు. అవి యిప్పుడుండి యుత్తరక్షణమున పోయెడి గాలివంటివి. నీవామాటలనుబట్టిగోరంతను కొండంత పెద్దజేసిననేతప్ప యవి గాలివలె పోయెడివే. ఇతరులకు నిన్నుగురించి యేమియు తెలియదు. అందు

చేత నీవు చేసినపనులనుగుఱించి వారేమనుకొన్నను నీకది ముఖ్యముకాదు.

ఎవరైన నొకపనిచేయుటకు తగిన కారణమొకటి యుండవలయును. నీకాకారణము తెలియనప్పుడు, నీ యిష్టమువచ్చిన కారణము లారోపించి వాడు తప్పుచేసి నాడని నిర్ణయించరాదు. 'నాకది తప్పుపనిగా తోచు చున్నది. నే నట్లు చేసియుండను. కాని, యతడట్లుచే యుటకేదో తగినకారణ ముండవలెను. నాకాకారణము తెలియదు' అని దయతో ననుకొనవలెను.

ఒకడు నీయెడల నమర్యాదగ బ్రవర్తించినయెడల, వెంటనే వానికి నీయందసూయయో కోపమో యుండు టచే నట్లు ప్రవర్తించెనని యెంచరాదు. అనేక సమయ ములలో, నాతడదివరకు ఇతర కారణములచే ఉద్రేక ముచెంది, కలతబారియుండి, ఆస్థితిలోనుండగా నీ వాతని యెదుటబడుట సంభవించుటచేత వాని కోపము నీమీదబడును. అట్టి సమయమున నీవు వానియెడల శాంతభావముతోనుండి సానుభూతి కనపరచవలెను.

మానాభిమానములు అహంభావమువల్ల గలుగును. సాధకుడు అహంభావమును నిర్మూలించవలెను.[1]

[1] శ్రీమద్భగవద్గీతలలో 2 అధ్యాయములోని స్థితప్రజ్ఞుని లక్షణ ములును, 14 వ అధ్యాయములోని గుణాతీతుని లక్షణములును చదువ

ఈ సందర్భములో పశ్చాత్తాపమునుగుఱించి కొంచెము చెప్పవలెను. పశ్చాత్తాపమనగా చేసినపనికై విచారించుటయని సామాన్యాభిప్రాయము. అట్లు విచారించుట గొప్పతప్పు. దానివల్ల ప్రయోజనములేదు. 'ఇది చాల తెలివితక్కువపని, ఇక నెప్పుడు నీ పనిని చేయను' అని శాంతముగ మనోనిశ్చయముచేసికొనవలెను. 'ఎవడైనను తప్పుచేయవచ్చును; మనమందరము తప్పులను చేయుచున్నాము; కాని, చేసిన తప్పు తిరిగిచేయువాడు మూర్ఖుడు' అని టాల్లిరాండు వ్రాసెను. 'చేసినతప్పు తిరిగిచేయనని నిశ్చయముచేసికొనుటే పనికివచ్చుపశ్చాత్తాపము' అని యొకప్పు డొక పరమగురువు చెప్పెను. ఎప్పుడును తప్పుచేయనివాడేపనిని చేయనివాడు. వెనుకటి జన్మములలో నీవు చేసిన తప్పులకిప్పుడు చింతింపవుగదా! అట్టిచో నిన్నను, ఒక క్షణముక్రిందటను చేసిన తప్పుకొఱ కిప్పుడేల చింతించవలెను? రెండును గతములే. చింతించుటవల్ల కాలము బలముకూడ వ్యర్థముగ వ్యయమగును. ఇంతేగాక, అట్లుచింతించుటయు నొకవిధమగు స్వార్థము, అహంభావము.

వలయును. మఱియును బైబిలులో పీటరు II-23, రోమా XII-19 చదువ వలయును.

మూలము :—"నీ మనోమయ శరీరము గర్వించి తాను వేఱని యనుకొననిచ్ఛయించును. తానధికమని యును, ఇతరు లల్పులనియును అనుకొనును."

కామశరీరమువలె మనోమయశరీరముగూడ నీకంటె వేరైనదియు, నీకోరికలకంటె వేరైనకోరికలు గలది యునై యున్నది. ఇది తెలిసికొనుట ఆవశ్యకము. సాధారణముగ మనము చేయు తలంపులన్నియు అశుద్ధ మనస్సువి. (దీనినే రూపమనస్సని, కామమనస్సని యందురు.) మనమొక్కసారి మన తలంపుల ప్రవాహ మును నిలిపి, వెనుకటి పదినిముషములలో తలంచిన తలంపులనన్నిటిని జ్ఞాపకమునకు దెచ్చుకొనిచూచినచో, ఆ తలంపులలో నూటికి తొంబదిపాళ్లకుమించి అశుద్ధ మనస్సువేయనియును, ఏ విషయమునుగుఱించియును తలంపు సందర్భముగను పూర్తిగను ఉండక ఒక విష యమునుంచి యొక విషయమునకు గంతులిడుచుపో యెననియును కనిపించును. అట్లొక విషయమునుండి యొక విషయమునకు గంతులిడుటవల్లగలుగు చలన ములే అశుద్ధమనస్సు కోరునది. ఆ విషయములన్ని యును చెడ్డవి కాకపోయినను, వానిలో నీకు నిరుపయోగ ములైన వెన్నియో యుండును. నీవొక పిల్లినిగుఱించి యాలోచించవలెనని యారంభింతువు. పిల్లియనగానే

పాలు జ్ఞాపకమునకువచ్చును, పాలతో ఆవు, ఆవుతో గడ్డి, గడ్డితో గడ్డిగోకువాడు, వానితో వానికుటుంబము, వారి దారిద్ర్యము; ఇట్లొకదానితో నొకటి సంబంధించిన విషయములలోనికి ఆలోచనలుపోయి రెండునిముషములలో నీ వారంభించినపిల్లితో, నెట్టి సంబంధము లేని రష్యానుగుఱించి తలంచుచుందువు. మనస్సట్టి ప్రక్కదారులలోనికి పోకుండ కనిపెట్టిచూచుచు, ఎప్పటి కప్పుడు మరల్చుచు చిత్తైకాగ్రత నభ్యసించవలెను.[1] లేనియెడల మనశ్శక్తి వ్యర్థముగ వ్యయమగును.

మనుష్యుని యుపాధులలోనెల్ల మనస్సు మిక్కిలి బలమైనది. అట్టి మనస్సు మనవశమం దుండి, మన

[1] అర్జునుడు శ్రీకృష్ణుని 'మనస్సు నిలకడలేనిది, క్షోభపెట్టునది, ప్రబలమైనది, గట్టిది; వాయువువలె దానిని నిగ్రహించుట బహు కష్టమనితోచుచున్నది. అట్టి మనస్సుతో నీచే జెప్పబడిన యోగమునకు స్థిరమైన యాధారము కనపడదే' యని యడిగినపుడు శ్రీకృష్ణుడు 'మనస్సు చంచలమైనదియు, నిగ్రహించుట కష్టమైనదియు నగును. అయితే, దానిని అభ్యాసముచేతను వైరాగ్యముచేతను లోబర్చుకోవలెను. అట్లు మనస్సు స్వాధీనముచేసికొని యుపాయము చేత యోగముపొందవలెను అని చెప్పెను. గీతా ॥ 6—33—36.

మరియును శ్రీకృష్ణుడు చంచలమైనదియు స్థిరముగానిదియునగు మనస్సు యేయే విషయము నిమిత్తము బయలువెడలుచున్నదో ఆ యా విషయమునుండి దానిని మరలించి ఆత్మయందే వశముచేసికొని యుంచవలెను అని చెప్పియున్నారు. గీతా ॥ 6—26.

యిష్టమువచ్చిన ట్లుపయోగింపదగియున్న యెడల, దాని సహాయమున మనము చేయజాలనిపను లుండవు. మన మొకరి నాశీర్వదించినను, శపించినను, అట్టి మనశ్శక్తి లేనియెడల, నవి ఫలించవు. కనుక, మోక్షమార్గమున జేరి లోకహితముజేయబూనువారు తమ తలంపుల నెల్లప్పుడును లోకహితముగోరునవిగనే యుండునట్లు అభ్యాసముచేయుటయేగాక ఆతలంపులవల్ల ఫలము గలుగునట్లు మనస్సును సంస్కరించి నిరంతరధ్యానము చే బలపరచి, శక్తివంతముగనొనర్చి, యుంచుకొనవల యును.

వడ్రంగి తన పనిముట్ల నెప్పుడును నాడిగానుంచును. వాడెప్పు డేపని చేయవలసివచ్చినను ఆపనిని వానితో చక్కగాచేయుట కవి సిద్ధముగానుండుట కట్లుంచును. అట్లే మనస్సునుగూడ నిరంతరము చురుకుగాను, మెల కువగాను, ఉపయుక్తముగాను ఉంచుకొనవలెను.

మనమేదోయొక వ్యాపకమును చేయుచున్నంతకాల ము మనస్సునాపనిమీదనే యుంచి, ఆపనిని చక్కగా శ్రద్ధతోజేయ నలవాటుచేసికొనవలెను. ప్రత్యేకముగ జేయవలసినపని యేదియులేక తీరికగా నున్నప్పుడు సాధారణముగ మనస్సనేకత్రోవలబట్టి వ్యర్థముగ బోకుండ నియమించవలెను. అట్లు నియమించుటకు

అభ్యాసముకావలెను. మనస్సు పనిలేనప్పుడు నీ ప్రయత్నములేకుండ నేదోయొక మంచితలంపు తలంచునట్లు అట్టి తలంపు నొకదానిని మనస్సులో నెప్పుడును వెనుకగ నుంచుకొనవలెను.[1] అట్టి తలంపు స్పష్టమును నిర్దిష్టమునైయుండవలెను. కొందరు భగవన్నామస్మరణము నెప్పుడును చేయుచుందురు. కొంతవర కది మంచియభ్యాసమే. కాని, నోటితో భగవన్నామము నుచ్చరించుచు మనస్సు నితరవిషయములకు బోనిచ్చుటవల్ల ప్రయోజనములేదు. పరమగురువునకు శిష్యుడుకాగోరువాడు ఎల్లప్పుడును ఆయనకొఱకు లోకహితమగు కార్యముల నెట్లుచేయగలననుచింత యొక్కటియే మనస్సునం దుంచుకొనవలయును.

ఇప్పుడు లోకమున మనస్సు బలపరచుకొనుటకు ప్రయత్నించువా రనేకులున్నారు. గొప్పప్రకృతిశాస్త్ర పరిశోధకులు తమ మనస్సును వశమందుంచుకొని మిక్కిలి చురుకుగను, బలముగను ఉండునట్లు తరిబీదు చేసియుంచెదరు. కాని దానిలో అహంభావము, స్వార్థము, అనగా, లోకములో కీర్తిబొందవలయునను నభిలాష, యుండవచ్చును. శాస్త్రపరిశోధకులందరకు నట్టి

[1] దీనిని గుఱించి 3 వ భాగములో మనోవిషయికమగు నిగ్రహము అను మొదటి అధ్యాయములో వివరముగ జెప్పబడినది.

యభిలాషయుండదు. కేవలము జ్ఞానమును సంపాదించి, లోకహితముచేయు వారనేకులున్నారు. అదియే మనస్సు యొక్క సద్వినియోగము.

మనస్సునకు గర్వమొక స్వాభావలక్షణము. ఇది సంస్కారములేని మనస్సునకు స్వభావమైయుండును. సంస్కారమువల్ల వినయ మలవడును. నిజమైన జ్ఞానమును బడసి, దానివల్ల మనస్సంస్కారముచేయవలెను. అంతవరకును గర్వముపోదు.

మూలము :—" ఐహికవిషయములనుండి దానిని మరలించియున్నను, నీ పరమగురువు కార్యమును, పరోపకారమును యోచించక తన మేల్మినే చింతింప జూచును."

ఈ వాక్యమువల్ల ఒక్కటే యాలోచన, ఒక్కటే యిచ్ఛ, ఒక్కటేపని, యనుభావము పరమగురువు మనస్సున నిండియున్నదనియు, దానినే శిష్యునకాదర్శముగ జెప్పెననియు స్పష్టమగుచున్నది. పరమగురువుపై భక్తి, పరమగురువుసేవ, లోకహితము, పరోపకారము, ఇవియే శిష్యుని మనస్సులో నెల్లప్పుడు నుండవలసిన యాలోచనలు. ఇతరములగు నాలోచనలు నీ మనస్సుకు చెందినవిగాని 'నీ'కు చెందినవికావు.

నీవు సాధనముచేసి సద్గుణముల నలవరచుకొను చున్నావు. ఎందుకు? నిన్నితరులు మెచ్చుకొనుటకా? నీవు ప్రథమోపదేశమున కర్హుడవగుటకా? లేక, నీవు పరమగురువుచేతిలో నుపయుక్తమగు నుపకరణముగ నుండుటకా? అని పరీక్షించుకొనవలెను. అట్టిపరీక్ష నీవు స్వయముగ, నేదోయొక నిర్దిష్టమైనమార్గమున, చేసికొనవలయును. నీవేవో కొన్ని గొప్ప సద్గుణములను, లక్షణములను, అలవరచుకొన్నావనుకొనుము. నీ పరమగురువుకొరకు కొక స్వల్పకార్యము చేయవలసి వచ్చును. దానికై నీవలవరచుకొన్న గొప్ప లక్షణముల క్కరలేదు. నీకంటె మిక్కిలి వెనుకబడియున్న వారెవరైనను దానిని చేయగలరు. అట్టి సమయమున నీవు "నేను నాకుతగిన గొప్పపనులనే గాని స్వల్పపనులను చేయ" ననక, ఆ స్వల్పకార్యమును చేయబూని పూర్తిగాచేయుదువా? ఇది యొక గొప్పపరీక్ష. శిష్యుడెప్పుడును పరమగురువుకొరకు చేయుపని గొప్పదా, కొద్దిదాయని యోచించరాదు. ఇతరులెవ్వరును చేయక విడిచిన పనిని తాను చేయుటకు సంసిద్ధుడై యుండవలెను. చేయవలసిన పని గొప్పదా కొద్దిదా యని యెంచుట మనోగర్వ లక్షణము.

మనస్సును మనము లోబర్చుకొని యైహికవిషయములలో గర్వించకుండ జేసినను, అది మనలను పరమార్థ విషయములలో గర్వించునట్లు చేయును. తుదకు నేను నిగర్వినని గర్వించునట్లు చేయును.

కామశరీరమువలె మానసికశరీరముగూడ, తన పుష్టివృద్ధికొరకు కట్లు చేయునుగాని, నీకు హానిజేయుటకు కాదు. మానసిక చైతన్యము నిన్నెఱుగనే యెఱుగదు.

మూలము :—"నీవు ధ్యానముచేయునపుడు 'నీకు' వలయునొక్కటేయగు విషయమును[1] విడిచి 'తనకు' వలయు పెక్కువిషయముల జింతించునట్లు చేయఁబూనును. ఈ మనస్సు నీవుకాదు. అది నీ వుపయోగించదగిన కరణము. కావున నిందును వివేచన మావశ్యకము. నిరంతరము జాగరూకుడవై యుండవలెను. లేనిచో చెడుదువు."

మనస్సు ఇంద్రియములకు రాజనియును, కావున నన్నిటికంటెను దానిని లోబరచుకొనుట కష్టమనియును చెప్పుదురు. మనోనిగ్రహముविషయమై యిప్పుడు విద్యాధికులుగూడ చాలవెనుకబడియున్నారు. ఏలయన,

"[1] మనమెద్దియో యొక విషయమును ధ్యానముచేయుచుందుము గదా! దానిని విడిపించి వేఱువిషయములకు మనలను ద్రిప్పును."

వారు తమ యశుద్ధమనస్సు ఒక విషయమునుండి, మరియొక విషయమునకు, త్వరితగతిని పరుగులెత్తు చుండుటజూచి గర్వింతురు. వార్తాపత్రికలు విశేషముగ జదువుట దీనికి తోడ్పడుచున్నది. రానురాను మిక్కిలి ముఖ్యములును జ్ఞానదాయకములునగు విషయములను గుఱించి వ్రాయబడిన వ్యాసములు, పెద్దవిగానున్న యెడల, చదువుటకు వారికి విసుగుపుట్టుచున్నది. చమత్కారములైన కథలుకూడ చిన్నవి కావలెను. కాని సాధకుని మనస్సట్లుండదగదు.

సాధకుడు నిరంతరాభ్యాసముచేసి యుపాయముతో మానసిక చైతన్యమును లోబరచుకొనగలడు.

---

మూడవ అధ్యాయము

## ఒప్పు—తప్పు

మూలము :—" తత్త్వముఁ దెలిసినవారు సరి తప్పు అనుటను నిశ్చయించుటలో నేమియు జంకరు[1]. ఎంత నష్టముగ పైకికనఁబడినను నీవు సరియైన దానినే చేయవలయును, సరికానిదానిని చేయరాదు. అవి వేఱు లేమని తలఁతురో, యేమని చెప్పుదురో అని సరకుచేయకుము. గుహ్యములగు ప్రకృతిధర్మములను లోఁతుగదిగి పరిశీలించి నీబుద్ధిని వినియోగించి తెలిసికొని యభీష్టములననుసరించి నీ నడవడికను గుదుర్చుకొనవలయును."

మన జీవితములను నిష్పక్షపాతముగ విమర్శించి చూచుకొన్నయెడల, ఏపనిచేసినను, ఏదోయొక విధముగ మనస్సమాధానముచేసికొని, తప్పు పనులను చేయుట యెక్కువగ గనబడును. 'లోకులేమనుకొందురో' యనుప్రశ్న ప్రతివానిని బాధించుచుండును.

"[1] అనగా నేదిచేయవలయునను సందేహము గలుగఁజాలదు."

ఇది ప్రాణాంతకమయిన ప్రశ్న. ఒక విషయములో నొకవిధముగ ప్రవర్తించుట యుత్తమమని తెలిసియు, లోకులతో విరోధించకుండ సులభముగ జీవితము గడుపుకొనిపోవలెనని, ఆయుత్తమవిధమును కొంచెము మార్చి, కొంత పాడుచేసి, తుదకు దానిని పూర్తిగ నవలంబించరు. ఇతరుల యభిప్రాయములకు వెరచుట కొక కారణము మంచిగానుండగోరుట—ఇతరులను సంతోషపెట్టి, వారిచే మంచివాడనిపించుకొన గోరుట. కాని, తత్త్వసాధకుడు ధర్మవిచికిత్సగలిగినపుడు, సరియైనమార్గము నవలంబించుటలో వెనుదీయరాదు. మన దైనిక జీవితముతో సంబంధించిన స్వల్పవిషయములలో గూడ నిట్లు మనస్సమాధానము చేసికొని తప్పుదారి ద్రొక్కుటకూడదు. ఇది తప్పు, ఇది యొప్పు అని తెలియనివారిసంగతి వేరు. యోగమార్గమున ప్రవేశించ గోరువారు తప్పొప్పులను తెలిసికొని యొప్పయినమార్గ మిదియని నిశ్చయించుకొని యా మార్గమునే యనుసరించుటకు దృఢసంకల్పము చేసికొనవలయును. ఆ మార్గమున నీవు వేయు నొక్కొక్కయడుగు నిన్ను నీ గమ్యస్థానమునకు దగ్గరగ గొనిపోవును, గనుక నీ యాదర్శము నొక్కమారు పొందలేదని వెనుదీయవద్దు.

"శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేతస్తౌ సంపరీత్య వివినక్తి ధీరః। శ్రేయో హి ధీరోఽభిప్రేయసో వృణీతే ప్రేయో మందో యోగక్షేమాద్వృణీతే॥" అని కఠోపనిషత్తు (౨-౨)లో చెప్పబడియున్నది. ధీరుడు (బుద్ధిమంతుడు) సుఖకరమైనది విడిచి శ్రేష్ఠమైనదానినే యెంచుకొనును. సుఖకరమైనది వేరు శ్రేష్ఠమైనది వేరు. శ్రేయః (శ్రేష్ఠమైనది) అనగా మోక్షమునిచ్చునదని యర్థము.

తప్పు, ఒప్పు యెంచుకొనుటలో నీ మనస్సాక్షినే నమ్మి నీమనస్సాక్షి యేది సరియైనదని చెప్పునో దానిని చేయుటకు ప్రయత్నింపుము. మరియొకని మనస్సాక్షి యేమి చెప్పునో దానికి నీవు బాధ్యుడవుకావు. మరియు నతడు తన మనస్సాక్షి ననుసరించుచున్నాడా లేదా యనుదానికిని నీవు బాధ్యుడవుకావు. నీ మనస్సాక్షికి నచ్చినది పైకి నీకు నష్టదాయకముగ గనబడినను నిజముగ నది నీకు నష్టముగలిగించదు. అయితే, నీ చిత్తచాపల్యములు, నీ కామవికారములు, నీ మూఢాభిప్రాయములు, నీ మనఃకల్పనలు, ఇవియన్నియు నీ మనస్సాక్షి చెప్పినవనుకొనరాదు. అందుకనే పరమగురు విక్కడ 'గుహ్యములగు ప్రకృతిధర్మములను లోతుగఁదిగి పరిశీలించి తెలుసుకొను' మని హెచ్చ

రించుచున్నారు. కనుక, మొదట ఆవిధముగ సరియైన దేదో నిశ్చయించుకొనవలెను.

ఈ వాక్యములో పరమగురువు 'నీ బుద్ధిని వినియోగించి' యని గొప్పసూచనచేసినారు. ఇతరుల మనోభావముల నెల్లప్పుడును గౌరవముతో గమనించుము; కాని, సరియైన పనిచేయుటలో వానిని నీ కడ్డురానీయకుము. తత్త్వజ్ఞు డితరులను నొప్పించడు, గాని, తాను తప్పుచేయుటకంటె నితరుల దురాభిప్రాయములను నొప్పించుటకు వెనుదీయడు. అట్టి దురాభిప్రాయములనైనను అనగత్యముగ నొప్పించడు. అగత్యమైనప్పుడైనను, తాను చేయుపనిని, నెమ్మదిగను, సావధానముగను చేయును, గాని, తొందరపడి చేయడు.

సాధారణముగ ప్రతిమనుష్యుడును చిన్నతనమునుండియు నేదోయొక మార్గమున శిక్షితుడై, కొన్ని స్థిరాభిప్రాయములను సమకూర్చుకొని, యవియే సరియైనవని యనుకొనును. అందుచేత, నతడు తన యభిప్రాయముల ననుసరించనివాడు తప్పుచేయుచున్నా డనుకొనును. లోకసామాన్యములగు స్థిరాభిప్రాయములను లోతుగ పరిశీలించినయెడల, వాని కేదో హేతుపూర్వకమగు నాధారము దొరుకును. ఒకప్పుడా యాధారము జను లనుకొనునది కాకపోవచ్చును. ఏదైనను, తరుచుగ,

ఆ యాధారము, కాలక్రమమున వికృతమై, దురభి ప్రాయభూయిష్ఠమై, యిప్పుడాచారములో నసందర్భ ముగనుండును.

కాని, యట్టి లోకాభిప్రాయమునకు భిన్నముగ బ్రవర్తించుటలో, తక్కిన విషయములలోవలెనే, నవుబుగాను, యుపాయముతోను, ప్రవర్తించవలెను. ఒక యెద్దు తనయెదుట ద్వారముమూసియుండుట జూచి, దానిని పొడిచి బ్రద్దలుగొట్టి, లోపలబ్రవేశించును, కాని, దానివలన ఆయెద్దు ద్వారమును పాడుచేయుటయే గాక తనకు గాయములను తగిలించుకొనును. లోకాభిప్రాయముల నెదుర్చుటలో మనమట్లుచేయరాదు. ఇంతకును, ఒకప్పుడు లోకాభిప్రాయము సరియైనదగుటయు, నీ యభిప్రాయము తప్పగుటయు సంభవించునని మరువరాదు. తరువాత వాక్యమును చూడుడు.

మూలము :—"ముఖ్య మిది అముఖ్య మిది యని భేదమును వివేచనముచేయవలయును. సరి తప్పు అను విషయమందు కొండవలె స్థైర్యముగలిగి[1] ముఖ్యములుకాని విషయములయందెప్పుడును ఇతరుల ననుసరించిపొమ్ము. ఏలయనఁగా, నీ వెల్లప్పుడును

[1] "అనఁగా సరియైనదానిని వదలక."

మార్దవమును దయయును గలిగియుండవలయును. యుక్తముగను, ఇతరుల కనుకూలముగను ప్రవర్తింప వలయును. అన్నింటియందును నీ కెంతపూర్ణస్వా తంత్ర్యము కావలయునో అంతస్వాతంత్ర్య మిత రులకు పూర్ణముగనిమ్ము."

పై వాక్యము చదివినపుడు గలుగు సందేహముల కీవాక్యములు సమాధానమిచ్చుచున్నవి. సాధారణ ముగ లౌకికు లెక్కువ శ్రద్ధజూపువిషయములు తత్త్వ జ్ఞున కనావశ్యములు. తత్త్వజ్ఞునకు, తాను చేయవలసిన కార్యము నెరవేర్చుటయొక్కటే ముఖ్యము అగుటచేత, దానినే తన దృష్టిలోనుంచుకొని, తనకనగత్యములును అముఖ్యములును అగు విషయములలో లౌకికులను తమయిష్టము వచ్చినట్లు పోనిచ్చును. వారికి కావలసిన విషయములలో తమ యిష్టానుసారముగ నతడు పో నిచ్చుటచేత, ముఖ్యమైన విషయములలో, వారు ఎఱుం గకయే, నతనితోగలిసి, సంతోషముతో బనిచేతురు. ఇదియే యుపాయమందురు, వివేకమందురు.

తాను ధర్మమని యనుకొన్నదే సరియని మూర్ఖపు పట్టు పట్టువాడు, ఇట్లు ముఖ్యాముఖ్యవిచక్షణముచే యక, అముఖ్యవిషయములలోగూడ తనపట్టు విడు వక, నితరులతో విరోధపడును. అందుచేత, ముఖ్య

మైన కార్యములలో వాని నితరు లనుసరించరు. ఇది ప్రకృతిధర్మము. ఒక మనిషినిగాని, ఒక జంతువును గాని, యెవడైన బలవంతముగ నొకవైపునకు లాగిన యెడల, వానికెదురుగ లాగి పెనగులాడుట స్వభావము; తెలివిగలవా డట్లు బలవంతముగ లాగక తట్టి, బుజ్జగించి మంచిచేసినయెడల పెనుగులాడకుండ వానివెంటనే వచ్చును.

నీకు కావలసినపని నితరులుచేయనప్పుడు, నీవు చేయబూనినపని కితరులు తోడ్పడనప్పుడు, నీలో నేమైన లోపమున్నదేమో చూచుకొనుము. నీ వవలంబించిన కార్యక్రమములో వారికిష్టములేని దేదోయుండవచ్చును. వారియందు లోపములుండవచ్చును, కాని వానినిగురించి నీవు బాధపడక, నీ లోపమును కనిపెట్టిచూచి, నీ కార్యక్రమమును సవరించుకొనుట మంచిది. నీవు బలవంతముచేసి వారిని నీ కార్యక్రమమునకనుకూలముగ నడుచునట్లు చేయగలిగినను, అది సరియైనపద్ధతికాదు. దానివలన విరోధములు, కష్టములు సంభవించును. అది నాయకుని లక్షణముకాదు. నిజమైన నాయకుడు అముఖ్యవిషయములలో తన్ననుసరించనివారిని బలవంతముచేయడు. యోగమార్గము ననుసరించ దలచుకొన్నవారు ముందొకప్పుడు లోకమును

పురోవృద్ధిమార్గమున నడిపించుటకు నాయకులుగనుండ వలసియుండును. కనుక, నాయకలక్షణముల నిప్పటి నుండియు నేర్చుకొనవలెను.

మహనీయులు తలపెట్టిన సత్కార్యముల కాటంక ములు అనేకములు కలుగును. కాని, వారు ఆ యా టంకములను లక్ష్యముచేయక, తమ యుద్యమమును వీడక, స్థైర్యముతోనిలిచి, ప్రజలను నేర్పుతో తమ పక్ష మునకు ద్రిప్పి, ఆటంకములు నివారణచేసి, కృతకృత్యు లగుదురు.

మూలము :—"చేయఁదగిన కార్యమెద్దియో తెలిసి కొనుటకు ప్రయత్నింపుము. కార్యము గొప్పకార్య మా కొద్దికార్యమా యనుటను బట్టియే దీనిని నిశ్చ యింపరాదనుటను మఱువకుము, లోకులు మంచిదని చెప్పు గొప్పకార్యముకంటె, పరమగురుని పనికి ప్రత్యక్షముగ ననుకూలమగు చిన్నకార్యము చే యుట బహుయోగ్యము. మఱియును కార్య ముప యోగకరమా నిష్ప్రయోజనమా యని విచారిం చుటమాత్రము చాలదు. ఉపయుక్తములగువాని లోపల నెద్ది యెక్కువ యుపయోగకరమో, ఎద్ది తక్కువయో యని వివేచనము చేయవలయును."

సామాన్యముగా లౌకికులు నిరుపయోగకరములగు విషయములయందే శ్రద్ధవహించి తన కాలమునంతను వానికొఱకే వినియోగించుచున్నారు, గాని, నిజముగ నుపయోగకరములైన విషయములను లక్ష్యముచేయరు. యోగసాధకు డట్లు నిరుపయోగకరములగు కార్యముల తో తన కాలమును, శక్తిని వ్యర్థపుచ్చజాలడు.

కార్యము పెద్దదియైన ముఖ్యమైనది, యుపయోగ కరమైనది, కనుక, చేయదగినది యనియును, చిన్నది యైన చేయదగనిది యనియును అనుకొనరాదు. గొప్ప రాజకార్యదురంధరులు చేయు మహాత్కార్యములు కొన్ని, పైకి గొప్పవిగ గనిపించినను, సత్యదృష్టి కవి బహు అల్పములు—సంసారచక్రమున కంటుకొన్న యిసుక రేణువులు. అంతకంటె, నెవ్వరికిని తెలియని వాడొకడు చేసిన బహుస్వల్పకార్యమే యెంతయో లోకోపకారమగు ఘనకార్యమగును.

పరమగురువుల సేవకొరకు, అనగా లోకకల్యాణ ముకొరకు, చేయవలసిన ప్రతికార్యమును ఉపయోగ కరమైనదే. కాని నీకాలము, నీశక్తి మితములయినవి గాని అమితములు గావు. కనుక, నీ వొక్కమారే అన్ని కార్యములను బూనిచేయజాలవు. అన్నిటిని నీవు చేయబూని, దేనినిగూడ పూర్తిగాను, చక్కగాను

చేయజాలక విడిచిపెట్టుటకంటె నీ శక్తికి, కాలమునకు, తగినకార్యములను బూని, వానిని నిర్దుష్టముగను, నేర్పుతోను పూర్తిచేయుటమంచిది. అందుచేత ఎక్కువ యుపయోగకరములైనవానిని ఎంచుకొని ముందుగా వానిని చేయుము.

మఱియును, ఆయెంచుటలో నీ శక్తిసామర్థ్యములను గూడ చూచుకొనవలెను. తరువాత వాక్యములను చూడుము.

మూలము :—“ పేదలకన్న మిడుట సత్కార్యమును, గొప్పదియు, ఉపయోగకరము నగును. అయినను, దేహముల కన్న మిడుటకంటె యాత్మలకన్న మిడుట ఎక్కువ గొప్పదియు, ఉపయోగకరము నగును. ధనవంతుఁడెవఁడైనను దేహమున కన్న మిడఁగలఁడు. తెలిసినవాఁడే ఆత్మకన్న మిడనోపును,”

ఇది ఆదర్శప్రాయమగు వాక్యము. లోకమునందలి బాధలన్నియు నజ్ఞానమువలనను మోహమువలనను గలుగును, గనుక, ఆబాధలను నిర్మూలించుటకజ్ఞానమును మోహమును పోఁగొట్టవలెనుగాని ఒక్కొక్క బాధకు తాత్కాలిక చికిత్సచేసిన చాలదు.

జ్ఞానము జ్ఞానుల స్వంతయుపయోగమునకు, వారిని తరింపజేయుటకు, మాత్రము వారికి లభించ లేదు, సద్వాని

యోగము నిమిత్తము వారికొప్పజెప్పబడినది.[1] ఎవరి కెంత జ్ఞానముగలిగినను వారు దానిని తమకంటె నజ్ఞానులైనవారికొఱ కుపయోగించినప్పు డది సద్వినియోగమగును. జ్ఞానదానముచేయువాడు పేదవారియాత్మలకు భాగ్యవంతుల ఆత్మలకుగూడ సమానముగ అన్నముబెట్టును.

పేదలుతినుట కన్నమిడుట మంచిదికాదనిగాని, చేయకూడనిదనిగాని చెప్పుటలేదు. ఎప్పటి కేది యగత్యమో అది చేయవలయును, కాని, అందరును ఆపనినే బూనుకొనుట వాంఛనీయముగాదు. ధనముగలవారు చేయగలపని యది యొక్కటియే గనుక, అది వారు చేయవలసినపని గనుక, వారికిక విచక్షణచేయవలసిన యగత్యములేదు. కాని, జ్ఞానముగలవారు శరీరములకును ఆత్మలకునుగూడ అన్నము నీయగలరు గనుక వారా రెండింటిలో నేది యెక్కువయుపయోగకరమన్న విచక్షణచేయవలయును; విచక్షణచేసి, ఆ రెండింటిలో జ్ఞానదానము ఎక్కువ యుపయోగకరమైనదియును ధనవంతులు చేయజాలనిదియును గనుక దానిని చేయుటకు వారు పూనవలయును.

[1] విద్యావంతుడు తన విద్యను తగినవానికి దానముచేయనియెడల బ్రహ్మరాక్షసిగ బుట్టునని చెప్పుదురు.

పూర్వకాలములలో నన్ని దేశములలోను బ్రహ్మ జ్ఞానసంపన్ను లితరపనులు చేయనక్కఱలేకుండ, నితరులకు జ్ఞానదానముచేయుచుండుటకై తగు సదుపాయము లమర్చబడుచుండెను. మన దేశమున పూర్వము బ్రాహ్మణుల కెట్టి సదుపాయము లమర్చబడుచుండెనో యందరు నెఱింగినవిషయమే. తక్కిన దేశములలోగూడ నట్టి సదుపాయములు జరుగుచుండెననుటకు బైబిలులో "అపోస్తలుల కార్యములు" (Acts of Apostles) అను భాగములో నొకగాథయున్నది. కొందరు తమ విభవములనన్నిటి నొకచో జేర్చి, యందరు గలిసి వాని ననుభవించవలయునను నొక సాంప్రదాయము నేర్పర్చుకొనిరి. వారిలో నొకప్పు డాహారపదార్థములను పంచుకొనుటలో తగువుపచ్చి, అపోస్తలులవద్దకు వచ్చి, వారికి తగువులేకుండ పంచిపెట్టుడని కోరిరి. అందుకు అపోస్తలులు "మేము భగవద్వాక్యమును విడిచి యన్నము వడ్డించుట భావ్యముకాదు" అని ప్రత్యుత్తర మిచ్చి, భగవద్వాక్యము నుపదేశించుట కేర్పడిన తాము కేవలమైహికకార్యముల జేతుమని యెదురుచూడవలదనియును, అందు కితరుల నేర్పర్చుకొని వారు చెప్పిన చొప్పున తమ తగువుల దీర్చికొనవలయుననియును చెప్పిరి. ఇట్లని యైహికకార్యముల నుపేక్షించవలెనని

యుద్దేశముకాదు. ఆకార్యములను చేయగలిగి, తదితరకార్యములను చేయజాలనివారినే అందుకు నియమించవలెనని యుద్దేశము.

మూలము :—“ నీకుఁదెలిసినచో నీవితరులకు సహాయపడి తెలుపుట నీ ధర్మము.

నీ విదివఱ కెంత వివేకివైయుండినను ఈ మోక్షమార్గమున నీవు దెలిసికొనఁదగినది యెంతయో గలదు. అందుచే, దీనియందును వివేచన మావశ్యకము. నేర్చుకొనఁదగినదెద్దియో జాగరూకుఁడవై యోచించవలయును. జ్ఞానమంతయు నుపయోగకరమే. కాలపరిపాకమున నీకును జ్ఞానమంతయుఁగలుగును. దానిలో నీకు కొంతయే యుండఁగలిగినప్పుడు, ఆకొంతయు నీకు మిగుల ఎక్కువయుపయోగకరమైనదిగ నుండునట్లు చూచుకొనుము. భగవంతుఁడు జ్ఞానస్వరూపుఁడును దయాస్వరూపుఁడును. నీ జ్ఞానము హెచ్చను హెచ్చను నీయందు భగవచ్ఛక్తి యెక్కుడుగ వ్యక్తముగాఁగలదు. కావున విద్యనభ్యసింపుము. అందు నితరులకు సహాయముచేయుటకుపయుక్తమగుదానిని తొలుత నభ్యసింపుము.”

విద్యను అభ్యసించుటలోగూడ నిట్టి వివేచనము జేయవలయునన్నసంగతి సామాన్యముగ నందరకు దెలి

యదు. జ్ఞాన మితరులకొరకు కుపయోగించుటకు ఏర్పడి నదిగాని స్వార్థమునకై వినియోగించవలసినది కాదని పైనిచెప్పబడినది. కనుక, జ్ఞానసంపాదనము జేయదల చినవాడు ముందుగ నితరుల కెట్టిజ్ఞాన ముపయోగించు నో తెలిసికొని, ఆజ్ఞానమును సంపాదించి, దాని నేవిధ ముగ నితరులకు జెప్పినయెడల వారికి బోధపడునో ఆ విధముగ జెప్పుటగూడ దెలిసికొనవలయును. ఒక విష యమును అందరకును ఒక్కవిధముగ బోధించినయెడల దాని నందరును గ్రహించజాలరు. అందులో, ఆధ్యా త్మికవిషయములను వినువారికి నచ్చునట్లు చెప్పజాలని యెడల, మంచికంటె కీడు ఎక్కువగ గలుగవచ్చును. జ్ఞానబోధను బడయుటకు సిద్ధముగానుండియు, తమకు నచ్చునట్లు చెప్పగలవారు లేకపోవుటచే, నెందరో అజ్ఞానావస్థలో మునిగియున్నారు. కనుక, ముఖ్యముగ మోక్షమార్గముకొరకు సాధనముచేయువారీవిచక్షణ తప్పక జేయవలయును. ఈ సంగతినే తరువాత వాక్య ములో నిట్లు చెప్పుచున్నారు.

మూలము :—"వినుకులేకుండ విద్య నభ్యసింపుము.
అయినను లోకులు నిన్ను పండితుఁడని దలఁచవలె ననిగాని నీవు పండితుఁడవను తృప్తి నీకుఁగలుగ వలెననిగాని నేర్వకుము. వివేకియే వివేకములోఁ

బరులకు సహాయముఁ జేయగలఁడని తెలిసి చదువు ము. ఇతరులకు సహాయముచేయ నీ వెంత కోరినను నీకు జ్ఞానములేనియెడల నీవు చేయఁగలుగు మేలు కంటె కీ డెక్కువ చేయవచ్చును."

ఇప్పుడు యువజనుల నెదుర్కొనుచున్న గొప్ప సమస్యయొకటి, వారు బడులలోను కళాశాలలోను అభ్యసించు విద్య యెందుకు పనికివచ్చునని. వారు నేర్చు కొన్న సంగతులు చాలవరకు తరువాత నిరుపయోగ మగుచున్నవి, కాని, ఆ విద్యాభ్యాసములో వారికి మంచి మానసిక శిక్షణము కలుగును. అది మిక్కిలి యుప యోగకరము. దానివల్ల వారి యాలోచనలు యుక్తి యుక్తముగను, సందర్భముగను, యదార్థముగను ఉం డును.

ఇదిగాక, అనేకవిషయములను తెలిసియుండుటగూడ ప్రయోజనకరము. ఒక ఆధ్యాత్మిక విషయమును పూర్వసాంప్రదాయనుసారముగ జెప్పినకంటె ఇప్పటి భౌతికశాస్త్రవిషయములతో సంబంధించిన యుదా హరణములతోగాని, భౌతికశాస్త్రమునకు ఆయాధ్యా త్మిక విషయము భిన్నముగాదని నిరూపించిగాని, హేతు పూర్వకముగ ఋజువుచేసిగాని చెప్పినయెడల, ఈ కాలమున నెక్కువమంది హర్షింతురు. అందుచేత

ఆధ్యాత్మికజ్ఞానము నుపదేశింపబూనువారికి భౌతిక శాస్త్రజ్ఞాన మావశ్యకము. ఈ విషయములో దివ్య జ్ఞానసమాజమువారు లోకమునకు గొప్పయుపకార మొనర్చిరి. వారిగ్రంథములలో గూఢములగు నధ్యాత్మ ధర్మములు ప్రస్తుతపరిస్థితులలో విద్యనభ్యసించిన వారికి సుబోధకమగునట్లు వ్రాయబడియున్నవి. అట్లు వ్రాయుటలో భౌతికశాస్త్రపరిజ్ఞానము నుపయోగించుటయేగాక, భౌతికశాస్త్రపరిశోధకులకు నచ్చునట్లు ప్రతివిషయమును విపులముగను యుక్తియుక్తముగను విమర్శించి నిరూపించిరి.

మరియును, నీవొక యాధ్యాత్మిక విషయమును గురించి యుపన్యసించుచున్నావనుకొనుము. నీవుపన్యసించువిషయ మాధ్యాత్మికము గనుక నీ యుపన్యాసమున నెట్టిమాటల నెట్లుపయోగించినను నష్టములేదని చెప్ప వచ్చునా? నీవు చెప్పదలచిన విషయమును హేతు పూర్వకముగ నిరూపించుటకు, శ్రోతల యభిరుచులను కనిపెట్టి వారి నేవిధముగ నమ్మించగలవో ఆవిధముగ పూర్వోత్తరసందర్భములను నియమించుకొని, తగిన యుపమానములనుచేర్చి, వాక్యసరణి, పదగుంభనము, వ్యాకరణము, నిర్దుష్టముగనుండునట్లు చూచుకొని, తుదకు కంఠధ్వనినిగూడ భావముల కనుకూలమగునట్లు

మార్చుచు, అగత్యములగు నంగవిన్యాసముల జేయుచు నుపన్యసించెదవు. ఇన్ని విషయములలో నేర్పుగలిగి ననేగాని నీ వా యొక్క విషయమునుగురించి యుప యోగకరమైన యుపన్యాసము నీయజాలవు. కనుక, విద్య యనగత్యము కానేరదు.

ఒకనికి పరార్థము లభించినతరువాత నిహార్థముల యందభిరుచి తగ్గుటసహజము. అందుకనియే పరమగురు విచ్చట మానసికశిక్షణ మింకను విశేషముగ బొంద వలసిన తన చిన్న శిష్యునకు "విసుకులేకుండ విద్య నభ్యసింపు" మని యుపదేశించిరి. విద్య కంతములేదు. ప్రపంచమున నెంత విద్యావంతునకైనను తెలిసినసం గతులకంటె తెలిసికొనవలసినసంగతులే యెక్కువగ నుండును. కనుక, 'యత్ జ్ఞాత్వా నేహ భూయోన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే,' (గీతా ॥ ౭—౨) ఏది తెలిసి కొన్నయెడల నీ లోకమున నిక తెలిసికొనదగినది మిగిలి యుండదో ఆ రహస్యమును తెలియువరకు మనమంద రముగూడ విద్యను విసుకులేకుండ నభ్యసించవలయును.

---

నాలుగవ అధ్యాయము

## ఎల్లప్పుడు సత్యముగానుండుట

మూలము :—"సత్యమునకు అనృతమునకు వివేచనము చేయవలెను. మనోవాక్కాయములతో నంతటను సత్యముగనుండుట నేర్చుకొనుము."

మనస్సు, వాక్కు, కాయము, ఈ మూడింటి కర్మలును సత్యములుగా నుండవలయునని యీ వరుసను చెప్పుట యోగశాస్త్రము ననుసరించియున్నది. శ్రీ గౌతమబుద్ధులుకూడ తమ ఆర్యాష్టాంగమార్గములో నీవరుసనే సమ్యగాలోచనము, సమ్యగ్వాక్కు, సమ్యగాచరణము అని చెప్పినారు.

మూలము :—"మొదట మానసికమగు సత్యమును నేర్చుకొనుము. ఇది సులభముగాదు. అసత్యములగు తలంపులును, అవివేకములగు మూఢాభిప్రాయములును, లోకమున నెన్నియోగలవు. అట్టి యభిప్రాయములచేఁ గట్టఁబడినవాఁడు వృద్ధికిరాఁజాలఁడు."

అముఖ్యమును ముఖ్యముగా నెంచుట మూఢాభిప్రాయము[1]. దానినుండి తప్పించుకొనుట బహుకష్టము, కనుకనే సాధకుడు ప్రథమదీక్షను పొందినంతవరకు దానిని పూర్తిగాతొలిగించుకొనవలయునని నియమించలేదు. మూఢాభిప్రాయములు ప్రతివానియందు నేదో రూపముగనుండును. అంతమాత్రముచేత వాడభివృద్ధినొందుట కాటంకముండదు. వాడా మూఢాభిప్రాయములకు లొంగిపోయినప్పుడే వాని యభివృద్ధికాటంకము కలుగును.

లోకమున సత్ప్రవర్తకులని, భక్తిపరులని, దానశీలురని, వన్నెకెక్కిన సార్థకజీవులెందరో మూఢాభిప్రాయములపాలైయున్నారు. వారు తామవలంబించిన పూజాది సంస్కారములు, మంత్రములు, తదితర కర్మలు ముఖ్యములని తలంతురు. కాని, నిజమున కవి ముఖ్యములుకావు. ప్రతిమతములోను ప్రేతసంస్కారములు కొన్ని విధింపబడియున్నవి. అవి రూపమున భేదించినను వాని యుద్దేశము చనిపోయినవాని కుత్తరలోకగతియందు సహాయమొనర్చుటయే. కర్మచేయువాని శ్రద్ధాభక్తులనుబట్టియు, చనిపోయినవానియం దతనికిగల ప్రేమనుబట్టియు నాయుద్దేశము నెరవేరును. అయినను,

[1] నాల్గవభాగము, 3 అధ్యాయములో దీనినిగురించి చూడుడు.

బాహ్యకర్మలనే ముఖ్యములని నమ్మి పోట్లాడుదురు. ఇట్లనేక విషయములలో దేశకాలాదిభేదములచే గలిగిన బాహ్యభేదములనే ముఖ్యములనియెంచి యొకరికంటె నొకరు గొప్పవారనుకొనుచున్నారు. ఇది యొక మూఢాభిప్రాయము. దీనికి భౌతికశాస్త్రవేత్తలుకూడ పాలగుచున్నారు.

ఏ విషయమునుగుఱించియైనను నీవు స్వయముగ నాలోచించి యది సత్యమని నిశ్చయించుకొన్నప్పు డది నీకు మూఢాభిప్రాయముకాదు. ఇతరులు చెప్పినారని గాని, వ్రాసినారనిగాని, ఏ విషయమును నీవు నమ్మినను అది మూఢాభిప్రాయమే. ఆవిషయ మతిప్రాచీన శాస్త్రగ్రంథములో నుండవచ్చును, వేదములోనుండ వచ్చును, అది చెప్పినవారు బహుగొప్పవారు కావచ్చును, కాని అంతమాత్రముచేత అది స్వతంత్రాభిప్రాయముకాదు. నీ స్వాభిప్రాయముకానిది నీకు మూఢాభిప్రాయమే. అట్టి గొప్పఆధారముగల వాక్యముల యందు గౌరవముంచవలసినదే. గౌరవముతో వానిని తెలిసికొనుము, కాని, వానిని పరిశీలించి, నీకు వాని తత్త్వమంతయు తెలియువరకును, కేవలము చిలుకవలె తిరిగి వర్ణించినంతమాత్రమున ప్రయోజనములేదు. ఒక యభిప్రాయము నీలోభాగమై నీ మనస్సున నాటుకొని

పోయి, దానిని నీ వెందుకునమ్ముచున్నావో తెలిసి నప్పు డది మూఢనమ్మకముకాదు. ఈ విషయమునే పరమగురు వీక్రిందివాక్యమున చెప్పుచున్నారు.

మూలము :—" కాఁబట్టి యనేకు లొకవిధమునఁదలచె దరను కారణముంబట్టియే, యామాట నంగీకరింప కుము. మఱియు పెక్కువందల సంవత్సరములనుండి యొకమాట నమ్ముచువచ్చినారనిగాని, ప్రమాణ గ్రంథమని లోకులెంచు నెద్దియోయొక గ్రంథమున వ్రాయఁబడియున్నదనిగాని దానిని నమ్మకుము. ఆ విషయము నీవే పరిశీలించి యిది యుక్తమా యని నీవే నిశ్చయించుకొనుము."

కొందరొకనాడు శ్రీగౌతమబుద్ధులవారిసన్నిధి కేగి "అనేకమందిగురువులు వచ్చి మాకనేక ధర్మములను బోధించుచున్నారు ; అవన్నియును మంచివిగనే గన బడుచున్నవి. అయితే, వాటి యన్నిటిలో నేది శ్రేష్ఠ మైనదియో మే మెట్లు తెలుసుకొనవలెను ? వానిలో విచక్షణ నెట్లు చేయగలము ? " అని యడిగిరి. అందుల కాయన యిచ్చినసమాధానము 'అంగుత్తరనికాయ ము'లో 'కాలామసూత్తము'నం దిట్లు వ్రాయబడి యున్నది. "ఒక విషయమై యొకరు చెప్పిరన్నంత

మాత్రముననే దానిని నమ్మవద్దు. సాంప్రదాయములు ప్రాచీనకాలమునుండి వచ్చుచున్నంతమాత్రముననే వానిని నమ్మవద్దు. జను లిట్లనుకొనుచున్నారని కింవదంతులను నమ్మవద్దు. ఋషు లిట్లు వ్రాసినారని ఋషివాక్యముల నమ్మవద్దు. సమాధిలోనున్నాననుకొని, యెవరో యొక దేవతచేసిన ప్రబోధమనుకొని, నీ మనోకల్పిత భావమును నమ్మవద్దు. అనాలోచితముగ నొక ప్రమేయమునుగైకొని దానినుండి యూహించు సిద్ధాంతములను నమ్మవద్దు. విషయసాదృశ్యముచే నిది యిట్లుండవలెనని యూహించి దానిని నమ్మవద్దు. పరమగురువులును, ఉపదేశకులును చెప్పినారని యది ప్రమాణమని నమ్మవద్దు. ఆవ్రాతగాని, సిద్ధాంతముగాని, యుపదేశముగాని నీయుక్తికిని, యనుభవమునకును సరిపడి యున్న యెడల దానిని నమ్ముము. నీవు విన్నంతమాత్రముననే నమ్మవద్దు. నీ మనస్సాక్షిచే నమ్మిన యెడల, నమ్మినదాని ననుష్ఠించి ప్రవర్తింపవలెను."

ఇంతకంటె విపులముగ నీ విషయమునుగురించి వ్యాఖ్యానము చేయనక్కర లేదు.

శ్రీకృష్ణు డర్జునునకు గీతాశాస్త్రమునంతను ఉపదేశించి తుదకు 'యథేచ్ఛసి తథా కురు', నే జెప్పినదంతయు విన్నావుకదా! ఇక నీ కెట్లిష్టమైన నట్లు

చేయుమని, ఆ స్వాతంత్ర్యము నర్జుననకు విడిచి పెట్టెను.

సాధకుడు ప్రతిదినము తన మానసిక సామగ్రిని పరీక్షించి దానిలో (1) ఇతరు లనేకులు నమ్ముచుండుట చేత తాను నమ్ముచున్న విషయములెన్నో (2) పూర్వకాలమునుండియు నమ్మబడుచుండుటచేత తాను నమ్ముచున్న విషయములెన్నో, (3) ఏదోయొక పవిత్రగ్రంథములో వ్రాయబడుటచేత తాను నమ్ముచున్న విషయములెన్నో, కనిపెట్టిచూచి, యీ మూడింటిని తీసివేసిన యెడల, తాను నమ్ముటకు సరియైన యాధారముగల విషయములేవో స్పష్టముచేసికొనుట మిక్కిలి మంచి యభ్యాసము. ప్రతివాడును ఏదోయొక మతములో బుట్టును. వాని కామతము సహజముగ విశ్వాసపాత్రముగ నుండును. కాని వాడు దానినిగురించి యెంత మాత్రమును యోచనచేసి విచక్షణచేయక, ఆ మతాచారములను గ్రుడ్డిగా అవలంబించును. అంతటితో బోక, తదితరాచారములను నిందించును. ఇది తన మతమునుగురించిన మూఢాభిప్రాయమువల్ల గలిగినది.

మూలము :—" వేలకొలఁది జను లొక విషయమును గురించి యేకాభిప్రాయము గలిగియున్నను వారా విషయముఁ దెలియనివారుగ నుండినచో వారి యభి

ప్రాయము నిష్ప్రయోజన మనుదానిని మఱు
వకుము."

ఈ కాలమున నిన్ని గ్రంథములును, పత్రికలును, ఉం డుట యొకవిధముగ ననర్థమే. సామాన్యజనులు వానిని జదివి యందలి యభిప్రాయముల ననుసరించుటయే జ్ఞానవికాస మనుకొనెదరు. కాని, యట్లు చదువుట మాత్రమువల్ల ప్రయోజనములేదు. అది జ్ఞానవికాసము కాదు. చదివినది కొంచెము చదివి, దానిని బాగుగా గ్రహించి, గ్రహించినదానిని మననము చేయవలెను. అప్పుడది నీకంగీకారమగునో కాదో నిర్ణయమగును, అంగీకారమైనయెడల అది నీ యభిప్రాయమగును లేని యెడల మూఢాభిప్రాయమగును.

మూలము :—" మోక్షమార్గమున నడువఁగోరువాఁడు
తనంతట తాను తెలిసికొన నేర్చికొనవలయును.
మూఢాభిప్రాయము లనునవి లోకమునందలి చెడు
గులలో మొదటి తరగతిలోఁజేరినవి, కనుక, నా
బంధమును బూర్ణముగఁ దొలఁగించుకొనుము."

ఈ బంధము మిక్కిలి గొప్పదియును సూక్ష్మమైనది యునగుటచేత దీనిని ప్రథమదీక్షపొందిన తరువాత వదులుకొనవలసిన బంధములలో మూడవదిగా జెప్పి

నారు. దీనిని పాలీభాషలో 'శీలబ్బతపరామాస' యందురు, అనగా, నెటువంటి కర్మలయందైనను, సంస్కారముల యందైనను నమ్మకముంచుట.

మోక్షమార్గమున నడువగోరువాడు తనంతట తాను తెలిసికొన నేర్చికొనవలయునని యిచ్చట చెప్పబడియున్నది. ప్రతివిషయమును, సంశయించి, ప్రశ్నించి, పరీక్షించి, దాని సత్యాసత్యములను పరిశోధించి, నీవు దాని నంగీకరించవలెనో నిరాకరించవలెనో నీవు స్వయముగ నిర్ణయించుకొనవలయును. ఇదియే యిప్పుడు శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు నొక్కి నొక్కి చెప్పుచున్నారు. మన ప్రస్తుతస్థితిలో మన కన్నిసంగతులును పూర్తిగ తెలియవుగదా! అట్టిస్థితిలో మన మిట్లు ప్రతివిషయమును పరిశోధించగలమా? పరిశోధించుటకష్టమే. మనకంటె విశేషజ్ఞానులైనవారున్నారు. వారు తమ అపార జ్ఞానసహాయమున మనకు అనేక విషయములు బోధించి చెప్పగలరు. కాని, మన మట్టి పరమపురుషుల వాక్యములయందలి సత్యత ననుమానించకుండ, దానిని ప్రతిఘటించకుండ, వానిని పరిశోధించవచ్చును. తొందర సమయములలో వారి యాదేశములను అవలంబించినను, తరువాత, వానియందలి తత్త్వమును విచారించి తెలిసికొనవలయును. "తస్మాత్ శాస్త్రం ప్రమా

ణం తే కార్యాకార్యవ్యవస్థితౌ” (గీతా॥ ౧౬—౨౪)
శాస్త్రము చేయవలసినదేదో చేయరానిదేదో ఏర్ప
ర్చుటలో నీకు ప్రమాణమైయున్నది, అని చెప్పబడినది.
ముందుగ నీవు ఆ విచక్షణచేయుటకు ప్రయత్నించి,నీకది
సాధ్యముకానప్పుడు శాస్త్రానుసారము చేయుము. అప్పు
డైనను, ఆ శాస్త్రమెందుకట్లు విధించినదో తెలిసికొనని
యెడల, నీవా ప్రమాణమును గ్రుడ్డిగా నంగీకరించు
చున్నావు గనుక, అదియు మూఢాభిప్రాయమగును.
(దీనినిగుఱించి ముందు 146 వ పుటలోను నాలుగవ
భాగము ఆరవ యధ్యాయములోను చూడుడు).

మూలము :—“మఱియు నితరుల విషయమున నీ
యభిప్రాయములు సత్యములుగ నుండవలయును.”

పై 102, 103 వ పుటలలో నీ విషయము కొంచెము
వ్రాయబడినది. మన మితరులనుగురించి యేదో యొక
విధముగ నూహించి, ఆ యూహానుబట్టి వారిట్టివారని అట్టి
వారని విమర్శింతుము. అది వితర్కము. మనకు మిక్కిలి
ఆప్తులైనవానిని గుఱించియే మనకు బాగుగా దెలియదు.
ఇక ముఖపరిచితులను గురించిగాని, ఇతరులనుగురించి
గాని మనకు తెలియున దంతకంటెను స్వల్పముగదా!
అట్లయ్యును, వారినిగుఱించి నిరంతరము నిరర్థక ప్రసంగ

ములను చేయుచుందుము. అది యంతయు నసత్యమే. ఇక కొన్ని వాక్యముల తరువాత పరమగురువు ‘ పరులపై దురుద్దేశముల నెన్నఁడుగాని యారోపింపకు ’ మని చెప్పినారు. దానినిగుఱించి విచారించినపు డీవిషయ మును తిరిగి విచారింతము.

మూలము :—“ వార లెల్లప్పుడును నీ విషయమే తలఁచుచున్నవారని యెంచకుము.”

మన మెల్లప్పుడును మనలనుగుఱించియే యాలోచించుకొనుచుందుము, గనుక, నితరులుఁగూడ మనలను గుఱించియే యాలోచించుచున్నారనుకొందుము. కాని మనమెల్లప్పుడును మనలనుగుఱించియే యాలోచించు కొనుచున్నట్లు ఇతరులందరు నెవరిమట్టుకు వారు తమను గుఱించియే యెల్లప్పుడు నాలోచించుకొనుచుందురు, గాని, మనలనుగుఱించి యాలోచించుటకు వారికి తీరిక యుండదు. ఎవనిమండలమునకు వాడే కేంద్రమై, ఆ కేంద్రముచుట్టును వాని తలంపులును భావములును తిరుగుచుండును, కనుక, ప్రతివిషయమును తనకే వర్తించుననుకొనును, కాని, యట్లు వర్తింపవు.

మూలము :—“ ఎవరుగాని యొక కార్యముఁ జేసినచో దానివలన నీకుఁ గీడుగలుగునని నీవు తలఁచినను,

వారాడుమాటలు నీ కన్వయించునని నీవు తలఁచి నను, వెంటనే యాతఁడు నిన్ను చెఱుపఁదలఁచెనని యెంచకుము. శతశః, ఆతఁడు నిన్నుఁదలఁచకయే యుండవచ్చును. వారివారి కష్టములు వారల కుండనే యున్నవి. వారు తమ విషయములనే ముఖ్యముగఁ జింతించుచుందురు. ఎవ్వఁడుగాని కోపముతో మాట్లాడినచో వాఁడు నిన్ను ద్వేషించెననిగాని నిన్ను నొప్పించ నిచ్ఛయించెననిగాని యెంచకుము. బహుశః, యెవ్వఁడో, యెద్దియో, ఆతనికి కోపము తెప్పించి యుండి, ఆసమయమున నీ వెదుటఁబడుటచే నా కోపము నీ మీఁదఁ ద్రిప్పియుండవచ్చును. అతఁడు తెలివిలేకయే ప్రవర్తించుచున్నవాఁడు. కోపమంతయు తెలివిలేనితనమేకదా. అయినను, వాని విషయమై నీ వసత్యముగఁ[1] దలఁపఁగూడదు."

ఇది శుద్ధవివేకము, కాని, దీని ననుష్ఠించువా రెంతయరుదుగనున్నారు! ఒక డేదోయొక మాటననిన నింకొక డది తననుగుఱించియే యన్నాడనుకొని, వానితో జగడమాడి, తనగుట్టు తానే బయటపెట్టుకొనును. ఇది సామాన్యముగ లోకమున జరుగుచున్నది. 'పుచ్ఛ

[1] "అనఁగా నిన్నుఁజెఱుపఁదలఁచెనని."

కాయలదొంగ యనిన బుజముతడుముకొనె' నన్నసా మెత యిందువల్లనే పుట్టినది. అది భ్రమ, ఆభ్రమ లేని యెడల నీలోకమున కలహములిన్ని లేకయుండును. ఇక్కాలమున నీ ప్రపంచమున సంకుల మెక్కువగా నున్నది. కనుక, కొంతవరకు సంఘర్షణ ముండకతప్పదు. దాని నంతగా పరిగణింపరాదు. ఏపట్టణవీధులలో జూచి నను జనసమ్మర్ద మెక్కువగనుండును. అంతసమ్మర్దము లోను జను లొకరినొకరు త్రోసుకొనుచు పోవుదురు. కాని యాత్రోపులాట నెవ్వరును సరుకుచేయక, ఎవరి పనిమీద వారు పోవుదురు. ఆత్రోపులాట కెవ్వరును కోపగించుకొనరు, కోపగించుకొనుట హాస్యాస్పదము. అట్లే జనసమూహములలో తలంపులు రాగములు తాకులాడుట సహజము. వాని తాకులాటలనుగురించి యు నదేవిధమున మన ముదాసీనముతో వర్తించ వలెను. జనసమూహములో నొకని తలంపులుగాని భావ ములుగాని మాటలుగాని నీ మనస్సుకు నొప్పిగలిగించిన యెడల, వా డది బుద్ధిపూర్వకముగ, కావలెనని, చేయ లేదనియును, వాడు తన పనిలో మునిగియుండి నిన్ను గురించి తలచనే లేదనియును నెరుగవలెను.

అయితే, యితరులు తమ పనులలో మునిగియున్నం దున వారియెడల మనకు ద్వేషము లేకపోయినను, మన

పనులలో మనము మునిగియుండి, వారియెడల మనము సామాన్య మర్యాదలనుగూడ జూపకుండ నుండరాదు. బ్రహ్మజ్ఞానిని ఇతరులనుండి గుర్తించుటకు మర్యాద, శాంతము, నిశ్చలమగు ప్రసన్నత, ముఖ్య చిహ్నములు.

ఈ లోకమున జనులను పీడించుచున్న బాధలెన్నియో యున్నవి. బుద్ధిమంతు డెవ్వడును తన కష్టముల నితరులకు తెలియునట్లుచాటడు. అంతమాత్రమున నతడు బాధపడలేదనరాదు. అట్లు బాధపడువాడు సహజముగ నేస్వల్పకారణముచేనైనను కోపము జెందును. వాని బాధలేవో తెలియకున్నను, వానికోపమున కేదో యొక కష్టమే కారణమని తెలిసి మనము శాంతము వహించవలయును.

మూలము :—“ నిన్ను పరమగురువు శిష్యుడుగ నంగీకరించినపుడు నీ మనోభావముల నతని భావముల తో నెల్లపుడు సరిపోల్చిచూచి నీ భావముల సత్యతను పరిశీలించవచ్చును. గురుశిష్యు లొక్కటియే కావున శిష్యుడు తన భావములను పరమగురుని భావములతో జేర్చిచూచి రెండును అన్వయించునో లేదో వెంటనే తెలుసుకొనవచ్చును. అన్వయించని యెడల తన మనోభావములే తప్పు గావున వానిని వెంటనే మార్చుకొనును. పరమగురువున

కంతయుం దెలియుటంబట్టి వారి మనోవృత్తులు శ్రేష్ఠములుగదా!"

గానములో నపస్వరములు కలుగుట మన కనుభవము. గాయకుడు అపస్వరము కలుగకుండ నెల్లప్పుడును జాగ్రత్తతో జూచుకొనుచుండును. ఆవిధముగనే స్వీకృత శిష్యుడుకూడ తన మనస్సున నపస్వరము కలుగకుండ జాగ్రత్తగ పరిశీలించి చూచుకొనును. పరమగురువు సర్వజ్ఞుడగుటచేత, నే విషయమునన్నైనను, ఆయన భావములు సరియైనవియైయుండును, గనుక, శిష్యు డాయన మనోభావములను ప్రమాణములుగ గైకొని వాని ననుసరించి తన మనోభావములను సవరించుకొనును. శిష్యుడు తన మనోభావములను పరీక్షించుకొనుటకు పరమగురువు దృష్టిని తనవైపు మరల్చ నక్కరలేదు. తన భావమును పరమగురుని భావముచెంత జేర్చిచూచి, తన భావము దానితో ననుకూలించనియెడల వెంటనే తన భావమును దానితో సరిచేసికొనును. ఇది స్వీకృత శిష్యునకే సాధ్యమగును. ఇంకను శిష్యునిగ స్వీకరింపబడని వారీ విషయమున విశేషశ్రమపడవలసియుండును. వారు తమ మనోభావములను పరీక్షించుకొనుట కొకమార్గమును తరువాత వాక్యము సూచించుచున్నది.

శిష్యుని మనస్సు పరమగురుని మనస్సుతో నైక్య భావమునొందును, కనుక శిష్యుని మనస్సునందేదైన దోషమున్నయెడల, అది యెుకప్పుడెప్పుడైన తమ మనస్సును కలతపరచకుండ పరమగురు వొక యాచ్ఛాదనము వేసికొనవలసివచ్చును. అందుచేత నట్టి దోషమున్నవానిని శిష్యునిగ నంగీకరించరు. కనుకనే, పరమగురువులు ఎవనినైన శిష్యునిగ స్వీకరింపకముందు వానిని కొంతకాలము పరిశోధించిచూచెదరు. ఇదియే పరీక్ష్యమాణావస్థయని చెప్పబడినది. ఆ కాలములో శిష్యుని సజీవప్రతిబింబ మొకటి పరమగురుని యెదుట నెల్లప్పుడునుండును. శిష్యునకును ఆ ప్రతిబింబమునకును పరస్పరసంబంధ ముండును, కనుక, శిష్య డెక్కడ నున్నను, వాని తలంపులును రాగములును ఆ ప్రతిబింబములో స్పష్టముగా గనపడుచుండును. ఎంతస్వల్ప మానసికసంచలనమైనను, భావసంచలనమైనను, పరమగురువుయెుక్క దృష్టిలో బడకతప్పదు. పరమగురువు తాను చేయుపని కాటంకము కలిగించుతలంపులు గాని భావములుగాని శిష్యునియందు కలుగుట కవకాశము బహుతక్కువగానుండునని నిశ్చయముచేసికొన్న తరువాతనే వానిని శిష్యునిగ నంగీకరించి, తనలో నైక్యముచేసికొనును. కాని, యింకను కొంతకాల

మువరకు అగత్యమైనప్పుడు శిష్యుని ప్రజ్ఞకును తన ప్రజ్ఞకును ఒక యవరోధము కల్పించుకొనుటకు అధికారమును తన చేతిలో నుంచుకొనును. శిష్యుడట్టి యవరోధమున కగత్యములేకుండ జేయుటకు ప్రయత్నించును. క్రమముగ, నట్టి యవరోధము గలిగించవలసిన నగత్యము కూడ నుండదని పరమగురువునకు నిశ్చయమైనపుడు శిష్యుడు గురుపుత్రునిగ గైకొనబడి, యంతటినుండియు నా యవరోధము కల్పించు నధికారమును గురువు వదులుకొనును.

ఇదివర కొకచోట పరమగురుని యభిప్రాయమైనను, అంతమాత్రముచేత, విమర్శించి పరిశీలించకుండ నమ్మవద్దని చెప్పియున్నాము. అయితే, శిష్యుడు సర్వజ్ఞుడగు పరమగురువుయొక్క యభిప్రాయము తన యభిప్రాయమునకు భిన్నమై తోచినపుడు, ఆయన యభిప్రాయము సరియైనదా తన యభిప్రాయము సరియైనదా యని తర్కముచేయుట కారంభించడు. ఆయన యభిప్రాయము అపారజ్ఞానముపై నాధారపడియుండుటచేత, అదియే సరియైయుండవలయునని తెలిసినవాడై, దానిని ప్రతిఘటించడు. తరువాత, ఆయన యభిప్రాయమునకాధారమేమి? తన యభిప్రాయమునందున్న లోపములేమి? యని విమర్శించి తెలుసుకొనును. అది

తప్పదు. కాని, యీ లోపున 'నా యభిప్రాయమే సరికాకూడదా,' యను నహంభావముతో ఆయన యభిప్రాయములను ప్రతిఘటించడు.

సాధారణముగ జనులు తమకు తెలియనివిషయములలోగూడ నితరుల నతిసాహసముగ విమర్శింతురు. అది తత్త్వమార్గమునకు కడుదూరము. పరమగురువు కొఱకు పనిచేయు ప్రతివాడును తన శక్తికొలదియు పని చేయును. ఆపనియొక్క మంచిచెడ్డలనుగుఱించి యతడు తన పరమగురువునకు సమాధానము చెప్పుటకు బాధ్యుడైయుండును. అట్టివాడు చేయుపనిలో నొకప్పుడొక లోపమున్నట్లు మనకగపడినయెడల "అది యిట్లొనర్చిన నింతకంటె బాగుండునేమో" యని మృదువుగ సూచించవచ్చును. కాని విమర్శించి, ఖండించరాదు.

మన మొకని కొకపనిని చేయుమని యిచ్చినప్పుడు, అతడు దానిని తన శక్తిసామర్థ్యముల ననుసరించి చేయగలడుగాని మన శక్తిసామర్థ్యముల ననుసరించి చేయజాలడు, గనుక, వానికి తన సామర్థ్యము జూపుటకును, వాని మనస్సులోని యాలోచనల ననుసరించుటకును తగిన యవకాశమియ్యవలెను. అతడు చేయుపని మనకు తృప్తికరముగ లేకున్న మరియొకనిని నియమించుట మం

చిదిగాని, యీలోపున మాటిమాటికిని వానిపనికి మన మడ్డురాకూడదు.

ఎప్పుడు, నితరులయందేదైన దోషముకనిపించునా, యని తప్పులకొరకే వెతకుచుండుట మిక్కిలి తప్పు. రంధ్రాన్వేషణము గొప్ప దురలవాటు. అది వెంటనే తొలిగించుకోవలసినది.

మూలము :—"పరమగురునిచే నంగీకరింపఁబడని శిష్యుఁ డింతబాగుగ చేయఁజాలఁడుగాని వాఁడు "పరమ గురువు దీని నేమనుకొనును? ఇట్టి సమయమున నేమిచెప్పును? ఏమి చేయును" అని పలుమాఱు నిలిచి యోచించుట వానికి మిగుల సహాయకర ముగనుండును. ఏలయన పరమగురువు చేయునని నీకుఁదోఁచని పనిని నీవెప్పుడును చేయరాదు. వా రాడుదురని నీకుఁదోఁచని మాట నీవెప్పుడు నాడ రాదు. వారు దలఁతురని నీకుతోఁచనిదాని నీ వెప్పుడును తలఁపరాదు.

నీ వాక్కును సత్యముగనుండవలయును. ఉన్నది యున్నట్లు పలుకవలయును. అతిశయోక్తులుండ రాదు."

పరమగురువుచే శిష్యునిగ నంగీకృతుడు గాకముందు చేయగల దీవాక్యములలో మొదటిభాగములో చెప్ప

బడినది. పరమగురు వేమిచేయునో, ఏమితలచునో, ఏమిచెప్పనో యోచించుట కష్టమేమైనను, సాధకుడు తన చర్యలను విమర్శించుకొనుటకై యీ మార్గము ననుసరింపక తప్పదు. అట్లు యోచించుటలో సాధకుడు పొరబడవచ్చును, కాని, మొత్తముమీద, వాని జీవితము నిర్దుష్టమగును. ఎప్పటికప్పు డట్లు నిలిచి యోచించు చుండుటవల్ల, ఎన్నడును ఏమాటయు నాడుటకు వీలు లేకుండబోవునని యాక్షేపించవచ్చును. అట్టివారు మాటలాడకపోయినను లోటు లేదు. ఏలయన, వారాడు మాటలలో నెక్కువభాగము ప్రయోజనకరములు కావు. ఒకడు మాట్లాడబోవునపు డామాటలు పరమ గురు వాడునాయని యోచించినయెడల, నతడాడు మాటలు బహుకొంచెముగనున్నను ప్రయోజనకరము లుగనుండును; మొదటలో విచక్షణచేయుట కొంత యాలస్యమగునుగాని క్రమముగ నభ్యాసముమీద త్వరలోనే సరియైనమాటలు తోచును.

మన మేపనినైన చేయుటకుగాని ఏమాటనైన నాడు టకుగాని ముందు ఆలోచించుట అభ్యాసముచేసికొనుట వల్ల, మన కింకొక ప్రయోజనమున్నది. మన చర్యల కును మాటలకును సంబంధములేకుండ ఆలోచించ గలుగు శక్తియలవడును. అట్లాలోచించగలుగుటవల్ల

మిక్కిలి యద్భుతములగు ఫలితములు కలుగును. డా॥ బెసెంటుగా రుపన్యసించుచున్నప్పుడు ఒక వాక్యమును చెప్పుచున్నప్పుడే ముందు చెప్పవలసినభావ మొకటి రెండు విధములగు వాక్యములుగా తన మనోదృష్టికి గోచరమగుననియు, వానిలో మిక్కిలి యుక్తమైన వాక్యమును బుద్ధిపూర్వకముగ నెంచుకొందుననియు ఆమెయే చెప్పిరి. ఆమె యుపన్యాసధోరణి నెఱింగిన వా రీసంగతిని విన్నయెడల ఆమె మాటలాడుచు, ఆ మాటలకు సంబంధములేకుండ నెంత వేగముగ నాలోచించగలరో, అందువల్ల నెంత ప్రయోజనమున్నదో తెలిసికొందురు.

మూలము :—“ పరులపై దురుద్దేశముల నెన్నడుగాని యారోపింపకుము. వారి మనస్సున నున్నది వారి పరమగురువునకే తెలియును. వారి నడవడికి గారణము నీ మనస్సున స్ఫురింపకయే యుండవచ్చును.”

మనకత్యంత సన్నిహితులును ప్రియులు నైనవారి మనస్సే దుర్జ్ఞేయముగ నుండును. ఒకడొక పనిని చేసిన తరువాత కొంతకాలమునకు వాడాపని నట్లుచేయుటకు కారణములు మనకు తెలిసినయెడల ఆశ్చర్యమును కలిగించును. ఆకారణ మదివరకు మనకు స్ఫురించియే

యుండదు. ఇది యిట్లుండ సాంప్రదాయములలోను, ఆచారములలోను, భావములలోను విశేషభేదములున్న రెండుజాతులకు చెందినవా రొకరిచర్యల కొక రుద్దేశ ముల నారోపించుట యెంతప్రమాదకరమో చూడుడు. ఒక్క విషయమునే వారు భిన్నదృష్టులతో చూతురు గదా! అట్టిచో, వారిలో నొకరియుద్దేశము నొకరెట్లు తెలియగలరు? ఆరోపించెడియుద్దేశము మంచిదైన యెడల ప్రమాద ముండకపోవచ్చును గాని చెడ్డదైన యెడల గొప్పప్రమాదము కలుగును. నీ వొకడు చేసిన పని నాత డెందుకుచేసెనో తెలియక, కష్టపడి యాలో చించి, తుద కొక అయోగ్యకారణము నూహించి, ఆరోపించి, దానికై వానిని నిందించ నారంభింతువు. దాని వల్ల మీయిరువురకు ద్వేషము బయలుదేరును. అంతే గాక, నీవారోపించిన దోషము వానియందు లేశమైన నున్నయెడల, నీవు చేయు విమర్శనమువల్ల నది బల పడును, ఇదివరకాదోషము వానియందు లేనియెడల క్రొత్తగాపుట్టును. నీవు మానసికముగ చేయువ్యాపార మువల్ల నీవారోపించిన దోషమున కనుకూలములగు సంకల్పరూపములు, స్పందములు బైలుదేరి అవి నీకును వానికినికూడ ఆదోషబుద్ధి కలిగించుటగాని, బలపరచుట గాని, చేయును. కనుక, నొకరు చేసినపనికిగల యుద్దేశ

ము నీకు తెలియనప్పుడు నీ వూహించి తెలిసికొనప్రయత్నించవద్దు.

మూలము :—“ ఎవరిపైనగాని యొకదూఱు వింటివేని దానిని మరల నాడకుము. అది సత్యము కాకయుండిన నుండవచ్చును. సత్యముగ నుండినను దానిని మరల నాడుటకంటె నూరకుండుట దయచూపినట్లగును.”

ఈ గ్రంథములో మనలో తరుచుగ గనబడునట్టియు, మనము బహుస్వల్పములని యుపేక్షించునట్టియు, లోపములనన్నిటినిచూపి, అవి మోక్షమార్గమున కెంత యాటంకముగనున్నవో చూపుచున్నారు. అవి యంతస్వల్పములగుటచేతను, సామాన్యములగుటచేతను, వానిని మనము లక్ష్యముచేయము. మరియు నవి లోపములని చెప్పిన వారిపై, బహుశః, కోపింతుము. మోక్షమార్గమును జేరగోరువాడు తన స్వభావమును మార్చుకొని, యీ లోకమును వీడి పరమగురువులలోకమున ప్రవేశించవలయును, గనుక, ప్రతిలోపమును గొప్ప లోపమనియే యెంచి దానిని తొలిగించుకొనుటకు ప్రయత్నించవలెను.

ఈ వాక్యములోచూపిన దోషము సర్వసాధారణముగ ప్రపంచమునందంతటను వ్యాపించియున్న దోష

ములలో నొక గొప్పదోషము. ఇది యెంతత్వరలో నిర్మూలమైన నంత మేలుచేకూరును.

ఎవరినిగురించియు నితరులేమి నీతో చెప్పినను దానిని నీవు వెంటనే నమ్మరాదు. అట్లు నమ్ముట గొప్పపొరపాటు. ఏలయన, నీవు విన్నకథ యసత్యమైనయెడల, దానిని నీవు నమ్ముటవల్ల, నీవతనియెడల నసత్యమారోపించినవాడ వగుదువు. దానికితోడు నీవా యసత్యమును ఇతరులకు చాటుచు బోయినయెడల నింక నెంత హానియగునో చూడుము. నీవు విన్నకథ నిజమేమైనను, నీవు దాని నితరులతో జెప్పి వానినిగురించి పరులకు దురభిప్రాయము నేల గలిగించవలెను? ఇతరుల స్వభావములను చక్కపరచుట నీ పని యనుకొన్నను, దాని కిది మార్గముకాదు. దానివల్ల నీవొకని స్వభావము చక్కబరుచుటకుబదులు వానికి హానిచేతువు. అందుచేత, నీవొకనిగురించి విన్నకథ నిజమైనదైనను దానినిగురించి మాటలాడక యూరకుండుటవల్ల వానియెడల దయ చూపినవాడవగుదువు.

అయితే, యొకడొక దొంగయనిగాని మోసగాడని గాని మనమెఱిగియుండి, వా డమాయకులను మోసగించుచున్నాడని తెలిసినప్పుడు వారికాసంగతి తెలియ జేయుట మనవిధి. ఆవిధినైనను, మనము మిక్కిలి నేర్పు

తోను, ఉపాయముతోను, ద్వేషభావములేకుండ, నెర వేర్చవలెను.

మూలము :—"యదార్థముకానిమాట నోటవచ్చునేమోయని భయము గలిగి చక్కఁగా నాలోచించి మాటలాడుము."

ఇదివర కెందరో మహానుభావు లీయుపదేశమును చేసిరి, కాని, లోకమున నింకను అయదార్థములనాడు నలవాటు పోలేదు. స్వల్పములగు నయదార్థముల నాడుట సత్సభ్యతగా పరిగణింపబడుటగూడ గలదు. తరుచుగ నతిశయోక్తుల నాడుదురు. పదిగజములదూరము నున్నవస్తు వెంతో దూరముగనున్నట్లు, నిన్నటికంటె నేడు కొంచెము వేడి హెచ్చుగానున్న యెడల మండబెట్టుచున్నదనియు, ఇట్లే అనాలోచితముగ నన్నృతముల నాడుదురు. "జనులాడు నిరర్థకమయిన ప్రతిమాటకును వారు విమర్శదినమున (Day of Judgment) సమాధానము చెప్పవలసియుండు" నని క్రైస్తుచెప్పిన వాక్యములో నెంతయో యర్థమున్నది.

మూలము :—"చేయుపనులయందును సత్యముగ నుండుము. నీలో నున్నదానికంటె వేఱుగనున్నట్లు నటింపకుము. అట్టి నటనలన్నియు నిర్మలమగు సత్య

జ్యోతికిఁ బ్రతిబంధకములు. స్వచ్ఛమగు నద్దములో నుండి సూర్యకాంతి ప్రకాశించునటుల నీ మూలముగ సత్యజ్యోతి ప్రకాశించవలెనుగదా!"

ఇది యెంతముఖ్యమైన విషయమో చూడుడు. నీయందితరులకు మంచి యభిప్రాయము కలుగవలెనని వారియెదుట మంచితనము నటించకుండుట, ఇతరులయెదుట చేయుటకు సిగ్గుపడు పనులు నీ వొంటరిగానున్నప్పుడు చేయకుండుట, ఎల్లప్పుడును ఋజుత్వము దప్పకుండుట, ఇది పనుల జేయుటలో సత్యముగనుండుట.[1] నీ స్వభావము నితరులయెదుట దాచిపెట్టి, వారి మెప్పుబడయుటకు మంచివానివలె నటించుట మోసము.

నీవు చేయదలచినపని మంచిదైనయెడల, యెవరేమనుకొన్నను లక్ష్యముచేయక బహిరంగముగ జేయుటకు ధైర్యమువహించి చేయవలెను. నీవు చెడ్డపని చేయదలచినయెడల దానినెక్కడను ఎప్పుడును చేయనే చేయకుము. మనస్సులో నొక యుద్దేశమును పెట్టుకొని, యితరులేమనుకొందురోయని, నీ యంతరాత్మకు భిన్నముగ బ్రవర్తించుట యనృతప్రవర్తనము.

[1] "దేవద్విజగురుప్రాజ్ఞపూజనమ్, శౌచమ్, ఆర్జవమ్, బ్రహ్మచర్యం, అహింసా, చ శారీరం తప ఉచ్యతే." (గీతా॥ ౧౭—౧౪)

ఒక గొప్పశాస్త్రపండితుడు నలుగురిలోనికి వచ్చి నప్పుడు ముఖము బిగించుకొని, గంభీరముగ చూచుచు, మాట్లాడినపుడు ప్రక్కనున్నవారి కుపకారము చేయు వానివలె మాట్లాడును. కాని నిజమైనజ్ఞాని చేష్టలు మిక్కిలి స్వాభావికముగను నిర్వ్యాజముగను ఉండును. జనులు సాధారణముగ గొప్పవారు గంభీరముగను ఇతరుల కెడముగను నుండవలె ననుకొందురు. కాని జ్ఞానులకు అట్టి యభిప్రాయములతో పనిలేదు. ఏకాంత మున నొక విధముగను, ఇతరులయెదుట నింకొకవిధ ముగను ప్రవర్తించుటగాని, యితరులకంటె తాను గొప్ప వాడనని యనుకొనుటగాని, ఇతరులు తనను గొప్ప వాడని మర్యాదచేయవలెనని యాశించుటగాని జ్ఞానికి లక్షణములుకావు.

అయితే, జను లేమనుకొన్న నేమని దుష్ప్రవర్తనమున బడకూడదు. ఋజుప్రవర్తనమున నుండవలెను. మఱి యును కొందరు 'నేను స్వాభావికముగనున్నా' నని చెప్పి యితరులయెదుట మిక్కిలి నీచముగను, మోటు గను, అసభ్యముగను ప్రవర్తింతురు. అది స్వాభావిక ప్రవర్తనకాదు. అది వారి స్వభావమునందలి పరమ నికృష్టభాగమును వెల్లడించుకొనుట. అట్టి స్వభావము మనయం దుండనేకూడదు. అది నీకు, అనగా, జీవాత్మకు

స్వాభావికముకాదు. నీవు స్వాభావికముగ ప్రవర్తించుట యనగా నీ యాత్మకు స్వాభావికములయిన దివ్య లక్షణములను వెల్లడిచేయుటగాని నీచప్రకృతిని వెల్లడి చేయుటకాదు.

---

## అయిదవ అధ్యాయము

## స్వార్థరాహిత్యము—పరమార్థజీవనము

మూలము :—"స్వప్రయోజనమునకును పరోపకారమునకును గల భేదము వివేచనము చేయవలయును. స్వప్రయోజనము పెక్కురూపములఁ దాల్చును. ఒక రూపమున దానిని దుదముట్ట నాశనము చేసితినని నీవనుకొనుచుండఁగా నింకొక రూపమున నెప్పటివలెనే యది దృఢముగఁ బుట్టును. అయినను, క్రమక్రమమున పరోపకారచింత నీ మనంబుననిండి నీ స్వవిషయమునుగురించి చింతించుటకు నీకు సందుగాని సమయముగాని లేకయే పోవును."

స్వార్థము వేయితలలసర్పము. ఒక్క తలను పడగొట్టుటకు, అనగా, ఒక్కవిధమగు స్వార్థమును నిర్మూలముచేయుటకు ప్రయత్నించినయెడల, దానిని నిర్మూలించవచ్చును, కాని చాలకాలము మిక్కిలి శ్రద్ధచేసి తొలిగించుకొన్నను, దాని స్థానమున నింకొకరూపమున నది తిరిగి బయలుదేరును, గనుక, ఆవిధముగ

నీవు స్వార్థము నెన్నటికిని పూర్తిగ తొలిగించుకొనజాలవు. కనుక, అందు కిచట పరమగురువు చెప్పిన సాధన మొక్కటే యుపాయము. క్రమముగ పరోపకారచింతతో నీ మనస్సును నింపుకొనుటయే ఆ సాధనము.

భక్తివల్ల నొక గొప్పప్రయోజనము స్వార్థము నశించుట. నీ మనస్సులో నీ యిష్టదైవము, నీ ధ్యేయమూర్తి, పూర్తిగా నిండియున్న యెడల, ప్రత్యేకముగ ప్రయత్న మక్కరలేకయే స్వార్థరహితుడవగుదువు. నీ మనస్సు నితరమార్గములలోనికి మరల్చి, నీ శక్తిని మంచివెల్లువలలో బ్రవహింపజేసిన యెడల నీ దుర్గుణములు నిరాహారతచే గృశించిపోవును. అట్లుగాక, నీ లోపములను గుఱించియే దలంచుచున్న యెడల, వాని విషయమై నీ వెంతపరితపించుచున్నను, వానిని తొలిగించుకోవలెనని యెంత ప్రయత్నించుచున్నను, అవి బలపడునుగాని నశించవు.

కనుక, స్వార్థము పోగొట్టుకొనుటకు ఇతరుల కుపకారము చేయవలయునన్న చింతయొక్కటి నీ మనస్సులోనిండియుండునట్లు చేయుము. అట్లు చేసిన యెడల, నిన్ను గుఱించిన యాలోచన లుండుటకు నీమనస్సులో చోటు ఉండదు, నీకు సమయము చిక్కదు.

నీకు కష్టములు సంభవించినపుడు వానికై దుఃఖించుటయు స్వార్థమే. కష్టము వచ్చినపుడు "అయ్యో! ఎంతకష్టము! ఇదంతయు నాయెడల నింత నిర్దయగ పరిణమించినదే! వానికి నామీాద నించుకంతయైన నభిమానములేదు! నన్ను వాడు సంరక్షణచేయుటలేదే! ఇదంతయు నాకే రావలెనా?" ఇట్లు ఎడతెగక విలపించుచు కూర్చొనుట కేవలము స్వార్థము.[1] అట్లు విలపించుటవల్ల నీకష్టమూ తొలగదు. నీస్వార్థచింతయూ బలపడును. నీ స్వార్థమును కష్టమునుకూడ బోగొట్టుటకు, అట్లు విలపించుచు కూర్చొనక, వెంటనే లేచి మరియొకనికొరకొకపనిబూని చేయనారంభించుట యొక్కటే యుపాయము. నీ మనస్సులో నొక్కసారి రెండుభావములు—అందులో రెండు విరుద్ధభావములు—ఉండుటకు అవకాశములేదు. కనుక, నీ స్వాంతమునకై యే ప్రయోజనమును కోరక, నీ చుట్టునున్న వారిని ప్రేమించుచు ఆప్రేమకు ప్రతిఫలముకోరక, యున్నయెడల, నీకు సుఖము చేకూరును. సామాన్యముగ

[1] క్రైస్తవులలో నొక సాంప్రదాయమువారు "ప్రభూ! దౌర్భాగ్యులము, పాపులము అగు మాయందు దయయుంచుము" అని ప్రార్థనలలో చెప్పెదరు. మనము పాపులముకావచ్చును, కాని, అంతమాత్రమున దౌర్భాగ్యులముకూడనై యితరులనుకూడ దౌర్భాగ్యులనొనర్చి మన పాపము మరింత దృఢపరచుకొననక్కరలేదు.

ప్రేమయనబడునది మెఱుగుపెట్టిన స్వార్థము. ఒకని 'ప్రేమించుట'లో నీకు బాధకలిగినయెడల నీ ప్రేమ స్వార్థపూరితమైనదని యర్థము.[1]

శ్రీ గౌతమబుద్ధులవా రుపదేశించిన ఆర్యాష్టాంగ మార్గము (The Noble Eightfold Path) లో నేడవ యంగము 'సమ్యక్ స్మృతి'యని చెప్పబడినది. ఆయన దీనినిగుఱించి వివరించి చెప్పుచు "మీరు జ్ఞాపకముంచుకొనవలసిన సంగతులవిషయమై బహుజాగ్రత్తగ నుండవలెను. . . . . వీధివెంటబోవుచు కనిపించిన చెత్తనంతను ప్రోగుచేసికొనుచు బోయినట్లు, నిరర్థకములును, అయోగ్యములునగు సంగతులను మనస్సులోనికి ప్రోగుచేసికొనుచున్నారు. యుక్తములగు సంగతులనుమాత్రమే జ్ఞాపకముంచుకొని, తక్కినవాని నన్నిటిని మరచిపోవలె"నని చెప్పి, తరువాత, మనము మరచిపోవలసిన సంగతులేవో జ్ఞాపకముంచుకోవలసినవేవో వివరించిచెప్పిరి. మనలనుగురించి యితరులాడిన దయావిహీనములైన మాటలు, ఇతరులు మనకు చేసినారనుకొను అమర్యాదలు అపకారములు ఇవన్నియు

[1] స్వార్థపూరితమైన స్త్రీపురుషులయనురాగము మోహమనబడును. మోహము అన్నమాట భ్రమ, మాయ, మోసము అనునర్థములు సూచించుట విశేషము.

పూర్తిగా మరచిపోవలసిన విషయములలోజేర్చి చెప్పిరి. మనలనుగురించి యితరులెవరైన దయతో నెన్నడైన పలికిన యొక్కమాటను, చేసిన యొక్కయుపకారమును, మనకు మనతోడివారియందు కనబడిన సద్గుణములును, మన మెప్పుడును జ్ఞాపకముంచుకోవలసిన విషయములలోచేర్చి చెప్పిరి. దీనినిబట్టి మనల నితరులెంత ద్వేషించినను, ఎంతయు పేక్షించినను, ఎంతనిందించినను, దానిని సరకుచేయక, వారిని మనము నిరంతరము ప్రేమించుచు, వారియందున్న సద్గుణములనే గణించుచు, నుండవలెనని స్పష్టమగుచున్నది.

మన మందరను ఒక్కరీతిగా ప్రేమించుట సాధ్యము కాదు. బుద్ధుడు, శ్రీకృష్ణుడు, క్రైస్తు, మొదలగు పరమపురుషులకే ప్రియతములగు శిష్యు లుండిరి. అట్టిచో మన మందర నొక్కవిధముగ బ్రేమించగలమా? తలిదండ్రులను ప్రేమించినట్లు భార్యను బిడ్డలను ప్రేమించగలమా? భార్యను బిడ్డలను ప్రేమించునట్లు మిత్రులను ప్రేమించగలమా? ప్రేమ యిన్నిరీతులుగ పరిణమించినను, అందరియెడల ప్రేమయును అతంద్రమైనట్టిదియు ఫలాభిసంధిరహితమైనదియునై యుండవలెను.

భగవంతుడు విశుద్ధప్రేమస్వరూపుడు. ఈ లోకములన్నియును భగవంతుని విశుద్ధప్రేమవల్లనే నడుచు

చున్నవి. అట్టి భగవంతు నెందరు దూషించుచున్నారు. ఎందరు దూషించినను, ఆయన ప్రేమప్రసారము అందరియెడలను సమానముగనే యున్నదిగాని యెవరియెడలనైన పక్షపాతమున్నదా? మన మీశ్వరాంశలమే గనుక మనము ఆయంశను మరుగుపరుచుచున్న యీ నీచప్రకృతిని జయించి, విశుద్ధప్రేమ ప్రకాశించునట్లు చేయవలెను.

మూలము :—"వివేచన నింక నొకవిధమునఁ జేయవలయును. అందఱును, అన్నియును, పైచూపున కెంత చెడ్డఁగ గనపడినను, వానియందుండు నీశ్వరుని వివేచనముచేసి చూడ నభ్యసింపుము. నీకును ఇతరునికిని సమానముగ నుండుదానిమూలమున నీవు వానికి సహాయముచేయనోపుదువు. మీయందు సమానముగ నుండునది భగవత్కళ. ఆభగవత్కళ నీసోదరునియందు మేల్కొలిపి, వికసించునట్లు చేయ నభ్యసింపుము.[1] అట్లయిన, నీ సోదరుని తప్పుత్రోవ నుండి కడ తేర్చగలుగుదువు."[2]

[1] 'పరమగురుచరణసన్నిధి' లోని యీవాక్యము కొంచెము మార్చి యిచట వ్రాయబడినది. (గుం. వెం. సు.)

[2] "అందఱియందు నీశ్వరకళ యున్నదిగదా! వారివారి రుచి ననుసరించి యీశ్వరుడు వారికి బురోవృద్ధిమార్గ మేర్పఱుచుచుండును.

సదసద్వివేచనమున నిది కడపటి యుపదేశము, మిక్కిలి యుపయుక్తమైన యుపదేశము. ప్రతివస్తువు నందును, అది పైకెంత చెడ్డదిగ గనపడినను, భగవంతుడున్నాడు. అట్లుకానియెడల నావస్తువున కునికియే యుండదు. 'ద్యూతం ఛలయతా మస్మి', మోసము చేయువారియొక్క జూదమును నేనే అని శ్రీకృష్ణభగవానుడు చెప్పెను. ఇది కొందరను చకితులను జేయును. కాని దానిలో నెంతయో సత్యమున్నది. మోసగాడీ ద్యూతముద్వారానేగాని మరియొక విధముగా నేర్చుకొనరాని దేదోయొక పాఠమును నేర్చుకొనవలసియున్నది. ఒకడు ఆదేశమువల్లగాని, యుపదేశమువల్లగాని యొకపాఠమును నేర్చుకొనజాలని స్థితిలోనున్నయెడల, వాడు ప్రకృతిధర్మముల ననుసరించి కలుగు ననుభవములవల్ల నేర్చుకోవలసియుండును. ప్రకృతి ధర్మములు గూడ నీశ్వర సంకల్పములో జేరినవే. శ్లో॥ "యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా। తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసమ్భవమ్॥ (గీతా ॥ ౧౦—౪౧)." ఐశ్వర్యయుక్తము, కాంతియుతము, దృఢ

కనుక, వారికి తోడ్పడవలెనని వారి మార్గమెట్టిదైన యా మార్గమునే వారికి మేలుచేయవలయునుగాని మన మార్గమునకే వారిని ద్రిప్ప యత్నింపరాదు."

మైన యుత్సాహముతోఁగూడినది, యగు వస్తుసమూహ
మేదేదిగలదో ఆయా వస్తుసమూహము నా తేజస్సు
యొక్క——ఈశ్వరశక్తియొక్క——యంశము వలన గలిగి
నదానిగాఁ దెలిసికొనుము" అని చెప్పి జూదము తానే
యని శ్రీకృష్ణభగవానుడు చెప్పుటచేత జూదములో
గూడ భగవంతుని యంశయున్నదనియే గదా అర్థము.

ప్రకృతి ధర్మములు పెద్దపాషాణములవంటివి. ఆ
ధర్మముల నెఱింగినవారిచే జేయబడిన ఆదేశములు,
ఉపదేశములు, చాలనున్నవి. వానివల్ల ఆ ధర్మముల
ననుసరించి నడుచుకొనుట యెట్లో నేర్చుకొనవచ్చును.
లేదా, స్వప్రయత్నమువల్లనైన ప్రకృతిధర్మములను
తెలిసికొని వాని ననుసరించవచ్చును. కాని యేవిధము
గను ఆ ధర్మముల ననుసరింపక, వాని కెదురేగు వాఁడా
పాషాణములను తాకి గాయములను తగిలించుకొని, ఆ
విధముగా, స్వానుభవమువల్ల, పాఠములను నేర్చు
కొనును.

ఎన్నికష్టములుపడియైనను మనము ప్రతివస్తువునందు
ను ఈశ్వరుని యంశమునుజూచుట దెలిసికొనవలయును.
నీవు నీ యెదుటనున్న ప్రాణియందీశ్వరుని జూడగలిగి
నప్పుడే నీవాప్రాణికి ఉపకారముచేయగలవు. నీకును
ఆ ప్రాణికిని సామాన్యముగ నున్న దాయీశ్వరకళ

యొక్కటియే. తక్కిన యన్నివిషయములలో మీరు భేదించవచ్చును. కనుక, నీవా యీశ్వరకళద్వారా వానికి ఉపకారముచేయగలవు.

ఒకడు దుర్మార్గుడైనను, వాని దుర్మార్గమంతయు వాని నీచప్రకృతితో సంబంధించినదిగాని జీవాత్మకు సంబంధించినది కాదు. మనము జాగ్రత్తగ పరీక్షించి చూచినయెడల ఆ జీవాత్మ తన దుర్మార్గమునంతను తొలిగించి, తన యందున్న యీశ్వరాంశను ప్రకటించుటకై ప్రయత్నించుచున్నదని కనిపించును. కనుక, మన మా యీశ్వరకళను కప్పియుంచిన దుర్మార్గము లనెడి పెంకును చొరుచుకొని లోపలికిపోయి, యందున్న యా యీశ్వరకళను చేరగలిగినయెడల, ఆజీవాత్మ ఒక్క గంతువేసి ముందుకువచ్చి, దేహాత్మకు మనముచేయు నుపకారమున మనకు తోడగును.

తక్కిన విషయములన్నిటిలోను క్రూరమృగప్రాయుడై ప్రవర్తించుచు, చూచుటకుగూడ భయంకరముగ నున్నవానికి ఒక బిడ్డయందో, ఒక కుక్కయందో ప్రేమయుండును. వానిలోని యీశ్వరకళ ఆ ప్రేమ రూపముగ ప్రకటితమగుచున్నది. ఆ సంగతి కనిపెట్టి ఆ ప్రేమను వృద్ధిచేసినయెడల, వాని క్రూరత్వమును పోగొట్టి, వానిని సద్వర్తనునిగ జేయవచ్చును.

"అట్లయిన నీ సోదరుని తప్పుద్రోవనుండి కడతేర్చ గలవు" అన్న తుదివాక్యములో పరమగురు వొక గొప్ప యాదేశము నిచ్చుచున్నారు. ముముక్షువునకు తానొకప్పుడు లోకరక్షకుడను కావలెనన్న ఆకాంక్ష యొక్కటే యుండును. అది యొక్కటియే వాని జీవితోద్దేశము. దాని నుద్దేశించియే యీ యాదేశమును పరమగురువు చేసినారు. మన జీవితములలో నీ విధమగు పరోపకారము, లోకసేవ, యెంతయెక్కువగ ననుష్ఠింతుమో అంత యెక్కువగ నిర్వ్యాజ పరోపకారియగు పరమగురువు జీవితము మన జీవితములలో ప్రతిబింబించును. అప్పుడే మనము నిజమైన నాయకులము, లోక రక్షకులము, కాగలము.

---

మొదటి అధ్యాయము

## కామమును తొలగించుట

[సంస్కృతమున వైరాగ్యమనియు, నిహాముత్ర ఫలభోగవిరాగమని యు, చెప్పబడు రెండవ సాధనము ఈ గ్రంథమున Desirelessness, లేక, నిష్కామత్వమని పేర్కొనబడినది.] బౌద్ధులు దీనినే పరికమ్మ యందురు (చూ॥ 48 పుట).

మూలము :—" అనేకులకు నిష్కామత్వమును సాధించుట కష్టము. వారు తమ తమ కామములే తామని తలంచెదరు.[1] కావున వారికి నైజములుగనుండు కామములను, వారి రాగద్వేషములను తీసివేసినచో, వారలయందేమియు మిగిలియుండదు."

జనులు తమ కామములే తామని యెంచుదురు. వారిని కామచైతన్య మట్లు తలచునట్లుచేయును. తృప్తి నొందని కామమొకటి నీకు సౌఖ్యముకలిగించుచున్నంత వరకు ఆ కామము నీవనే యనుకొందువు. నిజముగ, నీవు వేరు నీకామములు వేరు ; అయినప్పటికిని, నీ

[1] "కామమయోఽయంపురుషః"—ఈ పురుషుడు కామమయుడు.

కాభేదభావము కలుగుట కష్టము. అనేకులు తమ కామ స్వభావము జయించినామనుకొని సంతసింతురు, కాని, వారి ప్రవర్తనములోమాత్ర మది కనబడదు. అది తెలుసుకొన్నయెడల, దానికి ప్రతిక్రియ వెంటనే చేయుదురు.

అందుకు మొదటిమెట్టు 'ఈ కామములు నేనుకాను' అను భావమును మననముచేయుట. కామచైతన్యము గుఱించి యిదివరకు కొన్నిసంగతులను తెలిసికొని యున్నాము. (2 వ భాగము, 2 వ అధ్యాయము చూ.) ఆసంగతుల నిచ్చట తిరిగి చదువవలెను. "భగవంతుడు నన్నిట్లు సృజించినాడు. నేను కోపస్వభావముగల వాడను, నాకుబలమైన యిచ్ఛలేదు, కామవికారముల నణుచుకొనదగిన బలములేదు. అయిన, నేనేమి చేయగలను, భగవంతుడు నన్నిట్లు బలహీనునిగ బుట్టించెను" అని యనుకొని, భగవంతుడుచేసినదానికి వ్యతిరేకముగ నేమియు చేయజాలమని యూరకొనువా రనేకులున్నారు. వారు తమ పూర్వజన్మములలోని ప్రవర్తనమువల్ల తామే యాదౌర్బల్యము నీజన్మములో గలిగించుకున్నారని యెరుగరు. విడిచిపెట్టుటకు తమకు సాధ్యముకాని కుంటికాలు, గ్రుడ్డికన్నువలెనే తమ స్వభావముకూడ విడిచిపెట్టుటకు సాధ్యముకానిదనుకొం

దురు. తమ స్వభావమునందు ప్రశస్తలక్షణములు ఉన్న యెడల నవి పోగొట్టుకొనవచ్చునని యెఱుగరు, వాని నెందుకు పోగొట్టుకొనవలెనో కూడ నెఱుగరు. సాధారణముగ, సత్ప్రవర్తన మలవరచుకొనినయెడల స్వర్గములభించునని యొక నమ్మకమున్నది. కాని యా స్వర్గసుఖములయందాశయైన నందరను సన్మార్గమునకు మరల్చజాలకున్నది. దానికి కారణము, బహుశః, స్వర్గమునుగుఱించి ప్రబలియున్న యపోహలైయుండును. ఒకడు తన కామస్వభావమును చక్కబరచుకొనుటకు తగిన కారణ మదికాదు. వాడు భగవత్సంకల్పము నెఱింగి, 'ఆ సంకల్పము నెరవేర్చుటకు తోడ్పడుటకై, లోకపురోవృద్ధికి సహాయకరములగు కార్యములబూని చేయుట కర్హుడు కావలయును; అందుకు కామ ప్రకృతిని చక్కబరచుకొని, జీవాత్మ కీ శరీరములు తగిన యుపకరణము లగునట్లు చేసికొనవలయును', అని తెలిసికొన్నయెడల, తన కామములను జయించుటకై ప్రయత్నములను చేయుటకు వెంటనే యారంభించును.

తన కామములే తానను కొనువాని కీజీవితమున నేకార్యము చేయుటకును కామమే ప్రోత్సాహకర్తయై యుండును. కామప్రేరితముకాని పనిచేయుట యనగా నేమో వాడెఱుగడు. కనుక, వానికి కామములేని

జీవితము శూన్యముగనుండును. అందుచే నట్టి వానిని కామములను విడువుమనిన వాని కది యసంభవముగ దోచును. కనుక, ముందు వానియందు నిష్కామము లగు రాగములను కలిగించవలయును.

మూలము :—“ అయినను, వారు పరమగురువును జూడనివారలై[1] యుందురు. ఆ మహనీయుని పావన మగు సన్నిధి యను వెలుఁగుండినచో వారివలె కావలెనను కోరిక యొక్కటితప్ప తక్కుకోరికల న్నియు నశించును. ఐనను వారిని ప్రత్యక్షముగఁ జూచు సుఖము నీకుఁ గలుగుటకుముందే, నీవు వలయునన్న నిష్కామత్వమును సాధించవచ్చును.”

శ్లో॥ విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః । రసవర్జం, రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥ అని శ్రీమద్భగవద్గీతలు (అ ౨—౫౯)లో చెప్పినట్లు ఇంద్రియములను విషయములయందు ప్రవేశింపనీయని వానికి విషయానుభవములు నశించునుగాని, విషయ

[1] పరమగురుచరణసన్నిధిలో ‘వారలుగనే’ యని పాఠము. ఆ పాఠములో ఎప్పుడునుగూడ పరమగురువును చూడజాలనివారు గానే యుందురను భావము సూచితమగుచున్నది. ఆ భావము మూలములో లేదు. కనుక పాఠమిట్లు మార్చడమైనది. (గుం. వెం. సు.)

[2] పై 56 పుట చూ॥.

వాసన నశించదు. ఆ వాసన పరమును జూచినవానికి నశించును. ఆ వాసనయే కామము. కనుక, మనకు విషయానుభవము నశించినంత మాత్రమున కామము నశించినదనుకొనరాదు. కామము వృక్షమూలము వంటిది, ఆ మూలమునుండి యనేకములగు వేళ్లు బయలు దేరుచుండును. ఆ వేళ్లను నరికివేయవచ్చును, గాని, మూలమున్నంతవరకు తిరిగి క్రొత్తవేళ్లు పుట్టుచునేయుండును. కనుక, మూలచ్ఛేదముకావలెను. అది పరమ గురువు నొకసారి ప్రత్యక్షముగ జూచినయెడల నశించును. ఎట్లు? వారి నిర్మల తేజస్సుయొక్క కాంతి నొకసారిచూచినవానికి వారంతవానిని కావలయునని తప్ప తక్కినకోరికలన్నియు నశించును, అని యిచట చెప్పిరి. ఒకవేళ నీవు వారినిచూచు భాగ్యము కలుగక పోయినను, వారినిగురించి పెద్దలవల్లవిని గాని మరియొక కారణమువల్లగాని నీ వాధ్యాత్మికమార్గ మభిలషించి, పరసాధనముకొఱకు నీ కామమును నాశనముచేసికొన వలెనను నిచ్ఛ నీకు బుట్టినయెడల కామమును నాశనము చేసికొనవచ్చుననియు నిచ్చట చెప్పబడినది. 'నీవు వలయునన్న' యన్నమాట మిక్కిలి ముఖ్యమైనది. ఏలయన, నీకు బలమైన యిచ్ఛకలుగుటయే కష్టము గాని కలిగినయెడల కామమును జయించుట సులభము.

మనలో నేపనిచేయుటకైనను సామర్థ్యము లోపముగ నుండదు. ఇచ్ఛయే లోపముగ నుండును. లౌకిక వ్యాపారములలో నుపయోగించునంత యిచ్ఛాశక్తి నాముష్మిక సాధనములకొఱ కుపయోగించినయెడల మన యభ్యున్నతి మిక్కిలి శీఘ్రముగ జరుగును. కామమను మూలమునుండి వేళ్లెన్నివిధములుగ బైలుదేరునో యిక జెప్పుచున్నారు.

మూలము :—"జనులు తఱుచుగగోరు ధనైశ్వర్యములు మొదలగునవి పొందఁదగినవికావని వివేకముచే నీ కిదివఱకే తెలిసియున్నది. ఇది నోట చెప్పుటమాత్రమే చాలదు. యదార్థముగ నది నీ మనస్సునంటినచో, వానికై నీకుండుకోరికలు తుద ముట్టనశించును."

ధనమును, ఐశ్వర్యమును పొందవలయునను కోరిక అనేక రూపములుగా వ్యక్తమగును. అనేకులు తక్కిన యన్నిటికంటెను ధనము నెక్కువగా గోరుదురు. వస్తుతః ధనము కోరదగినదికాదు. ధనము కోరికలను పుట్టించును, సుఖము నీయదు. సంఘములో పలుకుబడి, రాజకీయాధికారము, గూడ నిట్టివే. ఇదంతయు పైమెఱుగు గాని నిజమైన బంగారుకాదు. జ్ఞాని తన కేమిసం

ప్రాప్తించినను సంతుష్టినొందునని శ్రీమద్భగవద్గీతలలో చెప్పబడియున్నది, అనగా, జ్ఞాని తనకేమిలభించినను, దానినే సంతోషముతో ననుభవించునుగాని, మరి యొకటి గావలెననికోరుచు, తన శక్తిని, కాలమును వ్యర్థముచేయడు.

ఉన్నత అధికారపదవులను పొందువా రెప్పుడును కొంచెముమందియే యుందురు. కాని, పదవి లభించ కున్నను, తదధికారమును చెలాయించవలెనను కోరిక తరుచుగ నందరకు నుండును. తన పనిని తాను చేయక పోయినను, ఇతరులపనిలో వ్రేలుబెట్టి, వారేమి చేయ వలయునో తాను చెప్పవలయునని, తాను చెప్పినట్లు వారు వినవలయుననికోరుట అధికారలాంఛనము. సంఘ ములోగాని, రాజకీయవ్యవహారములలోగాని అధికార పదవిని పొందవలెననుకోరిక లేనివారికైనను, ఇత రులు తాము చెప్పినట్లు చేయవలయునను చెడుకోరిక యుండును. అభ్యుదయము కావలసినవారి కట్టి కోరిక యుండదగదు. కార్యనిరతులు ఇతరుల పనిలో జోక్యము కలిగించుకొనకుండనే చేతినిండ పనిగలిగి యుందురు.

ఆత్మ నీయం దొకరీతిగ వ్యక్తమగును, మరియొకని యం దింకొకరీతిగ వ్యక్తమగును. వానిలో నేరీతిగ వ్య

ర్తముకావలసినదియు వానిపనిగాని నీపనిగాదు. కనుక, అతడు చేయుపనిలో నీవు జోక్యముకలిగించుకొనరాదు. ఇవ్విషయమున నింకను విపులముగ ముందు వ్రాయబడును. (ఈ భాగము ౫వ అధ్యాయము చూ॥.)

---

రెండవ అధ్యాయము

## ఒక మంచికోరిక

మూలము :—" ఇంతవఱ కంతయు సులభము. నీవు దీనిం దెలిసికొనుటమాత్రమే చాలును. అయినను, స్వర్గమును గోరియేగాని, తమకు మాత్రము బంధమోక్షమై జన్మరాహిత్యముకావలయునని కోరియే గాని, యైహికార్థములను విడుచువారు కొందఱు గలరు. నీ వీపొరపాటునఁ బడఁగూడదు."

ఐహికార్థములను విడిచిపెట్టుటకు సామాన్య జనులకు స్వర్గసుఖాపేక్షయే కారణము. కాని స్వర్గలోక సుఖము శాశ్వతమైనది కాదు. జీవుడు భూలోకమున నీపార్థివదేహపతనమువరకు నెట్లుండునో అట్లే సువర్లోకమున మానసికశరీరపతనమువరకు నుండును. ప్రతి జన్మాంతమున నాలోకమున కొంతకాల ముండి, యీ లోకానుభవములన్నియు నచట వాసనారూపములుగ మారినతరువాత, జీవుడు తరువాతజన్మమునకు సిద్ధ

మగును.[1] కాని, కొందరు విశేషలోకసేవాభిలాషచే స్వర్గలోకసుఖములను వదులుకొని త్వరలో పునర్జన్మము నభిలషించెదరు. అట్టికోరిక తీవ్రముగ గలవారి కది సాధ్యమగును. కాని, అందుకు కొంతశక్తి అవశ్యముప యోగించవలసియుండును.

[1] శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి। ఏవం త్రయీధర్మమనుప్రపన్నా గతాగతం కామకామా లభన్తే॥=(యజ్ఞాదికర్మల జేసి స్వర్గలోకమున దేవభోగముల ననుభవించు) వారు విస్తారమైన ఆస్వర్గలోకసుఖము ననుభవించి పుణ్యము ముగిసినతోడనే యీ మనుష్యలోకమును ప్రవేశించుచున్నారు. ఈ ప్రకారముగా (వెనుకటి జన్మమందువలెనే మరల) కేవలవేదోక్తకర్మమును (ఫలాపేక్షతో) ననుష్ఠించెడి విషయేచ్ఛగలవారు రాకపోకలను (చావు పుట్టుకలను) జరుపుచున్నారు. గీతా॥ ౯—౨౧.

ఇష్టాపూర్తం మన్యమానావరిష్ఠం నాన్యచ్ఛ్రేయో వేదయన్తే ప్రమూఢాః। నాకస్య పృష్ఠే తే సుకృతేఽనుభూత్వేమం లోకం హీనతరం వా విశన్తి॥=ఈ మూఢులు యాగాదికర్మలు, వాపీకూపాది ధర్మకార్యములు మిక్కిలి శ్రేష్ఠములని నమ్మి, తదితరమగు సుఖోపాయము నెఱుంగరు. వారు స్వర్గమునందు సుకృతఫలముల ననుభవించినపిదప యీ లోకమునకుగాని దీనికంటె హీనతరమైన లోకమునకుగాని తిరిగివత్తురు.—ముండకోపనిషత్తు, 1—2—10.

తద్యథేహ కర్మజితో లోకః క్షీయత ఏవమేవాముత్ర పుణ్యజితో లోకః క్షీయతే. . . =ఈ లోకమున కర్మచే సంపాదింపబడిన భోగ్యజాతము ఏలాగున (వినియోగానుభవములతో) క్షయించిపోవునో ఆలాగుననే స్వర్గాది లోకములయందున్న సుకృతమువలన నార్జింపబడిన ఆముష్మికభోగ్యవిషయముగూడ క్షయించిపోవును.—ఛాందోగ్యోపనిషత్తు, 8—1—6.

స్థూలశరీర మలసటనొందును, గాని, కామ మానసిక శరీరము లలసటనొందవు. ప్రతిజన్మమునకును స్థూల శరీరము క్రొత్తది కావలయుననుటకు కారణము ప్రాత జన్మములోని శరీర మలసిపోయి, యిక పనిచేయుటకుప యోగించకపోవుట. అయితే అలసటలేని కామ మాన సిక శరీరములుగూడ ప్రతిజన్మమునకును క్రొత్తవి యేల కావలయుననగా—వెనుకటిజన్మములలో సంపాదించిన యనుభవములన్నియు వాసనారూపముగ నీ జన్మ ములో మన స్వభావములో నంటియుండును. కనుక, గతజన్మాంతమున మన స్వభావ మెట్లున్నదో దాని ననుసరించి యీ జన్మములో మన కామ మానసిక శరీరముల ప్రకృతియేర్పడును. మన మీ జన్మములో కాలముగడిచినకొలదియు ఆప్రకృతిని మార్చుకొన వచ్చునుగాని, ఆమార్పున కొకమితియుండును. ఒక గడియారమునుగాని మోటారుబండినిగాని కొంతవరకు మరమ్మత్తుచేసి నడిపించవచ్చును, గాని, ఆపై నిక మరమ్మత్తుచేయుటకంటె క్రొత్తదానిని కొనుటయే మే లగును. కామ, మానసిక శరీరములుకూడ నించుమిం చుగ నావిధముగనే యుండును. వానిని మరమ్మత్తు చేయుటకెంత ప్రయత్నించినను ఆ మరమ్మత్తు అసం పూర్తిగానేయుండును. కనుక, ఆ శరీరములను అతు

కులు వేసి సంస్కరించుకొనుట కొక జన్మములోనేయుండి, కాలమును శక్తిని వ్యర్థపుచ్చుటకంటె, మఱియొక జన్మము నెత్తి, క్రొత్త శరీరములను సంపాదించుటయే మేలు. స్వర్గలోకమున నుండగోరక త్వరలో జన్మము నెత్తగోరువానికి స్థూలశరీర మొక్కటియే క్రొత్తది యుండును, గాని కామ మానసిక శరీరములు ప్రాత అతుకులబొంత లే యుండును. అందుచేత, వానిని తిరిగి తిరిగి మరమ్మత్తు చేసికొనుచుండుటకై కొంతశక్తి నావశ్యకముగ నుపయోగించవలయును. కనుక, మనము కామ, మానసిక, శరీరముల నెల్లప్పుడు నిర్మలముగను, శాంతముగను నుంచుకొనగలిగేపర్యంతము క్రొత్తశరీరములతో క్రొత్తజన్మము లెత్తుచుండుటయే మేలు.

మరణానంతరము ప్రతిజీవునకు నేర్పడిన త్రోవను విడిచి క్రొత్తమార్గమును బట్టగోరువాడు, స్వయముగ గాని, మరియొకరిద్వారాగాని, యొకానొక యుక్తమాధికారికపురుషున కాసంగతి నెరిగించవలయును. ఆయన వానికది శ్రేయస్కరమని తోచినయెడల అనుజ్ఞనిచ్చును, లేనియెడల అనుజ్ఞనీయరు. మరియు నట్లు త్వరలో పునర్జన్మముగావలెనని కోరువాడా జన్మములో మహీపీఠమువారి పనికి ఉపయోగించునని వారికి నమ్మకముండవలెను, వానిని విడిచిపెట్టినయెడల వారి పని

నెరవేరదన్నట్లుండవలెను. మన కామ, మానసిక శరీర ములను చక్కని స్థితిలోనుంచుటకు వారి నిరంతర సేవయే మార్గము. అదియే అందుకుతగిన కారణముకూడనై యుండవలెను.

మోక్షమార్గమున బ్రవేశించ గోరువారు తమ స్వప్రయోజనమునకై కోరరు. తాము ముక్తినిబొంది బంధములలోనున్న వారికి చేయూతనొసంగి వారికి ముక్తిమార్గము చూపించి, లోకము నుద్ధరించుటకై మోక్షమార్గము నపేక్షింతురు.

మూలము :—"నీవు నిన్ను బూర్ణముగ మఱచియుండినచో నీకు బంధనివృత్తి యెపుడుగలుగునో యనిగాని, లేక, నీ కెట్టి స్వర్గముగలునోయనిగాని, చింత నీకుండజాలదు. స్వప్రయోజనముఁగోరు కామమంతయు, నెంత గొప్పవిషయమును గూర్చినదైనను, బంధకారియే యనుదానిని మఱువకుము. దానిని నీవు బోగొట్టుకొనునంతదనుక, పరమగురువుల కార్యమునకై నిన్ను సమర్పించుకొనుటకు పూర్ణమగు స్వాతంత్ర్యము నీకుండదు."

స్వర్గము వాంఛనీయముకాదని యిక్కడ యింత విశేషముగ జెప్పబడినది గదా. మతములన్నిటిలోను

స్వర్గసుఖములంత చక్కఁగా వర్ణించి జనులకు స్వర్గేచ్ఛ యెందుకు కలిగించబడినదను ప్రశ్న రావచ్చును. అన్నము, పానము, శయ్యా మొదలగు కామములకు లోబడి, అవివినా తమకు జీవితములేదనుకొనువారికి 'నీ కామమును చంపివేయు'మని చెప్పినయెడల నేమియును ప్రయోజనములేదు. అట్టివాని నుద్ధరించుటకు, వానికి నీచకామములను నశింపజేసి, యుత్తమకామములను గలిగించు స్వర్గేచ్ఛగలిగించుటయే మంచిది. కాని, మోక్షమార్గమును బొందగోరువాడు స్వర్గేచ్ఛనేగాక మోక్షేచ్ఛనుగూడ విడువవలెను. ఏలయన, మోక్షేచ్ఛయు, స్వర్గేచ్ఛకంటె గొప్పదైనను, స్వార్థమే. ఎంత సూక్ష్మమైనదైనను, స్వార్థము వర్జనీయము. అది యున్నంతవరకు నీ మనస్సులో పరచింతకు తావుండదు. కనుక, నీ మనస్సునుండి నేను, నాది అను భావమును పూర్తిగా విడిచిపెట్టినయెడల, నీకేమి కావలయునో యను చింతయే కలుగదు.

పరమగురువుసేవ చేయగోరువాడేదోవిధముగ జేయుదునన్న పనికిరాదు. వాడాయనకు కావలసిన విధమున, ఆయనకు కావలసినచోట, సేవజేయుటకు సిద్ధముగనుండవలెను. హృదయ మేవిషయములో లగ్నమైయున్నను, అట్టి నిర్మలసేవకు సంసిద్ధుడైయుండ

జాలడు. ఒక సేన యుద్ధభూమిలో నున్నప్పుడు సేనా నాయకుడు శత్రుసైన్యము నెదుర్కొనుమని యాజ్ఞ నీయగా, భటులు తమ భార్యబిడ్డలపై వ్యామోహముచే జాన నిష్టములేక, ముందుకు పోమని యందురా? వా రన్నిబంధములను త్రెంచుకొని తమ ప్రభుసేవకు సిద్ధముగ నుందురు. ఆ విధముగనే పరమగురువుసేవకు సంసిద్ధుడగుటకుముందు హృదయగ్రంథులనన్నిటిని త్రెంచుకొనవలెను.[1] హృదయగ్రంథులలో ప్రేమగూడ జేరును. అనగా బంధహేతువైన ప్రేమ. నిర్మలమును శాశ్వతమును అగు ప్రేమ హృదయమును మించినది, ఆత్మకు చెందినది. కనుక హృదయగ్రంథులను త్రెంపిన యెడల, ప్రేమ విశాలమై, నిర్మలమైనదియగును. ఒకనియాత్మ కింకొకనియాత్మయెడల గల ప్రేమకు రూపములయెడల ప్రేమను చేర్చినయెడల నది బంధహేతువగును.

బంధకారణము లేశమైనలేనపుడే నీకు పరమగురువు సేవజేయుటకు పూర్ణస్వాతంత్ర్యము లభించును. నిన్నేదైననొకటి బంధించుచున్నంతవరకును నీకు సంపూర్ణ

[1] గుహాగ్రంథిభ్యో విముక్తోఽమృతోభవతి = హృదయగ్రంథుల నుండి విముక్తినొందినవాడై అమృతత్వమును పొందుచున్నాడు. ముండకోపనిషత్తు 3—2—9.

సమర్పణమునకు స్వాతంత్ర్యములేదు. హృదయగ్రంథు లను త్రెంపుకొనుటకు మిక్కిలి నేర్పుతోను, ఓరిమి తోను, స్థైర్యముతోను, బలమైన సాధనముచేయవలెను. అట్టి సాధనమువల్ల, నెమ్మదిగ, నెవ్వారికిని తెలియకుండ, బంధములను త్రెంచుకొనగలవు. అటుపైని, నీ వెప్పటి వలెనే నీ పుత్రమిత్రబాంధవులను ప్రేమించుచుందువు, నీ బాహ్యాచర్యయం దేమార్పును కనిపించదు, కాని నీ ప్రేమ వ్యక్తిగతముగాక విశ్వగతమగును. కొందరు వేదాంతు లీరెండువిధములగు ప్రేమయొక్క తారతమ్య మునెఱుంగక, తమకు సంభవించు సుఖదుఃఖముల యం దుదాసీనత గలుగుటకును, ప్రేమవల్ల దుఃఖము కలుగునని ప్రేమించక యుండుటకును, హృదయకా ఠిన్యము నలవరచుకొందురు. కాని, యది గొప్పతప్పు. దానివల్ల ఆత్మవికాసమున కాటంకము గలుగును; హృదయవిహీనులగు కేవల మేధాసంపన్నులు తయా రగుదురు. మనము ఉత్కృష్టములగు రాగములు గలిగి యుండవలెను. ఆ రాగములు కామచైతన్యముయొక్క యిచ్ఛానుసారముగ మనల నాడించు కామశరీరము నందలి చలనములై యుండక, జీవుని యుత్తమరాగ ములకు ప్రతిబింబములై, జీవుని వశమందున్నవై యుండ

వలెను.[1] దుష్కర్మజేతుమేమో యని యేపనిని చేయక కూర్చొనుట యెట్టిదో రాగములను జీవుని వశము చేయు నెపమున వానిని చంపివేయుటయు నట్టిదియే. పరుల యెడల ప్రేమయే లేనియెడల పరోపకారమెట్లు సాధ్యమగును? కాని ఆప్రేమ స్వార్థముతో గూడినదైన యెడల మనము చేయునది ఆత్మోపకారము కాని పరోపకారము కాదు; స్వార్థరహితమైన ప్రేమతో మనోవాక్కాయకర్మలద్వారా చేసినయుపకారమే నిజమగు పరోపకారము.

మూలము :—" నీవిషయములగు కామములన్నియు బోయినను నీవుచేయు పనివలనఁగలుగు ఫలము నీవు చూడవలెననుకోరిక నిలిచియుండవచ్చును. నీ వెవరికైనను సహాయముచేసినచో, 'నేను వానికెంత సహాయముచేసితినో 'యని చూడఁగోరు

[1] శివుడు కాముని తపశ్శక్తిచే దహించి పిమ్మట పార్వతిని పెండ్లియాడి, ఆమెను తన శరీరమున నర్ధభాగముగ జేసికొనెనను పురాణగాథ యీ సత్యమునే తెలుపుచున్నది. శివుడు తపస్సుచే ముందు కామమును కాల్చివేసెనుగాని ప్రేమను కాల్చివేయలేదు. ప్రేమయందలి నీచభావమగు కామమునుమాత్రము దహించి, ప్రేమను పవిత్రము, నిష్కలంకము, చేసి అట్టి ప్రేమతో పార్వతినిగైకొనెను. ఆప్రేమ యంత విశాలమైనది గనుక తనకును ఆమెకు భేదములేకుండ తనలో నామెను చేర్చివేసికొనెను.

దువు. వాఁడును దాని నెఱిఁగి కృతజ్ఞుఁడుగనుండ వలయునని కూడ నీవు కోరినను కోరుదువు. ఇది యును కామములోఁ జేరినదియే గాక నీకు నమ్మక ము లేదనియును సూచించును."

ఇదియే శ్రీమద్భగవద్గీతలలో (నిష్కామకర్మ) ఫల ము గోరకుండ పనిచేయుట యని చెప్పబడినది. నీవు చేయుపనియొక్క పర్యవసానమే ఫలము. కనుక పని చేసినప్పుడు ఫలము కలుగక తప్పదు. కాని, నీవు నిజ ముగా పనిచేయుచున్నవాడవైనయెడల, నీవుచేయు ప్రతికార్యముయొక్క ఫలమును కనిపెట్టి చూడనక్కర లేదు, చూచుటకు నీకు వ్యవధియు నుండదు; నీవు పూర్తిచేసిన పనిని తిరిగి చూచుటకై నిలచుటకైన నవకాశముండదు. ఒకపని పూర్తియగుటతోడనే, నీవు చేయబూనవలసిన మరియొకపని సిద్ధముగ నుండును; వెనుకటి పనినిగుఱించియే యోచించుచు గూర్చున్న యెడల, తరువాత చేయవలసినపని నెట్లుచేయగలవు? విశేషించి, నీవు చేసినపనివల్ల నీకు కలిగిన ఫలమేది యని విచారించుటకు బొత్తిగా వ్యవధియుండదు. మన ము చేసినపని సార్థకముగ నుండవలెను గాని వ్యర్థము కాకూడదు. అందుచేత, మన మాపనిని పూనినప్పుడే యది యెట్లుచేసిన సార్థకమగునో, యోచించి, నేర్ప

తో మన యావచ్ఛక్తిని వినియోగించి చేయుదుము. చేసినపని సార్థకము కావలయునని కోరుట, సార్థకమైనప్పుడు సంతోషముతో నుప్పొంగుట, మానవస్వభావము. కాని, మనము పొందగోరు గమ్యస్థానము మానవాతీతమైనది, కనుక, మానవస్వాభావికములగు దోషముల నతిక్రమించవలయును. మనము చేయుపనిని ఫలమపేక్షించి యారంభించరాదు, అనగా, ఆ పని స్వార్థముకొఱకు చేయరాదని యభిప్రాయము. ఒక పనివల్ల నీకు ప్రత్యక్షముగాగాని పరోక్షముగాగాని ఫలము కలుగవలెనని కోరి ఆ కోరికతో ఆ పనిచేయరాదు. అట్లే, పనియొక్క ఫలమును చూడవలెననియు నీవు కోరరాదు. ఆ కోరికయు నిషిద్ధము.

నీ వొకనికి ఉపకారము చేసినప్పుడు, దానివల్ల నీకేమియు లాభముకలుగదు, కలుగునని నీవు తలచవు, గాని, నీవు చేసిన యుపకారమునకు వాడు నిన్ను మెచ్చుకొని, నీకు కృతజ్ఞుడై యున్నాడో లేడో చూడవలయునన్న కోరికయైన మనస్సులో డాగియుండును. దీనివల్ల కామ మెంత సూక్ష్మమైనదో తెలియును. వాడు నీకు కృతజ్ఞుడైయున్నాడని చూడవలయునని కోరుట యెటువంటిదనగా, పెండ్లికొడుకునకు దుద్దు లెరువిచ్చి, అడిగినవారికెల్ల నవి తనవని యతడు చెప్పునో లేదో యని

యతని వెంట నంటియుండుటవంటిది. అది నిజమైన యుప కారముకాదు, నీశక్తిని నీనేర్పును విక్రయించుట.

మూలము :—“ఇతరుల సహాయమునకై నీ శక్తిని ధారపోసినచో, నీవు చూడఁగలిగినను లేకపోయి నను, దాని ఫలముగలిగియే తీరవలెనుగదా! భగవ దాజ్ఞను గనియుంటివేని ఇది సిద్ధమని నీకు తెలి యునుగదా!”

సాధకుడు ఏపనినైనను చేయుటయే ముఖ్యమని చేయవలయునుగాని, దాని ఫలమునుగాంచు కోరికతో చేయరాదు. మఱియును, ‘నే నుపకారము చేయు చున్నా’నను తలంపువల్లగలుగు సుఖము, సంతుష్టి కూడ కోరరాదు. మనము ధర్మనియతమైన లోకము లో బనిచేయుచున్నాము, గనుక, మనము చేసినపనికి సరియైన ఫలితము కలుగక తప్పదు. కనుక, మన మా ఫలితమునుగుఱించి యోచించ నక్కర లేదు. మన మొక కార్యము నారంభించినపుడు దానికేదోయొక కారణమువల్ల సద్యోఫలిత ముండకపోవచ్చును. కాని, మన ప్రయత్నమువల్ల ఫలనిష్పత్తి కొంత సమీపము నకు వచ్చి యుండును. ఇంతలో, మరియొక డాపనిని బూని పూర్తిచేయును. అంతమాత్రముచేత మన ప్ర

యత్నమునకు ఫలితములేదన వచ్చునా? ఆ ప్రయత్న మేలేనియెడల, బహుశః రెండవవాని కాకార్యము పూర్తిచేయుటకు సాధ్యమేకాదు.

ప్రకృతి ధర్మమునందు నమ్మకములేనియెడల, మన మే గొప్పకార్యమును నిర్వహించజాలము. ఏలయన, గొప్పకార్యములు మెల్లగాజరుగవలసినవి. మనము చేసిన యారంభములన్నిటికి వెంటనే ఫలములుగలు గవు, కాని యెప్పుడో యొకప్పుడు కలుగకతప్పదు. కనుక, నీవు చేయవలసినది, నీవు పూనినపనిని నెమ్మది గను, నేర్పుతోను చేయుటయే. అట్లు చేసినయెడల నీ కాశాభంగముండదు. ఆశాభంగమునకు ఫలాపేక్ష యే కారణము.

భగవదాజ్ఞ యనగా సృష్టిసంకల్పము నెరవేరుట కేర్పడిన ధర్మము. ఆ ధర్మ మనివార్యము. కనుక, దాని నెఱింగినవాడు దానిని తన యిష్టమువచ్చినట్లును ఉపయోగించగలడు. కనుక, మనము చేయు మనో వాక్కాయ కర్మము లెట్లుచేసిన నెట్టి ఫలితములు కలు గునో తెలిసి చేసినయెడల, మనము ఫలముకలుగుట యందు నమ్మకముంచి పనిచేయగలము.

మూలము :—“ పనిచేయుట ధర్మమనియే పనిచేయ వలయునుగాని ఫలమును జూడఁగోరి చేయరాదు.

నీకు లోకముపైఁ బ్రేమగలిగియుండుటచే లోకమున కుపకరించుటకు నిన్ను నీవు సమర్పించుకొనక తప్పదు అని యెఱింగి లోకసేవకు నీ వాత్మనివేదనము చేసికొన వలయును."

ఫలాభిసంధిరహితముగ సేవజేయుటకు నిర్మల ప్రేమ దక్క మరియొక హేతువులేదు. సర్వభూతహితైకరతుఁడైన వానికి తాను ఇతరులు అను భేదముండదు. కనుక వానికి పరోపకారము స్వాభావికము. వాడు పరోపకారముగాక మరియొకటి చేయడు, చేయజాలడు.

ప్రస్తుతమందు సేవ, ముఖ్యమగు మోక్షమార్గసాధనము. కనుక నే యీగ్రంథమున దాని నింత విశేషముగ వివరించి చెప్పినారు.

నేనాత్మత్యాగము చేయుచున్నా నను చింతయుండుటయు నహంభావమే. అట్టి చింతకూడ నుండకూడదు. అట్లుండకుండుటకు ప్రేమయేకారణము. ఎంతవరకు పరమపురుషులసేవకై సమర్పింపదగిన దేదియైన లవలేశమంత మనము దాచుకొనియుందుమో, అంతవరకు మన మార్గమునకు మనమే యాటంకములను కలిగించుకొందుము. అట్లులేశమైనను దాచుకొనక సర్వమును సమర్పించ సిద్ధముగనున్నవాడు త్వరలో పురోవృద్ధి నొందును.

---

మూడవ అధ్యాయము

## అణిమాది సిద్ధులు

మూలము :—“ అణిమాది సిద్ధులను[1] బొందఁగోరకుము. అవి కలుగుట నీకు మేలని పరమగురువు నన్నెన్నఁడు తోఁచునో అపుడవి నీకు వచ్చును.”

అణిమాది సిద్ధులు మన సూక్ష్మశరీరములద్వారా వ్యక్తమగు ప్రజ్ఞాశక్తులు. సామాన్యముగ మన స్థూలేంద్రియములచే దెలియజాలని విషయములను సూక్ష్మేంద్రియ వికాసమువల్ల దెలిసికొనుటయు, యీ స్థూలావయవములచే జేయజాలని పనులను సూక్ష్మశరీరములచే జేయగలుగుటయును సిద్ధులందురు. మనకిప్పుడు సూక్ష్మశరీరములలో ప్రజ్ఞగలిగి వ్యవహరించుటకు శక్తి లేదు గనుక, అవి కలుగుట యొక మహాభాగ్యమని తలంతుము. కాని యవియును స్థూలశరీర వ్యాపారముల

[1] అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము. వీనిని అష్టైశ్వర్యములనియు నందురు.

వంటివే యగుటచే వీనికంటె నవి గొప్పవని చెప్ప వీలు లేదు.

మన మీ స్థూలశరీరమును పరిపూర్ణమగు నారోగ్యమున, మనకు లోబడియుండునట్లు ఉంచుకొనవలసినట్లే సూక్ష్మశరీరములనుగూడ నుంచుకొనవలయును. స్థూలశరీరముతో సంబంధించిన యింద్రియములు అవయవములు ఎట్లుపయోగకరములో సూక్ష్మేంద్రియములును అట్లుపయోగకరములును, అవి యెట్లు స్పష్టముగానుంచబడి మనకు లోబడి యుండనియెడల మన మార్గమున కాటంకములగునో ఇవియును అట్లే మనము వానిని చక్కగా నుపయోగించజాలనియెడల నాటంకములును, అగును. కనుక గురుని సహాయములేకుండ మన మాసిద్ధులను పొందుటకు ప్రయత్నించుట క్షేమముకాదు.

మన స్థూలేంద్రియములు మనకెంత భ్రాంతిని కలిగించుచున్నవో చూడుడు. ఒక పసిబిడ్డ తనకు దూరముననున్న దీపము సమీపముననున్నట్లు భావించి దానిని పట్టుకొనబోవును. ఎందుచేతననగా, ఆ బిడ్డ కన్నులతో చూచి దూరమును నిర్ణయించజాలదు ; నేత్రేంద్రియ మింకను బిడ్డకు స్వాధీనముకాలేదు. క్రమముగ పెద్దవారు దూరమున నున్నవస్తువును దగ్గరకు

తెచ్చి బిడ్డకందించుటవల్లగాని, బిడ్డ నావస్తువు చెంతకు గొనిపోయిగాని, ఆ యింద్రియమును బిడ్డ స్వాధీనము లోనికి వచ్చునట్లభ్యాసము చేయింతురు. ఆ విధముగనే క్రొత్తగా భువర్లోక దృష్టి వికసించినవాడును తన కాలోక దృశ్యములు విపరీతముగ గనిపించి, వానిని యదార్థముగ చూడజాలడు. గురువుచెంత నున్న యెడల శిష్యుడు చేయుపొరపాట్లను సవరించి చెప్పుచు, క్రమ ముగ నతడు యదార్థముగ జూచి తెలిసికొనుశక్తి గలిగించును.

చిన్నబిడ్డలనేగాక ప్రపంచానుభవముగల వయో వృద్ధులనుగూడ ఇంద్రియములు మోసగించును. మన కంటికి సూర్యు డుదయించుచున్నట్లు కనిపించును. నిజ ముగ సూర్యునకు చలనము లేకున్నను చలనభ్రమ మన నేత్రేంద్రియమువల్ల కలుగును. మూడు పాత్రలను గైకొని, యొకదానిలో నుడుకునీరును, ఒక దానిలో మంచువలె చల్లనినీరును, మూడవదానిలో సమపాళ ముగనున్న నీరును పోయుము. నీవొక చేతిని యుడుకు నీటిలోను, ఒక చేతిని చల్లని నీటిలోను బెట్టి కొంత సేపుంచి తీసి, రెండుచేతులను సమపాళముగనున్న నీటి లోనుంచి చూడుము. ఉడుకునీటిలోనుంచి తీసిన చేతికా నీరు మిక్కిలి చల్లగా దోచును, రెండవచేతి కది వేడిగా

తోచును. ఇంద్రియములను మనము పూర్తిగ నమ్మ రాదనుట కిట్టి నిదర్శనము లనేకములు చూపవచ్చును. మనము బుద్ధి నుపయోగించి యింద్రియములచే దెలి యు సంగతులను సరిచూచుకొని సంప్రతించుకోవలెను. సూక్ష్మేంద్రియ జ్ఞానముగూడ నావిధముననే మనలను మోసగించును.

అట్టి అణిమాదులను స్వయంకృషిచే పొందగోరిన వాడెంత ప్రయత్నము చేయవలెనో చూడుడు. ఎంత యో శ్రమపడి, ఎంత శక్తినో వినియోగించి, ఎన్ని సంవత్సరములో సాధనముచేసినగాని యవి లభించవు. ఆ సిద్ధులు నీ కన్ని సమయములలోను, మోసగించ కుండ, యదార్థమగు ననుభవముల నిచ్చుచున్నవని నిశ్చయము కానియెడల నీకు వానివల్ల ప్రయోజనము లేదు. అందుచేత, అడుగడుగునకును నీ యనుభవము లను పరీక్షించుకొనుచుండవలెను. భువర్లోక పరిస్థితులు పూర్తిగ తెలియనివా డందుకొఱ కెంతశక్తిని వినియో గించవలెనో చూడుడు. అంత శక్తిని వినియోగించి వానిని సంపాదించిన ప్రయోజనమేమి? నీ స్థూలేంద్రి యములకు గోచరములుగాని కొన్ని సూక్ష్మవిషయ ములు గోచరములగుట, యీ స్థూలశరీరముతో చేయ జాలని కొన్నిపనులను చేయగలుగుట, అంతకంటె

నెక్కువ ప్రయోజనములేదు. అవి నీకు చేతనైనంత మాత్రమున, నీకు మోక్షమార్గము సమీపించదు. అట్టిచో నీవంతశక్తిని వ్యర్థముచేసినట్లే గదా! యోగ మార్గమున శక్తులను దుర్వినియోగము చేయరాదు.

ఇది యిట్లుండ, అణిమాది సిద్ధులు నీకు లభించి నప్పుడు నీ శీలము నిర్దుష్టముగానియెడల, నీవు స్వార్థ మును విడువనియెడల, నీవాశక్తులను దుర్వినియోగము చేయవచ్చును. దానివల్ల నీకు పతనము సంభవించును.

అందుచేత, నీవు ఆ సిద్ధులను దుర్వినియోగముచేయ వని పరమగురువునకు నమ్మకము కలిగినప్పుడు, నీకా సిద్ధులు కలిగినయెడల వానిని నీవు లోకసేవార్థ ముప యోగించెదవని వారికి నమ్మకము కలిగినప్పుడు, నీ కవి వారే యొసంగెదరు. నీవు పరమగురువుసేవ కుప యుక్తుడవు కావలయునని నీవెంత తొందరపడుచున్నావో వారును అంత తొందరపడుచున్నారు, కనుక, నీవు సిద్ధముగ నున్నయెడల వారు నీకు చేయొసగుటకు సిద్ధ ముగ నుందురు. కాని వారు నీ కర్మకెన్నడు నాటంకము రారు, గనుక, నీవందుకు సిద్ధమగుటకు నీవే బాధ్యుడవై ప్రయత్నించవలెను. కనుక, మన మిప్పుడు మన శక్తుల నీ యణిమాది సిద్ధులు పొందుటకొఱకు దుర్వినియో గము చేయక, మోక్షమార్గమునుచేరు సాధనముల

యందు వినియోగింతము. ఇందు కీ తరువాత వాక్యము చూడుడు.

మూలము :—“ పరిపక్వము గాకమునుపే వానిని గలుగునట్లు చేసికొనినచో, వానిచే పెక్కులు తొందరలు గలుగును. మోసగాండ్రగు క్షుద్రదేవతలు ఆ సిద్ధులు గలవానిని దఱచుగఁ దప్పుద్రోవల కీడ్తురు. లేక వాఁడహంకారియై తాను పొరబాటు పడఁజాలనని యెంచికొనును. అది యెట్లుండినను, వానిని సాధించుటకువలయు కాలమును, బలమును, ఇతరులకై పనిచేయుటయందు వినియోగపఱుప వచ్చును.”

పరిపక్వము కానివానికి సిద్ధులు కలిగినయెడల వానిని వాడు దుర్వినియోగము చేయవచ్చునని చెప్పియుంటిమి. పరమగురు విచట మరిరెండు ప్రమాదములను చూపించుచున్నారు. మొదటిది క్షుద్రదేవతలవల్ల కలుగునది. దేవతలు భువర్లోక, సువర్లోకవాసులు. వారిలో పెక్కుగణము లున్నవి. వారిపరిణామము వేరు, మానవపరిణామము వేరు. వారిలో కొందరు క్షుద్రదేవతులుందురు. వారికి మన సూక్ష్మశరీరములు మాత్రమే గోచరములగును. వారికి మనుష్యులను తమ యా

జ్ఞానువర్తులుగ జేసికొని యాడించుట సంతోషకరము. వా రట్లుచేయుట కేవలము కొంటెతనముచేతనేగాని ప్రయోజనముండికాదు. నీకు వారు ఏ జూలియస్ సీజరు అనియో, ఏ నెపోలియన్ బోనాపార్టీ యనియో పేరు బెట్టుకొని భ్రమకలిగించి నమ్మింతురు. దివ్యదృష్టిగల వారి కిట్టి కొంటెచేష్టలవలన నెంతయో కష్టమగును. ఈ క్షుద్రదేవత లితర విధములుగ గూడ మనుష్యులను మోసగింతురు. భువర్లోకమును విడిచి సువర్లోకము చేరిన జీవుని భువర్లోకశరీరము కొంతకాలము విచ్ఛిన్నము గాక తేలి యాడుచుండును. ఆ శరీరమున నింకను ఆ జీవుని కామసంబంధమయిన యనుభవము లంటియుం డును. ఈ క్షుద్రదేవత లట్టిశరీరముల నాక్రమించి, ఆ శరీరముద్వారా దానిని విడిచిపెట్టిన జీవునివలె నటించి, మృతులవద్దనుంచి వార్తలను వినుచోట్ల జేరి, విను వారిని మోసగించును. కనుక, ఈ దేవతలవిషయమై జాగ్రతగ నుండవలెను.

ఈ సిద్ధులవల్ల నిన్ని ప్రమాదములున్నను నీవు పొర బడ వనుకొనుట రెండవప్రమాదము.

ఈ సిద్ధులను పొందగోరకుండుట కన్నిటికంటెను ప్రబలమైన కారణము వానికై వినియోగించవలసిన శక్తి నంతకంటె మంచిపనికై వినియోగించుట. మీకున్న

శక్తులను మీరు సద్వినియోగము చేయుచున్నయెడల, మీ కధికశక్తులు లభించినను, వానిని దుర్వినియోగ ముచేయరని పరమగురువునకు నమ్మకము కలుగును. మీకున్న శక్తులనే మీరు స్వార్థమునకై వినియోగించు చున్నయెడల మీకధికశక్తుల నిచ్చిన, మీకును లోక మునకును గూడ ప్రమాదమగును.

బైబిలులో నొక కథయున్నది. పూర్వమొక ధని కుడు దేశాంతరమునకు బోవుచు తన ధనమును తన సేవకుల కొప్పగించెను. వారిలో నొకని కైదును, ఒకనికి రెండును, ఒకని కొకటియు నాణెముల నిచ్చెను. (ఈ నాణెములపేరు Talents టాలెంట్లు. ఈ Talent అన్న మాటకు ధీశక్తిఅనికూడ అర్థమున్నది. ఆ యర్థమున గూడ నీ కథ దృష్టాంతముగ నుపయోగించును.) కొంత కాలమున కాధనవంతుడు తిరిగివచ్చి సేవకులను తా నిచ్చిన ధన మేది యని యడిగెను. మొదటి యిద్దరును తమకిచ్చిన నాణెములతో వ్యాపారముచేసి వృద్ధిచేసి యుండిరి గనుక వా రావృద్ధితోగూడ తమకిచ్చిన నాణె ములను తిరిగి యజమాని కిచ్చిరి. మూడవవాడు తన కిచ్చిన యొక్కనాణెమును దాచి భద్రముగ నుంచి, దానినే తెచ్చి యజమాని కిచ్చెను. యజమాని ఆ నాణె ము నతనియొద్దనుండి తీసికొని యతనిని పంపివేసెను.

తక్కిన వారిద్దరిని బహూకరించెను. ఆ యజమాని యిట్లనెను "కలిగిన ప్రతివాని కియ్యబడును; అతనికి సమృద్ధికలుగును. లేనివాని యొద్దనుండి వానికి కలిగినదియు తీసివేయబడును". (మత్తై: 25—29). ఇది లోకవిరుద్ధముగ గనబడును. కాని, దీని యంతరార్థమిది. తనకున్న శక్తులను పూర్తిగా వినియోగించిన వానికి క్రొత్తశక్తు లొసంగబడును. తన శక్తుల నుపయోగించనివాడు (అనగా, జ్ఞానదృష్టితో జూచినయెడల శక్తులు లేనివాడు) ఉన్నశక్తుల నుపయోగించు నవకాశము గోల్పోవును; ఆ శక్తులు క్షీణించిపోవును.

పరమగురువులు నీ కెంతశక్తి యున్నదని చూడరు. నీ యుపకారబుద్ధిని మాత్రమే చూచెదరు.[1]

మూలము :—"మనుజుఁడు పరిపక్వము కానుకాను అవి వచ్చును. రాక తప్పదు. అంతకంటె ముందు నీ కవి కలుగుట యుపయోగకరమని పరమగురువుకుఁ దోఁచినచో నిరపాయముగ వాని నేవిధమున నీవు పొందఁగలుగుదువో వారు నీకుఁ జెప్పెదురు, అంతఁదనుక నీ కవి లేకుండుటయే మేలు."

[1] పురాణ ప్రసిద్ధమైన రంతిదేవునిచరిత్ర యిందుకు నిదర్శనము.

అణిమాది సిద్ధులుగలవారు పరోపకారపరాయణు లైయుండుట జూచి, తమకును అట్టిసిద్ధులు కలిగిన యెడల పరోపకారము చేయవచ్చునను నభిప్రాయము కొందఱికి కలుగును. అట్టి యభిప్రాయముకలుగుటలో తప్పులేదు. కాని, ఆ సిద్ధులుకలుగుటకు మాత్రము అవి స్వాభావికముగ గలుగువరకును వేచియుండవలెను, లేదా, పరమగురువు నీ కవి లభించుటవల్ల ప్రయోజన మున్నదని కనిపెట్టి, అవి నీ కెట్లుకలుగునో చెప్పువర కును వేచియుండవలెను.

ఆ శక్తులు పొందుటలో నీ కపాయము కలుగకుండ పొందువిధమును చెప్పుదురనుటవల్ల పరమగురువు నాజ్ఞ లేకుండ నీ వాశక్తులు పొందుటకు ప్రయత్నించినయెడల నపాయము సంభవించుననికూడ సూచింపబడుచున్నది.[1]

---

[1] బజారులో దొరకు పుస్తకములను చదివి ప్రాణాయామాది హఠ యోగసాధనము లభ్యసింతురు, గాని వానివల్ల నిదియే ప్రమాదము.

నాలుగవ అధ్యాయము

## అల్పకామములు

మూలము :—"మఱియు దినచర్యయందుఁ గొన్ని యల్పకామములు సామాన్యముగఁ గలుగును. వాని విషయమై మెలఁకువతో నుండుము. లోకమున నీవు ప్రకాశించవలెననిగాని, చమత్కారమును జూపవలెననిగాని యెన్నఁడును కోరకుము."

సర్వసాధారణముగ నిప్పటి జనులందరిలో నీ కోరిక యున్నది. మాటలాడుటలో చమత్కారము జూపవలయునని, ఇతరులు తమ్ము మంచివారనుకోవలయునని, ప్రతివానికిని కోరిక యుండును. ఒకసారి పరమగురువును ప్రత్యక్షముగ దర్శనముచేసిన వాడెవ్వడును తాను ప్రకాశించవలెనని కోరడు. పరమగురుని మహాత్మ్యమును జూచినతరువాత, తన యందెంత శక్తియున్నను, అది దివాకరునియెదుట దివిటీవలె నుండునని యాతడు గ్రహించును. కనుక, వానికి ప్రకాశించవలెనని బుద్ధి పుట్టదు. అదివర కట్టిబుద్ధి యున్నను అది పోవును. తన

దివిటీ లోకములో ప్రకాశించి కీర్తి సంపాదించవలెనని కోరువాడంతకంటె గొప్ప దీపములను చూచినవాడు కాడు, కనుక, వాని కాంతాతారతమ్యము తెలియదు.

కాని, మన దివిటీని మూతబెట్టి దాచనక్కర లేదు. అట్లు దాచినయెడల నది యారిపోవును. మనకున్న ప్రతి శక్తిని అది యెంతయల్పమైనది యైనను, లోకసేవార్థము వినియోగించవలయును. ఈ సంసారసముద్రమున బడి కొట్టుకొనువారికి దారిచూపుటకు సముద్రతీరమున గావలసినది జగద్గురుని మహాత్మ్యమను దీపస్తంభ మొక్కటియేకాదు. దాని కాంతి మిక్కిలి తీక్ష్ణమైనది యగుటను అది కొందరి కండ్లను చెదరగొట్టును. వారు దానిని జూచుటకు కన్నుల నెత్తజాలరు, గనుక, వారికి దాని యునికియే తెలియదు. అట్టివారికి సులభముగ దెలియదగిన దివిటీలుకూడ సముద్రతీరము పొడుగున నుండవలెను. మన దివిటీలలోగూడ. కొన్ని హెచ్చు కాంతి నిచ్చును, కొన్ని తక్కువకాంతి నిచ్చును. కాని ప్రతి దివిటీచెంతను తమ జ్ఞానదృష్టిని వికసింపజేసికొనదగినవారు లోకములో నున్నారు. కనుక, మనలో ప్రతివాడును చేయగల సేవ యున్నది. ఆ సేవ జేయవలయును, గాని, కేవలము ప్రకాశించుటకు మాత్రము, కీర్తినిసంపాదించుటకు మాత్రము, ఎన్నడును కోరరాదు.

మూలము :—" మాటలాడవలయునను కోరికను విడువుము. కొంచెము మాటలాడుట మంచిది. నీవు చెప్పఁ గోరునది సత్యమును, ప్రియమును, ఉపకారకరముగను, ఉన్నదని నీకు దృఢనిశ్చయముగఁ దోఁచువఱకు నేమియు మాటాడకయుండుట దానికంటె మంచిది. నీవాడఁబోవుమాట యీ మూఁడు గుణములఁగలిగియున్నదా లేదా యని జాగరూకతతో యోచించి అట్లుకానిచో నామాట నాడకుము."

ఎల్లప్పుడును విధి విరామము లేకుండ మాటలాడుచుండ గోరువా రనేకులున్నారు. వారు ప్రయోజనకరముగ మాట్లాడదగిన విషయము లెప్పుడు నుండవు. అందుచేత, వారు నిష్ప్రయోజనములును, విన నర్హములుగానివియు నగు మాటలనాడి, లోకమునం దిదివర కున్న వృథాప్రసంగప్రవాహమును మిక్కిలి బలపరచుచుందురు. వారు తమ నాలుకలను లోబర్చుకొనజాలక, వాటికి దాసులై, లోకమున జెప్పనలవికాని కీడు కలుగజేయుచున్నారు. ఆ కీడు కలుగకుండుటకు ప్రతివారును, పరమగురు విచ్చట చెప్పినట్లు, తాము ఆడదలచిన ప్రతిమాటయును సత్యమును, ప్రియమును, ఉపకారకరములై యున్నదా లేదా యని యోచించి,

అట్లున్న నే ఆమాట నాడుట నేర్చుకొనవలెను.[1] దానివల్ల మొదటలో నీవు సంభాషించుట చాల యాలస్య మగుచుండును. కాని, క్రమముగ నభ్యాస మగును.

వృథాప్రసంగమువల్ల నీ శక్తియు వ్యర్థముగ వ్యయ మగును. 'అరచే కుక్క కరవ' దన్నట్లు ఎక్కువగా మాట్లాడువాడు పనిచేయడు. ఇతరులతో గలిసియున్న ప్పుడు మౌనముగ గూర్చున్న యెడల, కొందరు తప్పు పట్టుదురు. వారు మౌనముగ నున్నవాడు గర్వపోతని గాని, ఉదాసీనుడనిగాని, ఇతరులతో కలిసిమెలసి యుం డుట కిష్టములేని యొంటెత్తువాడనిగాని, భావింతురు. అట్టి సమయములలో నొకొక్కప్పుడు కష్టపడి ప్ర యత్నముచేసి మాట్లాడవలసియుండును. నిరుపయోగ

[1] ఇది వాఙ్మయ తపస్సులోచేరినదని శ్రీమద్భగవద్గీతలలో చెప్పబడినది. శ్లో॥ అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ । స్వాధ్యాయాభ్యాసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥ (గీతా ॥ 17—15) ఉద్వేగమును కలిగించనట్టియు (అనగా, భయ ము, కోపము, దుఃఖము మొదలగు తీవ్రసంచలనములను ఎదుటివాని యందు కలుగచేయనివి), సత్యమును, ప్రియము (ఇహలోక ఫలము కొఱకైనది)ను, హితము (పరలోక ఫలముకొఱకైనది)ను అయినట్టియు మాటలనాడుట, వేదశాస్త్రాదుల నధ్యయనముచేయుట, వాఙ్మయ తపస్సు అని అర్థము. శ్రు॥ సత్యం బ్రూయాత్, ప్రియం బ్రూయాత్, ప్రియం చ నానృతం బ్రూయాత్, నబ్రూయాత్సత్యమప్రియం.

కరములగు మాటలను, సత్యము ప్రియము కాని మాట లను ఆడరాదు, గాని, మాట్లాడవలసిన విషయము లున్నప్పుడు మాట్లాడవద్దని నియమములేదు.

ఎక్కువగ మాట్లాడువాడు యదార్థముగ మాట్లాడ జాలడు. వాడు కావలెనని యసత్యము చెప్పకపోవచ్చు ను, గాని, వా డెప్పుడు నున్నదియున్నట్లు చెప్పజాలడు. అయథావతుగ మాట్లాడుటయు, అతిశయోక్తులనా డుటయు, గూడ అనృతమాడుటయే. దానివల్ల మాట్లా డువానిచుట్టును అనృతపూరితమగు వాతావరణము బయలుదేరి మిక్కిలి కీడొనరించును. తన నాలుకను[1] సాధించినవా డన్నిటిని సాధించినవాడని మనువ్రా సెను. మరియు, నొక క్రైస్తవబోధకుడు 'నాలుక చిన్న యవయవమైనను, గొప్ప విషయములనుగురించి దర్ప ములాడును. ఒకచిన్న యగ్నికణ మెంత గొప్పపదార్థ మును తగులబెట్టునో చూడుడు! నాలుకయగ్ని, దౌర్జన్య ప్రపంచము' అని చెప్పెను. నాలుకను లోబరచుకొనుట నీచప్రకృతిని సాధించుకొనుటయే.

[1] నాలుక యనగా రుచియనియు వాక్కనియు గూడ నర్థము చెప్ప వచ్చును. జ్ఞానేంద్రియములలో ముఖ్యముగ సాధించవలసినది రస నేంద్రియము. కర్మేంద్రియములలో ముఖ్యముగ సాధించవలసినది వాగింద్రియము. ఈ రెండింటికి స్థానము నాలుక కనుక ఈ వాక్య ము రెండు అర్థములను సూచించునని చెప్పదగును.

సాధారణముగ సంభవించు తలనొప్పి, అస్వస్థత, ఖిన్నత, మొదలగు స్వల్పరుగ్మతలు నిరర్థక ప్రసంగము వల్లగూడ గలుగును. అవి కలిగినప్పుడు మౌనము నభ్య సించవలయును. వృథాప్రసంగమువల్ల నరముల బలము వ్యర్థముగ వ్యయమగును.

వ్రతములలో మౌనవ్రతము బహుగొప్పది. ముని యనగా మౌనవ్రతుడని యర్థము. ఇతర విధముల సాధింపజాలని పరమార్థములను మౌనవ్రతముచే సాధిం చినవా రున్నారు. అయితే, లౌకిక వ్యాపారములలో నున్నవారికి శుద్ధమౌనము సాధ్యముకాదు. కనుక, వారీవ్రతముయొక్క యుద్దేశము నెఱింగి, యవలంబించ వలెను. అది యెద్దియన: నిరర్థకముగ నొక మాట యైన నాడకుండుట; ఆడదలచినమాట సత్యముకాని యెడల నాడకుండుట; సత్యమైనను, ప్రియముగ నా డుట; సత్యమును ప్రియముగనాడినను అది నీ యెదుటి వానికి హితవు గానియెడల నాడకుండుట; నీ యెదుటి వానికి హితవుగ నుండునని యిచ్చకము లాడుటయును, సత్యమును పలుకుచున్నానను గర్వముతో నెదుటివాని కపకారకరములగు మాటలాడుటయును, వాని క ప్రియ ములును, విన సహించనివియు నగు మాటల నాడి వానిని నొప్పించుటయు, వృథాప్రసంగమే యగును.

మూలము :—"మాటాడుటకుముందు జాగరూకతతో నాలోచించుట నిప్పటినుండియే వాడుక చేయుట మంచిది. ఏలయనఁగా నీవు పరమగురువునొద్ద మహోపదేశమును బొందినపిదప చెప్పరానిది యెద్దియైనను చెప్పుదునేమో యని ప్రతిమాటయును పరిశీలించవలసియుండును."

వృథాప్రసంగమువల్ల గలుగు ప్రమాదములలో గొప్ప ప్రమాద మిచట చూపబడినది. అనాలోచితముగ మాట్లాడువారు తాము వెల్లడించుట కధికారము లేని రహస్యములను వెల్లడింతురు. వారట్లు బుద్ధిపూర్వకముగ జేయకపోయినను, అనాలోచితముగ జేసినను, దానివల్ల కలుగు ప్రమాదము కలుగక తప్పదు. పరమగురువునొద్ద మహోపదేశము నొందినప్పుడు, వెల్లడించగూడని పరమరహస్యములు కొన్ని శిష్యునకు తెలియజేయబడును. అవి రహస్యములుగ నుండుటకు కేవలము శిష్యుని జాగ్రత్తపైననే యాధారపడియుండక, ఇతర యేర్పాట్లనుగూడ పరమగురువులు చేసియుంచినారు. ఒకప్పు డెవడైన నట్టి రహస్యము నొకదానిని బయలుబెట్ట దలచినయెడల, వాడు మాట్లాడుటకు ముందే, వాడు బయలుపెట్టవలసిన యొక రహస్య మున్న

దన్న సంగతినే మరచిపోవును. ఈ యేర్పాటువల్ల నా రహస్యము లెన్నటికిని బయలుపడవు. కాని, రహస్యముగ నుంచవలెనని యాజ్ఞాపించబడిన రహస్యము విషయమై యజాగ్రత్తగనున్న శిష్యుడు బహుదురవస్థపాలగును. లౌకిక వ్యాపారములలోనుండి, వైహిక విషయములలో మునిగియున్నవాడు తప్పుచేసినయెడల వాని పతనము నేలపైని నడుచుచు కాలు జారి పడుటవంటిది. జ్ఞానదీక్షనుపొంది, ఉన్నతాధ్యాత్మికస్థితియందున్నవాని పతనము, కొండమీదనుండి క్రిందకు పడుటవంటిది. కనుక, అప్పుడట్టియవస్థపాలగుట కవకాశము లేకుండ నీప్పటినుండియు మౌనవ్రతము నభ్యసించవలయును.

మూలము :—"లోకులాడుకొను మాటలు చాలమట్టుకనావశ్యకములుగను అవివేకములుగను నుండును. ఇతరుల విషయమై వృథాప్రసంగములైనపుడు ఆ మాటలు దుర్మార్గములేయగును."

వృథాప్రసంగమువల్ల కలుగున దిది యొక ప్రమాదము. నలుగురొకచోట గూర్చున్నప్పుడు కాలక్షేపమునకు ఆడుమాటలలో, ఇతరులకెవ్వారికైన సంతోషము గలిగించి వారిని తమయెడల ప్రసన్నులుగ జేసికొను

టకు, పరులనుగుఱించిన ప్రసంగములు జరుపుచుందురు. నిజమగు మిత్రులొకచో జేరినప్పుడు ప్రయోజనకరములగు విషయములనుగుఱించి ప్రసంగించుకొనవచ్చును; లేదా, మౌనముగనున్నను, వారన్యోన్య సహవాసమును చక్కగ ననుభవించుచు, దృఢమగు నభిప్రాయ సామాన్యత గలిగి యుండగలరు. ఇక నిచ్చకములాడువారు ద్రోహులని వేరుగ జెప్పనక్కరలేదు. పరులనుగుఱించి మాట్లాడునపుడు వారి మంచినిగుఱించియు చెడ్డనుగుఱించియు గూడ ప్రసంగములు వచ్చును. మంచినిగుఱించిన ప్రసంగమువల్లనంత చెడుగులేదనుకొందము; చెడ్డనుగుఱించి ప్రసంగించుటవల్ల, నది నిజమైనను, కాకున్నను, కూడరాని చెడుగు కలుగును. కనుక, అత్యగత్యమైన సమయములలో దక్క పరులను గుఱించి ప్రసంగించుట మానుటయే మేలు. (ఈ విషయమై పై 149 మొ॥ 154 వరకు పుటలలోను, ఈ భాగము అయిదవ యధ్యాయ ప్రారంభమునను చూడుము.)

మూలము :—"కావున నీవు మాటాడుటకు మాఱుగ ఇతరులు చెప్పుమాటల నాలకించుటను వాడుక చేసికొనుము. నిన్నుఁ బ్రత్యేకముగ నడిగినంగాని నీ యభిప్రాయముల పైబడి చెప్పకుము."

కొందరు తమకు తప్పులనిగాని, అసంపూర్తిమైన దనిగాని, తోచిన యొక మాటను వినగానే దానిని ఖండించి, వాదమును, విరోధమును కలిగించకుండ నుండజాలరు. ఇతరుల యభిప్రాయములను దిద్దుటగాని, తప్పుచేసిన వారినందరిని సరియైనత్రోవను బెట్టుటగాని మన పనికాదు. మన చేతనైనంతవరకు, నెమ్మదిగ నితరుల కుపకారము చేయుచు బోవుటయును, ఏ విషయమును గురించియైన నెవరైన మన యభిప్రాయము నడిగినప్పుడు, ద్వేషభావములేక, శాంతముగను, మితముగను, చెప్పుటయును మనపని. మన యభిప్రాయము లితరులకు ప్రయోజనకరములని మన మనుకొన నక్కర లేదు. ఒకప్పు డట్లు కాకపోవచ్చును. అప్పుడు దానిని వారిపై బలవంతముగ ద్రోయుటతప్పు. ఒక డొక విషయమున నిశ్చితమగు నభిప్రాయము గలిగియుండవచ్చును, అది తప్పులని నీకు బాగుగ తెలిసియుండవచ్చును, కాని, వానిని నీ వద్దుపెట్టక మాటాడనిచ్చుటయే మేలు. దానివల్ల నాతడు సంతసించును, నీకు నష్టము లేదు. అతడు భూమి బల్లపరుపుగ నున్నదనిగాని, సూర్యుడు భూమిచుట్టును తిరుగుచున్నాడనిగాని నమ్మవచ్చును. అది వానిపని. నీవు ఉపాధ్యాయుడవై, బాలురకు బోధించుటకు నియమించబడినప్పుడు, ఆ బాలు

రట్టి తప్పుఅభిప్రాయములను గలిగియున్నయెడల, వా
నిని సవరించుట నీవిధి. అప్పుడైనను నీ వాపనిని
నెమ్మదిగను, మృదువుగను చేయవలెను. ఎవరి శీలమున
కైన భంగము గలిగించు మాటల నొకడాడుట నీవు విన్న
యెడల, నీవు శాంతముగ "క్షమింపుము, నీవు చెప్పు
నది సరికాదు, అసత్యము" అని చెప్పి యథార్థమును
తెలియజేయుట నీ ధర్మము. ఏలయన, అప్పుడొక
యసహాయుడు నిందింపబడుచున్నాడు, గనుక, వానిని
కాపాడుట నీ ధర్మము.

మూలము :—"మోక్షసాధనముల స్వరూపమిట్లని యొకచోట నిరూపింపఁబడి యున్నది — తెలిసికొనుట, సాహసించుట, మనోనిశ్చయముచేయుట, మౌనముగ నుండుట, యని.[1] ఈ నాల్గింటిలో గడపటిది యన్నింటిలో కష్టమైనది."

మనము ప్రకృతిశక్తులను తెలిసికొని, వాని నుపయో
గించుటకు సాహసించవలెను. మోక్షమార్గమున మనకు
లభించు గొప్పశక్తుల నుపయోగించుటకు ఆశక్తులను

[1] To know, to dare, to will and to be silent. ఇదివరకు Rosicrucians (రోజక్రూషియన్లు) అను నొక క్రైస్తవ సంప్రదాయకు లీ సిద్ధాంతము నవలంబించిరి.

నియమించగల దృఢమైన యిచ్ఛాశక్తి గలిగియుండు టయే గాక, ఆత్మనిగ్రహముగూడ గలిగియుండవలెను. ఇవన్నియు గలిగియు వానినిగుఱించి మౌనము వహించుటకు తగినంత జ్ఞాన ముండవలెను.

---

అయిదవ అధ్యాయము

## నీ పనిని నీవు చూచుకొనుము

మూలము :—" ఇతరుల పనులయందు వ్రేలు పెట్టఁ గోరుట సామాన్యమగు మఱియొక కోరిక. దీనిని నీవు ఖండితముగ నణఁచుకొనవలయును. మఱియొకఁడేమిచేయునో, యేమిచెప్పునో, యేమి నమ్మునో, అనునది నీపనిగాదు. వాని యిష్టానుసారముగ పోను పూర్తిగా వానిని విడుచుటకు నీవు నేర్చుకొనవలయును. వాఁ డితరుల కడ్డమురాకయుండు నంతవఱకు, వాఁడుదలఁచు తలంపులకును, ఆడు మాటలకును, చేయు పనులకును, వాఁడు సర్వస్వతంత్రుడు. నీకు యుక్తమని తోఁచునట్లు చేయుటకు నీవు స్వాతంత్ర్యమును కోరుచున్నావుగదా! వానికి నట్టి స్వాతంత్ర్యము నియ్యవలయును. వాఁడా స్వాతంత్ర్యమును వినియోగించినపుడు వానినిగుఱించి మాట్లాడుట నీకు ధర్మము గాదు."

ఒకనిచర్య యితరుల కేవిధముగను హానిచేయక యున్నంతవఱకు నీవు దానితో జోక్యము కలిగించుకో

రాదు. ఒకడు మరియొకని శీలమునుగుఱించి మాట్లాడి నపు డేమిచేయవలయునో యిదివరకు చెప్పియుంటిమి. అట్లే యొక డింకొకనిని బాధించుట నీవు చూచినయెడల, దానిని తొలిగించుట కేదైన నుపాయము చెప్పుట యొకప్పుడు నీ ధర్మమై యుండవచ్చును. అట్టి తరుణ ములలోగూడ అన్ని సమయములలోను మనము చొరు చుకొని చెయిజేసికొన దగదు.

వ్యక్తిస్వాతంత్ర్యమున్నదని గర్వించు దేశములలో గూడ నిజముగా నట్టి స్వాతంత్ర్యములేదు. ఏలయన, నచటి జనులు కొన్ని యాచారములకు బద్ధులైయుండి, అవి యుల్లంఘించిన నెవరికిని నష్టములేకున్నను, ఉల్లం ఘించిన వారి ననేకవిధముల బాధింతురు. స్వల్పవిషయ ములలోనే వ్యక్తిస్వాతంత్ర్యము దొరకనప్పు డితర విషయములలో నెట్లు దొరుకును. తనకూడు తిని, తన బట్ట కట్టుకొన్నను, లోకమునకు వెఱచియుండవలెనని సామెత గలదు. అది నిజమే, కాని, లోకమునకు కీడొన రించనంతవర కెవడేమిచేసిన నేమి నష్టము? ఒకడు చేసిన పనిగాని, ఆలోచనగాని, యొకడాడిన మాటగాని నీకు నచ్చకపోవచ్చును. అంతమాత్రమున నీ యభి ప్రాయము ననుసరించి వాడు ప్రవర్తించవలెనని నీవు వానిని కోరుటకు నీకేమియు నధికారములేదు.

పాఠశాలలోని బాలురకుగూడ వారివారి పూర్వ జన్మవాసనలవల్ల వారి కేవిషయములలో జ్ఞానవికాస మేవిధముగ గావలసియున్నదో తెలిసికొని ఆయా విషయములలో, వారి కనుకూలమైన విధమున బోధించవలయునుగాని యుపాధ్యాయుని యిష్టమువచ్చినట్లును, అందరకు నొక్కరీతిగను, బోధించకూడదని పండితులిప్పుడంగీకరించుచున్నారు.

మన మితరులకు చేయగోరిన సహాయము వారికి ఉపయోగించనప్పుడు వారు దాని నంగీకరించరు. అట్టి స్థితిలో మనము వారికి బలవంతముగ తోడ్పడబోయిన యెడల నది వారి కపకారము గావచ్చును.

నిజమగు జ్ఞాని, తా నితరుల కెప్పుడు సహాయము చేయగలడో, ఎప్పుడు చేయజాలడో తెలిసికొని, యదను తెలిసి సహాయము చేయును, గాని, తన శక్తిని వ్యర్థము చేయడు. అభ్యాసముచే నట్టి యదను తెలిసికొనవచ్చును.

ఒకడు చేయబూనిన పనిని చక్కగాను నేర్పుతోను చేయుటకు వాడు బాధ్యుడు. ఆ పనిని చేయుటలో వాని యాత్మశక్తి వ్యక్తమగుచుండును. దానికి నీ వడ్డు వచ్చినయెడల వాని యాత్మశక్తి పూర్తిగ వ్యక్తముకాదు. ఇంతకును వాని పనిని వానికంటె నీవు

బాగుగ జేయగలవనుకొని నీవు దానిలో ప్రవేశించుట పొరపాటు.

తమకు స్వాతంత్ర్యముకావలెనని బైలుదేరువా రిత రుల కా స్వాతంత్ర్యము నిచ్చుట కెంతమాత్రమును అంగీకరించరు. నీవు అభిలషించు స్వాతంత్ర్యమువంటి స్వాతంత్ర్యము అందరికిని కావలెనని నీ వంగీకరించక తప్పదు. ఒకరి యభిప్రాయముల నంగీకరించుటకు నీ వెంత వివేకము నుపయోగించెదవో నీ యభిప్రాయములను వారంగీకరించుట కంత వివేకము నుపయోగింప నిమ్ము. ఇతరులకు స్వేచ్ఛ నిమ్ము. నీవు బంధితుడవు కాకుము.

మూలము :—"వాఁడు తప్పుచేయుచున్నాఁడని నీకుఁ దోఁచినచో, తగు సందర్భమును గుదుర్చుకొని, యేకాంతమున, వినయముతో, నీ కట్లుతోఁచుటకుఁ గారణముల వానికిం జెప్పుము. అప్పుడు వాఁడు నీ యభిప్రాయము సరియనియొప్పిన నొప్పవచ్చును. అయిన నింతమాత్రమైనను బ్రవేశించుట యనుచితముగ నేర్పడు సమయము లనేకములు గలవు. అది యెట్లుండినను, నీ వెన్నఁడుగాని మూఁడవవాని యొద్దకుఁబోయి యామాటల సల్లాపముగ నాడగూడదు. ఏలయన నది మిగుల దుర్మార్గమైన పని."

ఒకడు నీతికి దూరమైన పనిని చేయుచున్నాడని నీకు తెలిసినప్పుడు, వానికి నీవు సహాయముచేసి సరియైన త్రోవనుబెట్టుటకు ప్రయత్నించవచ్చును. కాని, యది మిక్కిలి నేర్పుతో జేయవలెను; లేనియెడల మేలుకంటె కీడెక్కువ గలుగవచ్చును. ఈ వాక్యములో సూచించినట్లు ముందు వానితో మాట్లాడుటకు తగినసమయము కనిపెట్టవలెను. వాని మనస్సు సరియైన స్థితిలో లేనియెడల నీవు చెప్పిన సంగతు లేవియు వానికి నచ్చవు. నీ యభిప్రాయములను అతడు శాంతముగ వినినప్పుడే గాని, వాని మంచిచెడ్డల నాలోచించుటకు అతనికి బుద్ధిపుట్టదు. అందుచేత, నీ వసమయమందు వానితో మాట్లాడబోయినయెడల, మొదటలోనే నీయం దతనికయిష్టత కలిగి, నీ మాటల నతడు మన్నించడు. కనుక, నీ మాటల నతడు వినుటకు తగిన సమయమును కనిపెట్టవలెను. తరువాత, నీవు చెప్పదలచినది యుక్తియుక్తముగ నుండవలెను; వాని మనస్సునకు ఏవిధముగ జెప్పిన నచ్చునో ఆవిధముగ జెప్పవలెను. నీవు వానితో నేకాంతముగ మాట్లాడవలెనని యిచట చెప్పినారు. ప్రతివానికి ఆత్మాభిమాన ముండక తప్పదు. తాను తప్పుపని చేసినానన్న సంగతి యితరులు వినుట కిష్టపడక పోవచ్చును. అదియే వాని ప్రథమ తప్పితమైనప్పుడును,

అతడు నిజముగ నిర్దోషియైు, పైకి దోషి యైన ట్లను మానించదగిన కారణములున్నప్పుడును, అతని కాసం గతి నితరులు వినగూడదను నభిలాష యెక్కువగ నుండును.[1] అట్టి స్థితిగతు లేవియైన యుండునేమో నీకు తెలియకపోవచ్చును. అందుచేత, ఏకాంతముగ మాట్లాడవలయును. నీవ ట్లేకాంతముగ మాట్లాడిన యెడల వాని యాత్మగౌరవము గాపాడిన వాడవని నీ యందు తనికి గౌరవమును, అందుచేత, నమ్మకమును కలుగును. మాట్లాడునపుడు నీవు మిక్కిలి శాంతముగ నుండవలెను. నీ మాట నతడు విననప్పుడు నీకు రోషము రాకూడదు. నీకు రోషమువచ్చిన, వానికిని రోషము వచ్చును, అసలుకార్యము చెడును. ఇంతకును, నీవు చేయబూనిన పని, వానిపనిలో వ్రేలుబెట్టుట ; అనగా, నీకు అధికారములేని పనిని పూనినావు ; కనుక, నీవు రోషము చెందుటకు కారణ మేమియు లేదు.

ఇన్నియును చెప్పి, పరమగురు వావిధముగ గూడ నీవు ప్రవేశించుట యనుచితమగు సమయము లనేకము లుండునని చెప్పుచున్నారు. ఇది బహుదూర దృష్టితో

[1] కొన్ని దేశములలో న్యాయస్థానములలో గూడ కుటుంబకలహములతోను, బిడ్డలు చేసిన నేరములతోను సంబంధించిన కొన్ని యభియోగములను రహస్యముగ విచారణచేయు ఆచారముకలదు.

నుష్ఠించదగిన విషయము. స్వాతంత్ర్యము నభిలషించు వానిని వాని స్వానుభవమువల్ల మంచిచెడ్డలను తెలిసికొనుటకు విడిచిపెట్టవలెను.

ఒకడు నీ సలహానుగాని సహాయమునుగాని కోరి వచ్చినప్పుడేగాని, సాధ్యమైనంతవరకు, నీయంతట నీవు చెయి జేసికొనకుండుట యుక్తము. దీనికి కొన్ని మినహాయింపు లుండవచ్చును.[1] అప్పుడైనను, అతడు నీ యభిప్రాయమునందు తనయభిప్రాయమునందుకంటె నెక్కువ నమ్మకముంచి, నీవు చెప్పుదానిని ఉపేక్షించక యాలోచించునని, నీవు దృఢముగా నమ్మినప్పుడే, నీ యభిప్రాయమును చెప్పుట మంచిది.

ఒకడు చెడ్డపని చేసినట్లు నీవు విన్నప్పుడు, నీవు ఆ సంగతి నితరులతో సల్లాపముగ జెప్పుట దుర్మార్గమైన పని. నీవితరులకు జెప్పకతప్పని సమయములు కొన్ని యుండును. ఒకడు హత్యగాని అటువంటిదే మరియొక నేరముగాని చేసినప్పుడు చట్టముప్రకారము నీ వా సంగతి యధికార్లకు తెలియజేయు బాధ్యత నీకునుండును. ఒక బాలుడు చెడుసహవాసము చేసి, చేయరాని పనులు చేయుచుండగా నీవు చూచినయెడల, వాని తలిదండ్రుల కాసంగతి జెప్పవచ్చును. ఇట్టి ధర్మబాధ్యత యున్నప్పు

[1] తరువాత వాక్యమును చూడుడు.

డేగాని, ఊఅక కూర్చుని యుబుసుపోకకై యట్టి సంగతులను గుఱించి మాట్లాడరాదు. అందుచేత నిచట 'సల్లాపముగ' మాట్లాడరాదని చెప్పబడినది. పైని చెప్పిన మినహాయింపుల నీక్రింద చెప్పుచున్నారు.

మూలము :—"పిల్లలనుగాని పశువులనుగాని యెవరైనను హింసచేయుటఁ జూచితివేని నీ వడ్డముపోవుట, నీకు ధర్మము."

తమను తాము కాపాడుకొనజాలని బలహీనులను బలవంతులు కాపాడుటకు బాధ్యులైయుండియు, అట్లు కాపాడక, వారి బలహీనత నవకాశముగా గైకొని, తమ బలమును వారిపై నుపయోగించి, హింసించుచున్నప్పుడు అడ్డుపడుట నీ ధర్మము. అట్టి హింస జరుగుచున్నప్పుడు బలముగలవాడు మధ్యపడి, యా బలహీనుల హక్కులకు భంగము కలుగకుండను, ఇతరుల స్వాతంత్ర్యమునకు భంగము కలుగకుండను, చూచుట ధర్మము ; కనుక, అట్టి సమయములలో నీ వడ్డుపడి, నీ వడ్డుపడుట సార్థకమగునట్లు చేయవలెను.

మూలము :—"దేశపుఁజట్టములకు విరోధముగ నెవరైన వర్తించినచో నీవు దాని నధికారులకుఁ దెలుపవలయును."

మన దేశమున నీ వాక్యమునుగురించి బాగుగా దెలియవలసియున్నది. ఇది బహుముఖ్యమైన విషయము. మన దేశమున వ్యవహారమునందున్న చట్టములలో గొన్ని నేరములు జరిగిన సంగతి నెఱిగిన వాడా సంగతి నధికార్లకు తెలియ జేయవలెననియు, అట్లు తెలియచేయక మభ్య పెట్టిన యెడల, వాడా నేరమున సహకారిగా నెంచబడుననియును శాసించబడియున్నది. ప్రతిపౌరునకును శాసనము నతిక్రమింపకుండుట యొక ధర్మము. శాసనోల్లంఘనము జరుగుచుండుట చూచి నపు డట్లుజరుగకుండచూచుట మరియొక ధర్మము. ఇవి పౌరధర్మములలో మొదటివని చెప్పవచ్చును. ఈ ధర్మమే దేశములో నవలింబించబడదో యా దేశమున నింకను పౌరధర్మములును బాధ్యతలును జనులకు తెలియ లేదనుకొనవలయును. అయితే, యీ విషయమున గొన్ని దురభిప్రాయము లుండుట కవకాశమున్నది. మొదటిది, నీ వెప్పుడును, ఇతరుల చర్యలను కనిపెట్టి చూచుచు, ఎవడైన నేదైన నేరముచేయునా, వానిని పట్టుకొని యధికార్లకొప్పగింతునా, యని చూచుచు కూర్చొన నక్కఱలేదు. అట్లు చేయవలయునని యిందు సూచింపబడుటలేదు. రెండవది, ప్రతినేరమునుగురించియు నీ వధికార్లకు తెలియ జేయనక్కఱలేదు. నీకు

తెలిసినప్పుడు తెలియజేయవలసిన నేరములేవో చట్ట
ములలో విధింపబడియున్నవి. అవి హత్య, బందిపోటు,
మొదలగు గొప్పనేరములు. వానితో వ్యక్తులకేగాక,
సంఘమున కంతకు సంబంధమున్నది. కొన్ని నేరము
లను వానివల్ల నెవనికి బాధ కలుగునో వాడు చెప్పు
కొనిననేగాని యధికార్లు విమర్శింప బూనరు. అట్టి నేర
ములను గుఱించి నీ వెవరికిని తెలుప నక్కఱలేదు ; నీ
సాక్ష్యమునెవరైన గోరినయెడల నీకు తెలిసినది యథార్థ
ముగ జెప్పుటకు నీవు బాధ్యుడవు. మఱియును, కొన్ని
బహుస్వల్పనేరము లుండును. అవి చట్టముప్రకారము
నేరములే యైనను ఎవరికిని ప్రమాదకరములు కానివి.
అట్టి స్వల్పనేరములు కొన్ని శిక్షార్హములు కావని చట్ట
మే శాసించుచున్నది. అట్టి నేరములనుగుఱించి నీ వధి
కార్లకు చెప్పనక్కఱలేదని తోచుచున్నది. ఏమైనను
ఈ విషయమున, వివేకము, ప్రపంచజ్ఞానము ఉపయో
గించవలెను. ఇతరులనుగుఱించి నీ వెట్లు ప్రవర్తించి
నను, నీవు చట్టము నుల్లంఘించరాదు. అనుపయుక్త
ములు, అవ్యవహార్యములు నగు పురాతన చట్టము
లింకను కొన్ని చట్టప్రణాళికయందు వ్యవహార్యములుగ
గనిపించుచున్నవి. వానిని మన్నించుట కెవరికిని బాధ్యత
లేదని కొందరి యభిప్రాయము.

మన దేశములో గొన్ని చట్టవిరుద్ధములగు కార్యములు బహిరంగముగను, ఒక్కొక్కప్పుడు అధికార్ల యెదుటను, జరుగుచున్నవి. వానివల్ల జను లిబ్బందిపడుచున్నారు. కాని, యెవరును అవలంబించుకొని యవి జరుగకుండునట్లు చేయుటకు బలమైన ప్రయత్నము చేయరు. ఒకరిద్దరు ప్రయత్నము జేసినను, నేరస్థుల పలుకుబడివల్ల ప్రయోజన ముండక పోవచ్చును, కాని, పౌరధర్మము ననుసరించి ప్రయోజనము కలుగువరకును గట్టి ప్రయత్నము చేయు టత్యావశ్యకమై యున్నది.

మూలము :—“ఎవరినైనను బోధించుటకు నీ స్వాధీనమున నుంచినచో వాని తప్పులను మృదువైన మాటలతో వానికి జెప్పుట నీధర్మము గావచ్చును.”

ఇది స్పష్టమైనసంగతి. బిడ్డ, శిష్యుడు, సేవకుడు, మన స్వాధీనమం దుంచబడు వారు. వారికంటె మనము వయోవృద్ధుల మగుటచేగాని, బుద్ధిమంతుల మగుటచేగాని, అనుభవశాలుర మగుటచే గాని, వారు మన యొద్ద నేర్చుకొనవలసి యుండుటచేత, మన స్వాధీనమందుంచబడినారు. అట్టిచో, వారు తప్పుచేసినప్పుడు మనము దిద్దని యెడల మనము మన ధర్మమును నెరవేర్చుట లేదు ; మన మెందుకు నియమింపబడినామో, ఆ పనినిచేయుట లేదు.

మూలము :—“ అట్టి సందర్భములందప్పు నీపని నీవు చూచుకొనుచు మౌనవ్రతము నభ్యసింపుము.”

ఇది యందరు నభ్యసించినయెడల సంఘ మిప్పటి కంటె నెంత శ్రేష్ఠముగ నుండునో గదా! దీని నభ్యసించినయెడల, నిరంతరము నీపొరుగువా రేమిచేయుచున్నారో కనిపెట్టి చూచుచుండక, నీవు నీ జీవితమును స్వేచ్ఛగాను, బహిరంగముగాను, గడుపగల్గవు ; జను లెవరికి యుక్తమని తోచినరీతిగ వారు ప్రవర్తించుటకు పరస్పరము స్వాతంత్ర్యము నొసంగుదురు ; ఖండనమునకును, రంధ్రాన్వేషణమునకు బదులు హితేచ్ఛయును, అన్యోన్యసహకారమును ప్రబలియుండును.

ప్రస్తుతము ప్రపంచమున వృద్ధిలోనున్న యార్యజాతి యొక్క యైదవ యుపజాతికి అశుద్ధమానసవికాసము ముఖ్యలక్షణము. అశుద్ధమనస్సు పృథక్త్వమును జూచును ; రెండువస్తువులలో నున్న భేదములను కనిపెట్టి ఆభేదములద్వారా వానిని గుర్తుపట్టుట అశుద్ధమనస్సు యొక్క స్వభావము. అందుచేత నిప్పుడు ప్రపంచమున రంధ్రాన్వేషణ మెక్కువయై, వితండవాదములు, కలహములు వృద్ధియగుచున్నవి. మనస్సును మించినది బుద్ధి, బుద్ధి యేకత్వమును చూచును. యోగసాధకులు బుద్ధిని వికసింపజేసికొనవలయును. బుద్ధి ముందు రానున్న

యారవ యుపజాతికి ముఖ్యలక్షణముగ నుండును. బుద్ధి సంయోగకారి యగుటచేత నది వికసించినవా రితరులయందు దుర్గుణములకు బదులు సుగుణములను, భేదములకు బదులు సామాన్యలక్షణములను, చూతురు.

ప్రపంచమున నిప్పుడు సోదరభావము పెంపొందుట కెన్నియో యుద్యమములు బయలుదేరుచున్నవి. సోదరభావము నభ్యసించుట కితరులలో ప్రశంసాపాత్రములగు లక్షణములనేగాని గర్హితములగు లక్షణములను చూడకుండుట యొకమార్గము. ప్రతివస్తువునందును, ప్రతి మనుష్యునియందును సద్గుణ ముండును. దానిని కనిపెట్టి పైకి తీయుటవల్ల మిక్కిలి గొప్పప్రయోజనము గలుగును. ఇంతవరకు నొకనియందు దుర్గుణములే చూచుచున్నను, ఇప్పుడు వాని సుగుణములనుకూడ నీవు చూడ నారంభించినయెడల, క్రమముగ నవియే యెక్కువగ గనిపించును. ఒకనిని మన మసందర్భ సమయముల యందు జూచి, అప్పటి స్థితినిబట్టి యతనియం దొక దుర్గుణ మారోపించి, యది యతనిస్వభావ మనుకొని వాని కన్యాయము చేయుదుము. కాని, తరువాత వాని యందు సుగుణము లెక్కువగ గనబడినకొలదియు నా యన్యాయము విశదమగును.

ఒకనికి సుగుణ మారోపించుటలో ఒకవేళ మనము పొరపాటుబడినను దానివల్ల ప్రమాదములేదు. ప్రతి వానియందును మంచియును చెడుగును గూడ నుండును. వాని చెడ్డనుగురించియే యాలోచించిన, వానియం దది లేకపోయినను ఉన్నను మన తలంపులవల్ల వానియం దాచెడుగు తలయెత్తుటగాని బలపడుటగాని సంభవిం చును; అట్లుగాక, మంచినే యాలోచించినయెడల నదియే వానియందు తలయెత్తుటగాని బలపడుటగాని జరుగును. వాని స్వభావమునేగాక మన స్వభావములో గూడ నట్టి మార్పే జరుగును. మన మనస్సు—అందులో ధ్యానాదులచే చిత్తసంస్కారము చేసికొన్న వారి మనస్సు—మిక్కిలి బలమైనది. అందుచేత, యితరులను గురించి మన తలంపులను బహుజాగ్రత్తగా నియమించ వలెను.

ఒక డొక పనిచేసినపుడు దాని కేదోయుద్దేశ ముం డును. ఆయుద్దేశము మంచిదో చెడ్డదో మనకు తెలి యదు. అప్పుడు మనము వానికి దురుద్దేశ మారోపింపక సదుద్దేశ మారోపించినయెడల, వాని దురుద్దేశమునకు వాడే సిగ్గుపడి సదుద్దేశము నలవరచుకొనును. అట్లుం దరియందును సదుద్దేశముల నారోపించుచున్నయెడల వానిని అమాయకుడని, చేతకానివాడని యందురు.

ఎవ్వరియందును మంచినిచూడజాలని గడసరియై యుం డుటకంటె నందరియందు మంచినే చూచుచు, తన సదుద్దేశములతో నందరకు తోడ్పడుచు సహాయకుడై యుండుట చాలమేలు.

ఇతరులయందు రంధ్రాన్వేషణము చేయుచు, ఇత రులు చేయుపనిలో ప్రవేశించి వారి కడ్డువచ్చుచు, ఇత రులపై నిందారోపణముల జేయుచు, ఇట్టి అక్కరకుమా లిన పనులజేయుటయందు తన కాలమును శక్తిని వ్యయ పరుచుటకంటె, ప్రతివాడును ఆకాలమును ఆశక్తిని వినియోగించి తన పనులను తాను చక్కగా చేసికొను చు, తన దోషములను తాను వెతికి చూచుకొని వానిని బాపుకొనుటకు ప్రయత్నించుచు, ఇతరులయెడల సద్భా వము సానుభూతి గలిగి మెలగుట యెంతయో ప్రయో జనకరము. అట్లు మెలగువారు చేయు పరోపకారము ధనధాన్యాదుల నిచ్చువారును, శరీరకష్టము నిచ్చు వారును చేయు పరోపకారము కంటె తక్కువదికాదు.

---

మొదటి అధ్యాయము

## శమము, లేక, మనోనిగ్రహము

సదాచారమని యీగ్రంథమున పేర్కొనబడిన మూడవ సాధనమును హిందువులు షట్సంపత్తి లేక శమాదిమణిషట్కము అని యందురు. బౌద్ధులు 'ఉపచానో' అని యందురు. ఈ మాటకు అప్రమత్తత యనియును ఆచారమనియును అర్థము, అనగా, నీ వీయారు విధుల ననుసరించి నీప్రవర్తనమును చక్కబరచుకొనుటయం దప్రమత్తుడవై యుండవలెనని భావము.

మూలము :—" సదాచారమునకు ముఖ్యముగ వలయు నంశము లాఱింటిని పరమగురు వీరీతిని చెప్పిరి. ఏవియన,

1. మనోవిషయమగు నిగ్రహము,
2. కాయిక కర్మవిషయమగు నిగ్రహము,
3. భిన్నరుచుల సహనము,

4. సంతోషము,
5. ఏకాగ్రత,
6. విశ్వాసము.

[సాధనచతుష్టయమువలెనే వీనిలో కొన్నితఱుచుగ వేరుపేళ్లతో పేర్కొనబడుట నేనెఱుగుదును. అయినను, నాకుపదేశించినపుడు పరమగురువు స్వంతముగఁ జెప్పిన పేర్లనే, అంతటను నే నుపయోగించుచున్నాను.] "

కుండలీకరణము చేయబడిన మాటలు పరమగురువు చెప్పినవికావు. ఆల్కియొని వ్రాసినవి. ఈ పేర్లలోని భేదములనుగుఱించియును, వాని భావములనుగుఱించియును రెండవ అనుబంధము చూడుడు.

మూలము :—" 1. మనోవిషయమగు నిగ్రహము. నిష్కామత యనుసాధనముతో కామమయశరీరమును నిగ్రహించవలయునని దెలియుచున్నది గదా! ఈ సాధనము మనోమయశరీర నిగ్రహమునకు నన్వయించును. మనోనిగ్రహ మనగా, నీకుఁ గోపము గాని, యాతురముగాని లేకయుండునటుల నీస్వభావమును నియమనము చేయుట యొకటి. ఎల్లప్పుడును శాంతము గలిగి, కలవిలపాటు నొందకుండు

నటుల మనస్సునే నిగ్రహించుట రెండవది. స్థూల శరీరమందలి[1] నాడులయందు సాధ్యమైనంతవరకు కలతపుట్టక యుండునటుల మనస్సుద్వారా నాడులను నిగ్రహించుట మూఁడవది.”

మన మీ లౌకికజీవితమునందుండియే మన యుపాధులను సంస్కరించుకొని, సున్నితము జేసికొనుటకు ప్రయత్నించుచున్నాము. అందుచేత, మన కీ సాధనము బహుకష్టముగ నుండును. కాని, అంతకష్టపడి సాధనము చేయుటవల్ల, వనవాసియగు మునికి కలుగు మనోబలము కంటె నెక్కువ మనోబలము మనకు చేకూరును.

నిష్కామత్వమును గుఱించి చెప్పినపుడు కామశరీరమును గుఱించియు, దాని పెక్కు కోరికలను గుఱించి

[1] “మనోమయకోశమున కలఁతపుట్టఁగా దానివలన స్థూలశరీరమునందుండు, నతిసూక్ష్మములగు నాడులలోను కంపనము గలుగును. ఆ నాడులు సమముగ చలించుచుండునంతవఱకు, కాయిక వ్యాపారములన్నియు సులభముగను, సుఖముగను, జరుగుచుండును. విశేష కోపము, కామము, భయము, దిగులులోనవి మనంబునఁ బొడమఁగా, సూక్ష్మశరీరమున స్పందము (అదరుపాటు) కలుగుటయేగాక, స్థూల శరీరపు నాడులయందు సయితము బలమగు కంపముగలిగి శరీరమునంతయు బడలునట్లు చేయును. శరీరమంతయు చెమటపట్టుట, రక్తహీనమయినట్లు తెల్లపారుట, వణకుట, గగుర్పాటు, డగ్గుత్తిక, మొదలగు లక్షణములన్నియు నీ నాడులయందలి కంపమువలననే గలుగుచున్నవి. అట్టివి కాకుండునటుల నిగ్రహించవలయును.”

యు, దానిని నిగ్రహించుట గుఱించియు, చెప్పబడెను ; వివేకమును గుఱించి చెప్పినపుడు మనశ్శుద్ధిని సూచించు సత్యమును గుఱించి విశేషముగ జెప్పబడెను ; ఇప్పుడు భావనిగ్రహము గుఱించియు మనోనిగ్రహము గుఱించి యు జెప్పుచున్నారు. కామములును సంకల్పములును కలిసి భావములగును. భావనిగ్రహమే యిచట స్వ భావనియమనమని చెప్పబడినది. అసహనము మొద లగు భావములు కొంతవరకు కామశరీరమునుండియు గొంతవరకు మానసికశరీరమునుండియు బుట్టును. సాధ కుడు భావములను లోబరచుకొనవలెను. స్వభావ మును నియమించుకొనక, భావముల నల్లకల్లోలముగా నుంచుకొన్నంతవరకును, సత్యము స్పష్టముగను, నిర్మల ముగను, కనిపించదు. భావసంచలమువల్ల మనస్సు లోకూడ సంచలనము గలిగి, తలంపులన్నియు కలత బారి, వికారములగును గనుక యదార్థదృష్టి కాటంకము గలుగును.

ఎల్లప్పుడు మనస్సునే శాంతముగను, కలతబార కుండను ఉంచుకొనుట మనోనిగ్రహమున కొక లక్షణ ముగ పరమగురువు చెప్పుచున్నారు. మనస్సు నిర్మలము గను నిశ్చలముగను నున్నప్పుడే శుద్ధమనస్సంకల్పము లశుద్ధమనస్సులోనికి వచ్చును. కూట్‌హూమీ మహా

ర్షివా రొకప్పుడు సిన్నెటుగారికి వ్రాసినలేఖలో 'నీవు వ్రాయునది యుపయోగకరముగ నుండవలెనని కోరుదువేని, నీ మనస్సు శాంతముగ నుండవలెను. అప్పుడే నీ యంతరంగమునుండి శుద్ధమనస్సంకల్పములు, నిశ్చలమైన సరస్సులో పర్వతము ప్రతిబింబించినట్లు, స్పష్టముగ నశుద్ధమనస్సులో ప్రతిబింబించును' అని వ్రాసిరి. ఒక గొప్ప విషయమునుగుఱించి వ్యాసమునుగాని, లేఖనుగాని, వ్రాయుటకుముందు కొంతకాలము నిశ్చలమగు మనస్సుతో గూర్చుని స్థిమితపడినయెడల, నీవు వ్రాత నారంభించినతరువాత నీ తలంపు లప్రయత్నముగను, స్వేచ్ఛగను ప్రవహించును. ఇచ్ఛామాత్రమున మనస్సును బాహ్యవిషయములనుండి తప్పించుకొనజాలనివారి కిది మంచి యుపాయము.

చిత్తైకాగ్రత బహుముఖ్యమైన సాధనము. దీని నభ్యసించువానికి బైటను పుట్టునల్లరులు మిక్కిలి సహాయము చేయును. మన దేశమున నొక్కగదిలో నొక్కసారి పెక్కురుగూడి మాటలాడుకొనుచు, నెవరిపనిని వారు చేసుకొనుచు నుండుట తఱుచుగ చూచెదము. గ్రామ బడిలో పిల్లలందరు నొక్కసారి బిగ్గరగ నెవరి పాఠమును వారు వల్లించుచుందురు, ఉపాధ్యాయు డందరిని కనిపెట్టుచుండును. దీనివలన చిత్తైకాగ్రత యలవడును.

చిత్తైకాగ్రత సిద్ధించినవాడు తన చుట్టును ధ్వనులు, అల్లరులు చికాకులు విశేషముగ గలుగుచున్నను, వానిని గుఱించి యోచించుటకు మనస్సును మరలించక, తన పని తాను చేసుకొనును.

ఇచ్చట చెప్పిన మూడవ లక్షణమునుగుఱించి తరువాత వాక్యమున నిట్లు చెప్పుచున్నారు.

మూలము :—"వీనిలో మూఁడవది కష్టము. ఏలయన నీవు మోక్షమార్గమును సాధింపబూనినపుడు నీ శరీర మతిసూక్ష్మగ్రాహి కాకతప్పదు. అప్పు డెద్దియైన యొకశబ్దము వినవచ్చినఁగాని, అదురుపాటు గలిగినఁగాని నాడు లతిసులభముగఁ గలతఁజెందును. మఱియు ఎంతమాత్రమైన నొత్తుడుదగిలినచో నది మిగుల చుఱుకుగాఁ దగులును. ఐనను నీవు నీ చేతనైనంత యత్నము చేయవలయును.[1]"

మన మనస్సునకు స్థూలశరీరముపై నధికారము బహుస్వల్పముగ నుండును. అందుచేతనే నాడులను లోబరచుకొనుట కష్టమని చెప్పబడినది. సాధారణముగ

[1] "అనఁగా నెన్నికష్టములు వచ్చినను, ఎవ రెన్నిమాట లాడినను, ఏమి చేసినను, కలఁతఁజెందక నీ శరీరమును, ఇంద్రియములను, మనస్సును, శాంతముగ నుంచుకొనుటకు బహుప్రయత్నము చేయవలయును."

మనస్సును లోబరచుకొనుట దుస్తరమనియు స్థూలశరీర మును లోబరచుకొనుట సులభమనియు ననుకొందురు. కాని, యది యట్లుకాదు. స్థూలశరీర ప్రకృతికంటె మానసిక శరీరప్రకృతి మిక్కిలి సూక్ష్మమగుటచేత నది జీవాత్మకు మిక్కిలి సన్నిహితముగనుండి, జీవాత్మ కనుగుణ్యముగ త్వరలో చలించును. జీవాత్మనుండి బైలు దేరు చలనములును, జీవశక్తియు మానసికప్రకృతి యందు పనిచేయునంత సులభముగ స్థూలశరీరప్రకృతి యందు పనిచేయుట సాధ్యముకాదు. అందుచేత, నిజ ముగ, స్థూలశరీరమును నిగ్రహించుటకంటె మనస్సును నిగ్రహించుటయే యెక్కువ సులభము, ఎక్కువ ముఖ్యము. మనస్సు లోబడినయెడల తక్కినవన్నియు సులభమగును. అందుకనియే, యోగసాధనములో చిత్తవృత్తినిరోధము ముందు చెప్పబడినది.

స్థూలశరీరమున బాధగలిగినయెడల, దానిని సులభ ముగ మరచి తిరుగవచ్చునుగాని, మనఃక్లేశమును సుల భముగ మరువజాలమని యందురు. నిజ మదికాదు. మనఃక్లేశమును చేతితోబట్టి యావలబారవేసినట్లు సుల భముగ దొలిగించుకొనవచ్చును, కాని, స్థూలశరీర బాధ, తీవ్రమైనదైనయెడల, పోగొట్టుకొనుట కష్టము. అయితే, దానినుండి మనస్సును మరలించుకొనుటవల్ల

కొంతవరకు బాధ నుపశమింపజేసికొనవచ్చును. ఇప్పుడు కొందరు పండితులు శరీరబాధలేదని మానసికముగ రూఢిపరచుకొనుటవల్ల ఆబాధ పోవునని నిరూపించి నారు. అప్పుడు బాధనుగురించి తలంపే యుండదు, గనుక, బాధపడుటయు నుండదు. ఇక శరీరమునకుగల యిబ్బందిమాత్రము మిగులును. స్థూలశరీరబాధలో నొక భాగము దానినిగురించి తలంచుకొనుచుండుట వలన గలుగును. ఆతలంపును తొలిగించుటకుగాను మనోనిగ్రహము కావలయును. ఈమధ్య నొకడు, తన కడుపులో శస్త్రచికిత్సచేసినపుడు, మత్తుమందునుపయో గించవద్దని నిషేధించి, వైద్యుడు శస్త్రముచేయు చున్నంతసేపును ఒక పుస్తకము చదువుకొనుచుండెనట. మనస్సు నంతవరకు ఇతరవృత్తులనుండి వేరుచేయగలిగి యుండవలయును.

సాధకుడు తన శరీరమును నాడులను తనస్వాధీనము నం దుంచుకొనవలయును, గాని, వాని శరీరము బహు సూక్ష్మగ్రాహియై యుండవలెను ; అనగా, తన యిం ద్రియములు మిక్కిలి సూక్ష్మములగు విషయములను గ్రహించుటకు శక్తిగలవియై యుండవలెను. అందుల కా యింద్రియములతో సంబంధించిన నరము లతిసున్ని తములుగ నుండవలెను. సూక్ష్మగ్రహణశక్తి వృద్ధియైన

కొలదియు, నరములను వశపరచుకొనుట కష్టతరమగును. సామాన్యమనుష్యుడు లక్ష్యముచేయని ధ్వనులు సున్నితములగు నరములుగలవానికి పీడాకరములుగ నుండును. ఒకొక్కప్పుడు యోగికి సూక్ష్మగ్రహణశక్తి గలిగి, ప్రక్కన నెవరైన మాట్లాడినగూడ భరింపలేనంత బాధగలుగును. అయితే, సాధకుని నరములు వ్యాధిగ్రస్తములుకావు. అట్లయిన, వాడీసాధనమును చేయజాలడు. వాని నరము లెంతస్వల్పస్పర్శకైనను చలించు బిగువైన వీణతీగెలవలెనుండును. ఎల్లప్పుడు నంతబిగువుగ నుంచుకొనుటకు చిచ్ఛక్తి నెక్కువగ నుపయోగించవలసియుండును. దానివల్ల, నొకప్పుడు శరీరమున కాయాసము గలుగును. ఎప్పుడును, శరీరమున కాయాసము గలిగి, ఆయాసమువల్ల నరముల కపాయము కలుగకుండ, జాగ్రత్తగనుండవలెను. ఒకప్పుడు నరములకు బిగువెక్కువయై తెగిపోవుటకు సిద్ధముగనున్నప్పుడు వానిని తమ యిష్టమువచ్చినట్లు పోనీయవలసియుండును. అట్లు, సాధకుడు శక్తివంచనలేక ప్రయత్నము చేయవలయును. ప్రయత్నము తిరిగి తిరిగి నిష్ఫలము గావచ్చును. అయినను, లెక్కచేయక, విడువకుండ సాధనము చేయుచు నుండవలెను. పరమగురువు శాసించినది యత్నముచేయుమని మాత్రమే. కనుక, మన మా

యత్నమును లోపములేకుండను, ఫలితము గలుగనప్పుడు నిస్పృహజెందకయు చేయుచుండవలయును.

సాధకులలో రెండు రకములవా రున్నారు. ఒక వంక నశ్రద్ధయు ప్రమత్తతయును జూపువారును, ఒకవంక అత్యంత న్యాయపరాయణతవల్లను, ఋజుత్వభావము వల్లను అక్కరలేని బాధలను దెచ్చిపెట్టుకొనువారును. రెండవరకమువారు తమ నరములను మితిమీరిన బిగువు నందుంచి, ఆయాసము గలిగించుకొనుటచేత, స్వభావతః వారెంత మంచివారైనను, బహు స్వల్పవిషయములలో నెక్కువ కలతబొంది, కోలాహలము చేయుదురు. మొదటి రకమువారు అశ్రద్ధచేసి, అల్పవిషయములు గొప్ప దుష్కార్యములగువరకు నూరకొందురు. ఈ రెండు పద్ధతులునుగూడ ప్రమాదకరములే గనుక, రెండింటికిని మధ్యమమార్గ మవలంబించవలయును.

ఒక పనిని పూర్తి చేయుటకుముందు దానినిగుఱించి యెంతశ్రద్ధయును జాగ్రతయును తీసికొనినను చాలక శ్రమపడవలసి యుండును. కాని, ఆపని తుదకు నిష్ఫలమయినయెడల, మనము సులభముగ విచారమునకు లోనై క్రుంగిపోవచ్చును. మన లోపములను గురించియు, ప్రమాదములగురించియు మనమంతగా చింతించరాదు. నీవు పూనినపని యెందుచేత నెగ్గినదికాదో

కనుగొనుటకు మాత్రమే నీవు దానిపై పొకసారి చూచి, తిరిగి నీపనిని చేయుటకు ప్రయత్నముచేయుము. దాని వల్ల క్రమముగ నీయందు లోపహేతువులు నమసి పోవును. కాని నీవు నీ లోపములనుగురించియే చింతించు చున్న యెడల, నవి బలపడి, నీవు తిరిగిచేయుప్రయత్న మున కాటంకములగును.

మూలము :—“ శాంతమగు మనస్సున్నచో ధైర్యము గూడ నుండవలయునని యర్థము. ధైర్యమువలన మోక్షమార్గమున నీకుఁగలుగు పరీక్షలను, కష్టము లను నీవు భయములేక నెదురించగలుగుదువు.”

మన పూర్వగ్రంథములలో ధైర్యమునకు విశేషప్రా ముఖ్యత యొసగబడినది. ఆత్మజ్ఞునకు భయమోహము లుండవందురు. బ్రాహ్మణునకు అభయము ముఖ్య లక్షణముగ జెప్పుదురు. శ్రీమద్భగవద్గీతలలో పదు నాఱవ యధ్యాయమున జెప్పబడిన దైవీసంపదలలో అభయము మొదట చెప్పబడినది.

మోక్షమార్గమున బోవువాడు బహువిధములగు నపవాదులకును, నిందలకును, దురభిప్రాయములకును పాలగును. అన్నిటికినిముందు సాధకుడు లోకాచారముల కును, సాంప్రదాయములకును భిన్నముగ ప్రవర్తించ

వలసియుండును. అప్పుడు ఎవరేమన్నను లక్ష్యముచేయక తనకు సరియైనదని కనబడిన మార్గము ననుసరించుటకు ధైర్యము, సాహసము, విశేషమగు మనోనిశ్చయము కావలయును.

మోక్షమార్గమున సాధకునకు పెక్కు కష్టములు గలుగును. అవి యదార్థములైనవిగాని, కేవల లాక్షణికములు గావు. మరియు నామార్గమున నపరిచితములును భయంకరములు నగు సంఘటనములు ప్రాప్తించును.[1] వాని నెదుర్కొనుటకు శౌర్యము, ఓరిమికూడ గావలయును.

ఊర్ధ్వలోక ప్రజ్ఞ వికసించినపుడు అచటి దృశ్యములు అద్భుతముగను భయంకరముగను ఉండును. మరియును స్థూలశరీరమున జాగ్రదవస్థలో వ్యవహరించుచున్నప్పుడే యూర్ధ్వలోకమున ప్రజ్ఞ వికసించిన క్రొత్తలో తిరిగి స్థూల శరీరమున ప్రవేశించజాలమేమో యని భయమగును. ఇట్టి వనేకములగు భయకారణము లుండును. వాని నెదుర్కొనుటకు ధైర్య మావశ్యకము.

[1] తపోనిష్ఠయం దున్నవారి తపస్సు భంగపరచుటకు మోహజనకములును భయంకరములునగు విఘ్నము లనేకవిధముల గలుగునని పురాణనిదర్శనములు గలవు. అవి యన్నియు యదార్థములు. వానిలో గొన్ని సాధకుని పరీక్షించుట కేర్పడినవియు, గొన్ని వాని సంచిత కర్మనుంచి త్వరలో ననుభవమగుటకు గొనిరాబడినవియు నైయుండును.

'నేనును ఈశ్వరుడును ఒక్కటి 'యను జ్ఞానము గలిగినవానికి భయముండదు. ఏదియైన యపాయము గలిగినయెడల నది యీ శరీరమునకుగాని యాత్మకు గలుగదని యెఱిగినవాని కపాయభీతి యుండదు.

భయమెన్నడైన గలిగినయెడల పరసహాయ మపేక్షింపక తన యంతరంగశక్తిని యుపయోగించుటకు సాధకుడు సిద్ధముగ నుండవలయును. అందుకు ధైర్యముండవలెను. సామాన్యముగ కష్టకాలమున దైవమును ప్రార్థింతుము. దానివల్ల మనకు మనశ్శాంతి గలుగును. కాని, అట్టి ప్రార్థనల జేయుట మనోదౌర్బల్యమును, ఆత్మశక్తియం దపనమ్మకమును సూచించును. మఱియును, నీ వీశ్వరుడవే యైనను, నీకు ఆత్మశక్తియందే గాక, యీశ్వరశక్తి యందు గూడ విశ్వాసము లేదని సూచించును. కనుక, నీస్వశక్తివల్లనే యాకష్టముల దొలిగించుకొనవలెను.

ధ్యానమువల్ల నీ కాత్మైక భావము లభించును. మరియును, ధ్యానమువల్ల నాకస్మికముగ ప్రాప్తించు కష్టముల నెదుర్కొనుటకు సంసిద్ధులమై యుండవలెను, గాని వానివల్ల మనస్సు కలత నొందనీయరాదు. సూక్ష్మరహస్యముల నెఱింగినవాడు మనస్సు కలతనొందిన యెడల కామశరీరములో గలుగు వికారములు చిర

కాలము నిలిచియుండు ననియును, శాంతచిత్తుడైన యెడల త్వరలో నభ్యుదయము నొందుననియు నెఱింగి, శాంతుడును, యుక్తుడునై యుండును.

మూలము :—"మఱియు స్థైర్యముగూడ నుండవలయును. అది యుండినచో అందఱికిఁగలుగు కష్టములను నిర్లక్ష్యముగఁ జూడఁగలుగుదువు. మఱియు లోకులనేకులు స్వల్పవిషయములను గుఱించి యెడ తెగని మనోవ్యథను పెట్టుకొనునట్లు నీవు పెట్టుకొనక తప్పించుకొనఁగలుగుదువు."

సాధకుడు తన మార్గమున నేగాలివీచిన నాగాలిచే గొట్టుకొనిపోకుండ నిలువబెట్టునది స్థైర్యము. బాహ్య విషయములపై నాధారపడియుండువాని కనంతములగు దుఃఖములు సంప్రాప్తమగును. ఏలయన, వాని వ్యాపారములు వాని స్వాధీనమం దుండక, వాని కేపని జేయుటకును నిశ్చయించుకొనుశక్తి యుండదు. మనుష్యుని జీర్ణించునది మనఃక్లేశముగాని పని కాదు. ఏదేని యొక బాధకరమైన తలంపు కలిగినపుడు తిరిగి తిరిగి దానినే జ్ఞప్తికి తెచ్చుకొనుట మనఃక్లేశము. ధైర్యము లేనివాడు ఏదో విధముగ నట్టి మనఃక్లేశమునకు లోబడియుండును.

కొందరు తరుచుగ దుఃఖావహమగు నేదోయొక విషయమును మనస్సులో గల్పించుకొని, ఆ యూహ చుట్టు నొక పెద్దనాటకరంగమును కల్పించి, యందు తామెట్లు ప్రవర్తించవలయునో గూడ భావించుకొను చుందురు. తుదకది యేదియు వారనుకొన్నట్లు జరుగదు. వారి యూహాలన్నియు నిరర్థకములగును. గనుక, దానివల్ల వారి మనోబలమంతయు వ్యర్థముగ వ్యయమైనది. అట్టి వ్యర్థపుటూహాలవల్ల సాధకుని మనస్సు, హృదయము, బలహీనములగును. ఆ దురభ్యాసమును తొలిగించుకొన వలెను. ఎట్లనగా, నీ యూహానిర్మిత రంగమునుండి నీవు బైటకు వచ్చి, నీ భావపరంపరలోని మొదటి భావమునందలి విషయమును నీవనుకొన్నట్లు జరుపగలవో జరుపలేవో యోచింపుము. జరుపగలవేని తప్పక జరుపుము. లేనియెడల, నిక దానినిగుఱించి చింతింపక విడిచిపెట్టుము. ముందేదో జరుగునని యనుకొని, దానినిగుఱించి యదేపనిగ చింతించుచు నుండుట వల్ల ప్రయోజనము లేదు. జరిగిన దానిని మార్చ జాలము గనుక దానినిగుఱించి చింతించుటవల్లను గూడ ప్రయోజనము లేదు.

మార్చుటకు వీలులేని గత విషయములనుగుఱించియు, జరుగవచ్చుననుకొను భవిష్యద్విషయములను

గుఱించియు నిరంతర మదేపనిగ జింతించుచు, రాత్రి నిద్రయు పగలు తిండియు లేక, సుఖము బాసి, తమ జీవితములను దుఃఖభాజనములుగ జేసికొనువా రనేకు లున్నారు. అట్టివారికి చిత్తశాంతి యెన్నటికిని కలు గదు. వారి మనస్సులో నొకయూహ పోయిన నిం కొకటి ప్రవేశించుచుండును. సాధకున కిది గొప్ప యా టంకము.

ఎంత ధీమంతునకైనను ప్రమాదములు సంభవిం చును. సాధ్యమైనంతవరకు ప్రమాదము గలుగకుండ జాగ్రతగనుండుట మంచిది. కాని, ప్రమాదము కలిగి నపుడు, దానినిగుఱించి చింతించుట యనావశ్యకము. వ్యథనొందిన మనస్సు నిరర్థకముగ భ్రమించును. ఆ భ్రమణమువల్ల మనస్సేగాక శరీరయంత్రమంతయు పాడగును.

మన కాత్మవిశ్వాసము బలముగ నున్నంతవరకు, మన విశ్వాస మితరులు చెప్పినదానిపైనిగాని మరియొక వ్యక్తిపైనిగాని ఆధారపడియుండనంతవరకు, మనకు తెలిసినంతమట్టుకు మనధర్మమును మనము నెరవేర్చు చున్నంతవరకు, పైనుంచి యేమిసంభవించినను మనో వ్యథ కలుగదు. చిత్తస్థైర్య ముండును.

మూలము :—“ వెలుపటినుండి మనకు సంభవించున దొకింతయు ప్రయోజనములేనిదని పరమగురువు బోధించుచున్నాఁడు. మనకు వచ్చు దుఃఖములు, కష్టములు, రోగములు, నష్టములు వీని నన్నిటిని తృణీకరించవలెను. వానివలన మనశ్శాంతిని చెడనీయఁగూడదు. అవి పూర్వకర్మఫలములు, అవి వచ్చినపుడు వానిని నీవు సంతోషముతో నోర్చుకొని, చెడుగంతయు నస్థిరమనియును, ఎల్లప్పుడును ఆనందమును నెమ్మదిని కలిగియుండుట నీపని యనియును తెలియుము. అవి యన్నియు నీ పూర్వజన్మమునకుఁ జేరినవి. ఈ జన్మమునకుఁ జేరినవికావు. వానిని నీవు మార్పఁజాలవు. కావున వానినిగుఱించి చింతించుట నిష్ప్రయోజనము.”

మనోవ్యథ తగదనుటకు పరమగురు విచ్చట చెప్పిన కారణము మిక్కిలి యదార్థమయినది. పూర్వజన్మములలో జేసిన కర్మములకు ఫలములను మన మీజన్మమున మార్చజాలము. మనము మార్చజాలనివానిని గుఱించి చింతించిన ప్రయోజనము లేదు. అయితే, పూర్వజన్మకర్మఫలములను మార్చజాలము గాని, వానిని మనము అనుభవించు విధమును మార్చవచ్చును. ఆ విధముగ నవి మనకొసంగు సుఖదుఃఖములను

హెచ్చించుటకుగాని తగ్గించుటకుగాని సాధ్యమగును. నీయెదుట నొకడు కఱ్ఱతో నిలచి నిన్నుకొట్ట సిద్ధముగా నున్నాడనుకొనుము. ఆదెబ్బ నీకు తగిలినయెడల నీవు క్రింద బడక తప్పదు. నీవు శాంతము ధైర్యము విడువక, నేర్పుతో నాదెబ్బను తప్పించుకొన్నయెడల నది నీకు తగులనే తగులదు, తగిలినను ఎచ్చటనో కొంచెము రాచుకొనిపోవును. అట్లే నీకర్మఫలముల భారమును తగ్గించుకొనవచ్చును. నీకు సంభవించు ప్రతి కష్టమును "ఇది నాఋణవిముక్తికై వచ్చినది. ఈ ఋణము తీరిపోయిననే మేలు" అను భావముతో జూచినయెడల, దానిని మిక్కిలి సులభముగ భరించవచ్చును. జీవితము నెదుర్కొన నేర్చినవా డెన్నికష్టములనైనను శాంతముగను, సుఖముగను భరించగలడు; నేర్వనివాడు, సగముపా లూహాకల్పనలచే గష్టములను కష్టతరములుగ జేసికొని, వానిచే క్రుంగిపోవును.

స్థూలశరీరబాధనుండి మనస్సును మరలించినయెడల నాబాధ తగ్గిపోవునని యిదివరకు చెప్పియుంటిమి. పశువు కాలికి దెబ్బతగిలి కాలీడ్చుకొనుచు నడుచుచున్నను, అది సుఖముగా గడ్డి మేయుచుండును. యుద్ధము సంకులముగ జరుగు సమయమున యోధునకు గాయము తగిలినను, వాని కది తెలియదు. కాలుచున్న యింటిలో

నుంచి యొక ప్రాణిని రక్షింపబోయినవానికి తన యొడలు కాలుచున్న సంగతి తెలియదు. తల్లి యెంత బాధపడుచున్నను బిడ్డ యపాయమున బడుట జూచిన యెడల, తన బాధను మరచి, బిడ్డను కాపాడుటకు బరువెత్తును. పూర్వము తమ మతాభిమానమువల్ల నగ్నిజ్వాలలలో బడద్రోయబడిన వారు, తమ యాదర్శము కొరకు జీవితముల బాయుచున్నామను సంతోషాతిశయమువల్ల, అగ్నిజ్వాలల వేడి నెఱుగనే యెఱిగి యుండరు. ఈ యుదాహరణములవల్ల మనస్సు శరీరబాధనుండి వేరైనప్పుడు మన కాబాధ తెలియదని నిశ్చయమగుచున్నది. అట్లు అవసరసమయములయందే గాక, సాధారణ సమయములయందు గూడ మనస్సును నిగ్రహించుకొని బాధలేకుండ జేసికొనవచ్చును. స్థూలశరీరబాధ నణచుకొనునంత స్వల్పప్రయోజనమునకై, ప్రత్యేకము గొప్ప ప్రయత్నము చేసి, మనశ్శక్తి నంతవిస్తారముగ వ్యయపరచుట యుక్తముకాదు. కనుక, మనస్సును తరుచుగ నిట్లు దేహసేవార్థము వినియోగించ నక్కరలేకుండ, నది యెల్లప్పుడు నెక్కువ యుపయుక్త కార్యములయందు పనిచేయుచు, నీ శరీరబాధతో నిమిత్తము లేకుండ నుండున ట్లభ్యాసముచేసికొనవలయును. అయితే, స్థూలశరీరముతో సంబంధించిన కష్ట

ములనుండి నీవు నేర్చుకొనవలసిన పాఠములను నేర్చుకొనవలయును. ఆపాఠములవల్ల నీకు బలము సమకూరును. నీకు వానిప్రయోజన మంతమాత్రమే యని, యంతటితో వానిని విడిచిపెట్టవలయును.

దుఃఖమంతయు నస్థిరమని చెప్పుచున్నారు. ఒకసారి నీ వీ జన్మమున ననుభవించిన దుఃఖముల నన్నిటిని జ్ఞాపకముచేసికొని చూడుము. ఒక్కొక్క దుఃఖము తాత్కాలికముగ నన్నిటికంటె గొప్పదిగా గనిపించుటయును, కాలక్రమమున దానిని నీవు మరచిపోవుటయును చూడ, వానిలో నేదియును శాశ్వతము గాదని తెలియును. కనుక, నీకు వర్తమానమున సంభవించు కష్టములుగూడ శాశ్వతములు కావని ధైర్యము గలుగును.

ఈ లోకమున మనకు సంభవించు సుఖము దుఃఖము గూడ నస్థిరములే; వానివల్ల గలుగు నంతరంగ వికాసము మాత్రమే శాశ్వతమైనది.

మూలము :—“ దానికంటె నీ విపుడు చేయుదానిని గుఱించి యోచించుము. దానినేమో నీవు మార్పఁగలవు. దానిచే నీకు రాబోవుజన్మమునఁగలుగు ఫలము లేర్పడును.”

మన ప్రస్తుతజీవితము యుక్తముగ జేసినయెడల, వెనుకటి కర్మఫలముగ గలుగు దుఃఖముల బాధను తొలిగించుకొనుటయేగాక, ముందు మనకు రాగల జన్మములయం దనుకూలపరిస్థితులను కలిగించుకొన వచ్చును. మన మిప్పుడు చేయు ప్రతికార్యము ముందు జన్మములయందలి స్థితిగతులకు కారణమగును. సామాన్యులు చేయుపనులకంటె మోక్షమార్గమున ప్రవేశించిన సాధకుడు చేయుపనులవల్ల గలుగు కర్మఫల మెక్కువ గాఢముగ నుండును. అతను చేయుపనులలో తనతోడిసాధకుల కాటంకములు గలిగించునవి యున్న యెడల, నవి మిక్కిలి ప్రమాదకరములగు ఫలితముల నిచ్చును. కనుక, సామాన్యమానవునికంటె సాధకుడు తాను చేయుపనులయం దెక్కువ శ్రద్ధయు మెలకువయు గలిగియుండవలెను.

మూలము :—“ ఎప్పుడుగాని దుఃఖమును ఖేదమును పైకొననీయకుము. ఖిన్నుఁడవైయుండుట తప్పు ; ఏలయన నాఖిన్నత యితరులకును వ్యాపించి, వారి కుండుకష్టములను హెచ్చించును. అట్లుచేయుట నీకు ధర్మముకాదు. కావున నీ కెప్పుడేని ఖిన్నత వచ్చెనేని దానిని వెంటనే దొలఁగఁద్రోసికొనుము.”

ఇతరవిధమున దుఃఖమును, ఖేదమును బోగొట్టుకొన జాలనివా డీకారణము నెఱింగినయెడల వాటిని తప్పక పోగొట్టుకొన గలడు. వెనుకటి జన్మములనుండి వచ్చిన కర్మఫలముగ మన కీ దుఃఖమును ఖేదమును సంప్రాప్తములగుచుండ, వానిని వృద్ధిచేసి, యితరులకుకూడ వ్యాపించునట్లుచేసి, వారిని కష్టపెట్టినందువల్ల కలిగెడు ఫలితములనుగూడ మూటకట్టుకొనదగునా! దానివల్ల నీ కర్మానుభవమున కంతముండదు. నీ వొకనిని కొట్టినయెడల, వాని కర్మానుభవమునకు నీవు ఉపకరణమువైతివి. అనగా, నీ మూలమున వాడా దెబ్బ తినవలెనను కర్మ ననుభవించెను. కాని, నీ వితరులదుష్కర్మానుభవమున కుపకరణముగ నుండుట గొప్పపనికాదు. ‘ నే నితరున కొకనికి కష్టము గలిగించు పనిని చేయను, మాటనాడను ’, అని నియమముచేసికొని, యితరుల కుపకారముచేసియు, మంగళము, ఆనందము గలిగించియు, వారి సత్కర్మానుభవమునకు నీవు ఉపకరణముగ నుండుము. వారి దుష్కర్మ యితర విధములుగ ననుభవమై హరించవలెను, గాని, నీ మూలముగ ననుభవమునకు రాగూడదు.

మూలము :—“ మఱియు నింకొక విధమున నీ మనస్సును నిగ్రహించవలయును. దానిని విచ్చలవిడిగ

సంచరించనీయరాదు. నీవు ఏపని చేయుచున్నను, దానిమీదనే మనస్సు నుంచి, ఆపనిని లోపము లేకయుండునట్లు చేయుము."

ఏ స్వల్పపనిని చేయుచున్నను, మనస్సంతయు దాని మీదనే యుంచి, దానిని లోపములేకుండ చేయుట సాధకునకు సులభవిషయమై యుండవలయును. మనము ఘనకార్యము లనుకొన్నవానిపై నుంచినంతశ్రద్ధ స్వల్ప కార్యము లనుకొన్నవానిమీద నుంచము. కాని మనము ఘనకార్యము లనుకొనునవి నిజముగ స్వల్పప్రయోజనకరములు, స్వల్పకార్యము లనుకొనునవి గొప్ప ప్రయోజనకరములు కావచ్చును. మనము చేయుపను లప్రయోజనకరములని ముందుగా తెలిసికొనుశక్తి మనకు లేదు. అందుచేత, మనము చేయు ప్రతికార్యమును సమానమగు శ్రద్ధతో, శక్తినంతను వినియోగించి, చేయవలెను. మఱియును, ప్రతికార్యమును పరమగురుని సేవాకార్యముగ సమర్పించి చేయువారు తమ కార్యములలో కొద్దిగొప్పల నెంచరాదు. చేయుపని స్వల్పమైననైనను, అదిచేయు నుద్దేశమునుబట్టియును, దానియందు మన ముపయోగించు శ్రద్ధ, భక్తి, ప్రేమ, మొదలయిన వానివల్లను దాని ప్రయోజన ముండును. పేదవానికి పిడికెడు బియ్యము నిచ్చునపుడు వానియందు దయగలిగి,

సానుభూతితో జాగ్రత్తగ నిచ్చినయెడల నీవిచ్చిన బియ్య
ముకంటె నెక్కువగ నీ ప్రేమయు, నీ సానుభూతియు వా
నికి సహాయమగును. అట్లుగాక, వానిని తిట్టుచునో, విసుకు
కొనుచునో, నీ ధర్మబుద్ధి చూపుటకు, తవ్వెడు బియ్య
మును తెచ్చి సగర్వముగ వానిపై బోసినయెడల, దాని
వల్ల వాని కొకపూట కడుపు నిండునే మోగాని, సంతుష్టి
యుండదు. ఒక యుత్తరము నొక స్నేహితునికిగాని,
నీతో వ్యాపారముచేయువానికిగాని వ్రాసినప్పుడు, నీ
యక్షరములను తెలిసికొనుటకు, నీ భావములను సరిగ
నర్థముచేసికొనుటకు నాత డెంతయో శ్రమబడునట్లు
నిర్లక్ష్యముగ వ్రాయక, చక్కని యక్షరములతో,
ఇంపైన శైలిలో, భావములు స్పష్టముగ దెలియునట్లు
వ్రాయవలెను. నీవు అట్లు వ్రాయుటకు కొంచెము శ్రమ
తీసికొనవలసి యున్నను, నీ యుత్తరమును చదువువాని
కిబ్బంది కలుగదు. గనుక నీ శ్రమ వ్యర్థము కాదు. నీవా
యుత్తరము వ్రాయునప్పుడు నీ మనస్సున నీ మిత్రుని
పై సద్భావము నుంచి, నీవు వ్రాయుదానివల్ల నతనికి
మేలగుగాక యని కోరుచు, నీవు చేవ్రాలుచేయునపుడు
అతనిపై నొక బలమైన ప్రేమభావము బంపుట బహు
మంచి యభ్యాసము. ఆతడా జాబును విప్పినపుడా
భావ మతనిపై నురుకును. అది యెట్లున్నను, సాధారణ

మర్యాదకొరకైనను నీవు వ్రాయు జాబును స్పష్టముగ తెలియునట్లు వ్రాయుట నీ ధర్మము.

నీవొక మిత్రుని వీధిలో గలిసికొన్నప్పు డాతనిపైని, యావశ్యకత ననుసరించి, ప్రాణశక్తినిగాని, ఓజస్సును గాని, ప్రేమనుగాని, ఒక పారమార్థిక భావమునుగాని, ప్రసరింప జేయుము. మనము కలుసుకొన్నప్పుడు కర స్పర్శనము చేసికొందుము. అది యట్టి శక్తిని ప్రసరింప జేయుటకు తగిన యవకాశము నిచ్చును. నీ వొకరి యింటిలోనికి బోవునపుడు, గుమ్మము దాటకముందే, బల మైన ప్రేమభావము నాయింటివారిపై బంపుము. మన మొకరికొకరు నమస్కరించుకొనునప్పుడు చెప్పుమా టలు నిరర్థకములుకావు. 'రామ్, రామ్' అనిగాని 'నారాయణ' యనిగాని, యిట్లేదోవిధముగ భగవం తుని స్మరింతుము. ఇంగ్లీషులో Good-bye (గుడ్ బై) అనుమాట God be with you (దేవుడు నీకు తోడై యుండుగాక) అను మాటలకు సంగ్రహము. ఒకడు నమస్కరించినపుడు రెండవవా డాశీర్వదించును. ఇవన్ని యు స్వల్పములుగ గనిపించును, గాని, చక్కగా, నర్థము తెలిసి, సుహృదయముతో జేసినయెడల, నివి యెంతయో మేలొనర్చును. మన దినచర్యయం దిట్టి యల్పకార్యములవల్లనే మన స్వభావము పైకి కన

బడును. ఇట్టి స్వల్పవిషయములయందు మన మప్రమత్తులమై, ఆత్మనిగ్రహము గలిగి, యదార్థముగ ప్రవర్తించినయెడల మన స్వభావము బలపడును.

నీ వేమి చేసినను మనస్సు నంతను దానిమీదనే యుంచుమని పరమగురువు చెప్పుచున్నారు. అనగా, నెంత స్వల్పకార్యమును చేసినను, ఎందుకు చేసినను, పూర్తిగ శ్రద్ధబెట్టి చేయవలెను. విశ్రాంతికొరకు కొక కథనుగాని వార్తాపత్రికనుగాని చదువుదుము, లేక, తోటలో పూలమొక్కలకు సంరక్షణ చేయబూనుదుము, లేక, నాటకమునో, మరియొక వినోదమునో చూడ బోవుదుము. అట్టిపనులను గూడ ఏకాగ్రమగు మనస్సుతో, పూర్తిగాచేయవలయును గాని, విశ్రాంతికై జేయుచున్నాము గనుక నెట్లుచేసిన నేమని సగము సగము చేయరాదు. ఒకపని చేయుటవల్ల, మనస్సుకు శ్రమకలిగినప్పు డింకొకపనిని బూనుకొని, దానివైపు నీ మనస్సు పూర్తిగా మరలించుటయే ప్రశస్తమైన విశ్రాంతి. కనుక, నీ వుపయుక్తములగు పనులను చేయుచునే విశ్రాంతి నొందవచ్చును.

మూలము :—“ నీమనస్సు నూరక యుండనీయకుము. మనస్సునకు వ్యాపారము లేనిసమయమున మనస్సు

నం దలంచుటకు సిద్ధముగ నుండునటుల నంతరంగమున సత్సంకల్పముల నెల్లప్పుడును జేర్చియుంచుము."

మనస్సంకల్పములు బహుబలమైనవి. అవి చేయగల పనిని సామాన్యముగ మనుష్యులు గుర్తించరు. మన మనస్సులో నొక యాలోచన గలిగినపుడు సువర్లోక ప్రకృతిలో స్పందములు గలిగి, అవి యలలవలె నలుమూలల విస్తరించును. ఆ స్పందములవల్ల భువర్లోక ప్రకృతిలో స్పందములు గలుగును. వానివల్ల భూలోక ప్రకృతిలో స్పందములు గలుగును. సువర్లోక ప్రకృతిలో గలుగు స్పందములు మనచుట్టు నున్నవారి మానిసిక శరీర ప్రకృతిని తాకి దానిలో నట్టి స్పందములనే గలిగించును. కనుక, నీ యాలోచనవంటి యాలోచన చుట్టు నున్నవారి యందు గలుగును. మరియును, నీ యొక్కొక్క యాలోచనమువల్ల నొక్కొక్క స్పష్టమైన మూర్తి సువర్లోక తత్త్వమున నిర్మాణమగును. ఈస్వరూపములు యదార్థములైనవియును చైతన్యముగలవియునై యుండును. నీ యాలోచనము నొక్క విషయమును గుఱించియే పలుమారు చేయుటవల్ల నా స్వరూపము మిక్కిలి బలమై చాలకాల ముండును. నీ సంకల్పము బలమైనదియైన యెడల ఆ స్వరూపము శక్తివంతముగ నుండును. నీసంక

ల్పములు నిరర్థకములైనయెడల ఆ స్వరూపములెంతో కాలముండక నశించిపోవును. ఒక దేవాలయమున ననేకవందల సంవత్సరములనుంచి భక్తిపూరితములగు సంకల్పస్వరూపము లనేకమంది భక్తులచే నిర్మించబడి యుండును. ఆభక్తి సంకల్పస్వరూపముల బలము ఎవ్వనికైనను భక్తిభావములను గలిగించ జాలును. నీ సంకల్పము మరియొకనిని గుఱించినది యైనయెడల, తత్స్వరూపము బాణమువలె వెళ్లి యాతని మనస్సులో బ్రవేశించి యతని కాసంకల్పమునే గలిగించును. అందుచేత మన సంకల్పములచే నితరులకు మేలుగాని కీడుగాని చేయుట మన చేతిలోనున్నది. అయితే, నీవొకనిని గుఱించి యొక సంకల్పమును బరపినపు డాతడు వేరొక విషయమును గుఱించి యాలోచించు చున్నయెడల, నీ సంకల్పస్వరూప మతని మనస్సులో చొరబడజాలదు. నీ సంకల్పము గాఢమైనది యైన యెడల, నది యచట కొంతకాలము వేచియుండి అదును చూచి వాని మనస్సులో బ్రవేశించును; లేని యెడల, నశించిపోవును. మఱియును, నీవు పంపిన సంకల్పము మిక్కిలి గాఢమైనదియు బలమైనదియునై యవతలవాని మనస్సున జొచ్చుట కవకాశము దొరకని యెడల, అది తిరిగివచ్చి నిన్నే తాకును.

మనము ప్రతినిమిషమును, అనేక విధములగు మానసిక స్పందములను సంకల్పస్వరూపములను, మన మెచ్చటనున్న నచ్చట, విడిచిపెట్టుచున్నాము. మన మొక వీధిలో నడుచునపుడు, అచట నడుచు మనుష్యుల యొక్కయు బండ్లయొక్కయు సంఖ్యకంటె ననేకవేల రెట్ల సంఖ్యగల వివిధములగు మానసిక స్పందముల లోను, సంకల్పస్వరూపముల మధ్యను నడచెదము. అట్టి సమయమున మన మనస్సున నేవిధమగు నాలోచనలు పుట్టుచుండునో వాని కనుకూలములగు స్పందములుగాని సంకల్పరూపములుగాని మన మనస్సులో బ్రవేశించును. తక్కినవి ప్రవేశించవు. అప్పుడు మన మనస్సు ఏ యాలోచనయును లేక యూరకయున్న యెడల దానిలో నేవిధమైన సంకల్పరూపములైనను, స్పందములైనను, ప్రవేశించుటకు ద్వారము తెరచియుండును. కనుక, మనము నిర్వ్యాపకముగనుండి, ప్రత్యేకముగ నాలోచించదగిన విషయమేదియు లేనప్పుడు, మనస్సు నూరకయుంచక, వెంటనే యందుప్రవేశించుట కొక సత్సంకల్పమును సిద్ధముగనుంచుకొనవలెను. నిరంతరము భగవన్నామస్మరణము చేయు నాచారము ప్రతిమతములో నున్నది. దానివల్ల మన మనస్సునం దొక నిర్దిష్టమైన స్పందశక్తి స్థిరపడి, యితర పని యేదియు

లేనప్పుడు మనస్సునందా స్పందములు కలిగి, ఆ నామమే స్మరణకు వచ్చును. మఱియును, ఉదయముననే లేచి యొక సద్వాక్యమును పఠనము జేసికొను నాచారము గూడనున్నది. దానివల్ల కలుగు ప్రయోజనముకూడ నదియే. అట్లుదయముననే, యేదోయొక సద్భావమును చేసికొన్నయెడల నదియే మరల మరల పైకి వచ్చుచుండుటచేత, నితర సంకల్పములు ప్రవేశించుట కవకాశ ముండదు. మఱియు నట్టి భావము భగవంతునిగుఱించి నదిగాని, పరమగురువును గుఱించినదిగాని యైనయెడల, మన కది గొప్ప యంగరక్షగా నుండును.

మూలము :—"నీ మనశ్శక్తిని ప్రతిదినమును మంచి పనులయందు వినియోగింపుము. లోక పురోవృద్ధికి సహాయుఁడవగుము."

మనము కేవలము మంచిగానుండుట మాత్రము చాలదు. మన మంచితనము నుపయోగించి యేదో యొక పనిని చేయవలయును. లేనియెడల మనజన్మము భూభారము నెక్కువ జేయుట కేగాని దానివల్ల ప్రయోజనముండదు. దుష్కార్యముల జేయుటకంటె నేకార్యములను చేయకుండుట మంచిదేగాని, మన మీ జన్మము నెత్తుట అట్టి అభావస్థితిలో నుండుటకుకాదు. మన

పరమాత్మ యీశ్వరునినుండి వెడలిన విస్ఫులింగము. అది యింకను తేజోవంతముకాలేదు. దానిని మనము తీవ్రమగు నుత్సాహముచేతను భక్తి, శ్రద్ధలచేతను రగుల్కొల్పి, ప్రజ్వలింపజేసి, ఆ జ్వాల యితరుల హృదయముల కుష్ణము, వెలుగు నొసంగునట్లు చేయవలెను. అప్పుడే మనజన్మ సార్థకమగును.

మూలము :—"దుఃఖపడుచున్నవాఁడనిగాని, కష్టపడు చున్నవాఁడనిగాని, సహాయము కావలసియున్నాఁడనిగాని, నీకుఁ దెలిసినవారిలో నొకరిని ప్రతిదినము స్మరించి నీ మనస్సునుండి ప్రేమను వారిపైఁ గ్రుమ్మరింపుము."

మనస్సంకల్పము లెట్లుపనిచేయునో పైనిచెప్పియుంటిమి. మన మాసంకల్పముల నుపయోగించి యెంత పరోపకారము చేయగలమో యీ వాక్యమువల్ల తెలియును. ప్రత్యేకముగ నొకడు కష్టదశలో నున్నాడని మనకు తెలియకపోయినను, మనము అవకాశమైనప్పుడెల్ల బలమైన సత్సంకల్పములను పైకి బంపుచున్న యెడల, నవి కష్టదశలోనున్న వారెవరో యొకరికి సహాయము చేయును. ఏదైన సద్గ్రంథమును చదివిన పిదప గాని, సత్కథ జెప్పిన తరువాత గాని, సత్కా—

ర్యము చేసిన తరువాత గాని, "స్వస్తి ప్రజాభ్యః పరి పాలయన్తాం న్యాయేన మార్గేన మహీమ్మహీశాః। గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం లోకాస్సమస్తా స్సుఖినో భవంతు। . . ." అను శ్లోకము చదివి స్వస్తి చెప్పుదురు. మన స్వేతరసంకల్పములు లేకుండ శుద్ధమై యున్న సమయమున లోకమున కంతకును, సమస్త ప్రాణులకును, శుభముగోరి సంకల్పించు నుద్దేశముతో నా శ్లోకము చదువుదుము. అట్టి పరిశుద్ధమనస్సుతో జేసిన సంకల్పము బలముగలదియై తప్పక ఫలించును.

మూలము :—"నీ మనస్సును గర్వమునుండి మరలింపుము. ఏలయన గర్వ మజ్ఞానమునుండి పుట్టునది."

గర్వము మనస్సునకు గల దుర్గుణములలో గొప్ప దుర్గుణము. యోగసాధకునకుగూడ నొక విధమగు సూక్ష్మమైన గర్వ ముండవచ్చును. సామాన్య మనుష్యునికంటె నాతడు జీవితరహస్యముల నెక్కువగ దెలిసికొన్నాడు, నిజమే, కాని యంతమాత్రమున తాను గర్వపడి, తక్కినవారి నవమానింపరాదు. తక్కిన వారుకూడ నేదోవిషయమున దెలిసినవారై యుందురు. వారికి తెలిసినదానికై వారిని మెచ్చుకొనవలయును. కనుక, ఎంత తెలిసినవాడైనను, తా నొకనికంటె

నెక్కువ తెలిసినవాడనని గర్వించి, యితరుల నవమానించక, అందరునుగూడ నేదో యొక మార్గమున నభ్యుదయ మొందుచున్నవారే యని తెలియ వలెను. కొందరు స్వాభిమానపరు లుందురు; తామెన్నడును తప్పు చేయమని, తాము బహుమంచివారమని యనుకొందురు. పరమపురుషులు కానివారెవ్వరును పరిపూర్ణులు కారు, గనుక, ఏదోయొక తప్పుచేయనివా రుండరు. ఎంత మంచివాడైనను, ఆ మంచితనమునకు గర్వించుటయే గొప్ప తప్పు. మన మొక్కసారి యా పరమపురుషులలో నొక్కరిని సందర్శించినయెడల, వారి యనంత మహాత్మ్యము నెదుట మన యల్పత్వము మనకు గోచరమై, మన గర్వమంతయు నశించును; ఇక మనకు వారి దర్శనము లభించినందులకుకూడ గర్వముండదు.

గర్వ మజ్ఞానమువల్ల బుట్టును. ఆత్మజ్ఞానమువల్ల భయము తొలగునని యిదివరకు నేర్చుకొంటిమి; ఇప్పుడు గర్వముగూడ తొలగునని దెలియుచున్నది.

మూలము :—“ తెలియనివాఁడు తాను గొప్పవాఁడ
ననియు తానేదో గొప్పకార్యములఁ జేసితిననియుఁ
దలఁచును. జ్ఞానవంతుఁడు భగవంతుఁ డొకఁడే
గొప్పవాఁడనియు, మంచిపని యంతయు భగ

వంతుని చేతనే చేయఁబడుచున్నదనియును తెలిసికొనును."

'సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తమ్ పరమేశ్వరమ్' (గీతా ॥ ౧౩—౨౭) పరమేశ్వరుడు సర్వభూతముల యందును సమముగా వసించియున్నాడు అనియును, 'యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వ। తత్త దేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్ ॥' (గీతా ॥ ౧౦—౪౧) ఎవ్వరిలో నేమహాత్మ్యమున్నను అది వానిద్వారా ప్రకాశించు నీశ్వరుని తేజస్సనియును, చెప్పబడియున్నది. కనుక, మన మేపనిచేసినను, అది మనద్వారా యీశ్వరుడు చేసినదే. మనము వీణ వాయించినపుడు తీగెలను నొక్కిన వ్రేళ్లు తామే వీణను వాయించితిమని యనుకొని గర్వించిన నెట్లుండునో, మనము పనులుచేయుచున్నామని గర్వించుట యట్లుండును.

అయితే, యిట్లు ప్రతికార్యము భగవంతుడు చేయుచున్నాడనుకొనుటవల్ల వ్యక్తిత్వమునకు భంగముగలుగునని యాక్షేపించవచ్చును. కాని, వ్యక్తికిని భగవంతునకును గల సంబంధము నెఱింగినవా డట్లాక్షేపించడు. వీణ వాయించిన దొకవ్రేళ్లుమాత్రమే గాదు. ఇతర అవయవములుగూడ పనిచేసినవి. మన స్నాయువయవముల

ద్వారా పనిచేసినది. అవయవములన్నియు మనస్సున కుపకరణములుగ బనిచేసినవి. అట్లు మనము భగవంతుని యుపకరణములుగ పనిచేయుదుము. ఆయన శక్తి మనద్వారా ప్రసరించి మనచే పనిచేయించును. ఆ శక్తి ప్రసరించుటకును ఆ పనిచేయుటకును తగిన ట్లుపకరణము నిశితముగను బలముగను నుండవలయును, గనుక వ్యక్తిత్వము బలపడి యుక్తముగను పవిత్రముగను ఉండవలెను. ఇదియే వ్యక్తిత్వము బలపడుట కావశ్యకత. బలపడిన యావ్యక్తి తనద్వారా ఈశ్వరశక్తి చక్కగా ప్రవహించుటవల్లనే పనిచేయగలుగుచున్నాడు.

---

రెండవ అధ్యాయము

## 2. కాయికకర్మ నిగ్రహము

మూలము :—"నీ మన స్సుండవలసినరీతి నుండెనేని కాయికకర్మవిషయమై నీకంత కష్టముండదు."

మనోనిగ్రహము ముఖ్యమనియును, దానివల్ల తక్కిన వన్నియు సాధ్యములగుననియును ఇదివరకు చెప్పియున్నాము (పు. 239). మన మేపనిచేసినను, ముందుగ దానినిగుఱించి యాలోచన జరిగియుండును. కర్మను సంకల్పము, కోర్కె, క్రియ, అని మూడుభాగములుగా ప్రాచీనగ్రంథములలో విభజించి చెప్పినారు. అనగా ప్రతిపనికిని ముందొక సంకల్ప ముండకతప్పదు. అయితే ఒకప్పు డాసంకల్పము వెంటనే క్రియారూపమును దాల్చును, ఒకప్పు డాలస్యమగును. ఏవిషయమునుగుఱించియైనను విశేషముగ నాలోచన జేసి యున్నయెడల ఆ తలంపంతయు మనస్సులో ఘనీభవించియుండి అనుకూలతరుణ మాసన్నమైనప్పు డాయాలోచనల సమూహమంతయు నొక్కమారు క్రియారూప

ముగ బరిణమించును. ముందు తలచిన తలంపులు వెంటనే కార్యరూపమగుటకు తగినంత శక్తిలేనివి కావచ్చును, లేక, నీవే యేదోయొక కారణముచేత ఆ పని చేయకూడదని నిశ్చయించి మానివేసి యుందువు. కాని, అంతమాత్రమున ఆతలంపులు నశించకపోవచ్చును. ఎప్పుడో యొకప్పుడు, తుపాకిమందుపైని బడిన చిన్ననిప్పురవవలె, ఏదోయొక యల్పవిషయ మా తలంపును వెంటనే క్రియగా మార్చును. మనము అనాలోచితముగ చేసితిమనుకొను పనులన్నియు నిట్లు చేయబడినవేగాని, ముందాలోచన లేకుండ చేయబడినవికావు. ఒకప్పు డాయాలోచన వెనుకటి జన్మములో చేసినది యైనను కావచ్చును. కనుక, మనము మన తలంపులనుగుఱించి బహుజాగ్రత్తగ నుండవలెను. ఏలయన, నవి యెప్పుడు క్రియారూపము నొంది మనచేత దుష్కార్యముల జేయించునో మనము చెప్పజాలము. మఱియును, బిడ్డలకు చిన్ననాటనుండియు సద్గుణముల నలవాటు చేయుటవల్ల, నిదియే గొప్పలాభము. వారికి వెనుకటి జన్మములలో చేసిన సంకల్పము లీజన్మమున వాసనారూపముగ నంటియుండి యెప్పుడు తరుణము దొరికినప్పుడు కార్యరూపమున బరిణమించును. మిక్కిలి బాల్యమున నావాసన లింకను క్రొత్తశరీరములలో

మొలకలెత్తవు. అప్పటినుంచియును బిడ్డకు సద్బుద్ధులనే గఱపినయెడల, ఆ వాసనాబీజము లంకురించుట కవకాశ ముండదు. ఒకవేళ అంకురించినను, ఆ యంకురములు మిక్కిలి బలహీనమై, వృద్ధిబొందవు.

మనస్సే క్రియాశక్తి. ఈశ్వరుని ఇచ్ఛాజ్ఞానక్రియా శక్తులు మూడును వరుసగ ఆత్మ, బుద్ధి, మనస్సుల నుపాధులుగా గైకొనుచున్నవి. క్రియాశక్తి సృష్టికర్త యగు బ్రహ్మకుచెందినది. బ్రహ్మసంకల్పము చేతనే యీసృష్టి జరిగినది. సంకల్పమే క్రియారూపమగును. కనుక, మనము చేయుపనులు మంచివియై యుండవలె ననిన, మన మనస్సు శుచిగాను, బలముగాను ఉండ వలెను. అందుచేతనే, శమము సదాచారములలో మొద టిదిగా చెప్పబడినది.

మూలము :—"ఐనను, లోకుల కుపయోగకరముగ నుండవలసెనేని, మనోవృత్తులననుసరించి కార్యము చేయవలయు ననుటను మఱువకుము. సోమరితనముం గూడదు. ఎడతెగక సత్కర్మములయందు పాటు పడుచుండవలయును."

మన యాలోచన లుపయోగకరములుగ నుండవలె ననిన, నవి క్రియారూపము నొందవలెను. కార్యమున కుపయుక్తములుగాని యాలోచనల నెన్నిటినో చేయు

దుము. అవి నిష్ప్రయోజనములేగాక మనోదౌర్బల్యమునకు గారణములగును. కార్యముగ పరిణమించని తలంపు మనస్సులో వుండువలెనుండునని మోర్యమహర్షి యొకప్పుడు చెప్పిరి. ఆ వుండులోనుంచి మనశ్శక్తి, రంధ్రములోనుంచి పైకిపోవు నీరువలె, పైకిపోవును. ఒకప్పుడగత్యమువచ్చి, తదనుగుణ్యమగు పనిని చేయదలచినపు డాశక్తిస్రావమువల్ల గలిగిన బలహీనత యందుకాటంకమగును. కనుక, ఏదైన నొకపనిని చేయదలచినప్పుడు, వెంటనే చేయక వెనుక కుంచివేయవద్దు. చేయవలసినపని యున్నప్పుడే ఆలోచించవలయునుగాని వ్యర్థముగ నాలోచించవద్దు, ఆలోచించినపనిని చేయక యుంచవద్దు. మన యాలోచన మంచిదే యైనను, దాని ననుసరించి పనిచేయనియెడల, అది మన యభ్యుదయమున కాటంకమగును. నరకమునకు దారి సదుద్దేశములతో గట్టబడినదని యింగ్లీషులో నొక సామెత యున్నది. దానియర్థ మిదియే. అయితే, పనిచేయ దలచినప్పుడెల్ల వెంటనే ఆపని సానుకూలము కాకపోవచ్చును; ఆ వెంటనే ఆపనిచేయుట కేదోయొక యాటంకము కలుగవచ్చును. అప్పుడు నీవా తలంపును వెనుకకుంచివేసి, అవకాశముకలిగినప్పుడు తిరిగి దానిని ఉపయోగించుము.

మూలము :—" ఐనను నీవు చేయునది నీకు విధింప బడిన పనిగానే యుండవలయునుగాని యితరులు చేయవలసినపనిగా నుండరాదు. ఇతరుల యను మతితో వారలకు సహాయమగునట్లు మాత్రము వారి పనియును చేయఁదగును. ప్రతిమానవుని తన తన పనిని తనదోవన చేయనిమ్ము. సహాయము కావలసినపుడు సహాయముచేయుటకు సిద్ధముగ నుండవలెను గాని ఎప్పుడుగాని వారి పనులలో నడ్డము దూరకుము. తాము చేయవలసిన పనినే తాము చూచుకొని యుండుటను నేర్చుకొనుట లోకులలో ననేకులకు కష్టములన్నింటిలోఁ బెద్దకష్టము. దానిని నేర్చుకొనుటయే నీ ముఖ్యమయినపని."

రాజసస్వభావము గలవారికొరకీ హెచ్చరిక చేయబడినది. ఒక వైపున సోమరితనము పనికిరాదని చెప్పుచు, నొకవైపున నితరులపనితో నీవు జోక్యము కలిగించుకోవద్దని చెప్పుచున్నారు. నిష్కామత్వమును గుఱించి చెప్పినప్పు డితరులపనులయందు వ్రేలుబెట్ట వలయునను కోరికను ఖండితముగ నణచుకొనుమని చెప్పియున్నారు (భాగము 3, అధ్యా 5).

చురుకుదన మెక్కువగ నున్నవా రన్నిపనులలో జోక్యము గలిగించుకొన జూచెదరు. కాని, యితరుల

పను లితరులవే యగునుగాని, నీవి యెన్నడును కాజాలవు. కర్మనుబోధించు గీతాశాస్త్ర మొకవంక 'కురు కర్మ', 'కర్మచేయుము' అని హెచ్చరింపుచు, స్వధర్మమునే గాని పరధర్మ మనుసరించుట భయావహమని యిం కొకవంక చెప్పుచున్నది. నీవు అనేక జన్మములనుం డియు సంపాదించిన కర్మవాసనల ననుసరించి యీ జన్మ మున నీధర్మ మేర్పడుచున్నది. అది నీస్వధర్మము, దాని ననుసరించి నీవు ఈ జన్మమున చేయగలపని యేర్పడియుండును. నీవు నీప్రకృతికి తగిన చిత్తవృత్తులను గలిగి, వాని ననుసరించి పనుల జేయుదువు. అట్లే ప్రతి మనిషియు తనతన ప్రకృతిధర్మము ననుసరించి పని చేయగలడు గాని నీప్రకృతిధర్మము ననుసరించి పని చేయజాలడు. స్వధర్మము ననుసరించి చేసిన కర్మ, అనగా, స్వభావనియతమైన కర్మ, చేయుటవల్ల పాప మంటదని చెప్పబడినది (గీతా. ౧౮—౪౭). కనుక, ఎవ డేపని నెట్లు చేయగలడో, వాని నాపని నట్లు చేయ నిచ్చినయెడల, నీవు వాని యభ్యుదయమున కడ్డురావు. వాని పని సరియైనది కాకున్నను, అది వాని ప్రకృతి ననుసరించి చేయబడినందున, వాని కదియే ధర్మమై యున్నది, గనుక, వాని యభివృద్ధి కదియే మార్గము. ఒకడు తన కలము నొకరీతిగ బట్టుకొని వ్రాయుట కల

వాటుపడియున్నప్పుడు, నీవు మరియొకరీతిగ బట్టుకొను మని బలవంతముచేసి వానిచేత వ్రాయించినయెడల, వాడిదివరకు చేసిన యభ్యాస మంతయు చెడి, వాని వ్రాత తీరు పూర్వముకంటె చెడిపోవును. ఆవిధముగ కలము బట్టుకొనుట మంచిది కాదని వానికితోచి, వానియంతట వాడు ప్రయత్నించి మార్చుకొన దలచి, నిన్నడిగినప్పుడు నీవు మంచివిధమును చూపవచ్చును. ఎవరి ధర్మము వారవలంబించుటకు స్వతంత్రులై యుండుటయే మనుష్యుల యభివృద్ధికి కారణమై యున్నది. క్షుద్రజీవములు అస్వతంత్రముగ దమ ధర్మమును నెరవేర్చుచున్నవి: పరమపురుషులు తమ ధర్మమును పరధర్మమును ఎఱిగి, స్వతంత్రముగను, నిర్దుష్టముగను తమ ధర్మమును నెరవేర్తురు. మనుష్యుడా రెండు కొనల మధ్యను ఏదోయొక యంతరువున నున్నవాడు. మనుష్యుడు తన కనుల్లంఘనీయములగు కొన్నిహద్దులకు లోబడి తన యిచ్ఛానుసారముగ బ్రవర్తించుటకు స్వతంత్రతగలిగియు, తన ధర్మమును తెలియజాలక, యింద్రియములకు లోబడి, యనుభవములను సంపాదించుచు, ఆ యనుభవముల వల్లనే క్రమముగ నిజధర్మము నెఱుంగును.

కొందరు మనోబలముగలవారు దుర్బలమనస్కులను లోబరచుకొని, తమ యిష్టమువచ్చినట్లు వారిని

నడిపించగలరు. కాని, ఆ నాయకుల యనంతరము వారిపనియంతయు భగ్నమైపోవును. వారహంభావము వల్ల తమ మార్గమే మంచిదనియు, నందరును శాశ్వతముగ తమ మార్గమునే యనుసరించవలెననియు నను కొందురు. వారు గొప్పవారు, నాయకులు, లోకోపకారులును కావచ్చును. కాని, వారు తమ పనిని సార్థకమగునట్లు చేయు నుపాయము నెరుగరు. వారు తమ చెంతకు దగినవారిని కొందరిని చేరదీసి, వారిని నమ్మి, తాము చేయు పనులలో గొన్నిపనులను వారి కొప్పగించి, వారాపనులను స్వతంత్రముగ స్వబుద్ధి ననుసరించి చేయుట కవకాశమిచ్చి, చేయించవలెను. అట్లు చేయుట వల్ల, వారు తమ యనంతరము తమ కార్యములను, ఏవిధముగనైన, నెరవేర్చదగిన నాయకులగుటకు సిద్ధముగ నుందురు.

మతబోధకు లొకరు, ఇతరులతో నెక్కువ జోక్యము గలిగించుకొందురు. 'ఉద్ధరేదాత్మనాఽఽత్మానమ్' (గీతా ౬—౫) అన్న ట్లెవరి యాత్మోద్ధరణము వారే చేసికొనవలసియుండగా, ఒకరి యాత్మను మేముద్ధరించెదమని యీ మతబోధకులు బయలుదేరుదురు. ఒక మతములో బుట్టుటగూడ పూర్వజన్మ కర్మఫలితమే. ఆమతమువల్ల వాడు నేర్చుకోవలసిన సంగతు

లున్నందునను, అవి మరియొక మతముద్వారా నేర్చు కొనుట వానికి సులభముగాదు గనుకను, వాడామత ములో బుట్టినాడు. కనుక, వాడామతమునుగురించి బాగుగదెలిసికొని, సాధ్యమైనంతవరకు దానినే యవ లంబించవలయును. నీవొకనిని నీ మతములో జేర్చు కొనుటవల్ల వాని కుపకారము గాదు. అంతకంటె, నీకు చేతనైనయెడల, వాడు తన మతమునే బాగుగ తెలిసికొనుటకు ప్రోత్సాహము చేయుట ఎక్కువ యుపకారము. కాని, మత విషయమున సంతసహన బుద్ధి యింకను ప్రపంచమున గలుగలేదు. తమ మతము ననుసరింపనివారిని పూర్వకాలములలో బ్రతికియుండగా మంటలలో ద్రోసి, చర్మము నొలిచి, క్రూరమృగ ముల పాల్జేసి, హింసించుచుండిరి ; ఇప్పు డింకొకవిధ ముగ హింసించుచున్నారు.

నీవు ఇతరుల మానసిక వ్యాపారములలో గూడ నిట్లు జోక్యము కలిగించుకొనుట కవకాశమున్నది. ఇందుకొక దృష్టాంతమును చెప్పెదను. ఒకని కొక విషమావస్థ గలిగి, వాడు దానిలోనుండి తప్పించుకొనుటకు ప్ర యత్నించుచున్నా డనుకొనుము. పూర్వము వాడు చేసిన దుష్కార్యములవల్లనో, మనోదౌర్బల్యమువల్లనో, దు శ్చింతవల్లనో, వాని కాయవస్థ కలిగియుండును. ఎట్ల

యినను, వాడు దానినుండి తప్పించుకొనుటకు తీవ్రముగ బ్రయత్నించుచుండును. అట్టి తరుణమున నింకొకడు వాని వద్దకు వచ్చి, వానియందు దౌర్బల్యముగాని, దుశ్చింతగాని గలదనిగాని, వాడావిషమావస్థలోనున్నాడనిగాని యనుమానించు ననుకొనుము. అది కేవల మనుమానమే యైనను, అది మొదటివాని మనస్సునందొక బలమైనదెబ్బగొట్టి, వాని ప్రయత్నము నంతము నొందించి, వానిని పెడత్రోవను బెట్టును. అందుచేత, నొకని స్వభావము చెడ్డదైనను, వానినిగుఱించి మన తలంపు లెన్నడును మంచివిగనే యుండవలెనుగాని చెడ్డవిగ నుండగూడదు.

కనుక, నీవొకనికి సహాయముచేయుటకు ఎల్లప్పుడును సిద్ధముగనుండియు, వాడు కోరకుండ నీవు పూనుకొనుట నీ ధర్మము కాదని యెఱిగి, నీ పనిని నీవు జాగ్రత్తగ జేసికొనుచు, నితరులను తమ పనులను తమ కుచితమగురీతిని జేసికొననిమ్ము.

మూలము :—“ గొప్పకార్యములఁ జేయఁబూనెదనను కారణమున, నీవు చేయఁదగు సామాన్యములగు కార్యములను చేయుట మఱువరాదు. ఏలయన, నా పనుల నన్నింటిని నెరవేర్చునంతదాఁక వేఱు కైంకర్యముచేయుటకు నీకు స్వాతంత్ర్యము లేదు.

క్రొత్తవియగు నైహికకార్యముల నీపై మోపుకొనకుము. ఇదివఱకే నీవు వహించిన కార్యములనే మోపూర్ణముగ చేసితీరవలెను. అవి యెవ్వియనగా, స్పష్టముగను, న్యాయముగను నీకు విధింపఁబడినవని నీ మనస్సునకుఁదోఁచునవిగాని యితరులు నీపనులని యెంచి నీపై నారోపింపఁజూచునవి గావు. నీవు పరమగురువువాఁడవుగ నుండవలయునన్న, నీవు చేయు సామాన్యపుపని నితరులకంటె మేలుగా చేయవలయునుగాని కీడుగఁ జేయరాదు. ఏలయన దానింగూడ నీవు పరమగురువు ప్రీతికొఱకనే చేయవలయును."

యోగాభ్యాసి యైహికకార్యము లముఖ్యములనియు, నందుచే నవి యెట్లుచేసిననేమని నిర్లక్ష్యముగ జేయుటయు, కూడదు. ఐహికకార్యములు అముఖ్యములగుట నిజము. కాని, ఆ కార్యములను చేయవద్దని యెక్కడను చెప్పలేదు. ఈ లోకమున జీవించియున్నంత కాలము ఈలోకకార్యములను చేయక యుండుట సాధ్యముకాదు. అంతేగాక, ఆత్మవికాసముకొఱ కీలోకమున బుట్టిన జీవు డాత్మవికాసముకొఱకై యీ లోకసంబంధమైన కర్మ చేయవలయును. అందుచేతనే యిది కర్మలోక

మనబడుచున్నది. సాధకుడు ఆసంగతి నెఱింగినవాడై, ఆత్మవికాసమునకై తాను చేయవలసిన కార్యము లేవియో, చేయరాని కార్యము లేవియో, వివేకముచే నిశ్చయించుకొని, చేయును. మఱియును, ఆధ్యాత్మికజ్ఞానము గలవాని కేకార్యము నేవిధముగ జేయవలయునో, ఎట్లుచేసిన యేఫలితము గలుగునో తెలియును, గనుక, వాడు చేయవలసిన కార్యము నావిధముగ జేయును. వాడీలోకమున తన ధర్మమును నిర్దుష్టముగ నెరవేర్చుటయే వాడు తన యాధ్యాత్మిక శక్తులను యుక్తముగ వినియోగించుచున్నందుకు నిదర్శనము. 'యోగః కర్మసు కౌశలమ్' (గీతా ॥ ౨—౫౦) అనగా, కర్మచేయుటయందు కుశలతయే యోగము, అని చెప్పబడినది. ఏపని నెప్పుడు ఎట్లు చేయవలెనో తెలిసి చేయుటయే కర్మకుశలత.

మనము భగవంతునికి నివేదనచేయదలచిన పదార్థములను శుభ్రముగ నుంచుదుము. అట్లే, పరమగురువు ప్రీతికొఱకు మనము చేయు ప్రతికార్యమును శుభ్రముగ చేయవలయును,—అనగా, సత్సంకల్పముతో, యావచ్ఛక్తిని వినియోగించి, గురుసమర్పితముగ చేయవలయును; నీ స్వంతప్రయోజనమునకుగాక పరోపకారార్థము చేయవలయును.

పరమగురువునకు శిష్యుడైనవాడు ఏపని చేసినను, దానిని చేయుటలో తప్పుచేసినయెడల, దానివల్ల కీడు కలుగకుండ పరమగురువు సవరించవలసి యుండును. అట్టి యగత్యము కలుగకుండుటకై శిష్యునిగ నంగీకరించక పూర్వము సాధకుని కొంతకాలము పరీక్షలో నుంతురు. సాధకుడును అప్పుడట్టి తప్పులు చేయకుండుటకై యిప్పటినుండియు నభ్యాసము చేయవలయును.

ముముక్షువున కైహికకర్మకును ఆముష్మికకర్మకును తారతమ్య ముండరాదు. ఆముష్మికకర్మ మధ్యాత్మిక శక్తులను కలిగించును. ఆశక్తులను ఐహికకర్మను లౌకికులకంటె బాగుగ జేయుటకు వినియోగించవలెను. తెలియనివా డొకపనిని చెడ్డగా చేయుటవల్ల కలుగు ఫలితముకంటె, తెలిసినవాడు ఆ పనిని తప్పుగా చేయుటవల్ల కలుగు ఫలితము ఎక్కువ ప్రమాదకరము.

కనుక, నీవు ఏపనిని శ్రద్ధతోను, యుక్తముగను, నేర్పుతోను, పూర్తిగా జేయగలవో ఆపనినే నీపనిగ గైకొని, తక్కినది నీదికాదని విడిచిపెట్టుము. ఒక నగరములో నొక పెద్దమనిషి యున్నయెడల, ఆతడు చేయగలిగినను, చేయలేకున్నను, ఆ నగరములోనున్న గౌరవోద్యోగములన్నియు నాతని కొక్కనికే యొప్పగించుట తరుచు చూచుచుందుము. అతనును, మో

మోటమిచేతనో, గర్వముచేనో, ఆ యుద్యోగములను వద్దనక స్వీకరించుకొని, తుదకు, దేనినికూడ పూర్తిగా నెరవేర్చజాలడు. తాను చేయజాలనిపని యితరులకు విడిచిపెట్టకుండుటగూడ యితరుల పనిలో జోక్యము కలిగించుకొనుటయే.

మనము దినమంతయు నేదోయొక పని చేయుచు నుండగలము, గాని వానిలో నన్నియు నుపయుక్తము లయినవిగ నుండవు. దినమందు కొంతకాలము పనికిని, కొంతకాలము నిద్రకును, భోజనమునకును ఉపయోగించుదుము. మనము చేయవలసిన పని బాగుగా చేయగలుగుటకు విశ్రాంతియు భోజనమును ఎట్లావశ్యకమో, అట్లే ధ్యానాధ్యయనములును, కొంతకాలము నెమ్మదిగ గూర్చుని మన మేపని చేయవలయునో, అది యెట్లు చేయవలయునో చింతించుటయు గూడ ఆవశ్యకము. ఇవి స్వల్పకార్యములు కావు. ప్రతిదినమును కొంతకాల మీపనుల జేయుట సాధకునకు మిక్కిలి సహాయకరము.

ఒకప్పు డొకశిష్యుడు తన చనిపోయిన బంధువునకు అపరకర్మ చేయవలసివచ్చెను. దానినిగురించి యాతడు పరమగురవు యాజ్ఞను గోరగా ఆయన యిట్లనియెను— "నీవు పోకున్న నీ బంధువులు దుఃఖింతురు. కనుక, నీవు వెళ్లి కర్మ చేయుము. కాని, నీకు బోధపడని దేదియును

చేయవద్దు. పురోహితుడు చెప్పుమనినదానినెల్ల గ్రుడ్డిగా పలుకవద్దు. ఏపనియైనను, నీవు స్వయముగ జేయవలసినది యున్నయెడల దాని నితరులుచేయుట కొప్పుకొనకుము." యీ వాక్యములు స్వధర్మాచరణమన నేమియో తెలియజేయును.

---

మూడవ అధ్యాయము

## 3. భిన్నరుచులసహనము [1]

**మూలము :**—" అందఱియెడలను పూర్ణమగు సహనముగలిగియుండవలయును. నీమతమునందు నీకు మనఃపూర్తిగనుండు విశ్వాసమును ఇతర మతముల

[1] "పురాతనగ్రంథములయం దిది యుపరతి యనఁబరగు. ఉపరతియన సన్న్యాసమని యాగ్రంథములయందు నిరూపింపబడియున్నది. అట్లనినఁ దనకు విధించియుండు కర్మములు విడుచుటయని సాధారణముగ నర్థముచేయుదురు. తాత్త్వికముగ బాహ్యకర్మములను విడుచుటయే ముఖ్యముగాదు. అంతస్సన్న్యాసమే ముఖ్యము. అంతస్సన్న్యాసమనఁగా స్వాత్మాభిమానమును విడిచి సర్వత్యాగము చేయుట. అదిగలవాఁడు బాహ్యకర్మములయం దభిమాన ముంచడు. నానాదేశములయందును, వివిధ మతములయందును, దేశకాలానుగుణముగ నాచారభేదములుండినను వాని యన్నింటివలని పారమార్థిక ప్రయోజనమును మాత్రము చూచుచు, బాహ్యభేదములను గమనించక, అందఱియందును, సకల విధాచారములయందును సమబుద్ధిగలిగి యుండును. ఇదియే భిన్నరుచులసహనము. ఇదియే యుపరతి, ఇదియే సన్న్యాసము. అట్టి సన్న్యాసముగలవాఁడు బాహ్యకర్మములను జేసినను జేయక సన్న్యసించినను లెక్కలేదు, నిజముగ సన్న్యాశియే యగును. అట్టి వారలనుద్దేశించియే శ్రీకృష్ణభగవంతులు " అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః । స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః ॥ " అని గీతాశాస్త్రమున ఆఱవ యధ్యాయము ప్రథమ శ్లోకమున స్పష్టముగ సన్న్యాసశబ్దమును నిర్వచించియున్నారు."

వారు నమ్ము మతసిద్ధాంతములయందును నీవు పూర్ణముగ నుంచవలయును. ఏలయన, నీ మతము వలెనే వారిమతమును బరమగతికి మార్గమే. అం దఱకును సహాయుడవు గావలెనని నీ వందఱివిష యమును దెలిసికొని యుండవలయును."

సహనమునుగుఱించి మాట్లాడువారు చాలమంది యున్నారు గాని, దాని నవలంబించువారు బహుతక్కువ. ఏలయన, నొకానొక విషయమునుగుఱించి గట్టి నమ్మక ముండి, దానియందు విశేషగౌరవ మున్నవారు, దాని నితరులుగూడ నమ్మునట్లు చేయవలెనని, సహజముగ, బ్రయత్నింతురు, గాని, తమకు తమ నమ్మకమునం దెంత యభిమానమున్నదో, ఇతరులకు వారి నమ్మకములం దంత యభిమాన ముండుననియును, దానిని తాము మన్నించ వలయుననియును, ఎఱుగరు. అందుచేతనే, మతముల పేరున నిన్ని ఘోరహింసలు, యుద్ధములు ప్రపంచ మున జరుగుట సంభవించినది. అయితే, ఇతరుల మత ములనుగుఱించి కేవల ముదాసీనముగ నుండుట సహ నము కానేరదు. విరోధముకంటె నుదాసీనత కొంత మేలు గావచ్చును, కాని, సాధకుడట్లుదాసీనముగ నుం డిన పనికిరాదు. సాధకుడు ప్రతివానియందున్న యాత్మ యును వాని కనుకూలమగు మార్గమును కనుగొని

దాని ననుసరించునని తెలియవలసినవాడు. ప్రతి వాడును పరమునకు ప్రయత్నించుచున్నాడు. అందుకు ఒక్కొక్కని కొక్కొక్కమార్గ మున్నది. నీమార్గ మింకొకని కనుకూలము కాదు. ఈ సంగతి సాధకుడు తెలిసియుండవలెను. మఱియును, నీమార్గమే మంచిది, తదితరమార్గములు మంచివికావు, అను దురభిమానము కూడ సాధకునకు పోవలయును. అందుకొఱకు, అతడా యితర మార్గములనుగుఱించి చక్కగా దెలిసికొన వలయును. నిజముగ నాలోచించి చూచినయెడల నీ దురభిమానమున కంతకును మూలము ఇతరుల మతము లనుగుఱించి తెలిసికొనకపోవుటయే. ఏలయన నీ వితర మతముల నన్నిటినిగుఱించియు బాగుగ దెలిసికొన్న యెడల, యేమతమును చూచినను అది నీ మతమువలెనే పరమగతికి మార్గమును చూపుచున్నదని విశదమగును. నీ మతము నీ ప్రకృతికి తగినమార్గమును నీకు చూపు చున్నది ; మరియొక మతము మరియొకని ప్రకృతికి తగిన మార్గము వానికి చూపుచున్నది. ఇది చక్కగా తెలిసి పరమతములయెడల గౌరవము గలిగియుండుట యే నిజమైన సహనము. అట్టి సహనము విశేషముగ నలవరచుకొన్న వారినే గాని మహీపీఠస్థులు తమలో జేర్చుకొనరు.

ఒకడు పరమతసంబంధమైన మందిరమునకుగాని, యాలయమునకుగాని, పోయినపుడు, అతడు సహనశీలుడైనయెడల, నచటి యాచారములను తానుకూడ ననుసరించును. అత డట్లుచేయుట కేవల మది యచటి యాచారమగుటచేతను, మర్యాదకొఱకును, మాత్రము కాదు; ఆయాచారములయందును, ఆమతస్థులయందును, మతమునందును గల గౌరవముచేత నట్లుచేయును. మసీదులలోనికి ఆలయములలోనికి, చెప్పులు తొడుగుకొనిపోగోరువారును, చర్చిలోని కేగి, యచటి పూజాపీఠమునకు గౌరవముగ ప్రణామముచేయుటకు బదులు ముఖ మావలప్రక్కకు త్రిప్పుకొని కూర్చొను వారును కొంద రున్నారు. అట్టి చోట్లకు పోయి యచటి మర్యాదలను ఆచారములను జరుపుట కిష్టములేనివా రచటకు పోవుటయేకూడదు. పోయి, యావిధముగ ప్రవర్తించుటవల్ల నచటివారి మతాచారములయెడల నసహనమును ప్రకటించుటయేగాక, వారి నగౌరవము చేసినవారగుదురు.

సాధుపురుషు లన్నిమతములలో నున్నారు. వారందఱి జీవితము నొక్కతీరుగ నుండును. ఏలయన, వారు తమ తమ స్వమతతత్త్వములను బాగుగ నెఱింగినందున సర్వసములై, సహనబుద్ధిగలవారై, ఒకరెక్కువ ఒకరు

తక్కువ యను భావమున కతీతులైన పరమార్థా జీవులు ; కనుకనే వారు సర్వత్ర పూజనీయు లగు చున్నారు.

మూలము :—"ఐనను, పూర్ణమగు సహనము నీకు కలుగవలెనన్న నీవు మొట్టమొదట పాషండత్వము నుండియు, మూఢాభిప్రాయముల నుండియు దొలఁగ వలయును."

స్వాభిప్రాయములనేగాని పరుల యభిప్రాయముల నెంచనివాఁడు పాషండుఁడు. తన మతముతో సంబంధించిన పుస్తకములనేగాని, మరియొక మతముతో సంబంధించిన పుస్తకమును చదువరాదనువాఁడు, తన మతస్థుఁడు కానివానిముఖము చూడరాదనువాఁడు, పాషండులు. ఇతరుల యభిప్రాయములు తెలిసికొన్నయెడల, నా యభిప్రాయములు మారిపోవచ్చును, గనుక, నేనితరుల యభిప్రాయములను తెలిసికొనను, అను భావ మీపాషండత్వమునకు కారణము. ఇది సత్యాన్వేషణమునకు విరుద్ధము. సత్యమంతటను గలదు. బిడ్డల పలుకులలోను, మూర్ఖులమాటలలోను గూడ సత్యముండును. కనుక, సత్యాన్వేషి యెవ్వరి యభిప్రాయమును త్రోసిపుచ్చక, అన్నిటిని సమానగౌరవముతో నాదరించి, వానియందు

సత్యలేశమున్నయెడల దానిని గ్రహించి తక్కినదానిని విడువవలయును.[1] 'సత్యమేవ జయతు, నాఽనృతమ్' అని యుపనిషద్వాక్యమున్నది. మూఢాభిప్రాయముల యందుగూడ కొంత సత్యమున్నది, కనుకనే, వానికంత ప్రాబల్యము కలుగుచున్నది. సత్యాన్వేషి యా సత్య లేశమును చూచును, పాషండుడు చూడడు.

మూఢాభిప్రాయములు గలిగియుండుట ప్రేమకు విరుద్ధము. కనుక, నవి లోకమున నత్యంతదుఃఖమును గలిగించుచున్న మూడు పాపములలో నొకటియని యీ గ్రంథములో జెప్పబడినది. లోకములో మతమునకు మూఢాభిప్రాయముల జేర్చి పంకిలము చేసియున్నారు. కనుక, మన మాపంకిలమును పరికించి సత్య మిది మూఢాభిప్రాయ మిది యని విచక్షణచేసి తెలిసికొనవలెను.

మూఢాభిప్రాయము[2] అను మాటకు పూర్తియయిన నిర్వచనము చెప్పుట కష్టము. అముఖ్యమును ముఖ్య

[1] "కం॥ వినదగు నెవ్వరుచెప్పిన,
వినినంతనె వేగపడక వివరింపదగున్ ।
కని కల్ల నిజముదెలిసిన
మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ ॥"

అన్న పద్యమున నీ తత్త్వమంతయు నిమిడియున్నది.

[2] దీనిలో ౨వ భాగము, నాల్గవ యధ్యాయమున నీ విషయము గుఱించి కొంతవరకు వ్రాయబడినది.

ముగ భావించుట యొక్క విధమగు మూఢాభిప్రాయము. మతవిషయములలో వైషమ్యముగల యిరుకక్షులవారును సత్యమునకు అనేకవిధముల నపార్థముల జేసి, వాని కొరకై వివాదలు పడుదురు, గాని వారి వివాదాంశము లెన్నడును ముఖ్యవిషయములను గుఱించినవిగా యుండవు.

సబబైన యాధారములేని నమ్మకముగూడ మూఢాభిప్రాయమని యందురు. దీనినిగుఱించి యిదివరకు చెప్పియున్నాము. దీనినిబట్టి నీవు నమ్మినసంగతి సత్యమేయైనను, దానిని నీవు నమ్ముటకు తగిన కారణములేని యెడల, అది మూఢనమ్మక మగును.

ఏదేశములో జూచినను సాంప్రదాయానుసారము లగు నాచారములు కొన్ని యున్నవి. వాని నిప్పుడు చూచినచో నవి మొదట నెందుకొఱకు విధింపబడినవో ఆయుద్దేశము మరిచిపోయి, కేవల బాహ్యరూపములను మాత్రమే పూజించుచున్నారని విశదమగును. ఆ యాచారము లొకప్పుడు జీవముతో నుండినను, ఇప్పుడవి నిర్జీవములై, నిరుపయోగములును, హానికరములునై యున్నవి. అట్టి యాచారములను వానితత్త్వము నెఱుంగక యవలంబించుట మూఢాచారము. అట్టి యాచారములను పరిశీలించి, వాని ముఖ్యోద్దేశము తెలిసికొనిన యెడల, దానియందలి యముఖ్యము నేర్చి పారవైచి,

ముఖ్యమైన భాగమునుమాత్ర ముంచుకొనవచ్చును. సంస్కర్తలు—సంఘసంస్కర్తలుగాని, రాజకీయ సంస్కర్తలుగాని—ఈ విషయమును చక్కగా గమనించవలెను. ఒకవంక కేవల పూర్వాచారపరాయణులు తమ నిర్జీవ ప్రతిమారాధనను వీడక, ఇంకొకవంక సర్వ సంస్కరణవాదులు పూర్వసాంప్రదాయములను సరకుగొనక కేవలము క్రొత్త ఆచారములను దెచ్చిపెట్ట జూచుచున్నయెడల, ఆ యిరుకక్షులకును సామాన్య విషయ మెక్కడను దొరకక, వారికి వైషమ్యము లెక్కువమైపోవుటయే గాక, నిజమగు సంస్కరణమున కవకాశముండదు. ఇరువంకలవారును తమ తమ మూఢాభిప్రాయముల యుద్రేకముచే మధ్యమార్గ మొకటి యున్నదని కానజాలరు. సంఘముయొక్క పునాదులను ముందు బాగుగ దెలిసికొని, వానిని విడువక, వానిపైని, దేశకాలానుసారములగు మార్పుల జేయుట మధ్యమార్గము. ఈ మారునవి అముఖ్యములు ; స్థిరముగనుండ వలసినవి పునాదులు, ముఖ్యములు.

మూలము :—"కర్మములు[1] నీ కనావశ్యకములని యెఱుగవలయును. లేనియెడల నా కర్మములం

[1] కర్మములు, అనగా, నీ సందర్భములో యజ్ఞాదిక్రతువులు, ఆరాధనలు, సంస్కారములు మొదలగునవి యని యర్థముచేసికొనవలెను.

జేయని వారికంటె నేదోవిధమున నీవు శ్రేష్ఠుడవని యెంచుకొందువు. అట్లైనను, కర్మముల నింకను పట్టుకొనియుండువారల నిందించరాదు. వారియిష్టము చొప్పున వారిని జేయనిమ్ము. అయినను తత్త్వము నెఱింగియుండు నీకేమో వారడ్డము రాగూడదు. నీవు గడచి దాటినదానిని నీచే బలాత్కారముగ జేయించుటకు వారలును బూనరాదు. అన్నిటికి నెడమిచ్చి ప్రవర్తింపుము. అన్నింటియెడ దయాపరుడవై యుండుము."

ఈ వాక్యము వినినంతనే కొందఱి కాశ్చర్యము గలుగవచ్చును. మన దేశము కర్మభూమి యని పేరొందినది. అందుచేత, కర్మముల జేయు టనావశ్యకమని యన్నయెడల యీ దేశస్థుల కాశ్చర్యము గలుగుటలో వింత లేదు. అయిన, నీ దేశముననే ఆశ్రమములలో నుత్తమాశ్రమమగు సన్యాసమును స్వీకరించినవారు కర్మముల నన్నిటిని విడిచిపెట్టుదురు. దీనికి కారణమే మనగా, కర్మములు మనుష్యునకు జ్ఞానవికాసము కానంతవరకు ఆవశ్యకములుగాని, జ్ఞానికనావశ్యకములు. పసిబిడ్డ నడకనేర్చుకొనునప్పుడు, తాను నిలువబడుటకు తగిన యూతను చూచుకొని, దానిని పట్టుకొని లేచి

నడుచుటకు ప్రయత్నించును, క్రమముగా, వాని కా యూత లక్కరలేక స్వతంత్రముగ నడువగలిగినపుడు వా డాయూతలను విసర్జించును. ఈ కర్మములుగూడ మనుష్యు డజ్ఞానదశలో నున్నప్పు డూతకర్రలవలె నుపయోగించును. కాని, జ్ఞానికి వాని యుపయోగము లేదు. విద్యుచ్ఛక్తి సర్వత్ర వ్యాపించియుండును గాని, దానికొక యంత్రము నేర్పర్చిననేగాని వ్యక్తముగాదు. అట్లే ఆధ్యాత్మికశక్తు లెల్లప్పుడును సర్వత్ర వ్యాపించి యుండును, గాని, వానిని మన ముపయోగించుకోవలెననిన, అందు కొక యంత్ర మమర్చవలెను. అట్టి యంత్రముల నమర్చుటకొఱకే యీ కర్మము లేర్పడినవి. అవి యన్ని కాలములలోను, అన్ని దేశములలోను, అన్ని మతముల లోను, స్వల్పరూపభేదములతో ననుష్ఠింపబడుచున్నవి. జనులందరు జ్ఞాను లగునంతవరకు కర్మము లుండకతప్పదు. శ్రీమద్భగవద్గీతలు సన్న్యాసమును ప్రతిపాదించి నను, "శ్లో॥ న బుద్ధిభేదం జనయేదజ్ఞానం కర్మసంగినామ్। జోషయేత్సర్వకర్మాణి విద్వాన్ యుక్తః సమాచరన్ ॥"—ఆత్మజ్ఞుడు కర్మమం దాసక్తిగల అవివేకుల యొక్క కర్మమునం దాసక్తిగలబుద్ధికి చలనముగలిగించ రాదు. నేర్పరి నాయందు యుక్తుడై, తానాచరించుచు నితరులు సమస్తకర్మముల నాచరించునట్లు చేయవలెను

—అని చెప్పబడినది (అ. 3—౨౬). అయితే, జ్ఞానికి కర్మము లక్కఱలేదుగదా! యెందుకాతడు కర్మముల జేయవలయునన, లోకసంగ్రహార్థము ; జ్ఞాని కర్మముల జేయనియెడల నజ్ఞానులుకూడ వానినే యనుసరించి కర్మములను మానివేయునుగనుక, వా రట్లు మాని చెడిపోకుండ జ్ఞానియు కర్మచేయునని చెప్పబడినది (గీతా॥ 3—౨౦ మొ॥ ౨౫). మరియును వారు సంఘములో నానానాక పదవియందుంచబడుటచేతను గూడ కర్మముల జేయవలసివచ్చును. జ్ఞాని యట్లు కేవలము లోకసంగ్రహార్థము కర్మముల జేయగలడు. అజ్ఞాని కర్మము లగత్యములగుటచే జేయును, కాని, వాడు కర్మముల జేయుటచేత తనయందు కర్మముల జేయని వారికంటె, నేదోయాధిక్యత యున్నదనుకొని గర్వించును. గనుక, సాధకున కది తెలియజేయుటకును, కర్మము లనావశ్యకములనియు మోక్షమార్గసాధనమే ముఖ్యమనియు హృద్గతమగుటకును, ఈ వాక్యము చెప్పబడినది.

నీవు కర్మము లనావశ్యకములని తెలిసినతరువాత, లోకసంగ్రహార్థము కర్మముల నాచరించుటయును, ఆచరింపకపోవుటయును నీయిష్టముపై నుండును. కాని, యితరులు కర్మముల నాచరించినను, ఆచరింపకున్నను,

నీవు వారిని నిందించరాదు. అది వారియిష్టమునకు విడువవలెను. కర్మము లాచరించినను, వాని ప్రయోజనము బడయజాలనివారుందురు, వారు కర్మముల జేయరు. అట్టివారిని నిందించిన నేమి లాభము?

మూలము :—"నీ విపుడు కన్నులు తెఱచిచూచుచుండుటచే పూర్వము నీవు నమ్ముచుండిన కొన్ని విషయములును, నీవు చేయుచుండిన కర్మములును, వ్యవస్థ లేనివని నీ కగపడవచ్చును. వాస్తవముగ నవి యటులనే యుండునేమోసుమా! నీవు కర్మముల నికమీద ననుష్ఠింపజాలకపోయినను, అవి కొందఱు సత్పురుషులకు నింకను ముఖ్యములుగ నుండును, గావున వారికై యా కర్మముల గారవింపుము. అవి యుండఁదగినచోట్లున్నవి. వానివల్ల నుపయోగము సయితమున్నయది. నీవు పసివాఁడవుగ నుండినపుడు, చక్కనిగీతలు రెండు గీచి వానినడుమ వ్రాయుటచే, వంకరలులేకయు, పొంకముగను వ్రాయుటకు ఆ గీతలు నీకు సహాయములుగనుండినను, తరువాత నా గీతలులేకయే అంతకంటె నెంతయో బాగుగను ధారాళముగను వ్రాయవచ్చినవెనుక నవియేల! ఆ నమ్మకములును కర్మములు నా గీటుల

వంటివి. అవి నీకును కావలసిన సమయముండెను. ఆసమయ మిపుడు దాటిపోయెను."

మనము వయోవృద్ధులమై, యనుభవజ్ఞానము సంపాదించిన తరువాత, అదివరకు మనము నమ్ముచుండిన కొన్నివిషయములు సారహీనములుగను అసంగతములుగను కనిపించును. ఒక బిడ్డ కొన్ని గుడ్డప్రేలికలను జుట్టి, అది బొమ్మయని, దానికి సంరక్షణజేయును. పెద్దవారెవ్వరు నాపని చేయరుగదా! అయినను, ఆ పనిని బిడ్డచేయుట చూచినపుడు మన మాబిడ్డను నిందించము. ఆపని మనముచేయుట హాస్యాస్పదము అయినను పసిబిడ్డచేసినప్పుడు మనము సానుభూతి చూపుదుము. ఆ పనిచూచి మనము నవ్వినను ఆనవ్వులో వాత్సల్యము మార్దవము నిండియుండును. ఆపని బిడ్డకు మేలొనగూర్చును. బిడ్డ దానిని శిశువనియే భావించునుగాని చింపిగుడ్డలమూటయని భావించదు; ఆ కల్పితశిశువుకు ముద్దుముచ్చట్లు జరుపునపుడు బిడ్డకు మార్దవము, పరిపోషణము, బలహీనులను అసహాయులను సంరక్షించుట మొదలగు మాతృత్వ లక్షణము లలవడును. అట్లే, మనకు కర్మములుచేయు టనావశ్యకమైనను, ఆవశ్యకమైన బాలిశులు కర్మములజేయునపుడు వారియెడల మనము దయ, మార్దవము జూపవలెను. ఏలయన, ఆ

కర్మములు మనకు నొకప్పు డావశ్యకములై, మిక్కిలి యుపయోగకరములై యుండెను ; మనము వాని నొకప్పుడు చేసియుంటిమి.

అనాగరికజాతులవారు మన కసంగతములుగదోచు కర్మముల జేతురు. పల్లెలలో—ముఖ్యముగ కొండపల్లెలలో—జరుగు కొన్ని జాతరలు, ఉత్సవములు మనకు బహు నిరర్థకములుగ దోచును. కాని, యదియంతయు వారి నిరాడంబరభక్తిని సూచించును. మనము వారి భావములను చూడవలెనుగాని పైకగపడు కార్యముల జూచి పరిహాసించగూడదు. మనమొక యాలయములో నమూల్యములగు వస్తువులను సమర్పించినపుడు మన కెంత భక్తియుండునో, వా రొకచెట్టుకో, పుట్టకో యొక గుడ్డపేలికను గట్టినపుడు వారి కంతభక్తియు నుండును.

భక్తికి హృదయము సమర్పించుట ముఖ్యముగాని, వస్తువుల నెంతవిలువగలవానినైనను, సమర్పించుట ముఖ్యముకాదు. హృదయము భక్తిపూరితమైనపుడు అట్టి హృదయముతో నెంత స్వల్పవస్తువును సమర్పించినను, దానిని భగవంతు డంగీకరించును. “శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం, యో మే భక్త్యా ప్రయచ్ఛతి। తదహం భక్త్యుప హృతమశ్నామి ప్రయతాత్మనః॥” —ఎవ్వడు నాకొఱకు, భక్తితో, ఆకును, పువ్వును,

పండును, లేక, ఉదకమును సమర్పించుచున్నాడో, శుద్ధాంతఃకరణముగల వానియొక్క భక్తిపూర్వకముగ సమర్పింపబడిన యీ పత్రపుష్పాదులను నేను స్వీకరించుచున్నాను—అని శ్రీకృష్ణుడు చెప్పెను (గీతా॥ ౯—౨౬). అట్టి యజ్ఞానులు భక్తితోజేయు కర్మముల యందు వారి యాసక్తిని పోగొట్టరాదు.

మూలము :—“ మహాగురుస్వామి లొకరిట్లు వ్రాసిరి. ‘ నేను బాలుఁడుగ నుండినపుడు బాలునివలె మాటలాడితిని, బాలునివలె తెలిసికొనుచుంటిని. బాలునివలెనే తలంచుచుంటిని. కాని పెద్దవాఁడనుకాగా పసితనపుఁ బనులను వదిలివేసితిని’. అయినను, తన బాల్యమును మఱచిపోయి, బాలుర సుఖదుఃఖములను దెలిసికొనలేనివాఁడు బాలురకు భోదింపఁజాలఁడు. వారలకు సహాయముచేయనేరఁడు. కావున నెవఁడు గాని, బౌద్ధమతస్థుఁడైననేమి, హిందువైన నేమి, జైనమతస్థుఁడైననేమి, హీబ్రూమతస్థుఁడైన నేమి, క్రైస్తవుఁడైననేమి, మహమ్మదీయుఁడైన నేమి, యందఱిని ఒక్కటేవిధమున దయతోడను, మార్దవముతోడను, సహానముగలిగియు, చూడవలయును.”

స్వానుభవమువల్ల గలిగిన జ్ఞాన మెంత ప్రయోజనకరమో యిచట జూపబడినది. అట్టి జ్ఞాని తన పూర్వపు అనుభవములను మరువక, ఆ యనుభవముల నిప్పుడను

భవించుచున్నవారియందు సానుభూతియు దయయు చూపును ; ఆతడు వారి కష్టసుఖములను బోధపరచుకో గలడు, గనుక, వారి కేవిధముగ సహాయము జేయవలె నో ఆవిధముగ జేయగలడు ; అనగా, వారి చిత్త వృత్తినిబట్టి, వారి యభిరుచులనుబట్టి, వారి యభ్యుదయ మునకు తోడ్పడగలడు.

పరమతసహనము అలవడవలెననిన, నీ వితర మత స్థులదృష్టితో విషయములను జూచుట నెఱుంగవల యును. శ్రీరామకృష్ణ పరమహంస క్రైస్తవమతమును నేర్చుకొనునప్పుడు క్రైస్తవులలో మసిలి, వారి వేష మునుగూడ ధరించి, క్రైస్తవుల పరిభాష నుపయోగించి, వారివలె ప్రార్థనల జేసెను. ఇట్లే ఆయన యితర మత ములను గూడ దెలిసికొని వానితో తాదాత్మ్యము నొందెను. తుద కాయన మాతృత్వతత్త్వమునుగూడ దెలియగోరి స్త్రీవేషము వేసికొని, స్త్రీననియే భావించు కొనుచు, స్త్రీలు చేయున ట్లన్ని చేష్టల జేయుచుండెను. తత్త్వమును తెలిసికొనుట కాయన కుపయుక్తములగు బాహ్యోపాయముల నన్నిటిని గైకొనెను ; తుదకు సర్వమత సమత్వబుద్ధి సాధించెను.

అన్నివిషయములను నీ దృష్టితోనే చూచుట తగదు. ఇతరు లాయా విషయముల నేదృష్టితో జూచెదరో, ఏ

విషయముగుఱించి, యెవరిచిత్తవృత్తి యెట్లుండునో అది చక్కఁగ దెలిసికొనియుండవలెను. దానివల్ల సహనము బాగుగ నలవడును. డా॥ బెసెంటుగారిట్లుచేయుటలో గడు నేర్పరి. ఆమె హిందువులయెదుట మాట్లాడి నపుడు హిందువువలెనే యాలోచన జేసి, హిందువుల పరిభాషనే యుపయోగించి, హిందువుల గ్రంథముల నుండియే యుదాహరణములనిచ్చుచు తాజెప్పదలచిన సత్యమును చెప్పెడువారు. ఆ సత్యమునే క్రైస్తవుల యెదుట చెప్పవలసినపుడు, వారి పరిభాషలోనే, వారి భావముల నుపయోగించుచు మాట్లాడుచుండిరి.

---

నాలుగవ అధ్యాయము

## 4. సంతోషము [1]

మూలము :—"నీకర్మ[2] మెట్టిదైననుసరే, దానిని సంతోషముతో భరింపుము. కష్టములు సంభవించుట యనునది నీకు గొప్పగౌరవమని భావింపుము. ఏల యన, కర్మఫలప్రదాతలగు మహానుభావులు దాము సహాయముచేయుటకు నిన్నుఁ దగినవానిగ నెంచు చున్నారని సూచించుచున్నది."

ఈసంపద తితిక్ష, లేక, తాలిమి, యనియు నన బడును. ఆ మాటవల్ల నీవు వారింపజాలని కష్టములను ఓరిమితో భరించవలెనని మాత్రమే యర్థమగుచున్నది, గాని, వానిని సంతోషముతోను, నిర్మలహృదయము తోను, అనుభవించవలెనని, సూచనచేయుట లేదు. దీనినిగుఱించి పరమగురువుయొక్క యభిప్రాయ మంత

[1] "వేదాంతులు దీనిని తితిక్షయందురు. సంతోషము తితిక్షలో నుత్తమావస్థ. సంతోషము తితిక్షయం దంతర్భూతమై యున్నది."

[2] ఈ సందర్భములో కర్మ యనగా సంచితప్రారబ్ధకర్మయని యర్థము చేసికొనవలెను.

యు సంతోషమను మాటలో నిమిడియున్నది. మనకు సంభవించు కష్టములను పైకి చెప్పకొనకుండ, ప్రతిక్రియల జేయదలపకుండ భరించగలము, గాని, దాని వెనుక తరుచుగ విచారముండును. విచారముతోగూడి సంతోషములేని యోరిమి నిజమగు నోరిమికాదు. కష్టములు సంభవించుట గొప్పగౌరవమని తెలిసి కొన్నయెడల విచారమునకు బదులు సంతోషము గలిగి యోరిమి తనంతటనే గలుగును.

సాధకునకు కర్మ మిక్కిలి త్వరితముగ ననుభవమునకు గొనిరాబడును. సాధకుడు మోక్షమార్గము కొఱకు సాధనము చేయుట కారంభించినప్పుడే తన కర్మ త్వరితముగ ననుభవమునకు వచ్చుట కంగీకరించినాడు. ఒకని సంచితకర్మలో నుంచి, వాడొక జన్మమున నెంత కర్మ ననుభవించగలడో, యెంతకర్మ ననుభవించుట కవకాశములు గలుగునో, అంతకర్మ ప్రారబ్ధముగ నేర్పర్చబడును. కర్మదేవత లాయేర్పాట్లన్నియును చేయుదురు. మన మీ జన్మమున సామాన్యముగ ననుభవించునది యాప్రారబ్ధము. కాని, మనుష్యునకు ఇచ్ఛాస్వాతంత్ర్యమున్నది. వాడాస్వాతంత్ర్యము నుపయోగించి, కర్మదేవతలు ఈ జన్మమున తాననుభవించుట కేర్పర్చిన ప్రారబ్ధము నంతను వారనుకొనినకంటె

నెక్కువత్వరలో ననుభవించవచ్చును. అట్లు ప్రారబ్ధము త్వరలో ననుభవమైనయెడల, కర్మదేవతలు, వాని పూనికకుమెచ్చి, సంచితమునుండి మరికొంత కర్మను దీసి వాని యనుభవమున కిత్తురు. "ఈశ్వరుడు ప్రేమించిన వారిని దండించు" నన్న నుడి కిదియే యర్థము.

కర్మ ప్రకృతిధర్మములలో నొకటి. తక్కిన ప్రకృతి ధర్మరహస్యములను తెలిసికొన్నయెడల నా ధర్మముల నెట్లు మన యిష్టమువచ్చిన ట్లుపయోగించుకొనగల మో, కర్మరహస్యముల నెఱింగినయెడల కర్మనుగూడ నట్లుపయోగించుకొనగలము. విద్యుచ్ఛక్తి యంతటను అవ్యక్తముగ నున్నది. దానిని మన మనేకవిధములుగ వ్యక్తముచేయుటకు యంత్రము లున్నవి. ఆ యంత్రముల ద్వారా మనకు కావలసినపు డది వ్యక్తమై పనిచేయును, లేనియెడల, నిలిచిపోవును. ఆయంత్రములో కొంచెము మార్పుచేసినయెడల నాశక్తి తీవ్రముగ బ్రసరించునట్లు గాని నెమ్మదిగ బ్రసరించునట్లుగాని చేయవచ్చును. మన మీ జన్మమునెత్తి యీ ప్రపంచమున బ్రవేశించుట మన కర్మానుభవమున కొక యంత్రమని చెప్పవచ్చును. మన జీవితములో కొన్నిమార్పులను చేసినయెడల కర్మ ఫలములను త్వరలో ననుభవమునకు తేవచ్చును. ఆ మార్పులను చేయుటకు సాధకుడు తీవ్రసంకల్పము

చేయుటవల్ల తన కర్మను త్వరితముగ ననుభవమునకు దేవచ్చునని యంగీకరించినాడు. అట్టి యంగీకారము లేని యెడల కర్మదేవతలు తమంతట తాము ప్రారబ్ధము ననుభవించుటనుగుఱించి మొదట చేసిన యేర్పాట్లను మార్చరు.

అనుభవించవలసిన కర్మ సంచితమై యున్నది. కర్మదేవతలు సాధకుని యనుభవమునకు గొనితెచ్చునది దానిలోనుండి కొంతభాగము గాని క్రొత్తదేమియు నుండదు. సత్పురుషులకే యెక్కువ కష్టములు గలుగుననిన, నది వారిని దండించుటగాని యన్యాయముగాని కాదు; వారికి దుష్కర్మరాహిత్యము త్వరలో జేసికొని, త్వరలో నభ్యుదయము నొందవలయునను నిచ్ఛ గాఢముగనుండి, అందుకు వారు సంసిద్ధులైయున్నారు, గనుక, ఆసంగతి నెఱిగి, కర్మదేవతలు వారికి తోడ్పడుటకై, సంచితమునుగూడ వారియనుభవమునకు గొనివచ్చెదరు. కనుక, కష్టముల నెంత యనుభవించిన నంత కర్మ క్షయమగుచున్నదని యెఱిగి, సాధకుడు సంతోషముతో వచ్చుచున్న కష్టముల నెదుర్కొని యనుభవించవలెను.

ఒకప్పుడు మన మనుభవించు కష్టములకును విపత్తులకును లోకనింద తోడగును. కొన్ని కష్టములు కలిగి

నపుడు ప్రక్కవారు జాలిపడుదురు. ఆ జాలి యాకష్టములను భరించుటకు కొంత సహాయపడును. కాని, కొన్ని కష్టములు కలిగినపుడు తోడివారు జాలిపడుటకు బదులు నిందించెదరు. అట్టి విషమకష్టము ప్రాప్తించినపుడు విశేషమైన కర్మక్షయమగును. ఆకష్టమునకు లోకనింద తోడైన కర్మక్షయము మరింతవేగముగను, పూర్తిగను, అగును.

మూలము :—“ అది యెంత కఠినముగనుండినను, అంతకంటె కఠినముగ లేదుగదా యని సంతసింపుము.”

కష్టముల ననుభవించుటలో జూపవలసిన దిది యొక విధమగు సంతోషము. ఎంత స్వల్పకష్టము వచ్చినను, ‘అయ్యో! ఇంత గొప్పకష్టము వచ్చినదే! ఇంతకష్టము నాకే రావలెనా!’ యని చింతించుట మన కభ్యాసము. సుఖపడుచున్నా ననుకొనువాని కెంత స్వల్పకష్టమైనను గొప్పగానే కనిపించును. కాని, వెనుకటి సుఖమును తలచుకొని అది పోయెనని చింతించుటకంటె, వచ్చిన కష్ట మింతకంటె నెక్కువ కఠినముగనుండక ఇంతటితో కడతేరినామని సంతసించుట మేలు. ఎంతటి కష్టమైనను నిలువదు, కాని, దాని ననుభవించుటలో మనము చూపించు చిత్తవృత్తినిబట్టి దాని యనుభవఫలితముండును.

మూలము :—"నీ దుష్కర్మము అనుభవముద్వారా తీరిపోయి, నీకు బంధము దెగునంతదనుక, నీవు పరమగురువునకు ప్రయోజకుఁడవు గావనుట మఱువకుము."

నీవు నీముక్తికొఱకు కర్మబంధములను త్రెంపుకొని, కర్మరహితుడవగుటకు కోరరాదు. నీవు ముక్తినొందుట ఆనందము ననుభవింపుచు నొకచో గూర్చొనుటకు కాదు, నీవు పరమపురుషులకొఱకు లోకహిత మొనర్చుటకు అర్హుడవైయుండుటకు. దుష్కర్మ లేశమున్న యెడల, అది నీవు లోకహితకార్యముల జేయుట కాటంకమగును, గనుక, నిన్ను పరమగురు వాయనపనికై నియోగించజాలరు. ఒక్కొక్క దుష్కర్మయే కష్టరూపమున ననుభవమైనకొలదియు నీ యుపయోగ మెక్కువయగును. కనుక, నీవు కష్టములను సంతోషముతో భరించి, త్వరలో కర్మరహితుడవగుట కిది యొక గొప్ప యుద్దేశముగ నుండవలయును.

మూలము :—"నీవు పరమగురువున కాత్మనివేదనము చేసికొంటివి గావున, నీ కర్మను బైఁబడి రమ్మని కోరితివి. అందువలన, నూఱు జన్మములందు కొంచెము కొంచెముగ ననుభవింపఁదగిన కర్మమును నీ వొకటి రెండు జన్మములలో తీర్చుకొనుదువు. అది సంపూర్ణ

ముగ తీరిపోవలెనన్న దానిని సంతుష్టుఁడవై యుల్లాసముతో భరించవలయును."

ఇదివరకు చేసికొన్న కర్మ నెట్లనుభవింతువో దానిని బట్టి ముందుకర్మ మంచిదో చెడ్డదో యేర్పడును. కనుక దుష్కర్మ నుల్లాసముతో ననుభవించినయెడల, వచ్చినదంతయు మేలునకే వచ్చినదని సంతుష్టిబొందినయెడల, ఆ కర్మానుభవమువల్ల క్రొత్తకర్మ చేకూరదు. నీ కర్మనంతను త్వరలో ననుభవించవలెననిన, నందుకు స్థైర్యము విశేషముగ నుండవలయును.

నీవు పరమగురువున కాత్మసమర్పణము జేసికొన్న కారణముననే నీ కర్మానుభవము త్వరితగతి నొందుచున్నది. దానివల్ల కష్టములు కలుగుచున్నవని సమర్పితమైనదానిని తిరిగి తీసికొని సుఖించదలచుట తగదు. నీవు సమర్పించిన నీ యాత్మను వారికిష్టమువచ్చిన పనికై వినియోగింతురు. అట్లు వినియోగించుటకు దగినట్లు కర్మరాహిత్యము చేయబడుచున్నది. దానిని వలదనుటకు నీ కధికారములేదు. నీవు సమర్పించినది సద్వినియోగమగుచున్నందుకు సంతసింపుము.

మూలము :—"మఱియు నొకయంశ మేమన—దేనినైనను 'నాది' యనుకొనుట బొత్తిగా విడువవలయు

ను. నీ కర్మమువలన నీ కెక్కువ మక్కువగల వస్తువులును నీ వెక్కుగఁ బ్రేమించువారును నిన్నుండి తొలఁగిపోవచ్చును. అట్టి సమయమునందును నీవు సంతోషము గలిగి, దేనినైనను సరే, అన్నిటినైనను సరే విడుచుటకు సిద్ధముగ నుండవలయును."

మనుష్యు డీ లోకములో ననుభవించు కష్టములలో మిక్కిలి గొప్ప కష్ట మిక్కడ కనపరచబడినది. మనల నీ ప్రపంచమునందుంచుటకు మమకారమే గొప్పకారణమైయున్నది. 'నాది', 'నావారు', లేనియెడల నిక మనమిం దుండుట యేలయని యనిపించును. మనము విశేషముగ ప్రేమించువస్తువులనుండిగాని మనుష్యులనుండిగాని యెడబాటుగలుగుట తుదిపరీక్షయని చెప్పవచ్చును.

ప్రేమను చంపుకొనుమని యీ వాక్యమున కర్థము కాదు. ప్రేమను చంపుకొనుట ఆసురలక్షణము. ప్రేమ పవిత్రముగావలెను, అనగా, మమత్వముతోగూడినదై యుండగూడదు. నాది, నావాడు, అయినప్పుడే ప్రేమించి యితరులను ప్రేమించకుండుట నిజమగు ప్రేమ కాదు. మఱియును నీవు ప్రేమించువస్తువుగాని మనుష్యుడుగాని నీకే చెంది, నీతోనే యెల్లప్పుడు నుండి నీకు

సుఖము నిచ్చుచు నుండవలయునని కోరుటయు నిజమగు ప్రేమకాదు. సర్వసమమైన ప్రేమ నిజమగు ప్రేమ. నీ బిడ్డ యింకొకరి బిడ్డను కొట్టినయెడల నీబిడ్డ యమాయకుడని, తెలియక కొట్టినాడని, యిట్లేదో వంక బెట్టి నీ బిడ్డ పక్షము మాట్లాడుదువు. ఆ యితర బిడ్డ నీబిడ్డను కొట్టినపుడు ఆబిడ్డ దుష్టుడని నిందింతువు. ఇది మమత్వముతో గూడిన ప్రేమవల్ల కలుగు ఫలము. బిడ్డలందరియెడలను సమానమగు ప్రేమభావము గలవా డట్లుచేయడు. మన మట్టిప్రేమ నభ్యసించవలెను.

ఆ విధముగ మన ప్రేమ మమత్వములేక నిర్మలమైన యెడల, నెడబా టుండదు. ఎడబాటువల్ల దుఃఖము 'నాది' యనునది యున్నప్పుడే కలుగును, గనుక, అది తొలిగించినయెడల మనము ప్రేమించువస్తువుగాని మనుష్యుడుగాని యెక్కడనున్నను మనకు విచారముండదు. మనము ప్రేమించు మనుష్యు డెప్పుడు మన యొద్దనే యుండవలెనని కోరుట స్వార్థము, అనగా, మనము వాని సుఖము, వాని యభ్యుదయము, వాని యవసరములు లెక్కచేయుటలేదని యర్థము. మనము వానిని నిజముగా ప్రేమించినయెడల వాని యభ్యుదయమునకు, వాని సుఖమునకు, సంతోషమునకు, ఆటంకము కలిగించబోము. కనుక, వాడు మనల నెడబాయుట

వాని కావశ్యకమైనపుడు మన మాయెడబాటును సంతోషముతో భరింతుము. తమ భర్తలను పుత్రులను సంతోషపూర్వకముగ రణరంగమునకు బంపిన వీరవనితల ప్రేమ యట్టి స్వార్థరహితమగు ప్రేమ.

సాధకుడు అట్టి నిర్మలప్రేమవికాసమునే గాక, యెడబాటును సంతోషముతో భరించుట గూడ నభ్యాసము చేసికొనవలయును. ఏలయన, పరమగురువు ననుసరించు సమయము వచ్చినప్పుడు నీవు 'నీవి' యనుకొను వాని నన్నిటిని విడువవలసివచ్చును; మానాభిమానములు గూడ విడువవలసివచ్చును. జీససుక్రైస్తు అవతరించినపు డాయన ననుసరించుటకు సర్వమును పరిత్యజించి వచ్చినవారు బహుకొద్దిమంది. తుద కొకధనవంతుడు వచ్చినప్పు డాయన వానిని తన ధనమునుమాత్రమే విడిచిపెట్టుమని కోరెను, గాని యతడు దానినైనను విడువలేకపోయెను. శ్రీకృష్ణుడు గోపికావస్త్రాపహరణము జేసినపుడు, గోపికలను దిగంబరులుగా తన వద్దకు వచ్చి తమ చీరెలను తీసికొమ్మని చెప్పెను, అనగా మానాభిమానములు విడిచిననేగాని తన కటాక్షమున కర్హులుకారని యర్థము.

ఖిన్నత యుండగూడదని యిదివరకు చెప్పబడియున్నది. ఎడబాటుకలిగినపుడు ఖిన్నత నొందుదువేని

నీవు పరమగురువుసేవ కుపయోగించవు. పరమగురువు యొక్క శక్తి నీద్వారా ప్రవహించుటకు నీ వెల్లప్పుడు సంతోషముగానుండు టావశ్యకము. తరువాత వాక్యమునం దీవిషయము చెప్పబడినది.

ఈ వాక్యమువల్ల ముముక్షువు స్వజనమధ్యమున నుండగూడదనిగాని, ధనధాన్యాదిసంపదల గలిగియుండ రాదనిగాని చెప్పుటలేదు. అవన్నియు నీచేతిలో లోకోపకారార్థము వినియోగించుటకు ఉంచబడినవని యెంచి, వానియందు మమకారముంచక, అవియున్నను, లేకున్నను, ఒకటేయై యుండవలెను. జనకమహారాజు చరిత్ర మిందు కుదాహరణము. ఉన్నవానిని విడువ నక్కర లేదు, గాని, యవి నిన్ను విడిచినప్పుడు వానికై దుఃఖించుటయు, లేనివాని నపేక్షించుటయు కూడదు.

మూలము :—“ పరమగురువు దనసేవకుని మూలమున నితరులకుఁ దనశక్తిని ధారపోయ సందర్భములు గలుగును. సేవకుఁడు ఖిన్నతకు లోబడియుండిన వారట్లు చేయనోపరు. కావున సంతోషము సహజముగ నుండవలయును.”

పరమగురువు సేవయే సాధకుని జీవితార్థము, గనుక, నాతడెల్లప్పుడును అందుకు సంసిద్ధుడై యుండవలెను.

ఒక్కొక్కప్పుడు, పరమగురువు ఈ లోకమున ఎవరైన నొకరిద్వారా ఒకానొక పనిజేయవలసియుండును. ఆ యన సర్వశక్తిమంతుడును, ఏ లోకమునందైన బని జేయ సమర్థుడునై యున్నను, స్థూలలోకమున బని జేయుటకై తన యాధ్యాత్మిక శక్తిని బహు అరుదుగా నుపయోగించెదరు. ఏలయన, నొక స్వల్పకార్యము కొఱకై విశేషశక్తిని వినియోగించవలసివచ్చును, గనుక, ఎంతో గొప్పఅగత్యము కలిగినప్పుడు తప్ప ఇతర సమయములలో నొక సాధకునిద్వారా ఆపని చేయించె దరు. అందుకుపయోగించుటకు నీవు సంసిద్ధుడవై యుండ వలెను. ఒకప్పుడు దొరికిన తరుణము పోగొట్టుకొందు వేని, మరల నట్టి తరుణము దొరుకుట దుర్లభము.

---

అయిదవ అధ్యాయము

## 5. ఏకాగ్రత [1]

మూలము :—"నీ పరమగురువుయొక్క పని చేయవల యునను నది యొక్కటియే నీవు లక్ష్యముగ నుంచు కొనవలయును. నీవు మఱియేమి చేయవలసివచ్చి నను వారిపని నేమో యెప్పుడును మఱువరాదు."

మనము ప్రతిదినము చేయుపను లన్నింటియందు నేకా గ్రత యావశ్యకముగ గావలెను. ఒకపని చేయునపుడు ఏకాగ్రతతో జేసినయెడల మన శక్తులన్నియును ఆ పనియందే వినియోగమగును, లేనియెడల, పనిచేయు నప్పు డితరవిషయములతో సంబంధించిన తలంపు లెన్నో కలిగి, ఇప్పుడు కలిగినతలంపు ఇంకొక క్షణమున నుండక, తారుమారై, తుదకు పూనినపని చక్కగా నెగ్గదు. మన జీవితమున కొకలక్ష్య ముండవలెను. మనము చేయుపనులన్నియు ఆ లక్ష్యముకొఱకే చేయ వలెను. ధనము సంపాదింప బూనినవాడు నిరంతరము

[1] "దీనిని సమాధానమని వేదాంతు లందురు." రెండవ యను బంధము చూడుడు.

ఆపనియందే ధ్యానముంచి, దానికొఱకే సర్వప్రయత్న ములజేయుచు అనేక పన్నాగముల బన్నుచు, తుదకు ధనము సంపాదించును. లక్ష్యమునందు బుద్ధి నిలపలేని యెడల వానిబుద్ధి యితర విషయముల వైపునకుపోయి ధనసంపాదనము జరుగదు. ఆవిధముగనే అధ్యాత్మిక సాధనమునగూడ, లక్ష్యమునందు చిత్తైకాగ్రతయుండ వలెను. మోక్షసాధనమునకు పరమగురుసేవయే యుద్దేశముగనుండవలయునని యిదివరకు చెప్పబడినది. కనుక సాధకునకు ఆ సేవయొక్కటియే లక్ష్యముగ నుండవలెను. ఇతర పనులెన్నియైన నుండవచ్చును, అవి చేయవచ్చును. కాని పరమగురువుసేవకు సంసిద్ధుడైయుండి, ఎప్పుడగత్యమువచ్చిన నప్పుడా యితర కార్యముల నన్నిటిని వెనుకకుంచవలెను. అయితే, సాధకుడు ఏపని చేసినను గురుసమర్పితముగ పరోపకారార్థము జేయ నేర్చుకొనును, గనుక, వాని కిది సులభమగును.

మూలము :—"అయితే, వారిపని తప్ప మఱియెద్దియు నీకుఁ బ్రాప్తించనేరదు. ఏలయన, ఇతరులకు సహాయకరమై స్వప్రయోజనము నపేక్షించని పనియంతయు పరమగురువుపనియే గదా! అట్టి పనిని నీవు వారికర్పణముగఁ జేయవలయును."

సాధకుడు చేయు ప్రతిపనియును పరమగురువున కప్పటికప్పు డుపయోగించక పోవచ్చును. కాని, యతడు పరమగురు సమర్పితముగ, స్వార్థరహితుడై, పరోప కారార్థము చేయుపనులన్నియు ఎప్పుడో యొకప్పుడు వారికుపయోగించును. మనము పాఠశాలలో నేర్చు కొన్న విషయములన్నియును మన జీవితములో మన కుపయుక్తములు గావు, కాని అవి నేర్చుకొనుటలో మన మనస్సునకు లభించిన శిక్షణమువల్ల మన మిప్పుడు మనశ్శక్తిని శీలమును బలపరచుకొనుట మిక్కిలి సులభ మగును. ఆవిధముగనే, సాధకుడుచేసిన ప్రతిపని అప్పుడు ఆరూపమున నుపయోగము కాకపోవచ్చును. కాని, ఆపనిచేయుటలో సాధకుడు వెలువరచు శక్తులు మరి యొకప్పు డుపయోగమగును.

పరమగురువుకొఱకు పనిచేయుట అనగా అమానుష ములగు వింతపనులు చేయుటగాని, మనతోడి మాన వులకు సంబంధించని పనుల జేయుటగాని కాదు. మన యనంతర మాయనసేవ జేయగల సత్సంతానముగనుట, ఆయన సేవకై వినియోగించుటకు ధనము సంపాదిం చుట, ఆయనకు తోడ్పడుటకై తగిన బలము, వీర్యము, శక్తి, సామర్థ్యము సంపాదించుట, ఇట్టి పనులన్నియును మన మాయనకొఱకు చేయుపనులే. అయినను, అట్టి

పనులను చేయుటలో ఆత్మవంచనము లేకుండ జూచుకొన వలయును ; అనగా, మనకు ధనముగాని అధికారము గాని సంపాదించవలయునను నిచ్ఛ బుట్టి, దానిని పరమ గురువుయొక్క పేరుతో నాచ్ఛాదించుచున్నామేమో యని చూచుకొనవలయును.

మూలము :—"అట్టి పనులలో నొక్కొక్కటియు నీవు చేయుచో, దానిని బాగుగ గమనించి, అది నీ చేత నైనంత బాగుగనుండునట్లు చేయుము. ఆ మహాగురు స్వాములే మఱియు నిట్లని వ్రాసిరి—'నీ వెద్దిచేసినను, అది మానవులకు గాదు, భగవంతునికని దానిని మనఃపూర్తిగఁ జేయుము.' పరమగురు వపుడే వచ్చి చూచునని నీకుఁ దెలిసినచో నీవొకపనినెట్లు జేయు దువో యోచించి నీవు చేయుపనినంతయు నారీతిననే చేయవలెను. అందరికంటె నెక్కుడు జ్ఞానము గలవా రలే పైవాక్యమునందలి యర్థమును బూర్ణముగఁ దెలిసికొందురు. దానికంటెను మిగుల ప్రాచీనమగు మఱియొక వాక్యము దానివంటిది యున్నది. అది యెద్దియన 'నీ చేతికిఁదగులు పనియెద్దియేగాని, దాని నీ శక్తినంతను వినియోగించి చేయుము.'"

మనము చేయుపనులన్నిటిని దేవుడు చూచుచుం డును, గనుక, మనము పాపములను చేయగూడదని బిడ్డల

కును మూర్ఖులకును చెప్పుటకలదు. దానివల్ల, దేవుడు తన యాజ్ఞనెవరైన నుల్లంఘించుచున్నారేమో యని చూచుచు, ఎవరైన తప్పుచేయుదురా, దండింతునా, యని దేవుడు కనిపెట్టుకొని యుండునను భావము వారికి గలుగును. అది సరియైన భావము కాదు. దేవుడు పరమ దయాస్వరూపుడు, ప్రేమమయుడు. కనుక, ఆయన సర్వవ్యాపియై యుండుట మన కాయనయే సర్వప్రాణుల యందును, ఇతరముగను, కనపడుటకేగాని, మనము చేయుపనులను పొంచుని చూచి మనలను దండించుటకు, బహూకరించుటకు కాదు. ఆయన సర్వవ్యాపియై యుండుటవల్ల మనకు క్షేమము మంగళము కలుగును.

నీ వేపనిచేసినను అది పరమగురువున కుపయోగించునట్లు చేయవలెను గదా! ఆపనియందు నీ యావచ్ఛక్తిని వినియోగించి, స్వార్థలేశములేకుండ చేసినపుడే అది ఆయన కుపయోగించును, లేనియెడల నుపయోగించదు. కనుక, పనిచేయునపుడు ఏకాగ్రతతో జేయవలెను.

నీవొక జాబును వ్రాయునపు డాజాబును పరమగురువు చదువుకొనునని నీకు తెలిసినయెడల, నీవెంతయో జాగ్రత్తగ వ్రాయుదువు. అక్షరములు పొందికగ, భావ

ముల పొందిక, విషయవివేచనము, అన్నియు చక్కగా నుండును. ఒక సేవకుడుగాని యుద్యోగము నర్థించువాడు గాని యధికారికి జాబు వ్రాయునపు డది యధికారి చూచి మెచ్చుకొనవలయునని యెంతో జాగ్రత్తగ వ్రాయును. లేనియెడల వాని నధికారి దండించునేమోయని, లేక, ఉద్యోగము నీయడేమోయని, భయముండును. పరమ గురువు విషయమున నట్టి భయముతో మనము పని చేయనక్కఱ లేదు. కాని, మన మాయన యుపయో గించవలయునని యొక పనిని చేసినప్పుడు, దానిని ఉప యోగించుటలో ఆయన కాలముగాని, శక్తిగాని వ్యర్థ ముకాకుండునట్లు దానిని జేయుట మన విధి. బిడ్డను గుఱించి తల్లి శ్రమపడునట్లు మనయందు లోపము లున్నను మన్నించి మనకొఱకాయన శ్రమపడవచ్చును. కాని మనము బుద్ధిపూర్వకముగ ఆయనకు శ్రమగలిగిం చుట గొప్పతప్పు. మనము చేయగల అత్యుత్తమకార్య మే పరమగురువునకు సమర్పించుటకు తగినదన్న యుద్దేశముతో మనము పనుల జేయుచు ప్రతిపనియు నత్యుత్తమముగ నుండునట్లు యావచ్ఛక్తిని వినియో గించి చేయవలయును. శబరి శ్రీరామునకు సమర్పిం చుటకు ఫలముల నేర్చుటనుగుఱించిన కథ దీనికి దృష్టాంతము.

మూలము :—"ఏకాగ్రతయన నీవు ప్రవేశించిన మోక్షమార్గమునుండి యెద్దియైనను నిన్నొకక్షణమైనను మరలింపరాదనియు నర్థమగును. నిన్ను మోహింపఁజేసి తప్పుత్రోవలఁ ద్రిప్పు సందర్భములుగాని, ఐహిక సుఖములుగాని, ఐహికములగు ప్రేమలైననుగాని, నిన్ను మరల్పఁజాలి యుండరాదు. ఏలయన నీ వీమార్గముతో నేకీభవించవలయును. అది నీకు సహజమై, దానిగుఱించి యోచింపనక్కఱలేకయే దాని నవలంబించునట్లును, దానినుండి మరలుట నీకసాధ్యముగ నుండునట్లును కావలయును. అంతరాత్మయగు నీవు ఆ మార్గమునఁ బ్రవేశింప నిశ్చయించితివి. దానినుండి త్రెంచుకొనిపోవుట యన నిన్నుండి నీవు త్రెంచుకొని పోయినట్లగును."

ఇంతవరకును మనస్సు మొదలగు శక్తులను ఒక్కచోఁ జేర్చి పనిచేయుట ఏకాగ్రత యని చెప్పబడినది. ఇచ్చట చిత్తస్థైర్యముగూడ ఏకాగ్రతయే యని చెప్పుచున్నారు. ముముక్షువు మోక్షమార్గముతో నేకీభావము నొందవలయునని యన్ని మతములలోను చెప్పబడియున్నది. క్రైస్తు 'నేను మార్గమును' అని చెప్పెను. శ్రీకృష్ణుడు

'నేను గతిని '[1] అని శ్రీ. గీతా ॥ ౯—౧౮ శ్లోకములో జెప్పెను. (The Voice of the Silence) 'అంతరంగ ప్రబోధము 'లో 'నీ వా మార్గము వేయైనగాని, దాని వెంటబోజాలవు ' అనియున్నది. నిజముగ నీ మార్గమున జరుగున దేమనగా, ముముక్షువు తన యాత్మతో నైక్య భావము నొందును. పతంజలి యోగలక్షణమును నిర్వ చనముచేయుచు, పురుషునకు మనోనిగ్రహము గలిగి నపుడు పురుషుడు నిజస్వరూపమునం దుండును (తదా ద్రష్టుస్స్వరూపాఽవస్థానమ్ ౧—3) అని చెప్పెను. ఆత్మైక్యభావమును బొందిన పురుషునిమనస్సు దిగ్దర్శన యంత్రములోని ముల్లువలె నెటుద్రిప్పినను ఆ పరవస్తువు వైపే మరలుచుండును. 'నీవు ' అని చెప్పదగినది ప్రజ్ఞా నాంశువు, లేక, తురీయాత్మ. ప్రజ్ఞానాంశువు (Monad) యొక్కయంశ క్రిందిలోకములలో బ్రవేశించి ప్రాజ్ఞాత్మ, లేక, జీవాత్మ యనబడును. జీవాత్మయొక్క యొక యంశ యింకను స్థూలప్రకృతిలో బ్రవేశించి దేహాత్మ యనబడును. దేహాత్మయే జాగ్రదవస్థలోను స్వప్నావస్థ

[1] గతిః అనుపదమునకు కర్మఫలము అనియును, పొందదగిన స్థానము లేక వస్తువు అనియును సాధారణముగ అర్థముచెప్పుదురు. గతిః అనగా (మోక్ష) మార్గమనియు నర్థముచెప్పబడియున్నది. మార్గమును, ఆ మార్గమున బొందదగినదియు నొక్కటేగదా !

లోను వ్యవహరించునది. దేహాత్మ జీవాత్మ అను రూపములతో ప్రజ్ఞానాంశువు యీ ప్రపంచరంగమున వ్యవహరించుచున్నది. యోగసాధనమువలన క్రమముగ దేహాత్మ జీవాత్మతో నేకమై, యటుతరువాత, దేహాత్మ ద్వారా జీవాత్మయే వ్యవహరించును. పిదప, కొంత సాధనానంతరము జీవాత్మ ప్రజ్ఞానాంశువుతో నైక్యము నొంది యంతటినుంచియు ప్రజ్ఞానాంశవు సర్వాధికారము వహించును. ఇట్లు క్రమముగ ఆత్మశక్తులు వికసించు కొలదియు నీ లౌకికవిషయములపై దృష్టి యాధ్యాత్మిక విషయములవైపు మరలి, తుదకు ప్రజ్ఞానాంశువునందు నిలచును. అట్టి యాత్మసంధానమునకు సాధనము చేయువాడు ఎట్టి లౌకికవిషయములు తన మనస్సును చలింప జూచినను లొంగక తన మార్గమును విడువక యుండవలయును. అందుకు విశేషమగు స్థైర్యము కావలెను. ఏలయన, వైహికమగు ప్రేమగూడ నిన్ను మరల్పజాలి యుండరాదు. లేనియెడల, నీవు మోహమును ప్రేమయని భావించి, యామోహమునకు జిక్కి పతితుడవు గావచ్చును. నీవు జయించవలసినది వైహికమగు ప్రేమయని యిచ్చట చెప్పబడినది. అదియే మోహము. నిజమైన దివ్యప్రేమ బంధహేతువు కాదు.

---

ఆరవ అధ్యాయము

## ౬. విశ్వాసము [1]

మూలము :—"నీ పరమగురువును విశ్వశింపవలెను. నీయందును నమ్మక ముండవలెను. నీవు పరమగురువును చూచియుండినచో జననమరణము లెన్ని గడచినను నీకు వారియందు సంపూర్ణమగు నమ్మకము గలిగియుండును. వారిని నీవింకను జూచియుండక పోయినను వారి స్వరూపము ననుభవమునకుఁ దెచ్చుకొనఁబూని వారిని నమ్మవలెను. నమ్మనిచో వారైనను నీకు తోడ్పడజాలరు."

ఇవి ఆల్కియొని తన పరమగురువునుగుఱించి చెప్పిన మాటలు.

పరమగురువుయొక్క మహాత్మ్యమునుగుఱించి యూహించుట మనబోంట్లకు సులభముకాదు. మన మం

[1] "ఇది శ్రద్ధయని వేదాంతు లందురు. గురు వేదాంత వాక్యముల యందు పరమవిశ్వాసమని చెప్పుదురు. గురువిశ్వాస మీగ్రంథమందు చెప్పబడియున్నది. వేదాంతవాక్యములసారము 'నేనంతరాత్మ' యని తెలియుటయే కదా!"

దుకు ప్రయత్నించవచ్చును. మనకు తెలిసినంతవరకు ఉత్తమాదర్శములను గుఱించి యోచించవచ్చును. కాని, పరమగురువు మన మూహింపజాల నన్నివిధము లగు గొప్పదనము మూర్తీభవించిన మహనీయుడగుట చేత, మన మెంత యుత్తమాదర్శమును బెట్టుకొన్నను, అది ఆయనకు సాటిరాదు. కనుక, మన మాయన నూహచేసికొని ధ్యేయమూర్తిగా బెట్టుకొనుట కష్టము, కాని వారిని ప్రత్యక్షముగ జూచు భాగ్యము లభించని వా రంతకంటె చేయునది లేదు.

పరమపురుషులను ప్రత్యక్షముగ జూచినవా రున్నారు. కాని, వారిలోగూడ, పూర్వజన్మకర్మఫలముగ, నా మహనీయుల మహత్వమును గనిపెట్టజాలక, వారి యెడల భక్తివిశ్వాసములు గుదురనివారు కొంద రున్నారు. పూర్వజన్మములలో సుకృతము జేసికొన్న వారు ఆ పరమపురుషులలో నొకరిని జూచినయెడల వెంటనే వారి మహత్వమును గుర్తించి, వారిని భక్తి విశ్వాసములతో సేవింతురు ; తదితరులు వారిని కన్నులార జూచియు వారు మహాత్ములని గుర్తింపజాలరు.

అయితే, పరమగురువులయెడల విశ్వాసము గలుగుటకు, వారిని చూచియుండ నక్కఱలేదు. అట్టి వా రున్నారని నమ్మి, వారీవిధముగ నుందురని ఒక ఆదర్శన

మూర్తిని యూహించి, ఆ మూర్తిని హృదయమున నుంచుకొని ధ్యానముచేయుచు, ఆ మూర్తియెడల భక్తిని కురిపించుచు నున్నయెడల, నీభక్తి యొక్క పరమగురువు నాకర్షించును ; ఆయన నీకు తోడ్పడును.

పరమగురువులున్నారని నమ్ముటకు తగిన హేతువు లున్నవి. వారిని చూచినవారు వారి యునికిని ధృవపరచు చున్నారు. పురాతనగ్రంథములలో వారినిగుఱించి వ్రాయబడి యున్నది. పురాణగాథలలో ఆకాలమున నుండిన మహర్షులనుగుఱించి చెప్పబడియుండుటయే గాక, భవిష్యత్కాలమునుగుఱించి చెప్పిన భాగముల లో కలియుగములో నేయే మహనీయు లేయే పదవుల యందుందురో వ్రాయబడియున్నది. మానవపరిణామము నాద్యంతముగ పరీక్షించి చూచినవారికి, మనుష్య వర్గుతో పరిణామ మంతమగునని చెప్పుట సబబుగా దోచదు ; మనుష్యునియందున్న లక్షణములకంటె గొప్ప లక్షణములు, మనుష్యుని శక్తులకంటె గొప్పశక్తులు, గల జీవులుండుట తప్పదని స్పష్టమగును. అయితే, అందరును వారున్నారని నమ్మవలయునని బలవంతము లేదు. పరమగురువులున్నారని తెలియనివారు కూడ లోకోపకారము జేయుటచే వారి కటాక్షమునకు పాత్రు లగుదురు. కాని, వారి మార్గమును బ్రవేశించ దలచిన

సాధకుడు వారియందు నమ్మకముంచక తప్పదు. వారి యందు ఆసాధకునకు భక్తివిశ్వాసములు లేనియెడల వారి శక్తులు వానిద్వారా ప్రసరించుట కాటంకము గలుగును, గనుక, వారు వానికి తోడ్పడజాలరు. వారి నెఱుగని వారి మనస్సులో వారియెడల విశ్వాసము లేదు, అవిశ్వాసము లేదు. కాని వారి నెఱిగి, వారి ననుసరింప బూనియు, వారియెడల విశ్వాసము లేనియెడల, నది యవిశ్వాసమే యగును.

మూలము :—"పూర్ణమగు నమ్మకముండినగాని వారి ప్రేమయు శక్తియు నీవైపున పూర్ణముగఁ బ్రవహింపఁజాలవు."

పరమగురువులు ఒక్కొక్కప్పు డెక్కడనైన తమ కొఱకేదైన పనిచేయుటకుదగినవా రెవరైన నున్నయెడల, వానిచే నాపని చేయించెదరని యిదివరకు చెప్పియున్నాము. అట్టి యవకాశము పరమగురువునెడల భక్తి విశ్వాసములు గలిగి వారిసేవ జేయ సంసిద్ధులై యున్న వారికి ముందుగ లభించును. వారిద్వారా పరమగురువులు తమ శక్తిని ప్రసరింపజేతురు. ఆశక్తి ప్రసారమున కాటంకములలో విశ్వాసము లేకుండుట యొకటి.

విశ్వాసము లేనివారిపైని పరమగురువులు కోపము చేయరు. సమయమునకు తమ పనిని చేయుట కొఱ

సాధకుడు సిద్ధముగా లేడని వానియెడల కాఠిన్యమును వహించరు. నీవు వారిపని చేయుట కుత్తమ సాధనము వని వారికి తోచినయెడల వారు నిన్నుపయోగించెదరు. ఉన్నవారిలో నుత్తముని యెంచుకొందురు. వారికి పని కావలెనుగాని వ్యక్తులపై నభిమానము దయ చూపుటకు మాత్రమే యెవ్వరిని ఉపయోగించరు. ఒకప్పుడు క్రొత్తగ అధ్యాత్మమార్గసాధనము నారంభించినవాడే వారిపనికి ఉన్నతసాధకునికంటె నెక్కువగ యుపయోగించవచ్చును.

మూలము :—"నీయందు నీకు నమ్మక ముండవలయును. నీ విషయమై నీకు చక్కఁగఁ దెలియునని యనుకొనెదవేమో! అట్లెంచినచో నీ విషయము నీకుఁ దెలియనే తెలియదు. పలుమాఱు బుఱదలోఁబడిన[1] దుర్బలమగు పైపొట్టును (వైశ్వానరాత్మను) మాత్రమే నీవెఱుఁగుదువు. యదార్థముగ నీవన్నో భగవంతుఁడను నగ్నినుండియే వెలువడిన యగ్నికణమవు. సర్వశక్తిమంతుఁడగు భగవంతుఁడు నీయందున్నవాఁడు. ఆకారణముంబట్టి నీవు చేయ నిశ్చయించినచో నీ కసాధ్యమగునది యొక్కటియు లేదు. 'ఒక

[1] "అజ్ఞానమయమగు సంసారములోఁబడి శోకమోహములకు లోఁబడునది యగు వైశ్వానరాత్మ యని యర్థము."

మనుజుఁడు చేసినదానిని మరియొకఁడు చేయఁ గలఁడు. నేను మనుజుఁడనే, అయినను నేను మనుజు నందుండు భగవంతుఁడనుగూడ. ఈ పనిని నేను చేయఁగలను. నేను చేసితీరెదను' అని నీకు నీవు చెప్పుకొనుము. ఏలయన నీ వీమోక్షమార్గమున నడువవలయునన్న నీ మనోనిశ్చయము బాగుగఁ దీరిన యుక్కువలె నుండవలెను."

ఎవనియొద్దకైనను పోయి, 'నాయనా! నీ వీతప్పు పనులను చేయుచున్నావు. అవి చేయవద్దు' అని చెప్పిన యెడల, వాడు వెంటనే 'నే నేమి చేయను. నా కది యభ్యాసమై పోయినది' యనును. అభ్యాసము నెపముగా బెట్టుకొని, యనేకమంది తమ దుర్మార్గములను విడుచుటకు ప్రయత్నమునైన చేయరు. వారి కాతప్పు పని అలవాటెట్లయినదో దానిని వదులుకొనుటకూడ నట్లే యలవాటగును. కాని, తన యలవాటును మార్చు కొనగలనను విశ్వాసము వానికిలేదు. ఎవని శక్తియందు వానికి విశ్వాసము లేనియెడల వా డభ్యుదయము నొందడు. నీ కాళ్లను నీవు కట్టివేసికొని నడువజాలనని కూర్చొనిన నేమి ప్రయోజనము?

నీ వేపనినైనను చేయగలవు; చేయజాలనని యనుకొనక, చేయగలనని మనస్సులో నిశ్చయము చేసికొని,

చేసి తీరుదునని ప్రారంభించినయెడల, నిజముగ చేసి తీరుదువు. అంతతీవ్రమైన ఆత్మవిశ్వాస మున్నవా డేపని యందైనను నిగ్రహించగలడు. ఇది మనకు లౌకిక వ్యాపారములలో తరుచుగ కనిపించు విషయమే. ధనార్జన లోగాని, పేరు సంపాదించుకొనుటలోగాని యేదైన నాటంకము వచ్చినయెడల, దానిని తొలిగించుటకెంత శ్రమనైనను భరించి పనిచేయుదువు. ఎందుచేత? నీవు పూనికతో పనిచేసినయెడల ఆయాటంకము తొలగు నన్న విశ్వాసమున్నది. కనుక, అనగత్యములగు లౌకిక కార్యముల నాత్మ విశ్వాసముతో పూనుకొని కష్టపడి పనిచేసి నిగ్రహించినట్లు అధ్యాత్మిక కార్యములనుగూడ నాత్మవిశ్వాసముంచి పూనికతో పనిచేసిన నెందుకు నిగ్రహించము?

'నేనేపనినైన జేయగలను' అను తలంపు నీ మనస్సులో గాఢముగ నున్నయెడల నది నీకు రక్షరేకువలె సదా నీయండనుండి, నీచేత నేపనినైన జేయించును. 'చేయజాలను' అన్నతలంపు నీకు దుష్టగ్రహమువలె వెంటనంటి, యేపనిబూనినను నీవు చేయలేకుండ జేయును.

మనుష్యుడు చేయజాలనిపని లేదు. ఇదివరకు ఎందరో ఎన్నియో ఘనకార్యముల జేసిరి. నీవేల చేయజాలవు?

కార్య మెంతగొప్పది యైనను ఆత్మవిశ్వాసముగలవాని కది బహు సులభముగనే కనపడును. వాని కాపని చేయ జాలనన్న తలంపే యుండదు.

ఎవరిపనిని వారు చేసికొనుటకు ప్రయత్నమేమియు చేయక, పరమగురుని సహాయ మపేక్షించుటవల్ల ప్రయోజనములేదు. నీచేత నొక పాత్రను గైకొని, దాని మీద గట్టిగా మూతబెట్టి, దానిలో నీరు బోయుదమనిన, ఆ నీరు దానిలో బడక, పైని పడిపోవును. స్వయంకృషి వల్ల పనిచేయుటకు ప్రయత్నించి, నీ యావచ్ఛక్తిని వినియోగించి పనిచేసినయెడల నీకు పరమగురుని సహాయ మప్పుడు లభించును.

---

మొదటి అధ్యాయము

## ముక్తి, నిర్వాణము, మోక్షము

మూలము :—"సాధనములన్నింటిలో ప్రేమ[1] అతి ముఖ్యము. మానవునకుఁ బ్రేమ యనునది దగినంత దృఢముగ నుండినచో, నది వానిని నిర్బంధముగ నితర సాధనముల నన్నింటిని సాధించునట్లు చేయును. ప్రేమ లేనియెడలఁ దక్కిన వన్నియు నెప్పటికిని జాలవు. దీనిని, జననమరణరూపమగు చక్రము నుండి మోక్షమునకును, భగవంతునితో నైక్యము పొందుటకును తీవ్రమగు నిచ్ఛయని తరుచుగ నిర్వ చింతురు. అయినను, అట్లుచెప్పుట స్వప్రయో

[1] "వేదాంతగ్రంథములయం దిది ముముక్షుత్వమని వాడఁబడు చున్నది. ముముక్షుత్వమనఁగా మోక్షేచ్ఛ—జననమరణరూపమగు సంసారదుఃఖమునుండి విముక్తుఁడు కావలయునను తీవ్రమగు నిచ్ఛ. అజ్ఞానమునుండియు, తత్కార్యములగు శోకమోహములనుండియు విడువఁబడవలయునను కోరిక. ఐహికములు నాముష్మికములునగు విషయములయందు తనకు గల ఇచ్ఛను వదలి, పరమేశ్వరు నొక్క రిని, మరియు ఆయన ఆవిర్భావ ఉపాధులగు సకలభూతములను ప్రే మించి, వారి సన్నిధిం జేరఁగోరుటయే ముముక్షుత్వము. దీని నిపుడు పరమగురువులు ప్రేమయని నిరూపించియున్నారు."

జన పరత్వమును సూచించుచు, ముముక్షుత్వము అను అర్థములోఁ గొంతభాగమును మాత్రమే తెలుపును."

దీనిని వేదాంతులు ముముక్షుత్వము అని యందురు. 'ముచ్' (అనగా, విడుదలయగుట) యను ధాతువు నుండి "మోక్షము" (అనగా విడుదల, విముక్తి) యను మాటయును, "ముముక్షుత్వము" (అనగా, మోక్షేచ్ఛగలిగియుండుట) అను మాటయును వచ్చినవి. మోక్షము, నిర్వాణము అను మాటల యర్థములు వేరు, కాని, రెండును ఒక్క అవస్థయొక్క రెండులక్షణ ములను తెలియజేయునని చెప్పవచ్చును. 'వా' అను ధాతువునకు 'నిస్' అను నుపసర్గ జేర్చుటవల్ల 'నిర్వాణ'పదము వచ్చినది. దానికి 'ఊదివేయుట' యని యర్థము. జననమరణచక్రమునుండి విడుదల యగుట మోక్షము. ఆ చక్రమున పురుషుని బంధించు నదియును, సామాన్యముగ మనము మనుష్యుడని యను కొనునట్టియును, ఈ స్థూలస్వభావమంతయు నశించి పోవుట నిర్వాణము.

ఈ మాటలనుగుఱించి యనేక దురభిప్రాయము లున్నవి. కొందరు మోక్షము అభావాత్మకావస్థ యను కొందురు. వారు స్వప్రయోజనకరములగు కోరికలను,

ఇతరులతో సంబంధమును, విడిచిపెట్టినయెడల, తమకు పునర్జన్మము కలిగించు హేతువులుండవని యనుకొని, విశేషసాధనముచేసి కోరికలను, పరస్పరసంబంధములను త్రెంచుకొని, బహుకాల మీలోకమున జన్మమక్కర లేకుండ జేసికొందురు. కాని, యది మోక్షము కాదు. నిర్వాణమనుమాట బౌద్ధు లుపయోగింతురు. వారిలో కొందరు నిర్వాణమనగా మనుష్యుడు పూర్తిగా నశించుటయని చెప్పెదరు. పాశ్చాత్యపండితు లా మాటయం దీయర్థమునే గ్రహించిరి. కొందరు నిర్వాణ మనగా, అహంభావము, అనగా, నేను ఈ పనిచేసి నాను, నేను ఈ యనుభవమును పొందినాను, అను నిట్టి భావములను నశింపజేసికొనుట యని చెప్పెదరు. ఇదియే సరియైన యర్థము. ఏలయన, నశ్వరమైనది నశించునుగాని నిత్యము సత్యమునగు ఆత్మ నశించదు. మఱియును, ఆత్మయు నశించినయెడల నిర్వాణావస్థయం దుండున దెవరు? అందుకు చేయుసాధన మంతయు నేల?

జననమరణముల యావశ్యకతయే లేకుండ జేసికొనుట, అనగా, నీ సంసారచక్రమునుండి పైకితొలగి పోవుట, మోక్షము. పైనిచెప్పినట్లు కోరికలను సంబంధములను త్రెంచుకొనినవాడు బహుకాల మూర్ధ్వలోకములలో ననిర్వాచనీయమగు సుఖ మనుభవించుచు

నుండును. కొన్నిలక్షల సంవత్సరములకు లోకమంతయు పరిణామమున తానున్నస్థితికి వచ్చును. అప్పు డాతడు, తన పురోవృద్ధికై, తక్కిన మానవాళితో పాటు తిరిగి యీ సంసారప్రవాహమున బడును. అట్టివారు సాధారణముగ సువర్లోకమును మించి పైకి పోయియుండరు. వారంతకాలము ననుభవించినది స్వర్గలోకసుఖము. ఒక బడిలో నొకటవ తరగతిలో నొక బాలుడు మిక్కిలి తెలివైనవాడు, చురుకైనవాడు, అని పైతరగతిలో వేయక సరాసరి మూడవతరగతిలో వేయుదురు. వాడచ్చట నొకటిరెండేం డ్లుండిపోయి మొదటితరగతిలో తనతో జదివినవారు మూడవతరగతికి వచ్చిన తరువాత, వారితో జేరిపోవును. అట్టిదే యీ సర్వసుఖ మనుభవించువారి యవస్థయును.

అట్టి జన్మరాహిత్యము స్వార్థమనుట కేమియు సందేహము లేదు. ఏలయన, దానిని బడయగోరు సాధకుడు తానీ లోకములో జన్మించి యిందలి కష్టముల ననుభవించుచు పాట్లుబడుట కిష్టములేక, యీ జన్మముల నెంత కాలము పొందకుండ సుఖించిన నంత మేలని యెంచి, యీసాధనము చేసి దానిఫలము నొందును. కాని, నిజముగ మోక్షముయొక్క యుద్దేశము స్వసుఖము కాదు.

సృష్టి ప్రారంభమున నీశ్వరుడు, తన నిత్యలీలలలో నొకలీలగ, తన నుండి యనేక ప్రజ్ఞానాంశువులను[1] విసృజించెను. ఒక జ్వాలనుండి మిణుగురులు వెడలు నట్లీశ్వరునినుండి ప్రజ్ఞానాంశువులు బైలువెడలినవని యూహించుకొనవచ్చును. ఇట్లు వెలువడిన యొక్కొక్క ప్రజ్ఞానాంశువు భౌతిక లోకములలో ననుభవములచే పరిపూర్ణ ప్రజ్ఞావికాసము నొంది, ఒక్కొక్క యీశ్వరుడై, తిరిగి యొక్కొక్క బ్రహ్మాండమును సృష్టించగలవాడగుట యీ సంసారముయొక్క యుద్దేశము, ఈశ్వర సంకల్పము[2]. ప్రజ్ఞానాంశువు నిజస్వరూపమున, అనగా నద్వైతస్వరూపమున,[3] ననుపాదికలోకమునందుండును. ఇది రెండవలోకము. దీనితరువాత (స్థూలత్వమున) ఆకాశతత్త్వప్రధానమగు సత్యలోకము (The higher Atmic or Spiritual Plane) ను, దాని తరువాత వాయుతత్త్వప్రధానములగు తపోలోక జనలోకములు నున్నవి (The Lower Atmic and the Buddhic Planes). ప్రజ్ఞానాంశువు ఈశ్వర సంకల్పము నెరవేర్చుట కనుపాదికలోకమునుండి క్రింది

[1] తురీయాత్మయని, పరమాత్మయని, Monad అని యందురు.

[2] God's Plan for Man.

[3] Monad అన్న యింగ్లీషుమాట యీ యర్థమును సూచించును.

(స్థూలతర) లోకములలో బ్రవేశించవలెను, గాని, తన నిజస్వరూపమున బ్రవేశించజాలడు. కనుక, తనయంశ నొకదానిని క్రిందకు బంపును. ఆయంశ సత్యలోకమున సచ్చిదానంద తాద్రాత్మ్యకమై వెలయును. ఇది ప్రజ్ఞా నాంశువుయొక్క ప్రథమ అవతరణము. తరువాత నా యంశ తపోలోక జనలోకములకును అటనుండి మహ ర్లోకము (The Higher Mental Plane) నకును అవతరించును. ఇచ్చట ఆయంశ ఆత్మబుద్ధిమనస్సు అని, ప్రాజ్ఞుడని, జీవాత్మయని చెప్పబడును.

మహర్లోకమున బ్రవేశించి నంతనే ప్రాజ్ఞున కాలోక మున స్వతంత్రముగ వ్యవహరించదగిన ప్రజ్ఞావికాసము కలుగలేదు. ఆలోక ప్రకృతియొక్క స్పందము తనకు భరింపశక్యముగానంత తీవ్రముగ నుండుటచేత నింకను స్థూలలోకముల ప్రకృతియొక్క మందస్పందముల నను భవించుటకై, తన యంశ నొకదానిని సువర్లోకమునకు బంపును, ఆయంశ యచటనుండి భువర్లోకమునకును, అటనుంచి భూలోకమునకును దిగును. అట్లు ఈ మూడు లోకములలో వ్యవహరించు అంశ దేహాత్మ యనబడును.

జీవాత్మ, కొంతకాలము మహర్లోకమునే యునికి పట్టుగ నుంచుకొని, అనుభవతృష్ణచే పునః పునః యీ మూడు లోకములలోనికి తన యంశను బంపుచుండుట

యే జన్మములనెత్తుట. ఇట్లనేక జన్మములనెత్తి సంపా దించిన యనుభవములచే దేహాత్మ పరిశుద్ధమగుచు రాగా జీవాత్మయొక్క తృష్ణ యుడుగుచువచ్చును. జీవుడు స్థూలలోకమున ముందు పూర్ణమగు ప్రజ్ఞను సంపాదించును. పిదప భువర్లోకప్రజ్ఞ సంపాదించును. భువర్లోకమున ప్రజ్ఞగలిగి స్వతంత్రముగ వ్యవహారింప గలిగినపుడు ఈ భూలోకజీవితము నిస్సారముగ గనిపించును. అట్లు జీవు డొక్కొక లోకమున ప్రజ్ఞ సంపాదించుచు తుదకు మహర్లోకమున స్వతంత్రముగ వ్యవహరించగల శక్తి గలిగినప్పు డీక్రింది మూడు లోకముల యనుభవములనుగూడ వాని నాకర్షించ జాలవు. కనుక, జీవునకు తృష్ణ నశించినదని చెప్పవచ్చును. ఇక, వాని కీ లోకములలో పొందదగిన యనుభవము లుండవు గనుక, ఆలోకములలో వ్యవహరించుటకు జన్మముల నెత్తనక్కరలేదు. ఆలోకముల ప్రకృతి తన వశమందుండుటచే, తన యిష్టమువచ్చినపుడు, సువర్లోక, భువర్లోక, భూలోకముల యణువులను గైకొని తన కుపాధులను నిర్మించుకొని యాలోకములలో జేయవలసిన పనిని నెరవేర్చి, తిరిగి ఆయుపాధులను అణువులుగా మార్చివేయును. లేదా, స్థూలశరీరమున్నయెడల దాని నెంతకాలమైన నుంచుకొని దాని

యందుండి వ్యవహరించుచుండును. దీనిని జీవన్ముక్తి యందురు.

ఆత్మృష్ణ పూర్తిగా నశించినపుడు నిజమైన ముక్తి కలిగినదని చెప్పవలెను. ఆతృష్ణయే జననమరణ హేతువు. ఆతృష్ణ నశించనియెడల నెన్నిలక్షల సంవత్సరములకైనను తిరిగి యీ లోకములలో జన్మించక తప్పదు. తృష్ణను నశింపజేయుటకు కోరికలను పోగొట్టుకొనుట యొక సాధనము. స్వార్థరహితముగ పరోపకారకార్యముల జేయుచు, నావిధముగ కామమును తొలిగించుకొనుట అంతకంటె మంచిమార్గము. ఈశ్వరుడు సృష్టిలో ప్రవేశించి, తన యపరిమితమును అపరిచ్ఛిన్నమును అగు ప్రజ్ఞకు పరిమితిని పరిచ్ఛిన్నమును గలుగజేసి, సంపూర్ణమైన ఆత్మత్యాగము, మహాయజ్ఞము జేసి, సృష్టిసంకల్పమున నిండియున్నాడు. కనుక, ఈశ్వరతాదాత్మ్యము నొందినవారుగూడ, లోకకల్యాణముకొఱకు త్యాగము చేయుదురు. వారుచేయు కర్మయందు స్వార్థముండదు, గనుక, ఆకర్మఫలము వారెవరికొరకు కర్మచేయుదురో ఆ మానవకోటికి కలుగును. కనుక, వారికి జననమరణ హేతు వుండదు.

ఈశ్వరతాదాత్మ్యము జీవన్ముక్తదీక్ష పొందిన వారికి గలుగును. అటుపైని ప్రాజ్ఞుడు నిజలోకమున స్వతం

త్రుప్తులై వ్యవహరించుచు ప్రజ్ఞానాంశువునకు బంధులై యుందురు. అటుపైని జీవన్ముక్తుని పురోవృద్ధిమార్గము ఈ లోకపరిణామముతో సంబంధించినదికాదు. కనుక, వారీ పరిణామములో బొందవలసిన ఫలమేదియు లేదు. "శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన। నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి॥ (పార్థా! ఈ మూడులోకములలోను నేను చేయవలసిన దేదియు లేదు, నేను ఇదివరకు పొందనిది, ఇక పొందదగినదియు లేదు, అయినను, నేను కర్మచేయుదును—గీతా॥ 3—22) అని శ్రీకృష్ణభగవానుడు చెప్పెను. వారికీ మూడు లోకములలోను, అనగా, భూర్భువస్సువర్లోకములయందు, చేయదగినదియు, పొందదగినదియు లేదని చెప్పినారు. వారీలోకములలో పొందదగిన దేదియు లేకపోవుటచేతనే స్వతంత్రముగ, అనగా, ఈలోకములలో దేనిచేతను బంధితులుగాక, కర్మచేయగలరు, కనుకనే, వారీలోగములను పాలించుట కధికారపదవులను బడయుట కర్హులగుదురు; ఈ లోకములలో పరిణామమును పొందుచున్న జీవుల నుద్ధరించుటకు సమర్థులగుచున్నారు. వారిలో కొందరు తమ యుత్తరాభివృద్ధికై తపస్సుచేసికొనుచు కూర్చొనక, లోకోద్ధరణకార్యముల జేయుటకై బూనుకొని యీ లోకములతో

సంబంధము విడువకయుందురు. అది వారు చేయు త్యాగము.

ముముక్షుత్వము నీ గ్రంథములో ప్రేమయని పేర్కొనుట పరమగురువుయొక్క బోధనాలక్షణమును చూపుచున్నది. ఆయన కేవలము మాటనుగాక దాని భావమును గైకొందురు. ఈశ్వరునితో తాదాత్మ్యము నొందుట యెందుకు? ఆయనవలె లోకోద్ధరణ కార్యముల జేయగలుగుటకు? అది యెట్లు సమకూడును? ఈశ్వరుడు ప్రేమమయుడు గనుక నీవుకూడ పవిత్రమగు ప్రేమను వృద్ధిచేసికొన్నయెడల సమకూడును? కనుక ఈ సాధనను నిజముగ ప్రేమయనియే చెప్పవలెను.

మోక్షమునకు భక్తి, జ్ఞాన, కర్మములను మూడు మార్గములను చెప్పిరి. మనుష్యులు తమ ప్రవృత్తినిబట్టి యెవరి కే మార్గ మనుకూలముగ నుండిన వా రామార్గము ననుసరింతురు, ఆ మార్గమున తరింతురు. ఎవ్వ రే మార్గము ననుసరించినను, అది ప్రధానముగనుండి తక్కినవి రెండునుగూడ గౌణములుగ నుండవలెను. కనుక, తుదకందరకును అన్ని లక్షణములను అలవరచుకొనుట యగత్యమైయుండును. ఏమార్గమైనను గమ్యస్థాన మొక్కటే, అచట చేయవలసినదియు లోకోద్ధరణ కార్యమొక్కటే. అకార్య మేరీతిగనైనను చేయవచ్చును.

జ్ఞానమార్గమున తరించినవా డామార్గముననే లోకసేవ జేయగలడు, భక్తిమార్గమున తరించిన వా డామార్గముననే లోకసేవ జేయగలడు. కాని, జీవులయెడల నపార ప్రేమయే లేనియెడల, వారి కాసేవచేయుట సాధ్యమెట్లగును? కనుక, ప్రేమను ముఖ్యముగ నలవరచుకొనవలెను. ఎవ రేమార్గమున మోక్షమును సాధించబూనినను, వారు ప్రేమను వృద్ధిచేసికొనవలెను, గనుక, యీ సాధనమున కీపేరు సరియైనదియే.

ప్రేమ దృఢముగ నున్నయెడల తక్కిన సాధనముల నన్నిటిని సాధించున ట్లాప్రేమయే చేయునని యిచట చెప్పబడినది. నిజమైనప్రేమ గలచోట నసాధ్యమగు కార్యము కనిపించదు. మనుష్యలోకమున మాతృప్రేమ యాదర్శమైనది. తల్లి, నాగరికతగలదియైనను, అనాగరికురాలైనను, చదువుకొన్నదియైనను, మూర్ఖురాలైనను, ధనవంతురాలైనను, నిరుపేదయైనను, బిడ్డను సంరక్షించుటకు ప్రాణములనైన నర్పించుటకు సిద్ధపడును. జంతువులలోగూడ నీ మాతృప్రేమ యింత గాఢముగను నున్నది. మాతృహృదయమున నంత స్వార్థరహితమగు ప్రేమయే లేనియెడల పసిబిడ్డలకు క్షేమమే లేదు. ఆప్రేమవల్ల, తల్లి తన కదివరకు చేతగాని పనులను బిడ్డసంరక్షణకై నేర్చుకొనును. అటువంటి

నిర్మలప్రేమ వికసించినయెడల, సాధకుడు లోకోప కారార్థము గావలసిన యే యితర శక్తులనైన నవలీలగ సాధించును. వాని దృష్టియంతయు తాను ప్రేమించు లోకమున కెట్లు సేవచేయవలయునన్న యొక్కదాని మీదనే యుండును గనుక, అందుకు కావలసిన యేశక్తి నైన సంపాదించుటలో కొంచెమైనను సందేహించడు, అశ్రద్ధచేయడు.

ఈ సాధనము మోక్షేచ్ఛగాని మోక్షవాంఛకాదు. కనుకనే తరువాత వాక్యములో నిట్లు చెప్పబడినది.

మూలము :—"అది కోరిక యనుట యంత సరికాదు. దృఢసంకల్పము, అధ్యవసాయము, మనోనిశ్చయ ము, అని చెప్పవచ్చును."

ఒక నాడాల్కియొని తానొక సుగుణ మలవరచుకొన గోరుచున్నానని తన పరమగురువగు కూట్ హూమీ మహర్షితో చెప్పగా, ఆయన యిట్లనియెను : "నీ వేది యు కావలెనని కోరవద్దు. కోరిక దౌర్బల్యలక్షణము. నీ వీశ్వరుడవు, గనుక, ఇది కావలెను అని దృఢసంకల్పము చేయుము, చేసి తత్సాధనమునకు పూనుకొనుము."

ఇది నాకు కావలెను, అని కోరుచు నుండువాడు, ఎన్న టికిని అట్లు కోరుచునే యుండును. కోరినదానిని పొందు

టకు సంకల్పించి, అందుకు తగిన సాధనము నాలోచించి, ప్రయత్నము చేయనియెడల, సాధనమును ఆరంభించుటయే యుండదు. ప్రపంచములో ధనవంతులము కావలెననియును, కీర్తివంతులము కావలెననియును, అందరును కోరుదురు. అట్టి కోరిక లేనివారు బహు అరుదు. అయినను, వారిలో నెందరు తమ వాంఛితఫలసిద్ధిని పొందుచున్నారు? కోరిన వారందరు మనోబలము గలిగి కోరినయర్థమును బడయుటకు కావలసినపని చేయజాలరు. మనోబలము గలవారు మాత్రమే కృతార్థులగుదురు.

మూలము :—“ దానిఫలము నీకుఁ గలుగవలయుననినచో నా మనోనిశ్చయముతో నీ యంతరంగము నిండి, మఱి ఏతలంపును మనస్సున స్ఫురించుటకు అవకాశము లేనట్లుండవలయును. యథార్థముగ నది భగవంతునితో నేకీభావము పొందవలయునను నిశ్చయమే, గాని, నీవు వేసటను, దుఃఖమును, తప్పించుకొనవలయునని ఏకీభావమును కోరరాదు. జీవన్ముక్తులయందలి గాఢప్రేమచే, వారికి తోడ్పడి, వారు వర్తించునట్లు వర్తించవలయునని కోరవలయును. ఏలయన, భగవంతుఁడు ప్రేమస్వరూపుఁడు. కావున నీ వాయనతో నొక్కటిగఁ గావలసినచోఁ,

బరిపూర్ణముగఁ బరోపకారబుద్ధియు పరమప్రేమ యు నీయందు నిండియుండవలయును."

మోక్షమార్గమును బొందువారు ఏకాగ్రతయును, దృఢమగు సంకల్పశక్తిని, అలవరచుకొనవలయును. మోక్షసిద్ధియే భగవంతునితో నేకీభావమునొందుట. మనము నిరంతరము నీశ్వరసాన్నిధ్యముననే యున్నా ము. మనలోను, మనబైటను, మనతోడను, ఎల్లప్పు డును, ఎల్లయెడలను భగవంతు డుండును. కాని, మన మాసంగతిని గుర్తించము. ఆసంగతిని ప్రత్యక్షముగ దెలిసికొనుటకు మన ప్రజ్ఞను వికసింపజేసికొనవలయును. అందుకు తగిన సాధనముల నన్నిటిని ఏమరక చేయవల యును.

మన మీశ్వరునితో నేకీభావమునొందుట యనగా ఆయన బాహ్యస్వరూపములతో నేకీభావమునొందుట గాదు, ఆయన యంతరంగ వికాసముతో, ఆయన యత్యుత్త మావిర్భావముతో నేకీభవించవలయును. అప్పుడు ఆయన శక్తులు మన ద్వారా లోకమున బ్ర సరించుటకు మనము తగిన వెల్లువల మగుదుము.

ఈశ్వరతాదాత్మ్యము నొందుటకు గల మూడు మార్గములలో జ్ఞాన, కర్మ మార్గములలోగూడ ప్రేమ యనుబంధముగ నుండవలయుననియు, లేనియెడల లోక

సంగ్రహార్థము పనిజేయజాలమనియు నిదివరకు చెప్పి యున్నాము. ఆయన యజ్ఞస్వరూపుడు. ఆయన యీ ప్రకృతిలో ప్రవేశించి సృష్టిహేతువగుటయే ఆయన చేసిన యజ్ఞము. ఆయన ప్రేమస్వరూపుడగుటచే, యీ జీవులకొరకై యా యజ్ఞము జేసెను. మనము గూడ ఈశ్వరులమే గనుక, మనము లోకోపకారార్థము యజ్ఞముచేయవలయును, గనుక, ప్రేమ నలవరచు కొనుట యత్యావశ్యకము. మనము మోక్షమును స్వ సుఖమునకై పొందరాదని మొదటినుంచియు చెప్పబడు చున్నది. ఆ మోక్షమార్గతత్త్వమునే యిచ్చట వివర ముగ జెప్పినారు.

---

రెండవ అధ్యాయము

## నిత్యప్రవర్తనము—ప్రేమ

మూలము :—“ఈ ప్రేమయనునది దినచర్యలో రెండు విధములుగ నేర్పడును. మొదట నీవు జాగరూకతతో నే ప్రాణికిఁగాని బాధచేయక యుండవలెను. రెండవది—ఇతరులకు సహాయము చేయుటకు నెల్లప్పుడును సమయమును నిరీక్షించుచుండవలయును.”

ఇచట నొక విషయమే రెండువిధములుగ జెప్పబడినది. ఏ ప్రాణికినిగాని బాధకలుగజేయకుము, అని, నిష్క్రియారూపకముగ జెప్పినది యొకటి. ఇతరులకు మేలుచేయుము అని క్రియారూపకముగ జెప్పినది రెండవది.

ఈ రెండు విధములగు నుపదేశమును సర్వమతముల లోను చేయబడినది. ‘మీలో నందరికంటెను గొప్పవాఁడు మీకు పరిచారకుఁడై యుండవలెను.’ (మత్తయి ౨౩—౧౧) అని బైబిలులో జెప్పబడియున్నది. శ్రీగౌతమబుద్ధులు వారీధర్మమునే సంగ్రహముగ నొక సూత్ర

మునం దిట్లు చెప్పిరి : ' చెడుగు జేయ మానుము ; మేలు జేయ దెలియుము ; నీ హృదయమును శుభ్రపరచు కొనుము.' శ్రీమద్భగవద్గీతలలో భగవంతుడు మహా కర్తగా వర్ణింపబడి, ఆయన చేసినట్లు, లోకసంగ్రహార్థము కర్మ జేయనివారు వ్యర్థజీవులని చెప్పబడినది ; మఱియును, వికర్మ, అనగా, పాపకర్మ యెంత భయంకరమో, అకర్మ, అనగా, కర్మచేయక యుండుటయు నంత భయంకరమనియు జెప్పబడినది. యజ్ఞ, దాన, తపః కర్మలు త్యాజ్యములుగావనియు, సన్యాశికికూడ కర్తవ్యములనియుగూడ జెప్పబడినధి. ' పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్ ' అను సూక్తి పురాణప్రసిద్ధము.

కేవలము పరపీడనము చేయుటకంటె నితరులెవ్వారికి కీడుగాని మేలుగానిచేయక యూరకొనుట కొంతమంచిదే, యైనను, ఏపనియును చేయకుండుట (అకర్మ) వల్లగూడ వికర్మవల్ల గలుగునంతఫలము గలుగునని చెప్పినందున, సత్కర్మచేయుచునే యుండవలెననుట నిశ్చయము. మఱియును ' న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ' (గీతా ॥ 3—5) (ఒక్కడునుగూడ నొక క్షణమైనను కర్మచేయకుండ కూర్చునియుండజాలడు) అందుచేత, నితర ప్రాణులకు బాధకలిగించ

ఖండ నుండుట కేవల నిష్క్రియారూపక మగుటచేత, వెంటనే పరోపకారము చేయవలయునని చెప్పబడినది.

కొందరు యోగులు నిరంతరము నేకాంతమున నుండి ధ్యాననిష్ఠలో నుండుట గలదు. వారు పైకివచ్చి యే పనియు జేయరు. కాని, వారు బహునుత్కృష్టమును, ఇతరులు చేయజాలనిదియు నగు కర్మను చేయుచున్నారు. వా రుత్తమసంకల్పముల జేసి, ఆ సంకల్పములను లోక సంగ్రహార్థము, మనఃపూర్వకముగ, బయటకు పంపుదురు. వారు తమవలె ప్రార్థనలనుగాని ధ్యానముగాని చేయజాలని దుర్బలులకొరకు ప్రార్థనలను ధ్యానమును చేయుదురు. వారు ఆత్మసంయములై, సన్న్యాసులై, కఠినతరములగు నూర్ధ్వలోకసంబంధములగు కార్యములను చేయుదురు.

ఈ సన్న్యాసులలో కొందరు బాధ్యతలేని సుఖజీవనము జేయుచు, నిర్వ్యాపకముగ ప్రొద్దుపుచ్చు ముష్టి సన్న్యాసులుకూడ నన్నిదేశములలో నున్నారు. వారివల్ల నెవ్వరికిని ప్రయోజన ముండదు.

మూలము :—" మొదటిది—బాధచేయకుండుట. ప్రేమకు విరోధములగుటంబట్టి లోకమునందలి పాపములన్నింటికంటె నెక్కుడు చెరుపుచేయు పాపములు మూఁడున్నయవి. అవి యెవ్వియన, లోకవార్తల

వృథాప్రసంగము, క్రౌర్యము, మూఢాభిప్రాయములు.”

ఈ వాక్యమువల్ల నితరులను మన మెన్ని సూక్ష్మవిధములుగ బాధించెదమో విశదమగును. లోకమునందలి పాపములన్నిటికంటె నెక్కువ చెరుపుచేయు పాపము లనగానే నరహత్య, గోహత్య, బందిపోటు, మొదలగు ఘోరకృత్యము లేవియో తలంపునకు వచ్చును, కాని, యీ వాక్యములోచెప్పినవి అంతగొప్ప పాపములని స్ఫురించదు. నరహత్య మొదలయినవి ఘోరకృత్యములని నాగరిక దేశములలో నందరు నంగీకరించినారు, గనుక, వానికి యుద్ధమను గౌరవనామము నిచ్చిననే తప్ప, యెవ్వరు నట్టి కృత్యములజేయ నంగీకరించరు. కాని, యీ స్వల్పవిషయముల నెవ్వరును పాపములని భావించనైన భావించరు. పరమగురు వాపాపముల యొక్క పరిమాణములను, వాని దూరఫలితములను యోచించి యీ వాక్యమునం దవి యంత ఘోరపాపములని చెప్పినారు.

వృథాప్రసంగమునుగుఱించి యోచించి చూతము. ఇది లోకమునం దంతటను సర్వసామాన్యమై పోయియున్నది. కాని, ఇది యేయొక్క సందర్భములోనైనను గలుగజేయు చెరుపుగాని, దీనివల్లగలుగు మనోవ్యథ

గాని, ఇది సమకూర్చు ఆదర్శపతనముగాని, తలచు కొనిన నద్భుతము గలిగించును. ఒక్కడు ఒక్క సందర్భములో చేసిన వృథాప్రసంగమువల్ల నింత చెరుపు కలుగుచుండగా, ననుదినమును లక్షులకొలది జను లనేక సందర్భములలో జేయు వృథాప్రసంగము వల్ల లోకములో నెంత చెరుపు కలుగుచున్నదో యోచింపుడు.

ఒకని యాదర్శమును న్యూనతపరచిగాని భంగ మొనర్చిగాని, అది యాత డనుకొన్నంత యున్నతమును, ఉదారము నైనది కాదనుభావము వానికి కలిగించుట గొప్ప ఘోరకృత్యము. ఒకడు పూజించువిగ్రహము లను బ్రద్దలుగొట్టుటకంటె వానికి మనము చేయగల కీడు ఇంకొకటి యుండదు. మనము క్షుద్రము, నీచము, అని యెంచు నొకవస్తువు నింకొకడు ఆదర్శముగ గై కొని గౌరవించుచున్నయెడల, మనము వాని యాదర్శ భావమును చక్కజేసి, అంతకంటె గొప్పవస్తువుల నాదర్శముగ గైకొనునట్లు చేయబూనవలయును, గాని, వాని యాదర్శమునకు బదులుగ నంతకంటె గొప్ప యాదర్శమును చూపించకుండ, వాని యాదర్శ మును భగ్నముచేయుట గొప్పతప్పు. దానివల్ల వాని పరిణామమున కాటంకమగును. ఎప్పుడును, ఎవ్వని

యందును, లోపములను వెతకి కనపరచుటయును, ఎవ్వనినైనగాని తూణతపరచుటయును తగని క్రూరపు పనులు.

ఎంత పరోపకారపారీణులైనను, ఎంత స్వార్థరహితజీవులైనను, అపనిందల పాలగుదురు. ఓర్వలేనివారో, కేవలము పరదూషణమాత్రజీవులో యేదోయొక నింద నారోపింతురు. ఇక నది యానోటనుంచి యానోట బడి యంతటను ప్రాకును. ఇది యంతయు వృథా ప్రసంగమువల్ల సంభవించును. అట్టి నింద నొక దానిని గైకొని జాగ్రత్తగ పరిశోధించి చూచిన యెడల, అది నిర్హేతుకమును అసందర్భమును అయి యుండును.

ఎవనిపై నపవాదు మోపబడునో వాని భావములా యపవాదువల్ల హానిబొందును. 'మే మేమనిన వాని కేమి? వా డెందులకు మామాటలను లక్ష్యముచేయ వలెను?' అని వృథాప్రసంగము చేయువా రనవచ్చును. కాని, వారు ఎవనినిగురించి మాట్లాడుదురో వాని యందొక లోపమున్నదని యారోపించి దానిని నమ్మి, వారి ప్రసంగముచేత, దానిని బలపరచుచున్నారు. ఆ లోపము నిజముగ వానియందు లేనియెడల, వారి తలంపులవల్ల నది వానియందు కలుగును, ఆ లోపము నిజ

ముగ వానియం దున్నయెడల నది బలపడును. కనుక, ఎట్లయినను, వాని కాయధిక ప్రసంగమువల్ల కీడుగలు గును (౨ భాగము, ౮ వ అధ్యాయము చూ ||). అట్లు నిరపనిందలు వేయుట విమర్శన మనుకొందురు, గాని, యది విమర్శనము కాదు. న్యాయబుద్ధితో, నిష్పక్ష పాతముగ మంచిచెడ్డల నరయుట విమర్శనముగాని తప్పులను వెతకి వెతకి పట్టుట విమర్శనము కాదు. విమర్శనములో సానుభూతియును సహాకారమును ఉండును.

ఒక డజ్ఞానముచేతనో, అసహనముచేతనో, మరి యొకనియం దొక దోషము నారోపించి నీతో చెప్పనను కొనుము. నీవు వెంటనే వానితో, నెమ్మదిగ, నది తగదని చెప్పి యూరకొనినయెడల, వారిద్దరకునుగూడ నెంతయో మేలు చేయుదువు. అట్లుగాక, నీవాసంగతి నింకొకనితో చెప్పినయెడల, మొదట నీకు చెప్పినవాని పాపము నీకు రెట్టింపుగా గలుగుచున్నది. నీ వది విన్నప్పుడు నిజమని నమ్ముట, తరువాత దానిని ప్రకటిం చుట, ఇంకను విస్తారముగ ప్రకటితమగుట కవకాశ మిచ్చుట, ఇవన్నియు నీ దోషములు.

మనలో కొందరము మిక్కిలి కలిసిమెలసి యుం దుము, కాని, మనలో ఒకరిమనోభావము లొకరికి

తెలియవు. తక్కిన యే విషయములోనైనను ఒకరి సంగతి నొకరు తెలిసికొనవచ్చునుగాని, మనోభావములు మాత్రము తెలిసికొనుట దుర్లభము. అట్టి స్థితిలో నొకరు—అందులో మనకంత పరిచయములేని వారు—చేసినపనికి యుద్దేశముల నారోపించి, నిందించుట యసంగతము.

మూలము :—"భగవంతునియందలి ప్రేమ (భక్తి) తన యంతరంగమున నిండియుండవలయునని కోరువాఁడు యీ మూఁటియెడ నెడతెగక జాగరూకతతో నుండవలెను."

పైనిచెప్పిన మూడు దుర్గుణములును ఎంతబలమైనవో యీ వాక్యములో సూచించబడినది. అవి అతి సామాన్యములును, చిరతరాభ్యాసముచే స్వాభావికములు నై యున్నవి. అందుచేత, అవి దుర్గుణములని గుర్తించువారు బహు అరుదు, గుర్తించినవారిలో వానిని తొలిగించుకొనవలయునని ప్రయత్నించువారింకను అరుదు. మన మీ బహుస్వల్పసంఖ్యలో జేరినవారము. ఏలయన, మన మీలోకమును విడిచి పరమపురుషుల లోకమున ప్రవేశింపజూచుచున్నాము. కనుక, మన కిది స్వభావముకాదనియును, మన స్వభావము

ప్రేమయనియును, కనుక, మన కిది అస్వాభావికమగు నొక యలవాటనియును నెఱింగి, స్వాభావికమగు ప్రేమను వృద్ధిచేసికొనవలయును.

వృథాప్రసంగము గుఱించియును, మూఢాభిప్రాయములను గుఱించియును, ఇదివరకే కొంతవరకు వ్రాసియున్నాము. క్రౌర్యమునుగూడ నొక గొప్ప పాపముగ చెప్పియున్నారు. ఈ క్రౌర్యము మనము తెలిసికొనని యనేక స్వల్పవిషయములలోగూడ మనము చూపుచున్నాము. మనము కొన్నిపనులు చేయుచు, వానివల్ల నితరులకు బాధకలుగుచున్నను, దానిని కానము ; ఆ పనులలో నిమిడియున్న క్రౌర్యమును గమనించము. పసిబిడ్డలను, అసహాయులను, కొట్టుట ; కూలిపని చేసికొని పొట్టపోసుకొను పేదవానికి కూలి యుక్తకాలమున నీయక త్రిప్పుట ; తన చేతిక్రిందనున్న సేవకుల కష్టసుఖముల నరయక, వారి కసందర్భములగు నాజ్ఞల నిచ్చుట ; రెయిలులో ముగ్గురిచోటు ఆక్రమించి పండుకొని లేవకుండుట ; ఇంటిలో నెవ్వ రెంత యిబ్బందిపడుచున్నారో యాలోచించక, మన యిష్టమువచ్చినట్లు సంచరించుట ; ఒక పిల్లవాని కొకబరువు నొప్పగించి మనము చేతులూపుకొనుచు నడుచుట ; ఇటువంటి యనేక స్వల్పవిషయములలో నితరులను హింసించెదము. ఇది

యంతయు నవివేకమువల్ల గలుగుచున్నది. కాని, దీని ఫలితము మాత్రము మన పుణోవృద్ధి కాటంకమగును. కనుక, మన మనునిమిషము మెలకువ గలిగి, మన మేపని జేసినను, దానివల్ల నితరులకు హానికలుగకుండునట్లు చేయుట అభ్యసించవలెను.

---

మూడవ అధ్యాయము

## వృథాప్రసంగము

మూలము :—"వృథాప్రసంగ మెంత పనిచేయునో చూడుఁడు. దానికి మూలము దుస్సంకల్పము. అది యే యొక పాపము. ఏలయన, అందఱియందును, అన్నింటియందును మంచి యున్నది. మంచి తలంచి మంచిని బలపరచి, లోకపురోవృద్ధికి మేలుచేయగలము. ఇతరులయందుగల చెడుగును దలంచి ఆరీత్యా దానిని బలపరచి, లోకపురోవృద్ధికి భంగముచేయగలము. అనఁగా భగవదిచ్ఛ ననుసరించి నడువగలము, లేక దాని నెదిరించి నడువగలము. మఱియొకనియందలి చెడుగును నీవు తలఁచితివేని యేక కాలమున మూఁడు పాపములను చేసినవాడ వగుదువు."

దుస్సంకల్పము పాపమని యిచట చెప్పుచున్నారు. ఏలయన, నీవొకతలంపు తలచినపు డది యితరుల తలంపులను కలంచును. ఒకనినిగుఱించి నీ తలంపులు చెడ్డ

వైనయెడల, నీ తలంపులు వాని మనస్సులో దగిలి, చెడుభావములను కలిగించును. అదివరకు వాని మనస్సున నట్టిభావములు లేకున్నను, నీ చెడుతలంపులవల్ల, వాని మనస్సులో నవి పుట్టునని, అదివరకు అట్టి భావములున్న యెడల నవి బలపడునని చెప్పియున్నాము. (పు 351) నీవు వానినిగుఱించి మంచితలంపులనే తలచినయెడల అవియు నట్లే వానియందు సద్భావములను కలిగించుట గాని, బలపరచుటగాని, చేయును.

నీవు నీ పుత్రుడుగాని, సోదరుడుగాని, యొక చెడ్డ పనిచేసినాడని విన్నయెడల, దాని నితరులకు తెలియ చేసి ప్రకటించుట కంగీకరించెదవా ? ఎన్నడు నంగీకరించవు. మొదట వా డాతప్పుచేయనే లేదని వాదించెదవు. తరువాత, దాని నితరులకు తెలియనిచ్చుట కిష్టపడవు. అట్టిచో, మరియొకనియెడల నింకొక విధముగ నెందుకు చేయవలెను.

మూలము :—" (1) నీ చుట్టుప్రక్కలనంతయు మంచి మనోభావములతో నింపుటకు మాఱుగా, దుష్ట మనోభావములతో నిండింతువు. అందువలన, లోకమునందలి దుఃఖమును హెచ్చింతువు."

ఇది మొదటిపాపము—మన మనస్సు ఏరీతిగానుండునో మనకు లోక మారీతిగా నుండును. ఒకడు కుంచిత

బుద్ధిగలవాడై, దుర్మార్గము కొఱకును, దోషముల కొఱకును వెతుకుచు, ఎవ్వరేమన్నను తన కవమానము జరిగినదని భావించి, కోపము దెచ్చుకొనుటకు సందు దొరకునాయని జూచుచు, నున్న యెడల, వానికి కావలసిన వన్నియును లోకములో దొరుకును. ఈ లోకములో కావలసినంత చెడుగు దుఃఖము ఉన్నవి. కాని, వానినే మనము వెతకుకొనుచు బోవక, విశాలదృష్టి గలిగి, ప్రతివిషయములోను ఉన్న మంచినే వెతకి చూచి, దానివల్ల మనము అవకాశమైనంతవరకు మేలొందుటకు ప్రయత్నించి, సంతోషహృదయులమై యుండగలము. అప్పుడు మన కీ ప్రపంచమంతయు మిక్కిలి తేజోవంతముగ గాన్పించును. మఱియును, మన సంతోషము వల్లను, మన సత్సంకల్పములవల్లను ఇతరులుగూడ నీ లోకమునుండి యానందమును బడయునట్లు చేయగలము. మన దుష్టసంకల్పముల వల్లను, ఇతరుల నెరసులను వెదకు బుద్ధివల్లను, ఇతరులకు దుఃఖము గల్పింతుము, మనకు లోకము దుర్మార్గముతో నిండినట్లు కనిపించును.

మూలము :—" (2) ఒక మనుష్యునియందు నీవు దలంచిన దుర్గుణముండినచో దానిని నీవు బలపఱచి పోషింతువు. అందువలన, నీ సోదరుని మునుపటికంటె మంచివానిగఁ జేయుటకు మాఱుగా, వానిని ముందు

కంటె చెడ్డవానిగఁ జేయుదువు. అయితే, ఒకవేళ నాదుర్గుణము వానియం దుండదు. ఉన్నదని నీ కెట్లో తోఁచియుండును. అట్లయినచో నీ దుస్సంకల్పము నీ సోదరునిఁ దప్పత్రోవల నీడ్చును. ఏలయన వాఁడింకను పరిపూర్ణుఁడు గాకయుండినచో వాడు నీవు భావించిన గుణములు వానియందు పెరుగును.”

ఇది రెండవపాపము. ఈ విషయమునుగుఱించి యిది వరకు (౨వ భాగము, ౪వ అధ్యాయము) వ్రాయబడి యున్నది.

మూలము :—“(౩) నీ మనస్సును సత్సంకల్పములతో నించుటకు మాఱుగ దుస్సంకల్పములతో నించుకొనుదువు. కావున నీ యభివృద్ధికి నీవే యడ్డము వేసికొందువు. చూడఁగలవారు[1] నిన్నుఁజూచినచో నీవు రమణీయముగను ముద్దుగ నుండుటకు మాఱుగా, వికారముగను, దుఃఖకరముగను గనఁబడుదువు.”

ఇది మూడవపాపము. ఈ మూడుపాపములును మరియొకనియందున్న చెడుగును నీవు తలచుటవల్ల గలిగినవి. మొదటిది నీ చుట్టునున్న లోకము నెడల చేసినది,

[1] “చూడఁగలవారన బాహ్యదృష్టితో స్థూలశరీరమును చూచువారు గాదు, యోగదృష్టితో సూక్ష్మశరీరమును జూడఁగలవారని యర్థము.”

రెండవది. నీ వెవనినిగుఱించి తలచితివో వానియెడల జేసినది, మూడవది నీయెడలనే జేసినది.

మన తలంపులవల్ల నొక్కసారి యీ మూడుఫలములు గలుగును. తలంపులు మంచివైనను, చెడ్డవైనను, ఎంతబలముగలవియైన, నంత స్పష్టమైన ఫలములు కలుగును. ధ్యానము తపస్సుమొదలగు నభ్యాసముల చేత శిక్షితమైన మనస్సునుండియే యా సంకల్పములు వెడలినయెడల, వానిఫలము లెంత తీవ్రముగనుండునో యోచించవచ్చును. తపోబలముచే ఋషు లెంతెంత పనులనైన సాధించినట్లు పురాణములలో జదివియున్నాము గదా!

ఈ మనస్సంకల్పములను, అవి చేయుపనులను, యోగదృష్టిగలవారు చూడగలరు. వారు నీ సూక్ష్మశరీరముల జూచినప్పుడు నీ సంకల్పములు చెడ్డవైనయెడల, వారికి నీ వతికురూపివిగా కనబడెదవు. నీ సంకల్పములు స్పష్టములైన రూపములను పొందును. సత్సంకల్పములు పొందెడు రూపములు చూచుట కింపుగను మనోహరముగను ఉండును. దుస్సంకల్పములు పొందెడు రూపములు చూచుట కసహ్యముగ నుండును. నీ చుట్టును నీ సంకల్పరూపములు ఎప్పుడును తేలియాడు చుండును. యోగదృష్టిగలవాడు నీచుట్టును అసహ్య

ములగు దుస్సంకల్పరూపములనే జూచినయెడల నీవు వాని కసహ్యముగ గనిపించెదవు.

సాధారణముగ మన మీ లోకమున నింపైన వస్తువులను జూడ గోరుదుము, మనము శుభ్రమైన దుస్తులను ధరించియు నితరవిధముగ నలంకరించుకొనియు, శరీరము శుభ్రముగ నుంచుకొనియు, చూచువారల కింపుగా గనబడవలయునని ప్రయత్నింతుము, మన మేదైన నొక పనిచేసినపుడుగాని యొక వస్తువును నిర్మించినపుడుగాని, యది చూచుట కింపుగానుండవలయునని యుద్దేశించి చేతుము. ఇది డంబముకొఱకు మాత్రమే చేయుపని కాదు. కంటికి ఇంపుగను, మనోహరముగను, ఉన్న వస్తువును చూచినవారి కానందము గలుగును, కనుక, మన మితరుల కాయానందము గలిగించినవార మగుచున్నాము. ఒక రమణీయమగు మందిరమును గట్టించినవాడు, దానిని చూచినవా రెందఱకో సంతోషమును గలిగించి వారందరి కృతజ్ఞతకు పాత్రుడగుచున్నాడు. మరియొక డసహ్యకరమగు మందిరమును కట్టించిన యెడల, దానిని చూచినవారి మనస్సులలో నేవబుట్టి, హృదయము ముడుచుకొనిపోవును. ఆచెడుకర్మ ఆ యిల్లు గట్టినవానికి తగులును. మన పల్లెలలో నిండ్లముందర యుదయమే ముగ్గులుబెట్టి యలంకరింతురు.

అది యెంతసంతోషదాయకముగ నుండునో చూచిన వారికే దెలియును. ఇట్టి స్వల్పవిషయములలో నెట్లు చేసినను బాధ లేదనుకొందురు. కాని, స్వల్పవిషయములలో మన మితరులకు సుఖముగలుగునట్లు మన పనులను చేయుట కశ్రద్ధ జేసినయెడల నితరులకు సుఖమునిచ్చు ఘనకార్యములను చేయజాలము.

సూక్ష్మలోకమునగూడ నావిధముగనే మనము మనస్సంకల్పములను శుద్ధమైనవిగ నుంచుకొన్నయెడల, వానిచేగలుగు చక్కనిరూపములను మన చుట్టును బలపరచుకొని, యోగదృష్టిచే జూడగలవారికి మనము చక్కగా గనిపించి వారికి ఆనంద మొనగూర్తుము.

మఱియును గాఢములగు దుష్టసంకల్పములనే గలిగి దుర్మార్గవర్తను డైనవాని ముఖమున నా దుర్మార్గ చిహ్నములు కనిపించును, వాని ముఖము చూచుటకు భయంకరముగనుండును. ముఖవర్చస్సునుబట్టి మనుష్యు డెట్టివాడో చెప్పవచ్చును. ఒక సంఘములో ధర్మబుద్ధి నశించి అధర్మము ప్రబలియున్నయెడల, నచట ఆధి వ్యాధులుకూడ వృద్ధియగును. శరీరముయొక్క వాసనను బట్టి యొకడు మంచివాడో చెడ్డవాడో కుక్క కనిపెట్ట గలదు. ఈ విధముగ సంకల్పముల ఫలితములు స్థూల లోకమునగూడ గనబడును.

కనుక, మన తలంపులు ఎల్లప్పుడును ప్రేమపూరితములై యుండవలెను.

మూలము :—“ ఇట్లు వృథాప్రసంగములఁ జేయువాఁడు తనకును, తానుఁ జెఱుపఁబూనినవానికిని ఇంతకీడుఁ జేసియుఁ దృప్తిఁ జెందక యితరుల సయితము తాను జేయు దుష్కృత్యములో భాగస్థులుగఁ జేయుటకుఁ దనశక్తినంతయు వినియోగపెట్టి యత్నించును. తన దుర్మార్గపుకథను ఇతరులు నమ్ముదురుగాక యను కోరికతో నుత్సాహమున నితరులకుఁ జెప్పును. అంతట వారును తమ దుస్సంకల్పములను దుర్బలుఁడగు నా కష్టజీవిపైఁ గ్రుమ్మరింతురు. ఇట్లు దినదినమునను, ఒక్కఁడేగాక వేలకొలఁది జనులు చేయుచుందురు. ఈపాప మెంత నీచమో ఎంత ఘోరమో నీకు కొంచెమైనను ఇపుడు స్ఫురించుచున్నదా? దానిని బూర్ణముగ మానుకొనవలయును. ఎవరిని గూర్చిగాని కీడెన్నఁడును మాట్లాడకుము. ఎవరైనను మఱియొకరినిగుఱించి చెడ్డమాటలాడినను, దానిని వినక నిరాకరించి, వారితో :— ‘ఒకవేళ నిది నిజము కాదేమో! నిజముగనుండినను దానినిగుఱించి మాటలాడకయుండుట మాట్లాడుటకంటె దయచూపినట్లగును గదా!’ యని మృదువుగ జెప్పుము.”

అట్లు చెప్పుటకు ధైర్యము కావలయును. కాని, యట్లుచెప్పుట, ఆచెడుమాట లాడువాని యెడలను, ఎవనినిగుఱించి యీ మాట లాడబడుచున్నవో వాని యెడలను గూడ దయజూపుట, గనుక, ధైర్యముచేసి చెప్పవలెను.

సాధారణముగ నెవరైన నింకొకరినిగుఱించి చెడు మాటల నాడుచున్నప్పుడు 'పోనిమ్ము, మన కెందు కూర కొనుము' అని యనుట వాడుకలోనున్నది. 'నీ కెం దుకు' అనుటకంటె మన కెందుకు అనుటలో నెంతయో యుపయోగమున్నది. 'మనము' అనుటవల్ల నీవును వానితో నేకీభవించి వానికి సానుభూతి చూపినట్లెంచి, నీమాటను వాడు విశ్వసించును. మఱియును, నీవు వాని కంటె గొప్పవాడవు అనుకొని వానికి బుద్ధిచెప్ప జూచు చున్నావనుకొనడు. అట్లుపాయముతో నెమ్మదిగ జెప్పిన యెడల, వా డా చెడుసంభాషణమును మానును, గాని, వానిపై నీవు కోపించినను, వానిని తున్నతపరచినను, నీ మాటయందు వానికి విలువయుండదు, మఱింత హెచ్చు ప్రసంగముచేయును.

———

## నాలుగవ అధ్యాయము

# క్రౌర్యము

మూలము :—“ ఇకఁ గ్రౌర్యమెట్టిదనిన :—అది బుద్ధి పూర్వకము అబుద్ధిపూర్వకము అని రెండువిధములు. అందు బుద్ధిపూర్వక మనునది మఱియొక ప్రాణికి బాధఁగలుగఁజేయవలయునని యుద్దేశించి చేయునది. అది పావములన్నింటిలో గొప్పది. అది మనుజుఁడు చేయఁదగినది గాదు. దయ్యము చేయఁ దగినపనియని చెప్పవచ్చును. మనుజుఁడెన్నఁడుగాని యట్టి పనిని జేయఁడని యందువేమో! మనుజులు పలుమాఱట్టిపనిని చేసియున్నారు. ఇప్పుడును ప్రతి దినమును చేయుచున్నారు. పూర్వ మైరోపాఖండములోఁ గొందఱు ‘ రోమన్ క్యాథలిక్ ’ (Roman Catholic) మతస్థులిట్లు హింసించిరి. మఱియు ననేకులు మతాభిమానులు మతముపేరు పెట్టి యిదే పనిని చేసియున్నారు.”

మహాపాపములని చెప్పిన మూడింటిలో మొదటిదగు వృథాప్రసంగమును గుఱించి మూడవ యధ్యాయ

ములో జెప్పబడినది. ఇచట రెండవ మహాపాపమగు క్రౌర్యమునుగుఱించి చెప్పుచున్నారు. క్రౌర్యము బుద్ధిపూర్వకముగా కావలయునని హింసించుటయు, అబుద్ధిపూర్వకముగ జేయునదియు, నని రెండు విధములని చెప్పినారు. బుద్ధిపూర్వకమగు క్రౌర్యమునుగుఱించి వివరించుచు, అది మనుష్యు డనదగినవాడు చేయదగినది కాదని చెప్పినారు. అందుచేతనే, యట్టి పరహింసాత్మకుని 'వీడు రాక్షసిగాని మనిషికాడు' అని యందురు.

ఈ వాక్యములోచెప్పిన యుదాహరణము చరిత్రాంశము. మతము పేరున జరిగిన క్రౌర్యము పూర్వకాలమున నన్ని దేశములలోను, అన్ని మతములవారును చేసిరి ; ఇప్పు డింత నాగరికుల మనిపించుకొను జనులు కూడ చేయుచున్నారు. పూర్వపుమాదిరి హింస లిప్పుడు లేకపోవచ్చునుగాని, యిప్పు డవి మరియొక రూపమును దాల్చియున్నవి. పాశ్చాత్యదేశములలో శిష్టాచార విరుద్ధములగు మతాభిప్రాయములు గలవా రిప్పటికి సంఘబహిష్కారాదిహింసల పాలగుచున్నారు. బలవంతులు బలహీనులను, ధనవంతులు ధనహీనులను ఇప్పుడును అనేక విధముల హింసించుచున్నారు. జనామోదము బడయని యభిప్రాయములు గలవారి పాట్లందరు నెఱిగినవే.

పద్ధతికి కారణము. కాని, ఇది యెంతవర కుపయోగ కరమో చూతము.

మేక యనేకరకముల ఆకులను తినును. వానిలో కొన్ని మనుష్యుడు తిన్నయెడల తత్క్షణము యమసదనమున కరుగును. ఆ యాకులు మేక జీర్ణకోశములో నెట్టి మార్పులనొంది యే యే పనులజేయునో ఆ మేక కడుపును కోసిచూచినందువల్ల మనుష్యున కేమైన నుపయోగించునా? మరియును, జంతువు భీతినొందినపుడును, విశేషముగ బాధపడుచున్నప్పుడును, దాని శరీరములోని ద్రవపదార్థముల స్వరూపము మారిపోవును. అందుచేత, నట్టి సమయములలో నా ద్రవములను గుఱించి చేసిన పరిశోధనలవల్ల నేమి ప్రయోజనము? మానవతత్త్వమునకును జంతువుల తత్త్వమునకును విశేషభేదముండును, గనుక, యీ ప్రయోగములు, పరిశోధనలు నిరుపయోగములు.

ఇట్టి నిరుపయోగమగు పరిశోధనలకై, కరుణ యొకింతయైన లేక జంతువులను బెట్టుబాధ యింతిం తన రాదు. మనుష్యుని యెంతస్వల్పబాధ పెట్టినను శిక్షించుటకు స్మృతులు, చట్టములు గలవు గాని, జంతువుల నీ విధముగ హింసించినవారిని దండించుటకు చట్టములు లేవు. కనుక, ఈ క్రౌర్యము విచ్చలవిడిగ జరిగిపోవు

చున్నది. ఒక జంతువులో జరుగుచున్న ఇంద్రియ వ్యాపారములు నిలిచిపోవుట కెంత వేడిమి కావలెనో చూచుట కాజంతువును ప్రాణముతోనుండగా గాల్చుదురు. ఇంతకంటె నిరుపయోగకరమగు ఘోరకృత్యమేదైన గలదా? జంతువు నిండుప్రాణముతో నుండగా, మత్తుమందునైన నీయకుండ, బాధచే గొట్టుకొనకుండ కాళ్లను బిగించికట్టి, దానిని కోసి, కాల్చి, విషపదార్థములు పోసి, యీ విధమగు హింసలబెట్టుట యీ పరిశోధనల లోని యసహ్యాకరమైన భాగము. ఒక పరిశోధకుడు తాను పరిశోధనలకై దెచ్చిన కుక్కలను బాగుగా మేపి, మత్తుమందు నిచ్చి, కోసి, పరిశోధించిన తరువాత, గాయములను కుట్టి, కట్లుకట్టి, అవి మానువరకును ఆ కుక్కలను మిక్కిలి జాగ్రత్తగ నాదరించి సంరక్షించెడువాడట. ఇదియు ననగత్యమే మైనను, తక్కిన పరిశోధకులు చేయుదానికంటె చాలబాగుగ నున్నది; ఆ జంతువుల యెడల ఆయన జూపు ప్రేమ, కరుణ, చాలవరకు క్రౌర్యముయొక్క ఫలితమును తగ్గించును.

ఇప్పుడు (X-Ray) యక్సురే సహాయముతో శరీరములో నేది యెట్లున్నదో దెలిసికొనుచున్నారు. ఇట్లేదైన నొక యుపాయము గనిపెట్టి శరీరతత్త్వమును దెలిసికొనువరకును మానవశరీరములపైనే యీ పరిశోధ

నల నేలజేయరాదు? అందుకు చట్టము లొప్పికొనవు. అది మనుష్యునియొక్క స్వార్థస్వభావమును చూపించును. తగినచట్టములను జేసి యిప్పుడు జంతువులపైని జేయుప్రయోగములు మనుష్యులశరీరములపైని జేయుటకు సంఘ మంగీకరించునా? మనుష్యునియెడల క్రౌర్య మనదగిన పని మనుష్యునివంటి ప్రాణియేమైన జంతువునెడల క్రౌర్యముగాదా!

ఒక విధముగ జూచిన నీ పండితులు మూఢాభిప్రాయములకు లోబడియున్నారు. ఒక పండితు డొకనా డొకయభిప్రాయము నిచ్చినయెడల, నిక నదియే వేలము వెఱ్ఱిగ నందఱును ఆ యభిప్రాయమునే యనుసరింతురు. మరియొక పండింతు డదిగాదని మరియొక యభిప్రాయమును సూచించినంతనే దీనిని విడిచి దాని నవలంబింతురు. ఇది యంతయు మూఢాభిప్రాయముగాక యేమగును?

స్వార్థమును వీడి కరుణ నభివృద్ధిజేసికొన గోరువారిట్టి హింసల జేయరు.

మూలము :—"ఉపాధ్యాయులలో ననేకులు వాడుకగా నీపనిని జేయుచున్నారు. వీ రందఱు నీహింస తమ కాచారముగ నేర్పడినదని తమ ఘోరకర్మమునకు సమాధానము చెప్పుకొనఁ బూనుదురు.

పాపకార్య మనేకులు చేయుటనుబట్టి యది పాప
కార్యము గాకపోదు."

మఱియును, చిరకాలమునుండియు నాచారముగ
జేయబడుచున్నను అది పాపకార్యము గాకపోదు.

బిడ్డల నుపాధ్యాయులును తలిదండ్రులును శిక్షించుట పూర్వసాంప్రదాయసిద్ధము, కాని, యిప్పుడు చాల వరకు తగ్గిపోయినది. ఇప్పటి మానసిక తత్త్వశాస్త్ర పండితులు బిడ్డలను శిక్షించి భయపెట్టకుండ ఆదరించి చదువు చెప్పినయెడల త్వరలో చదువు వచ్చునని కని పెట్టిరి. మరియును, డా॥ మాంటిస్సూరీగారి పద్ధతి వంటి పద్ధతుల నిప్పుడు కొంతవరకు పాఠశాలలో నుప యోగించుచున్నారు. ఇండ్లవద్దగూడ బిడ్డలను తలిదం డ్రులు మునుపటివలె శిక్షించుట లేదు, కాని, కృష్ణమూర్తి గారి కీయుపదేశములు చేయబడిన కాలమున నింకను బడులలోను ఇండ్లలోను బెత్తము లుపయోగమున నుండెను.

బిడ్డలు నిస్సహాయులు, బలహీనులు, వారి కీప్రపంచ మున ననుభవము చాలదు, వా రేపని చేసినను, తమ శక్తికొలదియు చేయుటకు ప్రయత్నింతురు, గాని, యొక్కమారుగ, మనము చేయగలవిధముగ, మనము చేయగల పనులను చేయవలయునని మనము వారిని దం

డింతుము. చేయవలసినపని నేవిధముగ జేయవలయునో వారికి బోధపడునట్లు చెప్పి, చేసి చూపించి, నెమ్మదిగ వారిచేత ఆపనిని చేయించినయెడల చేయగలరు, గాని, వారెరుగని పనిని దండించినంతమాత్రమున చేయగలరా? మన దండనవల్ల కలిగిన బాధచేతను, భయముచేతను, వారి మనస్సు చెడిపోయి, చెప్పునది బొత్తిగా బోధపడకుండబోవును. మఱియును, వారి మనస్సు నిర్మలము, అమాయకము అగుటచేత, భయముచే దానిని కలతబారునట్లు చేసి, సంకుచితము జేయుటవల్ల, నది ప్రేమచే వికసించినట్లు వికసించక, తప్పుద్రోవలలో బడిపోవును; దానివల్ల, కల్లలాడుట, దొంగపనుల జేయుట, కపటము, కొంటెతనము, కాఠిన్యము కలుగును.

బిడ్డలవంటివారే యజ్ఞానులు. అజ్ఞానముచే నేరముల జేసి క్రూరదండనములపాలై, మానవత్వమును పోగొట్టుకొన్నవార నేకు లున్నారు. వారెఱుగక తప్పు చేతురు గాని వారి నధికార్లు ఎఱిగి దండింతురు. వారిని దండించక, నెమ్మదిగ బుద్ధిగఱపినయెడల వారు బాగుపడుదురు. ఒకసారి నేరముచేసి చెరసాలకుబోయి పైకి వచ్చినవానిని సంఘ మెంత క్రూరముగజూచునో చూడుడు. వానికెక్కడను గౌరవముండదు, ఆదరణ యుం

డదు. అందరును వాని నంటరానివానిగను, చూడరాని వానిగను, భావింతురు. ఇక, వాని కీ ప్రపంచమునం దసహ్యాము బుట్టక అనురాగము బుట్టునా? వాడు చెరసాలనుండి మంచి యుద్దేశములతో నీవలకు వచ్చి నను సంఘము వాని నాయుద్దేశముల ప్రకారము బ్రతుకనీయక తిరిగి బలవంతముగ వెనుకటి కూపములోనికి బడద్రోయుదురు. దానికి బదు లొక్కడెవడైన వాని నాదరించి, దయతో మాట్లాడినయెడల, వాని సదుద్దేశములు బలపడి వానికి సద్గతి దొరుకును.

మరణదండన మిట్టి క్రౌర్యములలో నొకటి. అది పూర్వ మేకారణముచే నేర్పర్చబడెనోగాని, నేరస్థునకును సంఘమునకుగూడ నిరుపయోగమును, హానికరమును, అయిన దండనము. అది యెంతత్వరలో తొలిగించిన లోకమున కంత మేలు.

ఒక చెట్టు చక్కగా పెరుగుటకు, శుభ్రమైనగాలి, వెలుతురు, ఎండ, నీరు, గెత్తము కావలెను; చుట్టును మరియే ఆటంకములేక విస్తరించుటకు చాలినంత చోటు కావలెను. అట్లే ఆత్మ వికసించుటకు స్వాతంత్ర్య ముండవలయును, చుట్టును ప్రేమ యుండవలెను, పరిస్థితులన్నియు ప్రేమమయములై యుండవలెను. లేనియెడల ఆత్మవికాసము కలుగదు.

మూలము :—"మన కర్మగతి యనునది యాచార మును సరకుగొనదు. క్రౌర్యమనునది కర్మము లన్నింటిలో ఘోరమైనది. ఇండియా దేశమున నైనను నిట్టి యాచారముండుట కాస్పద ముండరాదు. ఏల యన, నచట నహింసాధర్మ మందఱకును దెలిసి నదియ."

కర్మము తన ధర్మమును మార్చుకొనదు. ఏవిత్తు నాటిన నాపండు ఫలించక తప్పదు. ఇప్పుడు సాధారణ ముగ నుపాధ్యాయవృత్తిలో, తక్కిన వృత్తులలోవలెనే, పొట్టకూటికై ప్రవేశించుచున్నారు. కాని, కర్మదేవత కావిచార మక్కఱలేదు. వారెవనినైన నావృత్తిలో బెట్టినయెడల, దానివల్ల వాని కొక గొప్ప యవకాశము గలుగజేయవలయునని పెట్టెదరు. వాడాయవకాశమును బోగొట్టుకొనక, జాగ్రత్తగను, నేర్పుతోను, దయతోను, ప్రేమతోను, తన యుద్యోగ ధర్మమును నెరవేర్చుకొన్న యెడల, తరువాత జన్మమున పరతత్త్వోపదేశికుడు గావచ్చును. తరువాత, గొప్ప సాధుపురుషుడై, జ్ఞానదాతయై, లోకోపకారియగుటకు మార్గమేర్పడును. కర్మదేవత లొసంగగల గొప్ప జీవితార్థముల బడయుట కుపాధ్యాయ పదవి చక్కని మార్గమై యున్నది.

ఉపాధ్యాయుడు ప్రతిబిడ్డయు నొక జీవుడని తెలిసికొని, ఆ జీవుని సత్స్వభావములు వికసించుటకు సాధ్యమైనంతవరకు తోడ్పడవలెను. బిడ్డలు తనవద్దకు నేర్చుకొనుటకు వత్తురు, గనుక, వారిని తన యిష్టమువచ్చినట్లు తయారు చేయవచ్చును. ఉపాధ్యాయుడు చెప్పు మాటలవల్లను మాత్రమేగాక, వాని ప్రవర్తనమువల్ల గూడ బిడ్డలు నేర్చుకొందురు. కనుక, ఉపాధ్యాయుడు తన ధర్మమును చక్కగా నేరవేర్చువాడైనయెడల నాతడు ఆదర్శకప్రవర్తనగలవాడై యుండవలెను, వాని నుండి ప్రేమయును, సానుభూతియును ప్రసరించుచుండవలయును.

ఉపాధ్యాయుని బాధ్యత యెంతగొప్పదో చూడుడు. తన యొద్ద జ్ఞానము బడసి తమ స్వభావములను వికసింపజేసికొనుటకై వచ్చిన బిడ్డలయందు సత్స్వభావములను వికసింపజేసి దుస్స్వభావములు తలయెత్తకుండ జేయుట యాతని బాధ్యత. ఆబాధ్యత యుక్తముగా నెరవేర్చనియెడల, యుపాధ్యాయుడాబిడ్డల యాత్మవికాసమున కాటంకము గలిగించి వారిని గొప్ప ఆపదపాలు చేయును. మఱియు, నుపాధ్యాయుడావిధముగ కర్మదేవతలు తనకిచ్చిన యవకాశమును బోగొట్టుకొన్నయెడల, నతనికి గొప్ప పతనము గలుగును. క్రౌర్యము

వల్ల కలుగుఫలములు మిక్కిలి ఘోరములు. క్రౌర్య మాచారానుసారముగ జేసినామన్నను, మంచికొఱకు చేసినామన్నను, దానివల్లగలుగు ఫలితములు మాత్రము తప్పక కలుగును.

ప్రపంచమున నిప్పు డనేక కార్మికనిలయములు బయలుదేరినవి. ఒక్కొక్క నిలయములో గొన్నివేల మంది కూలివాండ్రు పనిచేయుచున్నారు. ఆ నిలయాధికారులకు ఆ కూలివారియెడల నుపాధ్యాయునకు బిడ్డల యెడల గల బాధ్యతలే యున్నవి. ఆ యధికారులకును కర్మదేవత లుపాధ్యాయుల కిచ్చినట్లే గొప్ప యవకాశముల నిచ్చెదరు. కూలివాండ్రు తమచేత తమ యజమానులు ఎక్కువ పనిచేయించుకుని తక్కువ కూలి నిచ్చి, తమ మంచిచెడ్డలను చూడక, యేవిధముగనైన తమ కష్టమువల్ల సంపన్నులు కాదలచుచున్నారని తలచెదరు. యజమాని కూలివాండ్రు తనను మోసగించి సాధ్యమైనంతవరకు తన ధనమును తినివేయుచున్నారని యనుకొనును. కొన్నిచోట్ల, నీ రెండు అభిప్రాయములునుగూడ నిజమై యుండును. యజమానులు పనివాండ్రను నమ్మరు. పనివాండ్రు యజమానులను నమ్మరు. అందుచేత ఎడతెగని క్లిష్టసమస్యలు సంప్రాప్తమగుచున్నవి. ఉభయులు తమ సంబంధమును యదార్థ

ముగ నెఱిగినయెడల నిట్టివి సంభవించవు. అయితే, అధికారి, పనివాండ్రను బాగుజేయుటకై తనకొసగ బడిన యవకాశమును గైకొని, తన ధర్మమును నెరవేర్చి నాడా లేదా యని మాత్రము కర్మదేవతలు జూచెదరు గాని తక్కిన సంగతులు వారి కక్కరలేదు. కర్మదేవ తల యభిప్రాయములు మన యభిప్రాయముల నను సరించి యుండవు. ఇందు కొక దృష్టాంతము జూడుడు. మనము చావు అనిన నెంతయో భయపడి మన కది యొక దండనగా భావింతుము, కాని, కర్మదేవతలు మనకు మృత్యువు నొక బహుమతిగ చేకూర్తురు; మన మీా శరీరముకంటె సూక్ష్మమైన శరీరమున, నింతకంటె మంచి యవస్థ ననుభవించుట, కీ చెరనుండి మనలను విడిపింతురు.

అహింసాధర్మ మన్ని మతములలోను విధింపబడి యున్నది. కాని, అన్ని దేశములయందుకంటె మన దేశ మునం దాధర్మ మెక్కువ వ్యాప్తినొందియున్నది. కనుక, మన దేశమునందలి యుపాధ్యాయులు బిడ్డలను దండిం చుట హింస యని తెలియుట తోడనే పై దేశములలోని యుపాధ్యాయులకంటె త్వరలో నాక్రూరకార్యమును మానివేసి యితరులకు త్రోవజూపుట కవకాశము లున్నవి. ఆ యవకాశము మన దేశస్థులకు లోకపాలు

రొసంగియున్నారు. దానిని నెరవేర్చు బాధ్యత మన యుపాధ్యాయులపై నున్నది.

మూలము :—"మృగయావినోదమని పేరుబెట్టి భగవంతునిచే సృజింపఁబడిన జీవకోటిని వేఁటాడి బుద్ధిపూర్వకముగ హింసించిన వారందఱు క్రౌర్యము వలని ఫలము ననుభవింపక తప్పదు."

బుద్ధిపూర్వకమైన క్రౌర్యమున కిది యొక దృష్టాంతము. వేట వ్యసనములలో నొకటి యని చెప్పబడినది. ఆవ్యసనమునకు లోబడినవారు కేవలము దయాశూన్యులును, రాతిగుండె గలవారును కారు. ఇతర జంతువుల నెడల నైతేనేమి, తమ యాలు బిడ్డల నెడలను, బంధుమిత్రులయెడల నైతేనేమి, వారు మిక్కిలి ప్రేమ గలిగి యుందురు. కాని, ఆవ్యసనము గలిగినప్పుడు వారు చేయు ఘోరక్రౌర్యమును గుర్తించక, దానివల్ల వారికి తాత్కాలికముగ గలుగు సంతోషమునే జూచికొందురు. దానికి యజ్ఞానమే కారణము. ఈ జీవరాసులన్నియు మనుష్యుని వినోదముకొఱకే సృజింపబడినవి, గనుక, వానిని చంపుటలో తమ నైపుణ్యమును జూపుచు వినోదముగ గాలము బుచ్చుటకు మన కధికారము గలదని వా రనుకొందురు. అవి మన వినోదమునకే సృజింపబడవచ్చును. అయినను, వానిని చూచి వినో

దించవచ్చునుగాని, వానిని జంపి వినోదించ నక్కఱలేదు. మాంసాహారముగూడ ఈ కారణముచే ననాలోచితముగ జేయబడుచున్న క్రౌర్యమని చెప్పవలసియున్నది. ఒకడు తన కడుపు నిండించుకొనుటకై యట్టి క్రౌర్యమును చేయనక్కఱలేదు. అయినను, కేవలము వినోదార్థము వేటాడుటలో నా మిషయైనను లేదే! మఱియును, కొన్ని దేశములలో దుస్తులలో నలంకరించుకొనుటకు కొన్నిరకముల పిట్టల యీకెలను, కొన్ని జాతి జంతువుల చర్మములను ఉపయోగించెదరు. వీనిని సంపాదించుట కాపిట్టలను జంతువులను మిక్కిలి హింసించి చంపెదరు. ఇదియు ననగత్యమైన యాడంబరము కొఱకు చేయు జీవహింసయే యైయున్నది.

ఇట్టి హింసలజేయువా రజ్ఞానముచే జేయుచున్నను, బుద్ధిపూర్వకముగ జేయుచున్నారు. అనగా తాము చేయునది హింసయన్న జ్ఞానము, క్రూరకృత్యమన్న జ్ఞానము లేకపోయినను, స్వార్థమునకై తీరికూర్చుని చేయవలెనని హింసచేయుచున్నారు. కనుక, వారాకర్మ ఫల మనుభవించక తప్పదు. నిద్రలో సంచారముచేయు వాడు (Somnambulist) తన సంచారములో నొక యెత్తైనచోటనుంచి పడినయెడల గాయములు తగులును, వానికప్పుడు తెలివిలేదని గాయములు తగులకుండునా?

అట్లే యిది క్రూరకృత్యము అని యెఱుగనంతమాత్రము చే కర్మఫలములు గలుగకమానవు.

మూలము :—“ అట్టి పనులను నీవు చేయవని నే నెఱుఁగుదును. భగవంతునియందు నీకుఁగల ప్రేమను బట్టి యట్టిపనులఁ జేయరాదని యవకాశము గలిగినప్పు డితరులకు స్పష్టముగఁ జెప్పుచుండుము.”

ఈ వాక్యములో ‘ అవకాశము గలిగినప్పుడు ’ అన్న మాటలు ముఖ్యముగ గమనించవలసినవి. మన యభిప్రాయములెంత మంచివైనను, అవి యందరకును నచ్చకపోవచ్చును. మన యభిప్రాయముల నితరులపై బలవంతముగ ద్రోయుట మన పనికాదు. మన మీవిషయమున వివేకముతో మెలగనియెడల మేలు కలుగుటకు బదులు కీడు గలుగును. వేటవ్యసనముగలవారు పదిమంది చేరియున్నప్పుడు నీవు పోయి వారు క్రూరులని నిందించ మొదలుబెట్టినయెడల, వారు నిన్ను వెర్రివాడవని కొట్టకుండ విడిచిపెట్టిన నీవదృష్టవంతుడవే. ఎవరైన నీ యభిప్రాయము నడిగినప్పుడు గాని, మాటల సందర్భమున నవకాశము దొరికినప్పుడుగాని, నెమ్మదిగ, ‘ ప్రాణము, ఏ శరీరములోనున్నను, పవిత్రమని నా యభిప్రాయము. ఈ జంతువులు మన చిన్నసోదరులు. మీ సంతోషముకొఱకు కొక మనిషిని చంపుటకు

మీ కధికారము లేదుగదా! అట్టిచో నీ జంతువులను చంపుటకు మీ కెక్కువ యధికార మున్నదా?' అని, యీ విధముగ జెప్పవచ్చును. అప్పుడైనను వారు నిన్ను వెక్కిరించవచ్చును, నీ మాటలను లెక్కచేయక పోవచ్చును, గాని, ఒక్కపెట్టున దూషణమునకు దిగి నప్పుడువలె తీవ్రవైరమును బూనరు.

మూలము :—"కార్యములందుఁ గ్రౌర్య ముండునట్లే మాటలయందును క్రౌర్యముగలదు. ఎవ్వఁడైనను మఱియొకని నొప్పించ నుద్దేశించి యొక మాట బలికినచో వాఁడీ (క్రౌర్య) పాతకముఁ జేసినవాఁడ గును. ఆపాపమును సైతము నీవు సేయవు. అయి నను, బుద్ధిపూర్వకముగ నాడు మాటలవలన నెంత చెఱుపుగలుగునో అంతచెఱుపు యోచించిక యాడు మాటలవలన గలుగవచ్చును. కనుక నబుద్ధి పూర్వకముగ క్రౌర్యము చేయుదువేమో యని జాగరూకుఁడవై యుండుము."

బుద్ధి పూర్వకముగ జేయుక్రౌర్యములలో మాట లాడుటచే గూడ చేయగల క్రౌర్యమును జూపి, అబుద్ధి పూర్వకమగు క్రౌర్యమునుగుఱించి చెప్పుచున్నారు.

కొందఱు తమ కేది నోటికివచ్చిన దాని నాడుదురు. వారు మాట్లాడునపుడు తామాడుమాటలు ఎవరి మన

స్సునకైన కష్టము గలిగించునా యని యాలోచననైన చేయరు. వారు తరుచుగ మాట్లాడునది యితరుల లోపములనుగుఱించియే. అట్లు మాట్లాడుట యొక సుగుణమని తలంచి, తాము గొప్పపని చేయుచున్నామని వారు గర్వింతురు. కాని, వారాడు మాటలన్నియు వారి శీలమునకు మచ్చ దెచ్చుచున్నవని వా రెరుగరు.

లోకములో ననేక విషయములలో ననేకములగు నభిప్రాయము లున్నవి. ప్రతి యభిప్రాయమునకును తగిన యాధార ముండును. భిన్నాభిప్రాయములు గలవారు ముందు తమ యభిప్రాయమున కాధార మేదియని తెలిసికొనవలయును. పిమ్మట అవసరమైనపు డితరులకు దానినిగుఱించి నెమ్మదిగను, శాంతముగను చెప్పవచ్చును. కాని, తనతో నేకీభవించనివారిని, తనకు నచ్చనిపని జేసినవారిని, అందరిని, నిందిచుట గొప్ప తప్పు. నీ యభిప్రాయమును సమర్థించుకొనవలసి వచ్చినయెడల, నీ పక్షమున జెప్పవలసిన దంతయు హేతుపూర్వకముగ జెప్పవలెను, గాని దానిని నేర్పుతోను నెమ్మదిగాను చెప్పవలెను. ఒకప్పుడు నీకు వ్యతిరేకములైన యభిప్రాయములను ఖండించవలసి వచ్చును. అప్పుడైనను, ఆ యభిప్రాయములలో నీకు దోచిన దోషములను మిత్రభావముతోను, గౌరవముగను జూప

వలయునుగాని ఆ యభిప్రాయములనుగాని, వానిని గల వారిని గాని దూషించరాదు. నీ యభిప్రాయముల యందు నీ కెంత యభిమానమున్నదో వారికి వారి యభిప్రాయములయం దంత యభిమాన ముండును. నీ యభిప్రాయమునం దెంత సత్యమున్నదో వారి యభిప్రాయమునం దంత సత్యముండును. అభిప్రాయ స్వాతంత్ర్యమునకు నీ కెంత యధికార మున్నదో వారికిని అంత యధికార మున్నది. ఇంతకును, నీ యభిప్రాయమే శ్రేష్ఠమైనదని యేమి నిశ్చయము. కనుక, ఈ విషయమున మిక్కిలి జాగ్రత్తగ నుండవలయును.

ఇక నబుద్ధిపూర్వకమగు క్రౌర్యమునుగుఱించి వివరించి చెప్పుచున్నారు.

మూలము :—"ఈ యబుద్ధిపూర్వకమగు క్రూరకర్మము సాధారణముగ యోచనలేమిచే సంభవించును. లోభము, ధనకాంక్ష, వీనితో నిండినవాఁడు న్యాయముగ నితరుల కియ్యవలసినదానికంటెఁ దక్కువగ నిచ్చుటచేతను, తన యాలుబిడ్డల కరకడుపునకు పెట్టుటవలనను దాను గలుగఁజేయు కష్ట మింత యని యొకప్పుడైన యోచననైనను చేయడు. మఱియొకఁడు తన కామము తీర్చుకొనుట యోచించి, దాని నీడేర్చుకొనుటయం దెందఱు జీవులను

ఎన్ని దేహములను[1] నాశనము జేయునో యించుక యైనను సరకుఁగొనఁడు. ఇంకొకఁడు కొద్దినిమిషముల శ్రమను దప్పించుకొనుటకై, తనవలనఁ దన పనివాండ్రకుఁగలుగు కష్టముల నెంతమాత్రము యోచింపక వారలకు జీతమియ్యవలసిన దినమున నాజీతముల నియ్యఁడు. మనము చేయు కార్యమువలన నితరుల కెంత కష్టముగలుగునో యని మనము యోచింపక మఱచుటవలన నింతకష్టము గలుగుచున్నది. కర్మవిధి కేమో మఱపు లేదు. లోకులు మఱచిపోవుదురనుటను కొంచెమైనను సరకుగొనదు. నీవు మోక్షమార్గమున బ్రవేశింపఁ గోరితివేని యోచింపక యెద్దియేని క్రూరకార్యమును చేయుదువేమోయని భయముగలిగి, నీవు చేయుపనిచేఁ గలుగు ఫలముల నన్నింటిని యోచించవలయును."

ఇచ్చట జెప్పిన క్రూరకృత్యములు మనము నిత్యమును చూచుచున్నవే. అవి యనాలోచితముగ జేయబడుచున్నవి. ఎవ్వరును వానివల్ల నెంత హింసగలుగు

[1] "పాపకార్యములం బ్రవేశపెట్టుటచే జీవులకుఁ గీడుచేయును. దుర్మార్గమునం బ్రవర్తింపఁజేయఁ బరలోకమునఁగలుగు పాపఫలము గాక, నిచ్చట సైతము వెంటనే శరీరముల వ్యాధిగ్రస్తములుగఁ జేసి, శరీరములకుఁ గీడుఁ గలుగఁజేయును."

చున్నదో యోచించనైన యోచించరు. దినమున కొక నాలుగైదణాల సామగ్రి నమ్ముకొని, దానివల్ల రెండు డబ్బులు లాభమువచ్చినచో బ్రతుకవలెనని యొకడు బయలుదేరును. వానియొద్ద నీవు సామగ్రినికొని వానికి రొక్కమీయక రేపురమ్మన్నయెడల, నాటికి వానికిని వాని యాలుబిడ్డలకును తిండిలేకుండ జేసినావన్నమాట యేనా? నీవప్పుడు ఆ డబ్బుల నీయజాలకయో, లో పలకుబోయి తెచ్చుటకు బద్ధకముచేతనో వానిని రేపు రమ్మనెదవు. అనగా, నీ లాభము నీ సుఖము యోచించుకొన్నావుగాని, వాని కష్ట మాలోచించలేదు. మఱియు, వెలలో నెంతయో బేరముచేసి తగ్గించకుండ వెల నీయవు. స్వల్పలాభము నాశించువాని కదియును కష్టమేగాదా? ఇట్లే యిందు చూపించబడిన క్రూర కృత్యము లన్నియును అజాగ్రత్తవల్ల, బద్ధకమువల్ల, స్వార్థమువల్ల జేయబడునవే. ఇందొక్కొక్కటియు గూడ పరమునకు ఆటంకములే యగుటను సాధకుడు బహుజాగ్రత్తతో దనప్రతిచర్యను పరిశీలించి, దానివల్ల నెవ్వరికిని హానిగలుగదని నిశ్చయమైనప్పుడే దానిని చేయవలయును

---

## అయిదవ అధ్యాయము

## మూఢాభిప్రాయములు

మూలము :—"మూఢాభిప్రాయములు గలిగియుండుట మఱియొక గొప్పచెడుపు. ఇది ఘోరమగు క్రౌర్యమును విశేషముగఁ గలుగజేసియున్నది. దీనికి లోనైయుండువాఁడు వానికంటె నెక్కువదెలిసిన వారిని దిరస్కరించి బలవంతపెట్టి తాను చేసినట్లు చేయింపఁబూనును."

ఇది ప్రేమకు విరుద్ధములగు మహాపాపములు మూడింటిలో మూడవది. దీనిలోనున్న పాపమంతయు నీ వాక్యమున కడపటి మాటలలో దెలియజేయబడినది. ప్రపంచ చరిత్రమునం దిట్టి ఘోరపాపకృత్యము లనేకము జరిగినట్లు మనము చదివియున్నాము. అందు ముఖ్యముగ మతద్వేషము లెక్కువ ఘోరకృత్యములకు కారణములైనవి. ఇక జాతిద్వేషము, వర్ణద్వేషము ఇప్పటికిని కొన్ని నాగరికదేశములలోగూడ మిక్కిలి క్రూర కార్యములకు కారణము లగుచున్నవి.

మూఢాభిప్రాయ మనగా, తన కొక విషయమును గుఱించి తెలియకపోయినను, సాంప్రదాయకముగను ఆచారముగను వచ్చుచున్నదనిగాని, యెవరో చెప్పి నారనిగాని, వ్రాసినారనిగాని, దాని నవలంబించుట. ఒక యభిప్రాయము నీ యెదుటకు వచ్చినపుడు దాని మంచిచెడ్డలను నిదానముగ నరసి, విమర్శించి, సబబుగ నున్న యెడల నీ వవలంబించవచ్చును. గాని, తొలుతనే నీవు దానిని తిరస్కరించిన యెడల, నది నీ మూఢాభి ప్రాయమువల్లనే యనవలయును. మఱియును నీవు దాని నొక ప్రమాణవాక్యముగ గైకొని యవలంబించినను అది మూఢాభిప్రాయమే యగును. నీ యభిప్రాయములు మంచివైనను మూఢములైనను బాధలేదు, గాని, నీవు నీ యభిప్రాయముల నితరులపై బలవంతముగ ద్రోసి, వారి నెట్లయిన బాధించి నీతో నేకీభవింప జేయుటకు ప్రయత్నించుట మాత్రము క్రూరత్వమగును. మూఢా భిప్రాయములతో సంబంధించిన క్రౌర్యములలో నిది యొకటి. మఱి కొన్నిటి నీతరువాత వాక్యములలో జెప్పు చున్నారు.

మూలము :—“(దేవతులకు) పశువులను బలియిచ్చి తీరవలెనను మూఢాభిప్రాయమువలనను, మనుజున కాహారముగ మాంస మవశ్యముగ గావలయునను

నంతకంటెను నెక్కుడు క్రూరమగు మూఢాభిప్రాయమువలనను, ఘోరమగు పశువధ యెంత చేయబడుచున్నదో యోచింపుము."

పశుబలులు మనుష్యజాతి పరిణామారంభకాలము నాటి యాచారమై యుండవలెను. అప్పటి మనుష్యులు క్షుద్రదేవతలను మంత్రపూర్వకముగ నారాధించుచుండిరి. ఆ దేవతలకు నెత్తురువాసన బహు ప్రీతికరము. కనుక, ఆ దేవతల శాంతికొఱకు రక్తబలు లిచ్చుచుండిరి. ఆ దేవతల కట్లు శాంతి గలిగించకున్న యెడల వారు తమ సస్యములకు, ఇండ్లకు, ఆలుబిడ్డలకు చెఱుపుగలుగ జేతురని యిప్పటికిని కొంద ఱాటవికులు నమ్ముదురు. ఆయాచారములే నగరవాసులుగూడ నవలంబించుచున్నారు.

రక్తబలు లెచ్చటను దేవతలపేరుననేగాని భగవంతునిపేరున నిచ్చుటలేదు. ఒకవేళ నెచ్చటనైనను ఇయ్యబడినవని యనినను, అది యజ్ఞానముచేత నట్లు చెప్పబడును. ఏలయన, భగవంతున కట్టి బలు లక్కఱలేదని యూహించుట కంత జ్ఞాన మక్కఱలేదు. వేదములకు మూలవేదమనబడు ఋగ్వేదమున జంతుబలులు విధింపబడలేదు. తదితర మతములలోగూడ నట్లు విధింపబడినట్లు కనిపించదు. ఎక్కడ జూచినను ఈ బలులు

ఆయా మతమునకు పూర్వపుటాచారముల శేషములు గా గనబడుచున్నవి.

మఱియును, రక్తవాంఛ క్షుద్రదేవతలకేగాని యుత్తమతరగతి దేవతలకు లేదు. అట్టి యుత్తమ దేవతల పేరున యజ్ఞాదులజేసి జంతుబలుల నిచ్చుటయు ప్రాచీనాచార సంబంధమే యై యుండవలెను. ఒక దేశమున గ్రొత్తమతము వ్యాపించినను, ఆ మతమును స్వీకరించిన జనులు తమ పూర్వాచారముల నన్నిటిని విడువక, అనుష్ఠించుచువచ్చి, క్రమముగ ఆయాచారములకు ఈ మతమునకు సంబంధములను కల్పించుట చరిత్రాంశము. కనుక, అతి ప్రాచీనకాలపుటాచారశేషములనే యజ్ఞాదులలో ననుష్ఠించుచున్నారనుట సహేతుకము.

భగవంతుడు ప్రేమస్వరూపుడు, తాను సృజించిన ప్రాణుల నన్నిటి నేదోయొక యుద్దేశముతో సృజించి, ఆ యుద్దేశము ప్రకారమవి పురోవృద్ధినొందుటకై సర్వము తానేయై, "శ్లో॥ యద్యద్విభూతిమత్సత్వం శ్రీమదూర్జితమేవ వ। తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సమ్భవమ్ ॥ (గీతా ॥ ౧౦-౪౧) అని నట్లు సర్వమును తన తేజస్సేయయి, యున్నాడు. పరిణామము నొందుచున్నది ఆ తేజస్సే, ఆ యంశయే. అట్టి భగవంతునకు మనము జంతుబలుల నిచ్చుట యసందర్భము.

ప్రాచీన కాలములలో నీ యాచారము లెట్లు ఆరంభ మైనవో, యెందుకారంభమైనవో యూహించుచు మన కాలము వ్యర్థముచేయుటకంటె, ఆయాచారముల నిప్పుడు మన మనుసరించవలసిన యగత్య మున్నదా లేదా యని విమర్శించి చూచుట మంచిది. అట్లాలోచించిన వారెవ్వరికిని జంతుబలులు మనుష్యుల యభివృద్ధి కగత్యములని తోచదు. మనకు కావలసినది పారిమార్థికముగాని యైహికసుఖము గాదు. జంతుబలులచే క్షుద్రదేవతలను సంతోషపెట్టి కొన్ని యైహిక సుఖముల బడయగల మనుకొన్నను, అది స్వార్థమునకై పరహింస జేయుట గనుక, మన మార్గమునకు రెండు రెట్లాటంకమగుచున్నది. విమర్శనచేయక, పూర్వాచారమని, సాంప్రదాయమని చెప్పి, జంతుబలుల నిచ్చుట యావశ్యక మనుకొనుటయే మూఢాభిప్రాయము.

అంతకంటెను మాంసాహారము మనుష్యున కావశ్యకమని యనుకొనుట క్రూరతరమైన మూఢాభిప్రాయమని యిచ్చట చెప్పుచున్నారు. మాంసాహార మన్ని దేశములలోను ప్రబలి యున్నది. మన దేశములో నిప్పుడు కేవలశాకాహారులగు వర్ణములవారు కూడ పూర్వము మాంసాహారులనియును బౌద్ధమతవ్యాప్తి అనంతరము వారు మాంసాహారము వర్జించిరనియు చెప్పుదురు.

ఇప్పుడిప్పు డన్ని దేశములలోను మాంసాహారముకంటె శాకాహారమే మనుష్యునకు తగినదని, సర్వవిధముల క్షేమకరమని, యంగీకరింపబడుచున్నది. కాని, మాంసాహార మేకాలములోను సాత్వికాహారముగ నెక్కడను అంగీకరించబడలేదు. యోగసాధకులు సర్వత్ర సాత్వికాహారములనే యుపయోగించుచుండిరి.

మాంసాహారులకు జంతుహింసవల్ల గలుగు పాపము గలుగుటయేగాక, ఆ యాహారము ద్వారా వారి శరీరములలో నక్కరలేని పదార్థములు ప్రవేశించి, శరీరములను మోటుపరచి, పశుస్వభావమును బలపరచును.

శాకాహారమునకైనను జీవహింసచేయక తప్పదు గదా? అట్టిచో మాంసాహారము నెందుకు నిరసించవలెనని యాక్షేపింతురు. నిజమే, శాకములను చంపుచున్నాము, గాని, శాకములలో జంతువులలో నున్నంత చైతన్యవికాసము లేదు, గనుక, వానిని జంపుటవల్ల జంతువులను చంపునపుడు చేయునంత హింసజేయుట లేదు. శాకములను చంపుచున్నామనియును అట్టి పనుల వలన కొంత పాపము చేయుచున్నామనియు గుర్తించియే తత్పరిహారార్థము మనకొఱకు ఋషులు ప్రతిదినమును చేయుటకై కొన్ని కర్మలను విధించియున్నారు. అట్టి స్వల్పపాపముగూడ జేయుటకు అంగీకరించని

సాధుపురుషులు పండి రాలిన పండ్లను ఆకులను తినెదరు.

ప్రాణహింస కింకొక గొప్ప యాక్షేపణ యేమనగా, నిండుప్రాణముతోనున్న ప్రాణి నకస్మాత్తుగా జంపుట వల్ల ఆ ప్రాణియొక్క పరిణామమున కాటంకము గలుగును. ఒక మనుష్యు డీ జన్మములో నీ లోకములో బొందవలసిన యనుభవములు, కర్మఫలములు, పొందుటకును, ప్రారబ్ధమును నశింపజేసికొనుటకును, ఏర్పడిన యవకాశముల కాకస్మిక మరణము ఆటంకము కలిగించును. ఆ యనుభవములకే వా డింకొక జన్మము నెత్తవలసియుండును. ఈ జన్మమున నాయనుభవములకు గలిగిన సదుపాయములు తిరిగి కలుగుట కెంతకాల మో పట్టును. అంతవరకును వాని కాకర్మరాహిత్యము గాక, వాని పురోవృద్ధి వెనుకబడిపోవును. జంతువులకు వ్యక్తిత్వము లేదు. ఒకజంతువు చనిపోయినయెడల ఆ జన్మములో దాని యనుభవములన్నియు ఆ జాతి జంతువుల సమూహాత్మకు చెందిపోవును. కనుక, యొక జంతువు నకస్మాత్తుగా జంపినందున, మనుష్యుని జంపుటవల్ల వాని యాత్మకు గలుగునంతకీడు ఆ జంతువుయొక్క ఆత్మకు, లేక, సమూహాత్మకు కలుగదు. జంతువుల కంటె చెట్లు పరిణామమున తక్కువస్థితిలో నున్నవి,

గనుక, మిక్కిలి యభివృద్ధిజెందిన కొన్ని చెట్లలో తప్ప తక్కిన వానిలో, వ్యక్తిత్వము బొత్తిగా లేదనవచ్చును. అందుచేత, శాకాహారమువల్ల మాంసాహారమువల్ల గలుగునంత హింసయు క్రౌర్యమును గలుగవు.

ఇచ్చట జంతువులను చంపుట బొత్తిగా నిషేధింప బడలేదు. వినోదమునకు, ఆహారమునకు, చంపుటయే నిషేధింపబడినది. ఆత్మ సంరక్షణార్థము, అనగా, తనను చంపుట కొక మనిషిగాని, జంతువుగాని పైబడినప్పుడింకొక యుపాయముచే దప్పించుకొనుట కవకాశము లేనియెడల, ప్రాణరక్షణార్థము, ఆ మనిషినిగాని జంతువునుగాని చంపుట తప్పదు. యోగి యందుకైన నొప్పుకొనడు, గాని, మనము యోగులముకాము. యోగ మార్గమున బ్రవేశింపనున్నాము, గనుక, మనకును అంత గొప్ప యాదర్శ ముండవలసినదే. అయినను, క్రూరత్వము, జీవహింస, యను వానియం దీతారతమ్య మున్నదని. గమనించవచ్చును. స్వంతప్రాణమును రక్షించినట్లే, అసహాయస్థితిలోనున్న యొక స్త్రీనిగాని, బిడ్డనుగాని, పురుషునిగాని, కాపాడుటకు హత్యచేసినను అంత దోషములేదు.

కొన్నిదోషములు, వాని స్వాభావికమైన యాహారమును విడిచి, నిన్ను కరిచి, నీ నెత్తురులో విషము బ్రవేశ

పెట్టుచున్నవనుకొనుము. వానిని జంపకుండ నేదైన నుపాయ మాలోచించి వాని బారినుండి నీవు తప్పించు కొనగలిగిన మంచిదే, లేనియెడల, వానిని చంపుటయే యెక్కువ శ్రేయస్కరమును తక్కువ పాపమును అగును. దోమ స్వాభావికముగ శాకాహారి, మనుష్య రక్తమును రుచిమరిగి, ఆవాసనను బట్టి మనలను గర చును. అందుచేత, అది మనకు దూరముగానుండి తన యాహారమును తినుచున్నయెడల మంచిదే, కాని, మన నెత్తురు రుచిమరిగినయెడల మన కెంతో హానిచేయును. ఇట్టి రకపుప్రాణు లనేకము లున్నవి. కొన్ని యసహ్యా కరములగు క్రిములు కీటకములు జీవపరిణామములో జేరని యుత్పాతములు. వానిని చంపుటయును పరి ణామములో చేరి పురోవృద్ధినొందుచున్న ప్రాణులను చంపుటయు నొకటికాదు. మన మూరకున్నయెడల మన జీవిత మసహ్యమగునట్లు చేయు రామబాణము, చెద పురుగు, మొదలగు నల్పప్రాణు లనేకము లున్నవి. వీనిని చంపుటయు నగత్యమే యగును.

యోగి జీవహింసజేయకున్నను వాని కాహారము సమకూడును. కాని, ఆ యాహారపదార్థములను సమకూర్చు కర్షకుడు తన సస్యములను పాడుచేయు క్రిమి కీటకములనుండియు, చెవులపిల్లులు మొదలైన

జంతువులనుండియు సస్యములను కాపాడుకోవలయును గదా!

ఏది యెట్లున్నను, ప్రాణరక్షణార్థ మొక క్రూరజంతువునుగాని, యల్పప్రాణినిగాని చంపుటకును నీచమగు రుచిని తృప్తిపరచుకొనుటకై, మేక, గొఱ్ఱె, ఆవు, మొదలగు నుత్తమజంతువులను బుద్ధిపూర్వకముగ జంపుటకును మిక్కిలి భేదమున్నది.

మూలము :—"మన కత్యంత ప్రేమాస్పదమగు నిండియా దేశమున మూఢాభిప్రాయమువలన నంత్యజుల యెడ మనము నటించురీతిని యోచింపుము. సోదరభావము కలిగియుండుట ధర్మమని తెలిసినవారియందు సయితము మీ దుర్గుణ మెట్టి కఠినమగు క్రౌర్యమును గలుగఁజేసియున్నదో చూడుము."

తక్కిన దేశములలోకంటె మన దేశములో నీ సోదరధర్మము నెక్కువగా దెలిసియుండవలసియు నిచ్చటను గూడ నింకను ఈ యధర్మము ప్రబలియున్నది, గనుక, ప్రత్యేకముగ మన దేశమునందున్న యీ దురాచారమును ఇచ్చట చూపించినారు. ఇది కేవల మూఢాభిప్రాయమనుటకు సందేహములేదు. ఇవ్విషయమున నీ గ్రంథము వ్రాయబడినప్పటికంటె నిప్పుడు మన దేశ

మునం దెక్కువ సంచలనము కలిగినది. పంచములను అస్పృశ్యులుగ నెంచి దూరముగ నుంచుట తగదని జన సామాన్య మంగీకరించుచున్నారు. కాని, యీ సమస్య యంతటితో తీరునదికాదు. వారిని దగ్గరకు రానిచ్చుట, వారిని ముట్టుకొనుట, వారితో కలిసి మెలసి తిరుగుట, వారితో నేకపంక్తిని భోజనముచేయుట, వారిలో గొం దరిని పరిపాలకసభలలో గూర్చొననిచ్చుట, యివి మాత్రము చేసినచో వారిని మన ముద్ధరించినవారము కాము. వారియెడల దయ, సానుభూతి, ప్రేమ, కన పరచి, వారి కష్టములకు తోడై, వారికిని ఇతరులతో సమానమగు జీవిత సౌకర్యములను సమకూర్చవల యును. అది ముఖ్యముగాని, తక్కిన పైపనులు ముఖ్య ములు కావు.

ఈ దేశములో పంచము లనుభవించు పాట్లితర దేశ ములలోగూడ గొన్ని జాతులవా రనుభవించుచున్నారు. నాగరికు లనిపించుకొనువారు చేసికొన్న కర్మఫలముల నావిధముగ ననుభవించుట కట్టి జాతులు ఇంకను లోకమున నుండవలసియున్న దనుకొందును. ఎప్పుడు నాగరికజాతులు తమతోడి మానవులయందు తార తమ్య మెంచక సోదరభావము జూపుదురో అప్పు డట్టి కష్టజీవులగు జాతులుండుట కగత్యముండదు. కనుక,

ఏ దేశములోనైనను, ఇట్టి జాతిక్రూరత్వ మాచారము నందున్న యెడల, దానిని నిర్మూలించుటకు ఉత్తమ జాతులవారికి తక్కువజాతుల వారియెడల గల చిత్తవృత్తి మారుట యొక్కటియే మార్గము.

మఱియును, మనుష్యులలో కొంద ఱింకను కేవలము అజ్ఞానులై తామసవృత్తియందు నిమగ్నులై యున్నారు. వారందఱి నొక్కమా రుద్ధరించి యగ్రజాతివారుగ జేయబూనుట ప్రమాదకరమైన చికిత్స. వారు క్రమక్రమముగ నగ్రజాతుల సంపర్కమువల్ల వృద్ధిలోనికి రావలెను. అట్లనుటచే నగ్రజాతులవారు వారిని నీచముగను క్రూరముగను జూడరాదు. వా రజ్ఞానులగుట చేతనే వారియెడల ప్రేమ గలిగి, వారి నాదరించి, వారికి జ్ఞానముగలుగు మార్గముల జూపవలయును. ఆ విధముగ జూచినయెడల నెక్కడివారి నక్కడ నుంచి వారి ధర్మము వారు వీడకుండ జేసి, వారి యభ్యుదయమునకు తోడ్పడుటయే యుక్తమని తోచుచున్నది.

మూలము :—" ఈ మూఢాభిప్రాయమను దయ్యము చేతఁ జిక్కి ప్రేమస్వరూపుఁడగు భగవంతుని పేరు చెప్పుచు ననేక పాతకములు సేయఁబడియున్నవి."

కేవలము స్వార్థపరాయణులై, స్వప్రయోజనార్థము చెడుకార్యములు చేయువారు తమ కోర్కెలను తీర్చు

కొనుటతోనే కాలము బుచ్చుచు, తమ పని కడ్డురాని వారి జోక్యమునకు బోరు. కాని, పరోపకారమునకై బయలుదేరి, మందబుద్ధిచే నితరులతో జోక్యము కలిగించుకొనువారు ఆ స్వార్థపరాయణులకంటె నెక్కువ హాని లోకములో గలిగించుచున్నారు. మతబోధకు లీ రకమువారు. వారు తమ మతమే యుత్తమ మనియును, అందరును ఆ మతమునే యవలంబించవలయుననియును, దురభిమానముతో బైలుదేరుదురు. వారు పెక్కు దేశములలో గొప్పకార్యముల జేసి జనులకు మిక్కిలి యుపకారము జేసినారు, నిజమే, కాని, వారు చేసిన యపకారమంతకంటె ఎక్కువయైనది. పాశ్చాత్య దేశములనుండి బయలుదేరిన క్రైస్తవ మతబోధకులు, తమ యవివేకముచేత, నపాయములలోబడి, స్వధర్మము కొఱకు, క్రైస్తుకొఱకు ప్రాణత్యాగము చేయుచున్నా మనుకొందురు.

ఒక క్రైస్తవ మతబోధకు డొకదేశములో ప్రవేశించినయెడల, వాని వెనుకనే బ్రాందిమొదలగు పానీయముల నమ్ము వర్తకుడును, వాని వెనుకనే సేనలును, క్రమముగ ప్రవేశించి తుదకు యుద్ధములు, దేశము నాక్రమించుట, దేశస్థులు స్వాతంత్ర్యము గోల్పోవుట, స్వధర్మమును విడుచుట, పైవారి దురలవాట్ల నలవాటు

చేసికొనుట, ఇది సామాన్యమైపోయినది. పాపము ఇది యంతయు క్రైస్తుప్రభునికొఱకు జరుగుచున్న మహాత్కార్య మనుకొని, పాశ్చాత్యదేశములలోని ముసలమ్మలు తమ నోరు కట్టుకొని సంపాదించిన ధనమును మతప్రచారక సంస్థలకు దానముచేయుచున్నారు. ఇది యంతయు భగవంతునిపేరున జరుగు పాతకములలో నొకటి. పూర్వకాలములలో మతముపేరున జరిగిన ఘోరయుద్ధములు చరిత్రాంశములైయున్నవి. మతము పేరు చెప్పి ఘోరమైన జంతుబలుల నిచ్చుట మరియొక విధమగు మూఢాభిప్రాయము.

మూలము :—"కావున నాపాతకము నణుమాత్రమైనను నీ యందు నిలువన ట్లతిజాగరూకుఁడవై యుండుము."

మనము తెలియకుండనే యీ పాతకమునకు లోబడుట కవకాశమున్నది. కనుకనే, యిక్కడ పరమగురు వింత నొక్కి చెప్పినారు. మనము మిక్కిలి జాగ్రత్తగ నుండవలెను. ప్రతివిషయమును మన యభిప్రాయానుసారముగను పరుల యభిప్రాయానుసారముగను, రెండు విధముల, జూడవచ్చును. మన యభిప్రాయమే సరియైనది, యితరులది సరియైనదికాదు అనుటకు వీలులేదు.

ప్రతివాని యభిప్రాయములోను సత్యలేశ ముండవచ్చును, కాని యెద్దియు పరిపూర్ణమగు సత్యము కానేరదు. భగవంతునితో తాదాత్మ్యము నొందిన వాడొక్కడే శుద్ధసత్యము నెఱుఁగును.

మూలము :—“ ఈ గొప్ప పాపముల మూడింటిని నీవు విడువవలెను. ఏలయన, నవి ప్రేమకు విరోధములు గావున, నవి పురోవృద్ధిని చెరుచును.”

ఈశ్వరుడు ప్రేమమయుడు. మనుష్యుడు ఈశ్వరుని యంశమై, యీశ్వరునంతవాడు కావలయునని, యీ సంసారమున దిగినాడు. అందులకు వానియందు ప్రేమ పూర్తిగ వికసించవలయును. కనుక దాని కాటంకము గలిగించున వన్నియు పురోవృద్ధి కాటంకములగును.

---

## ఆరవ అధ్యాయము

## సేవ

మూలము :—“ అయితే, నీవు కీడుఁజేయక యుండుట మాత్రము చాలదు. పూనికతో మేలును చేయు చుండవలయును. లోకసేవఁ జేయుచుండ వలయునను నతి తీవ్రేచ్ఛ నీయందుఁ బూర్ణముగ నిండియుండ వలెను. నీ చుట్టుపట్టులనుండు మనుజులకు మాత్రము గాదు, పశువులకు నోషధులకుం[1] గూడ సేవచేయుట కవకాశము దొరుకునా యని మెలఁకువతో నెల్లప్పు డు నిరీక్షించుచుండవలయును. నీవు ప్రతి దినమును స్వల్ప విషయములయం దీ లోక సేవఁ జేయుచుండ వలయును. అట్లయినచో లోకసేవఁ జేయుట నీ స్వ భావముగ నేర్పడి గొప్ప పనిఁ జేయ నవకాశ మరు దుగ దొరికినపుడు దానిని బోఁగొట్టుకొనక యుం డఁగలుగుదువు.”

ఇంతవరకును ఏది ప్రేమకాదో, ఏది ప్రేమకు విరుద్ధ మో, చూపబడినది. ప్రేమ యనునది కేవలము అభా

1 “ వృక్షములు, లతలు, గుల్మములు లోనగునవి.”

వాత్మకము కాదు. అనగా, చేయరాని పనులను మానుట మాత్రమువల్ల ప్రేమ వృద్ధికాదు. ప్రేమతో గూడిన కొన్ని పనులను చేయుటవల్ల ప్రేమ వృద్ధియగును, గనుక, నిచ్చట నాపనులను వివరించుచున్నారు.

అవి లోకసేవాకార్యములని చెప్పినారు. సేవ యనగా నీ స్వప్రయోజనమును వీడి యితరులకు మేలు గలిగించు కార్యముల జేయుట. అట్లుచేయుటకు ముందు నీ కా యితరులయందు ప్రేమ యుండవలెను. లేని యెడల, నీకు సేవజేయు నిచ్ఛగలుగదు. ఆ యిచ్ఛ తీవ్రముగ నున్నయెడల, నీవు వారికి ఉపకారము చేయుటలో నెంత మాత్రమును వెనుదీయవు. నీయందు ప్రేమ, నిష్కల్మషమగు ప్రేమ, పూర్తిగా నున్నప్పుడే నీ కట్టి తీవ్రమైన యిచ్ఛ యుండును. నీ ప్రేమ స్వార్థముచే కలుషితమై యున్నయెడల నీవు చేయునది సేవకాదు.

లోకసేవయు నితరకార్యములవలె నభ్యాసముచే నలవడును. ప్రతిదినమును సంభవించు స్వల్పములగు అవకాశములను బోగొట్టుకొనక, చిన్న చిన్న యుపకారములను చేయుచున్నయెడల, నీ మనస్సు ఎప్పుడును ఉపకారచింతతో నిండియుండుటయును, సమయము వచ్చినప్పుడు నీ యుపాధులన్నియు నీకు తోడగుటకు

సంసిద్ధములై యుండుటయును కలుగును. కనుక, ఏదో ఘనకార్యము తటస్థించినప్పుడు చేసెదనని కనిపెట్టుకొని కూర్చొనక, ఎంత స్వల్పకార్యమైనను, ఇతరులకొరకు చేయవలసినప్పు డదే ఘనకార్యముగ నెంచి, చేయ వలెను. స్వల్పకార్యములు చేయుట కవకాశములను బోగొట్టుకొనుచున్న యెడల ఘనకార్యము చేయు నవ కాశము కలిగినప్పుడు దానిని కనిపెట్టజాలవు.

మఱియును సేవ మనుష్యులకు మాత్రమే గాక సకల ప్రాణులకుగూడ సమానముగ జేయవలయును. సకల ప్రాణులును పరిణామము నొందుచున్నవి. ఏ యవస్థలో నున్న ప్రాణికి ఉపకారము చేసినను, ఆ ప్రాణి పరిణామ మున నభ్యుదయము నొందుట కది సహాయకరమగును, కనుక, అది లోకసేవయగును.

లోకసేవ యైహికముగనేగాక నాధ్యాత్మికముగ గూడ జేయవలయును. యోగులు కొందరు నిరంతరము తపస్సుచేయుచుందురు. వారు ఐహికవ్యాపారములలో జోక్యము కలిగించుకొనరు. అంతమాత్రముచేత వారు వ్యర్థజీవులు కారు. ఐహికమగు నుపకారముల జేయు వారికంటె వారు గొప్ప సేవ చేయుచున్నారు. వారు తమ తపశ్శక్తిని నిరంతరమును లోకమున ప్రసరింప జేయుచు, సమస్తప్రాణులకు నొకరక్షను నిర్మించు

చున్నారు. అట్టి తపశ్శాలుల తపశ్శక్తివల్లనే యీ ప్రపంచ మధర్మమువల్ల క్రుంగిపోకుండ నిలిచియున్నది.

పూర్వము బ్రాహ్మణుడు ప్రజల కాధ్యాత్మికగురువై, యెల్లప్పుడును ధ్యాన, అధ్యయన, అధ్యాపనముల యందును యాగాది కర్మలయందును, నియమితుడై, అందరకును ఆలోచనల జెప్పుచు నుండెను. లౌకిక వ్యాపారములలో మునిగియుండువారి శ్రేయస్సుకొరకు బ్రాహ్మణుడు ఆ పనుల జేయుచుండుటచేత, వానికి నైహిక వ్యాపారములతో సంబంధము లేశము నుండకుండుటకై, వానిని ప్రజలు పోషించుచుండిరి. లోకసేవయే తమపనిగ బెట్టుకొన్న బ్రాహ్మణులకును, సన్యాసులకును బిక్షావృత్తి యగౌరవమని యెంచబడలేదు. ఇప్పుడది యంతయు తారుమారైనది.

సకల ప్రాణులకును సేవజేయ సంసిద్ధుడవై యుండవలయుననుటకు కారణ మీక్రింద వ్రాయుచున్నారు:

మూలము :—" ఏలయన, నీవు భగవంతునితో నేకీభావము నొందవలయునను తీవ్రేచ్ఛ నీ స్వప్రయోజనమునకుఁ గాదు. భగవంతుని ప్రేమ లోకమున నుండు ప్రజలకు ప్రవహించుటకు నీవొక మార్గముగ కావలయునని యేకీభావమును గోరవలయును. మోక్షమార్గమున నుండువాడు బ్రతికియుండుట తన

కొఱకు గాదు[1]. ఇతరులకై బ్రతికియుండును. ఇతరులకు సేవఁజేయుటకై తన్నుఁదా మఱచియుండును[2]."

ఈ గ్రంథమును చదివిన వారందలి విషయములను తెలిసికొనుటతో నూరకొనక, తమ ప్రవర్తనము నొకానొక విధముగ సవరించుకొనవలయునని యుద్దేశము. మనము మోక్షమార్గమున బ్రవేశింపగోరుచున్నాము. అందుకు మన జీవిత మనుగుణ్యముగ నుండునట్లు మార్చుకొనవలయును. మనకు స్వార్థచింత యావంతయు లేక పరమార్థచింత పూర్తిగ గలిగియుండవలయును. పరోపకారము, సకల ప్రాణులను ప్రేమించి తదభ్యుదయమునకై తోడ్పడుకార్యముల జేయుట, పరమార్థ సాధనము.

మనయందు వికసించు ప్రేమ యీశ్వరుని ప్రేమ. మన మితరులను ప్రేమించినపుడు మన ద్వారా యీశ్వరుని ప్రేమ యితరులపై ప్రసరించును. కాని, ఈశ్వర ప్రేమ కలుషితముకాకుండ లోకమున బ్రసరించుటకు నిర్మలములగు మార్గము లుండవలెను. లేనియెడల నది ప్రసరించదు, కనుక, మన ప్రేమ కలుషితమైయున్న

1 "శివాయ లోకస్య భవాయి భూతయే। య ఉత్తమశ్లోక పరాయణా జనాః। జీవంతి నాత్మార్థం . . . .। (భాగవతము)

2 పరోపకారబుద్ధివలన దనకార్యములను మఱచియే పోవును."

యెడల మనమా యీశ్వర ప్రేమకు తగిన మార్గములమ కాజాలము.

విద్యుచ్ఛక్తి పుట్టినచోట నెంతయో తీవ్రమగుశక్తి గలిగియుండును. దానిని తీగెలద్వారా విశేషమగు నొత్తిడితో గొనిపోయి, యక్కడక్కడ నమర్చబడిన పరిణామయంత్రముల కంద జేతురు. అక్కడ నా యొత్తిడి తగ్గి తక్కువ తీవ్రతతో నాశక్తి తిరిగి తీగెలద్వారా నెక్కడకు గావలసిన నక్కడకు గొనిపోబడి యచట దీపములు మొదలగు వాని కుపయోగమగును. పరిణామ యంత్రములద్వారా ప్రవహించక సరాసరి జనన యంత్రమునుండి దీపము వెలుగవలసిన చోటున కాశక్తిని గొనిపోయినయెడల దాని నా దీపికాయంత్రము భరించ లేదు. ఆ విధముగనే యీశ్వర ప్రేమయును సరాసరి యీ లోకమున బ్రవేశించుట కవకాశముండి ప్రవేశించిన యెడల, దానినిచ్చట ప్రాణులు భరించజాలవు. ఆ ప్రేమ పరిశుద్ధహృదయులద్వారా ప్రపంచమున బ్రసరించును. నీ హృదయముద్వారా ఆ ప్రేమ ప్రసరించవలయుననిన, నీ హృదయము దానిని నిజశక్తితో భరించుటకు తగినంత నిష్కలుషముగను పవిత్రముగను ఉండవలెను. లేనియెడల నీ హృదయ మాశక్తిని భరించజాలదు, భరించినను అపవిత్ర మొనరించును.

మనము నిరంతరము సూర్యునినుండి ప్రసరించు ప్రాణ శక్తిని లోపలకు గైకొనుచున్నాము. మన మా శక్తి వల్లనే చైతన్యముగలిగి, ఈ యుపాధులలో వ్యవహారించుచున్నాము. కాని, రోగులు కొందరా ప్రాణ శక్తిని సరాసరిగ గ్రహించజాలరు. అందుచేత, వారు నీరసించెదరు. అట్టి రోగులు ప్రాణశక్తి నెక్కువగా గ్రహించువారి చెంతనున్నయెడల, వారి శరీరముల కుపయోగముకాగా మిగిలి పైకివచ్చు ప్రాణశక్తిని తాము గ్రహించి, దానివల్ల నెమ్మదిగ బలము సమకూర్చుకొనగలరు. కొందరు తమకు కావలసిన ప్రాణ శక్తికంటె నధికశక్తిని గ్రహించి, తమ కుపయోగము కాగా మిగిలిన శక్తి నితరుల కిచ్చి వారి రోగములను కుదిర్చెదరు. ఆ విధముగ నీశ్వర ప్రేమనుగూడ గ్రహించుచు, లోకమున నార్తులయి యున్న వారికి దానిని పంచి పెట్టుటకు యోగాభ్యాసకులు పూనుకొనెదరు. యోగుల జీవితోద్దేశము లోకసేవ, వారియందు స్వార్థమావంతయైన నుండదు. వారి జీవితమునకు లోకసేవ తప్ప వేరొక ప్రయోజనమే లేదు అని యిచ్చట జెప్ప బడినది.

మూలము :—“ పేనాయొకటి చేతఁబట్టి దానితో వ్రాయుటచే మనోభావములు వ్యక్తములుగఁ జేయఁ గలము. ఆ పేనా లేనియెడల ఆ మనోభావములు

వ్యక్తముగ జేయఁజాలము గదా? అటులనే భగవంతుని సంకల్పములు ప్రవహించి యీ లోకమున నభివ్యక్తము గావలయుననిన, నీ మోక్షమార్గముననుండు వాఁడు భగవంతునిచేతి పేనావలెఁ గావలయును."

ఇది మిక్కిలి మంచి యుపమానము. పేనా (కలము) వ్రాయుటకు తగినదియై యుండవలయును. అట్లే సాధకుడు గూడ తగిన పదునుగల యుపకరణమై యుండవలెను.

మూలము :—" ఇంతియకాదు. ప్రాణముగలిగి జ్యోతిర్మయమగు నగ్నిశిఖయుం బోలి, వాఁడు తన హృదయమున నిండియుండు నీశ్వరసంబంధమగు ప్రేమను లోకముపైనంతయు కిరణములవలె ప్రసరింపఁజేయుచుండును."

పరమపురుషుల తేజస్సెలో నిట్టి పరిశుద్ధమును, కనుక, తేజోవంతమును, నగు ప్రేమ నిండియుండును కనుకనే, వారిని పాపాత్ములు కన్నెత్తి చూడజాలరు.

మూలము :—" నీకువలయు సాధనము లెవ్వియనిన :—సహాయము జేయ శక్తినిచ్చు విజ్ఞానము మొదటిది. ఆ విజ్ఞానమును మంచిత్రోవల నడుపు మనోనిశ్చయము రెండవది. ప్రోత్సాహముచేసి ఆ నిశ్చయమును పుట్టించు ప్రేమ మూఁడవది. మనోనిశ్చయము, విజ్ఞానము, ప్రేమ, యను నీ మూఁడును,

భగవంతునకు మూఁడు ముఖములు. భగవంతుని సేవకుల జేరఁగోరు నీ వీ మూఁడు గుణములను లోకమున వెల్లడిగ చేయవలయును."

ఈ గ్రంథమునందలి యుపదేశములకు ముఖ్యోద్దేశ మీ తుదివాక్యములలో నిరూపింపబడినది. మోక్షమార్గసాధనములలో ప్రేమ ముఖ్యమైనది. కాని, ఆ ప్రేమ నీ విజ్ఞానమును మంచికార్యముల కుపయోగించుటకు నీకు మనోనిశ్చయము కలిగించునదియై యుండవలయును. విజ్ఞానములేని మనోనిశ్చయముకూడ ప్రయోజనకరము కాదు. ఏలయన, నీ వొక కష్టజీవి యెడల దయదలచి, వానికి సహాయముచేయ బూనినను, వాని కేవిధముగ సహాయముచేసిన వానికి ఉపకరించునో నీ వెరుగనియెడల నేమి ప్రయోజనము? కనుక, నీ మూడు సాధనములును కలిసి యుండవలెను. కనుక, నవి భగవంతుని ముఖములుగ జెప్పబడినవి.

సోదరులారా! ఈ మహాగ్రంథమునందలి చక్కని యుపదేశముల సహాయమున నాల్కియోని యెట్లు సాధనము చేసి తరించెనో, అట్లు మీరును తరించుట కీ గ్రంథము మీకు తోడ్పడును గాక!!!

ఓం తత్ సత్, బ్రహ్మార్పణమస్తు!!!

# రెండవ అనుబంధము

సదాచారము = షట్సంపత్తి = శమాదిషట్కము = ఉపచారో (ఈ పాలిమాటకు అప్రమత్తతయని యర్థము. అనగా, ఈ సంపత్షట్కము నవలంబించి ప్రవర్తనమును చక్కబరచుకొనుటయం దప్రమత్తత)

| సంఖ్య | ప్రాచీన సాంప్రదాయములనుబట్టి | | శ్రీకృష్ణమూర్తిగారికి ఉపదేశించినపుడు పరమగురు వుపయోగించినట్టి | | | |
|---|---|---|---|---|---|---|
| | సంస్కృత గ్రంథముల లోని పేరు | భావము | పాలిభాషలోని పేరు | ఇంగ్లీషు పేరు, దానికి సరియైన తెలుగు పేరు | భావము | శమాదులవల్ల తొలగు కామాదులు |
| 1 | శమః | మనోనిశ్చలత ; మనోనిగ్రహము.<br>" విరజ్య విషయవ్రాతాత్ దోషదృష్ట్యా ముహుర్ముహుః ।<br>స్వలక్ష్యే నియతావస్థా మనసశ్శమ ఉచ్యతే ॥ "<br>(వివేకచూడామణి)<br>(విషయసముదాయము తాపత్రయహేతుభూతమను దోషమును మాటిమాటికి చూచుటచే అందు మనస్సు విరక్తి చెంది తనకు లక్ష్యమగు ఆత్మయందే నియతముగ నుండుట శమ యనబడును).<br>" శమోనామ అంతరింద్రియనిగ్రహః, అంతరింద్రియంనామ మనః, తస్యనిగ్రహః శ్రవణాదివ్యతిరిక్తవిషయేభ్యో నివృత్తిః ॥ "<br>(ఆత్మానాత్మవివేకము)<br>(లోపలి యింద్రియముల జయించుట శమము, లోపలి యింద్రియము మనస్సు ; దానిని జయించుట అనగా శ్రవణమననాదుల యందు దక్క తదితర విషయములందు మనస్సును పోనీయకుండుట, ఇది శమము). | శమో | Control of Mind<br>= శమము | మనోనిగ్రహము. | కామము |
| 2 | దమః | బాహ్యేంద్రియనిగ్రహము.<br>" విషయేభ్యః పారవర్త్య స్థాపనం స్వస్వగోలకే ।<br>ఉభయేషామింద్రియాణాం స దమః పరికీర్తితః ॥ "<br>(వి. చూ.)<br>(" జ్ఞానకర్మేంద్రియములను విషయములనుండి మరలించి తమ తమ నెలవులందు నిలుపుట దమము ").<br>" దమోనామ శ్రవణాదావర్తనం " (ఆ. వి.)<br>(ఇతర వ్యాపారములనుండి మరల్చి మనస్సు శ్రవణమననాదుల యందే నిలుపుట దమము.) | దమో | Self-control in action<br>= దమము | కర్మచేయుటలో ఆత్మనిగ్రహము. ఉదయాది ఆ సాయంత్రము మనముచేయు పనులన్నియు నిర్దుష్టములుగ నుండవలెననిన, మన యింద్రియములు మనకు లోబడియుండవలెను, గనుక, దీని కీపేరు పెట్టిరి. | క్రోధము |
| 3 | ఉపరతి | సంన్యాసము.<br>" బాహ్యానాలంబనం వృత్తేరేషోపరతి రుత్తమా " (వి. చూ.)<br>(మనోవృత్తిచే బాహ్యవిషయముల గ్రహింపకుండుట యుపరతి).<br>" ఉపరతిర్నామ విహితానాం కర్మణాం విధినా పరిత్యాగః శ్రవణాదిష్వేవవర్తనం " (ఆ. వి.) (వేదోక్తములైన కర్మలను సన్న్యాసాశ్రమవిధిచే పరిత్యజించి శ్రవణాదులను మాత్రమేయాచరించుట యుపరతి). | ఉపరతి | Tolerance<br>= భిన్నరుచుల సహనము | పరమతసహనము గలిగి మూఢాభిప్రాయములను విడుచుట. సన్యాసి ద్వంద్వాతీతుడై, అహంకారమమకారములను, స్వపరభేదములను విడిచి సర్వసముడై యుండును. ప్రతివాడును స్వస్వభావము ననుసరించి స్వధర్మముద్వారా పరిణామము నొందుచున్నాడని యెఱింగి, అందరియెడలను సమబుద్ధి గలిగి, అందరి యభిప్రాయములను సమానముగ గౌరవించుట సన్యాసలక్షణము. | లోభము |
| 4 | తితిక్షు | ఓరిమి ; తాలిమి,<br>" సహనం సర్వదుఃఖానా మప్రతీకారపూర్వకమ్ ।<br>చిన్తావిలాపరహితం సాతితిక్షా నిగద్యతే ॥ " (వి. చూ.)<br>(దుఃఖించక, ఏడ్వక, ప్రతీకారముచేయక సకలదుఃఖములను సహించుట తితిక్ష).<br>" తితిక్షానామ శీతోష్ణాదిసహనం దేహవిచ్ఛేదకారణేఽపి సతః పురుషస్య స్వయం నిగ్రహశక్తావపి పరాపరాధసోఢృత్వం చ ॥ "<br>(ఆ. వి.)<br>(చలి, వేడి అనువాని నోర్చుట, ఎవడైనను తన యవయవములను నఱికివేసినను, వానిని నిగ్రహించుశక్తియున్నను, వాని యపరాధమును మన్నించి సహించుట తితిక్ష). | తితిక్ఖ | Cheerfulness<br>= సంతోషము | కష్టములువచ్చినపుడు, ఇవి నా కర్మరాహిత్యముకొఱకు వచ్చినవి, దీనితో కర్మబంధములు తెగిపోవుచున్నవి, ఇది నాకు మేలే గదా !, యని సంతోషముగ ననుభవించుట. | మోహము |
| 5 | సమాధానం<br>(దీనిని ఆరవ దానిగను శ్రద్ధ నైదవ దానిగను చెప్పుట యు గలదు) | " సమ్యగా (సర్వధా) స్థాపనం బుద్ధేశ్శుద్ధే బ్రహ్మణి సర్వదా ।<br>తత్సమాధాన మిత్యుక్తం న తు చిత్తస్య లాలనమ్ ॥ "<br>(వి. చూ.)<br>(ఎప్పుడును శుద్ధబ్రహ్మమునందు బుద్ధిని బాగుగా నిలిపియుంచుట సమాధానముగాని చిత్తముయొక్క లాలనము కాదు). " సమాదానం నామ శ్రవణాదిషు వర్తమానం మనః వాసనావశాత్ విషయేషు గచ్ఛతి యదా యదా తదా తదా దోషదృష్ట్యా తేషు తేషు మనసః ప్రత్యావర్తనం ॥ " (ఆ. వి.)<br>(శ్రవణ మననాదులందున్న మనస్సు కర్మవాసనచేత విషయములగూర్చి పరువెత్తినప్పుడెల్ల, ఆ విషయముల దోషములను విమర్శించి వానినుండి మనస్సును మఱలించుట.) | సమాదాన | One-pointedness<br>= ఏకాగ్రత | జీవితమునంతను ఒక్క లక్ష్యమునందు కేంద్రీకరించుట ; నేజేయు ప్రతిపనియును ఈశ్వరారాధనమేయని, దానియందు పూర్ణమైన మనస్సునుంచి, పరిశుభ్రముగ జేయుచుండుట. | మాత్సర్యము |
| 6 | శ్రద్ధ | " శాస్త్రస్య గురువాక్యస్య సత్యబుద్ధ్యావధారణా ।<br>సా శ్రద్ధాకథితా సద్భిర్యయా వస్తూపలభ్యతే ॥ "<br>(వి. చూ.)<br>(శాస్త్రమును గురువాక్యమును సత్యములను నిశ్చయము శ్రద్ధ ఆశ్రద్ధచే వస్తుజ్ఞానము లభించును.)<br>" శ్రద్ధానామ గురువేదాన్తవాక్యేషు అతీవ విశ్వాసః । "<br>(ఆ. వి.)<br>(గురువుయందును వేదాన్తవాక్యములయందును అధికమగు విశ్వాసము శ్రద్ధ). | శద్ద | Confidence<br>= విశ్వాసము | శాస్త్రకారులు పరమగురువులు సత్యమును తెలిసినవారని యెఱింగి వారి మాటలయందు విశ్వాసముంచుటగాని మూఢ నమ్మకము కాదు. వారియందు తల్లియందు బిడ్డవలె విశ్వాసముంచవలెను మఱియును ఆత్మశక్తియందుగూడ విశ్వాస ముంచవలెను. | మదము |